

# ప్లేటో ఆదర్శరాజ్యం

అనువాదం

జి. వి. కృష్ణరావు

55




సాహిత్య అకాడెమీ. న్యూఢిల్లీ.

ప్లేటో

# ఆదర్శ రాజ్యం

అనువాదం :

జి. వి. కృష్ణరావు, పిహెచ్.డి.



సాహిత్య అకాడెమీ పక్షమున

సాహితీ కేంద్రం

తెనాలి

A

*Adarsa Rajyam* (Greek classic : *Republic*) by Plato. Translated into Telugu by G. V. Krishna Rao. Published by Sahiti Kendram, Tenali on behalf of Sahitya Akademi, New Delhi, 1962. Price: Rs. 10/-

© సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ
ప్రథమ ముద్రణ, 1962

ప్రకాశకులు :
సాహితీ కేంద్రం
తెనాలి

*Also available at :*
*Sahitya Akademi, New Delhi 1*

ముద్రణ :
జ్యోతి ప్రెస్, తెనాలి.

మూల్యము :
పది రూపాయలు

B

# ప్రస్తావన

ప్లేటో క్రీస్తుపూర్వం 427 లో జన్మించాడు. వాసస్థానం సంస్కృతిసంపన్నమైన ఏథెన్సునగరం. అతని తండ్రివైపు వారు, తల్లివైపువారు తరతరాలనుంచి ప్రసిద్ధులు, పరిపాలక వర్గీయులు. ఆనాటి తత్త్వవేత్తలలో ప్రథమగణ్యుడైన సోక్రటిస్ అతనికి గురువు. కేవలం గురువుమాత్రమే కాదు. అతని తత్త్వానుసంధానవిధానమూ, ధర్మైకదృష్టీ ప్లేటోజీవితాన్ని దిద్దితీర్చాయి. అతని జీవితానికి పరమలక్ష్యమైపోయాయి. దాదాపు తన రచనలన్నిటిలోను సోక్రటిస్‌నే అతడు ఉత్తమోత్తమ తత్త్వార్థప్రతిపాదకునిగా చిత్రించాడు.

నాటి ప్రజాస్వామికప్రభుత్వం అతనిగురువైన సోక్రటిస్‌కు అన్యాయ్యంగా మరణశిక్ష విధించింది. సోక్రటిస్ నిజంగా ఆ శిక్ష తప్పించుకొని పారిపోవటానికి అవకాశం ఉన్నది. అయినా, తన దేశానికి, ధర్మానికి అపచారం చేసినట్లవుతుందన్న భావంతో అతడు ఆ ఘోరశిక్షకు తలఒగ్గాడు. వ్యాధిగ్రస్తుడైన ప్లేటో గురువును ఆ మరణశిక్షాసమయంలో సందర్శించలేకపోయాడు. అన్యాయ్యంగా గురువును ప్రభుత్వం చంపినతరువాత ప్లేటో ఏథెన్సునగరంనుంచి మెగారానగరానికి వెళ్ళాడు. అక్కడనుంచి అనతికాలంలోనే బయలుదేరి కొన్ని సంవత్సరాలపాటు ఇటలి, సైరీని, సిసిలి, ఈజిప్టు దేశాలలో సంచారం చేశాడు. ఆమీదట ఏథెన్సుకు తిరిగి వచ్చి అచట విశ్వవిద్యాలయం నెలకొల్పాడు. యూరప్‌లో

తరువాత బయలుదేరిన విశ్వవిద్యాలయాలకు, సిద్ధాంతిక పరిశోధనలకు ఇదే మార్గదర్శకం. రాజకీయకార్యకలాపాలకు మూలం శాస్త్రమేనని గుర్తించి ప్లేటో తన విశ్వవిద్యాలయంలో శాస్త్రార్థాలను బోధిస్తూవచ్చాడు. ఈ విధంగా 20 సంవత్సరాలు అతడు ధర్మాన్నిగూర్చి, తాత్త్విక సమస్యలను గూర్చి, గణితశాస్త్రార్థాలనుగూర్చి విద్యార్థులతో చర్చిస్తూ కాలం గడిపాడు.

60వ ఏట తనరాజకీయలక్ష్యాలన్నిటిని అమలుపరచటానికి అవకాశం దొరికినట్లుగా అతనికి కనిపించింది. దానికోసం ప్లేటో ప్రయత్నించాడు. కాని అనతికాలంలోనే ఆ అవకాశాలన్నీ విషమపరిస్థితులవల్ల వ్యర్థమైపోయాయి. తిరిగి ప్లేటో తన విశ్వవిద్యాలయానికి చేరి తుదిగడియవరకు అక్కడే గడపి క్రీ. పూ. 348 లో అస్తమించాడు.

ప్లేటో ప్రతిభ అనన్యం. అతని ప్రతిభాజ్యోతి ప్రకాశింపజేయని అర్థం లేదు. జ్ఞానస్వరూపం, సృష్టిక్రమం, జగత్తత్త్వం, ధర్మస్వరూపం, మానవజీవితాదర్శం, పురుషార్థాలు, భాషాతత్త్వం, ప్రణయరహస్యం, కళాతత్త్వం, జాతీయవిద్యావిధానం, పరిపాలనావిధానం, పౌరధర్మం, గణితశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, రేఖాగణితం, సంఖ్యాతత్త్వం, జీవశాస్త్రం, వైద్యశాస్త్రం — ఒక టేమిటి? — పరామృష్టంకాని విషయం లేదంటే అతిశయోక్తి లేదు. అయితే విచిత్రం మరొకటి ఉన్నది. ఇన్ని శాఖలలోను అతడు ప్రతిపాదించే అర్థాలు స్థూలాతిస్థూలాలు కావు. సూక్ష్మాతిసూక్ష్మంశాలెన్నో చర్చితాలవుతాయి. లేదా కనీసం స్పృష్టాలవుతాయి. ఆ రచనలు చదువుతుంటే పాఠకునకు దిగ్భ్రమ కలుగుతుంటుంది. 2400 సంవత్సరాలక్రిందట ఈనాటిపాఠకుని ఎలా ఊహించగలిగాడా అని విస్మయం కలుగుతుంది.

ప్లేటోరచనలకు మరొక ప్రత్యేకత ఉన్నది. అతని రచనలన్నీ సంభాషణరూపంలో ఉన్నాయి. వివిధవాదాలు ఖండనమండన లకు పాల్పడుతాయి. అయినా అతడు సాధారణంగా ఎక్కడా ఇదమిత్థమని సిద్ధాంతీకరించడు. ఆ నిర్ణయం, నిర్వచనం పాఠకునికే వదలివేస్తాడు. తనరచనలను పాఠకుల జిజ్ఞాస ప్రజ్వరిల్లటానికి ఇంధనాలుగ చేస్తాడు. ఎంతగంభీరవిషయం చర్చించబడుతున్నా గ్రహణక్లేశం, తర్కకర్కశత్వం ఉండవు. ఒక మధురకావ్యాన్ని చదువుతున్నట్లుగా ఉంటుంది.

అట్లని అతనిరచనలు లోతుపాతులు తడవవని చెప్పవీలులేదు. అవి దివ్యతారలువలె మెరసిపోతుంటాయి. యుగయుగాల నుంచి సూర్యచంద్రాదులను చూస్తూనే ఉన్నాము. అను దినం అందరమూ చూస్తున్న యీ సూర్యచంద్రాదులు ఒక్కొక్కనిలో అతని సంస్కారబలాన్నిబట్టి ఒక్కొక్క మధురభావాన్ని రేకెత్తిస్తున్నారు. ఈ సూర్యచంద్రాదికాన్ని ఎందరుకవులు వర్ణించలేదు? వీరందరికి ఉద్బోధకం అదే కదా? అయినా ఆ వర్ణనలలో ఎంత అనన్యత్వం ఎంత వైవిధ్యం గోచరిస్తుంటుంది!

అలాంటివే ప్లేటోరచనలు; దివ్యతారలు, చ్యుతిలేని బింబాలు, నిత్యోద్బోధకాలు. అతనిస్వభావం సోకని పాశ్చాత్యదార్శ నికుడు ఒకడైనా లేడంటే అతిశయోక్తి ఏమాత్రం లేదు. భారతదార్శనికులకు ఉపనిషత్తులు ఎట్టివో, పాశ్చాత్యదార్శ నికులకు ప్లేటోరచనలు అట్టివి. ప్లేటోతరువాత వెలువడిన తాత్త్వికసిద్ధాంతాలన్నీ అతనిరచనలకు టుప్పీకలేనని ప్రొఫె సర్ వైట్‌హెడ్ అభిప్రాయం. ఇది అత్యుక్తి అయినా ఇందు కొంతలో కొంతైనా సత్యం లేకపోలేదని అభిజ్ఞులకు పొడకట్టక మానదు.

అయితే ప్లేటో సిద్ధాంతాన్ని యథాతథంగా అర్థంచేసికోవా లంటే చాలకష్టం. ఇంతకుముందు చెప్పినట్లు అతని రచనలు పాఠకునిలో అనంతభావప్రపంచాన్ని రేకెత్తిస్తుం టాయి. యథార్థంగా ఎంతవరకు ఆ భావాలను ప్లేటో రచ నలు స్వతః ప్రతిపాదిస్తున్నవో, ఎంతవరకు పాఠకునిబుద్ధి ప్రతిపాదిస్తున్నదో విభజించిచెప్పటం కష్టసాధ్యం. ఈ విభాగం స్పష్టంగా జరిగితేనే కాని ప్లేటో సిద్ధాంతాలను యథాతథంగా గ్రహించటానికి వీలులేదు. నిజానికి ఎంతోమంది వ్యాఖ్యా తలు తమ తమ అభీష్టార్థాలు వాటికాపాదించి ప్లేటోను ప్రశంసించారు.

ప్లేటోను గూర్చి ఇలా చెప్పగానే అతడు మానవమాత్రుడు కాడనీ, కేవలం ఈశ్వరుడే అవతరించి క్రొత్తగా, పూర్వసిద్ధాం తాలతో సంబంధంలేని ఈ విశిష్టసిద్ధాంతాలను సృష్టించాడనీ అర్థం చేసికోరాదు. అతనిప్రతిభ అసామాన్యం. అతడు తనకు పూర్వమున్న గ్రీక్ తత్త్వవేత్తలు ప్రతిపాదించినఅర్థాలవల్ల ప్రతిబుద్ధుడయ్యాడు. పైథాగరస్, పార్మనీడ్స్, హిరాక్లిటస్, సోక్రటిస్‌ల ప్రభావం అతనిసిద్ధాంతాల్లో అసల్పంగా కని పిస్తుంది. పైథాగరస్‌నుంచి అతడు ఆత్మనిత్యత్వము, జన్మ పరంపర, పారలౌకికత్వం, గుహాదృష్టాంతం, గణితశాస్త్రాభి మానం మొదలైనవి స్వీకరించాడు. "యాథార్థ్యం నిత్యం, కాలానికి అతీతం. పరిణామం కేవలం ప్రాతిభాసికం," అన్న భావాలు పార్మనీడ్స్‌నుంచి స్వీకరించాడు. ఈ రెండు సిద్ధాం తాల సమన్వయంవల్ల యథార్థజ్ఞానం ఇంద్రియాలవల్ల లభ్యం కాదనీ, కేవలం వివేకంవల్లనే లభ్యమౌతుందనీ ప్లేటో ప్రతి పాదించటం జరిగింది. సోక్రటిస్ ప్రభావంవల్లనే బహుశః అతడు ధార్మిక సమస్యలలో ఎక్కువ నిమగ్నుడు కావట మేమి, ప్రయోజనదృష్టితో జగత్తత్త్వనిరూపణకు ప్రయత్నిం చటమేమి జరిగి ఉంటుంది.

ఏది ఎలాఉన్నా ప్లేటోసిద్ధాంతాలను ఆరుభాగాలుగా విభజించవచ్చును. 1. జ్ఞానస్వరూపం, 2. ఆత్మనిత్యత్వం, 3. సృష్టివిధానం, 4. ధర్మం, 5. ఆదర్శరాజ్యం, 6. కళల తత్త్వం. ఈ విషయాలను క్రమబద్ధంగా సమగ్రంగా ఏ ఒకటి రెండు రచనలలోను అతడు వివరించలేదు. అతనిసిద్ధాంతం తెలిసికోవాలంటే అతని రచనలన్నిటిని పరిశీలించటం ముఖ్యం. దీనికి కారణం ఒకటే. అతని వయఃపరిణతితోపాటు అతని భావాలుకూడ విస్పష్టతరరూపాలు పొందుతూవచ్చాయి. అయినా అతనిరచనలన్నిటిలో 'ఆదర్శరాజ్యం' విశిష్టస్థానం ఆక్రమిస్తున్నది. అతనిరచనలకు అది కొలికిపూస. అతని భావాలన్నీ అందు దాదాపు సుబోధకంగా రమణీయంగా సంగ్రహంగా ప్రతిబింబిస్తున్నవి. 'ఆదర్శరాజ్యం' వాస్తవంగా యవనరూపకం. దేశకాలవస్త్వైక్యబద్ధం. దానిని చదువుతున్నంతసేపు ఎన్నో భావతరంగాలు బయలుదేరి పాఠకులను శాంతరసంలో ఓలలాడిస్తుంటవి. ఈ విశిష్టతను పురస్కరించుకొని ఎల్లపాశ్చాత్యభాషలలో ఈ ఆదర్శరాజ్యానికి అనేక అనువాదాలు బయలుదేరాయి. పాశ్చాత్యదర్శనాన్ని, సంస్కృతిని చదివి ఆకళించుకొనటానికి ఈ రచన ఎంతో తోడ్పడుతుంది. అందువల్ల దీనికి తెనుగుఅనువాదం అవసరం. ఈ కొరతను తీర్చటానికే సాహిత్యఅకాడెమీ ఆదర్శరాజ్యాన్ని ప్రకృతరూపాన వెలువరించింది.

ప్రకృత ఆంధ్రీకరణనుగూర్చి అనువాదకుడు ఒకటి రెండు ముక్కలు చెప్పకతప్పదు. ఈ రచన ఆంగ్లంలో బెంజమిన్ జోవిట్ కావించిన అనువాదానికి అనువాదం. ప్లేటోమాటల్లో చెప్పాలంటే ప్రకృతగ్రంథం మూలానికి త్రిగుణవ్యవహితం. పైగా ఆదర్శరాజ్యంలో అటు దర్శనం, ఇటు కవిత్వం వియ్యమందుతున్నవి. ఇలాంటిరచనను అనువదించటమంటేమాటలు కాదు. మూలంలోని పలుకుబడి, వాక్యవిన్యాసం, ఆచారం,

వ్యవహారం, కథ, గాథ పాశ్చాత్యం. అందువల్ల అది తెలుగునకు విజాతీయం. ఈ గుణగణాలలో దేనినీ పోనీక హాయిగా నడిచేరచనను అనువాదకుడు తెలుగుపాఠకులకు అందించాలి. ఇది అసిధారావ్రతం. ఈవ్రతంలో అనువాదకుడు ఎంతవరకు కృతార్థత పొందాడో పాఠకులే చెప్పాలి.

తె నా లి,
19–9–'61

జి. వి. కృష్ణరావు

అనువాదమ్ములు కత్తిసాములని వ్యాహారింపరే పెద్దలం
దును శాస్త్రమ్మును గావ్యమున్గలసి హిందోళంబునం బాడఁగా
దెనుఁగుం జేఁతకు సాహసింతురె మహాధీశాలులైనం జిరం
తనవిజ్ఞానవిభూతి కీతఁడిదిగో దంభించె లోభంబునన్.

# మొదటి ప్రకరణం

దేవిని పూజించ వచ్చునని నిన్న యారిష్టన్ కుమారుడైన గ్లాకన్‌తో కలిసి పిరీస్ వెళ్ళాను. అక్కడకు పోవటానికి మరొక కారణం కూడ ఉన్నది. దేవికి జరుగ బోయే ఉత్సవం క్రొత్తది. ఆ ఉత్సవం ఎలా జరుగుతుందో చూడాలని కూడా ఉన్నది. స్థానికులు సాగించిన యాత్రను చూచి ఆనందించాను. థ్రేసు దేశీయులు సాగించిన యాత్రకూడ అంతకన్న మిన్నగా ఉండక పోయినా, మనోహరంగానే ఉన్నది. మా పూజ ముగించుకొని ఉత్సవం చూచి నగరం వైపు మళ్ళాను. ఇలా ఇంటికి బయలుదేరుతుండగా సిఫాలస్ కుమారుడు పాలిమార్కస్ మమ్ము దూరాన చూచాడు. "నీవు పరుగెత్తుకొని పోయి నేను వచ్చేదాక వారిని ఆగు మని చెప్పు," అని అతడు తన సేవకుణ్ణి నాకోసం తరిమాడు. వాడు వచ్చి వెనుకనుంచి నా వస్త్రాంచలం పట్టుకొని నిలిపి "అయ్యా, పాలిమార్కస్ మిమ్ము ఆగమన్నారు," అని చెప్పాడు.

నేను వెనుదిరిగి చూచి "మీ యజమాని ఎక్కడ?" అన్నా.

"అదిగో, మీరు కొంచెం ఆగితే యిప్పుడే వస్తారు," అన్నాడు ఆ యువకుడు.

అలాగే నన్నాడు గ్లాకన్. కొలది నిమిషాలలో పాలిమార్కస్ ప్రత్యక్షమయ్యాడు. ఆతని వెంట గ్లాకన్ సోదరుడు యాడైమాంటస్, నీసియస్ కుమారుడు నిసరేటస్—ఇంకా చాలమంది ఉన్నారు. వీరంతా యాత్ర వద్ద కనిపించారు.

సోక్రటిస్, మీరూ మీ అనుచరుడు అప్పుడే పట్టణానికి బయలుదేరి నట్లుందే? అని పాలిమార్కస్ ప్రశ్నించాడు.

నీ వంతగా పొరపాటు పడలేదు సుమా! అని నేనన్నా.

ఇంతకూ మే మెంతమందిమి ఉన్నామో చూచారా?

ఆఁ, చూచాను.

వీరందరికంటె మీరు బలవంతులా? కారు కాబట్టి ఉన్న చోటినుంచి మీరు కదలరాదు.

అంతకు వినా గత్యంతరం లేదంటారా? మిమ్ము మేము నచ్చజెప్పి ఒప్పించనూ వచ్చు; మీరు మమ్ము పోనీయనూ వచ్చు నని అన్నా.

మీ మాట విననప్పుడు గూడ మమ్ము ఒప్పిస్తారా?

అప్పుడసంభవమే నన్నాడు గ్లాకన్.

ఇంతకూ మీ మాట విన దలచుకోలేదు. ఇది మాత్రం తథ్యమని పాలిమార్కస్ అన్నాడు.

"ఈ సాయంకాలం దేవీమహోత్సవంలో గుర్రాలపై దివ్వెలపోటీ జరుగుతుం దని మీకెవ్వరు చెప్పలేదా?" యాడైమాంటస్ అడిగాడు.

"గుర్రాలపై దివ్వెల పోటీయా! వింతగానే ఉన్నది. రౌతులు తమ కాగడాలను ఒకళ్ళ కొకళ్ళు అందించుకొంటారా?" కుతూహలంతో అడిగాను.

ఆఁ, పైగా రాత్రికి ఉత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవం చూచి తీరాలి. రాత్రి భోజనా లయిన తరువాత వెంటనే వెళ్ళి చూదాము. యువకులు అనేకులు వస్తారు. హాయిగా గోష్ఠి జరుపుకోవచ్చును. అందువల్ల నిలిచి పొండి. మొండి కెత్తకండి.

ఇంతగా బలవంతం చేస్తుంటే నిలవక తప్పుతుందా? అన్నాడు గ్లాకన్.

నేనూ సరే నన్నా.

పాలిమార్కస్‌తో కలిసి మేమంతా వారి ఇంటికి వెళ్ళాము. అక్కడ అతని సోదరులు లైసియస్, యుథిడిమస్, వారితోపాటు కాల్సిడన్ దేశీయుడు థ్రాసిమాకస్, పీనియన్ అయిన కార్మాంటిడిస్, యారిస్టాని మస్ కుమారుడు క్లిటోఫన్ కనిపించారు. పాలిమార్కస్ తండ్రి సిఫాలస్ కూడ అక్కడే ఉన్నాడు. నేను ఆయనను చూచి చాలకాల మయింది. అతని జరాభారం ఇంకా ముదిసినట్లు కనిపించింది. మెత్తపర చిన కుర్చీలో అతడు కూర్చుని ఉన్నాడు. అతని తలపై పుష్పమాల ఉన్నది. అప్పుడే పూజాగారంలో దేవబలి సమర్పించి వచ్చాడు. అతని పీఠానికి ప్రక్కనే అర్ధచంద్రాకారంలో మరికొన్ని కుర్చీలు వేసి ఉన్నవి. మేము వెళ్ళి అతని ప్రక్కన కూర్చున్నాము. అతడెంతో ఆప్యాయంగా పలకరించి యిలా అన్నాడు:— సోక్రటిస్ ! నన్ను చూడటానికి నీవు తరచుగా రావటం లేదు. నేనైనా యిల్లు వదలి బయలుదేర గలిగిన స్థితిలో ఉంటే నిన్ను వచ్చిపొమ్మని కోరను. ఈ వయస్సులో పట్టణం రాలేను. కాబట్టి నీవే తరచు పిరీస్‌కు వస్తూఉండాలి. ఎందుకంటే శారీరక సుఖాలు వెనుకపట్టినకొలదీ సరససల్లాపసుఖంలో మమకారం పెరుగు తున్నది. అందువల్ల నా కోరిక త్రోసిపుచ్చకు. మాయిల్లే మీయిల్లనుకొని ఈ యువకులతోపాటు నీ సాహచర్యసుఖం కల్పించు. మనం చిరమిత్రు లము. బెరుకు లేక మీయింటివద్ద ఉన్నట్లే యిక్కడ మాతో ఉండ వచ్చును.

సిఫాలస్ ! వృద్ధులతోడి సల్లాపంకంటె నాకు ప్రియతరం మరొకటి లేదు. ఎందుకంటే వారు గమించిన మార్గమే నేనూ గమించాలి. ఆ మార్గం సుగమమో, దుర్గమమో తెలిసికోవలసి ఉంది. ఇప్పటి మీవయస్సును కవులు వార్ధకానికి దేహళిగా వర్ణిస్తుంటారు. అలాంటి వార్ధకాన్ని త్రొక్కిఉన్న మిమ్ము ఈ విషయం అడిగి తెలిసికోవాలని ఉన్నది. చరమదశలో జీవితం కష్టతరమా ? మీ రేమంటారు ?

అతడు ప్రారంభించాడు:— నా అనుభవం చెప్పమంటావా? నా వయసువారంతా ఒకచోట చేరుతారు. సామెత చెప్పినట్లు మేమంతా సతీర్థులం కదా ! అలాంటి సమావేశాలలో తరచు నాకీ సణుగుడు విని పిస్తుంటుంది. "నేను కడుపార తినలేను, త్రావలేను. యౌవనసౌఖ్యాలు అంతరించాయి. ప్రణయానందం సురిగిపోయింది. ఒకప్పుడు జీవితం ఎంత మధురంగా ఉండేది ! ఆ రోజులు పోయాయి. ఇప్పుడు బ్రతుకు బ్రతు

కుగా లేదు.'' కొందరు చుట్టాలవల్ల తాము పొందిన ఈసడింపులు ఏకరువు పెడతారు. ముదిమివల్ల పడుతున్నపాట్లు దిగులుసొచ్చి వివరిస్తారు. కాని వీరంతా దూరరానిదానిని దూస్తున్నట్లు కనబడుతున్నది. అనర్థాలన్నిటికి వార్ధకమే హేతువైతే, నేను కూడ వృద్ధుణ్ణే. వారి అనుభవమే నాకూ కలగాలి. కాని నా అనుభవం అలా లేదు. వృద్ధకవి సోఫాక్లీజ్ చెప్పినసమాధానం నా మనస్సులో స్పష్టంగా మ్రోగుతున్నది. ''సోఫాక్లీజ్! ముదిమితో ప్రేముడి యెలా జతపడుతున్నది? నీవు పూర్వంవలెనె ఉన్నావా?'' అని ప్రశ్నిస్తే, అతడు చెప్పిన సమాధానం జ్ఞప్తికిరావటం లేదా? ''పాపం శమించు గాక! ఆ చెర విరగడైపోయింది. క్రోధోన్మత్త ప్రభువు బారినుంచి బయట పడ్డాననుకొంటున్నా'' నని అతడన్నాడు. అతని మాటలు నాడువలె నేడూ అర్థవంతాలు. నిజంగా వార్ధకంలో మహత్తరశాంతిస్వాతంత్ర్యాలు పొడుకొంటాయి. రాగద్వేషాదులు ఉడిగిపోతాయి. సోఫాక్లీజ్ చెప్పినట్లు ఉన్మత్తప్రభువు ఒకనినుంచికాక పెక్కురనుంచి చెర విరగడ అవుతుంది. నిజానికి చీకుచింతలకు మూలం మానవస్వభావమే కాని, వార్ధకం కాదు. శాంతసంతుష్టస్వభావునికి వార్ధకక్లేశాలు అంటవు. భిన్నస్వభావులకు ప్రాయం కూడ బరువుచేటు.

అతని మాటలు విస్మయాసక్తులతో వింటున్నాను. అతనిచేత ఇంకా మాటాడించా లని అన్నా:—మీ మాటలు ప్రజలు సామాన్యంగా నమ్మరేమో నని నా సంశయం. మీకు వార్ధకం సుఖదాయకం కావటానికి కారణం మీ సంపదే కాని మీ సుస్వభావ మని వారు నమ్మరు. సాధారణంగా సంపద సుఖప్రదం కదా!

అతడు మళ్ళీ ప్రారంభించాడు:—నీ వన్నది యథార్థం. వారు నమ్మరు. వారి మాటల్లో కొంత సత్య మున్నది. అయినా వారు ఊహించేటంత సత్యం అందులో లేదు. ఒకసారి థిమిస్టొక్లీజ్‌ను, ''ఏథెన్సునగరవాసి వగుటవల్ల నీకు ఖ్యాతి వచ్చిందే కాని, నీ సుగుణసంపత్తివల్ల రాలేదు,'' అని సెరిఫియన్ అధిక్షేపిస్తే, ''నీవు నాదేశంలో గాని, నేను నీ దేశంలో గాని జన్మించిఉంటే మన మిద్దరమూ ప్రసిద్ధులమై ఉండము,'' అని అతడు సమాధానం చెప్పాడు. ధనహీనులై ముదిమిలో ఓరిమి కోల్పోయినవారికి ఈ సమాధానమే చెప్పవచ్చును. మంచివాడైన నిరుపేదకు ముదుసలితనం అంత తేలిక కాదు. చెడ్డవాడైన భాగ్యవంతునికి ఆత్మశాంతి కలుగదు.

సిఫాలస్ ! మిమ్ము ఒకటి అడగాలని ఉన్నది. మీ సంపద పిత్రార్జితమా, స్వార్జితమా? అని నేను ప్రశ్నించా.

స్వార్జితమా? నే నెంత సంపాదించానో వినగోరుతున్నావా? ధన సంపాదనకళలో నేను మా తాతగారికి, నాన్నగారికి మధ్యేమార్గం అనుసరించాను. మా తాతగారిపేరే నాకూ పెట్టారు. నా కిప్పుడున్నంత ఆస్తే ఆయనకు తన తండ్రిగారివల్ల వచ్చింది. దానిని ఆయన రెండింతలు మూడింతలు చేశాడు. మా తండ్రిగారు లైసనియస్ దానిని ఇప్పుడున్న దానికంటె తక్కువ చేశారు. నేను మాత్రం పితృదత్తమైన దానికంటె కొంచెం అధికంగా మా కుర్రవాళ్ళ కప్పగించ గలిగితే సంతోషిస్తాను.

అంత నేనిలా అన్నా:— ధనమందు ఉదాసీనులుగా కనిపించటం వల్ల మిమ్ము ఈ ప్రశ్న వేశాను. ఈ లక్షణం పైతృకసంపన్నులందు కనిపిస్తుంది కాని, స్వయంగా సంపాదించినవారిలో కనిపించదు. ప్రయోజనాన్నిబట్టి, తమకూ ఇతరులకూ కలిగేలాభాన్నిబట్టీ, ధనతృష్ణ కొంత ఉండటం సహజమే. కాని కవులకు తమరచనలందువలె, తల్లిదండ్రులకు తమబిడ్డలందువలె, స్వార్జితసంపన్నులకు ధనమందు విశేషమమకారం ఏర్పడుతుంది. కాబట్టి వారితో గోష్ఠి చాల దుష్కరం. వారెప్పుడూ లక్ష్మీ దండకం వల్లిస్తుంటారు కాని, మరొకటి మాటాడరు.

అది అక్షరాల నిజమని అతడన్నాడు.

అది అలా ఉంచండి. ఇంకొకటి మిమ్మడగాలని ఉన్నది. సంపద వల్ల మీరు పొందిన ఉత్తమోత్తమ ఫలమేమిటి?

లేకేమి? ఉన్నది. కాని దానిని చెబితే ఇతరులు నమ్ముతారనుకోను. సోక్రటిస్! మృత్యువు సమీపిస్తున్న దనుకొన్నప్పుడు మున్నెన్నడూ లేని భయమూ ఆందోళనా మానవునిమనస్సును ఆవరిస్తాయి. ఒకప్పుడు నరకలోకవృత్తాంత మన్నా, అచటి శిక్షలన్నా, నవ్వుగా ఉండేది. కాని తలమీద మృత్యువు ఆడుతున్నప్పుడు మాత్రం అవన్నీ నిజమేమో నన్న శంక అతన్ని పీడిస్తుంది. వార్ధకదౌర్బల్యంవల్ల నేమి, తుదిగడియలు సమీపించటంవల్ల నేమి అతనికి ఇవన్నీ కన్నులకు కట్టినట్లు కనిపిస్తవి. అనుమానాలు, ఆందోళనలు ముమ్మరంగా ఆవరిస్తాయి. అతడు దిగులుపడి తా నొనర్చిన అపకారాలకు బేరీజు కడతాడు. అతని ఉల్లంఘ

నలు సంఖ్యాధికాలుగా ఉన్నప్పుడు భీతిల్లి పిల్లవాడువలె నిద్రలో పెక్కు మార్లు ఉలికిపడుతుంటాడు. ఘోరదుర్నిమిత్తాలెన్నో అతనికి కనిపిస్తుంటవి. పాపమెరుగనివాని కట్లు కాదు. పిండార్ మనోజ్ఞంగా వర్ణించినట్లు మధురమధురమైన ఆశ ముదిమిని దాది అవుతుంది.

"న్యాయానికి కట్టుబడి పవిత్రజీవనయాత్ర సాగించేవానిని వలచి ముదిమిని దాదియై ఆశ ఉపచరిస్తుంది. అతనికిహలోకయాత్రలో సహచారిణి అవుతుంది. అశాంతిచంచలమైన మానవుని ఆత్మను మహత్తర శక్తియై అనుశాసిస్తుంది," అని ఆ కవి వర్ణించాడు.

అతని వర్ణన ఎంత ఉదాత్తం! సంపదవల్ల ఒక్కటే మహత్తర ప్రయోజనం. అది అందరకూ కలుగుతుందని నేను చెప్పను. కాని సుకృతవంతుడు మాత్రం కక్కురితిపడి యితరులను వంచించ నక్కర లేదు, అతడు పరలోకానికి పయనమైనప్పుడు దిగవిడిచిన దైవయజ్ఞాలకు భీతిల్లడు. తీర్చని అప్పులనుగూర్చి కాళ్ళు త్రొక్కుకోడు. ఇలాంటి మన శ్శాంతికి సంపద దోహదమిస్తుంది. పరామర్శించి చూడగా మానవునకు సంపద సంపాదించగలిగిన ప్రయోజనాలలో ఇది ఉత్తమోత్తమమని నా అభిప్రాయం.

అంతలోనే అందుకొన్నా :— సిఫాలస్! చక్కగా చెప్పారు. కాని న్యాయమంటే ఏమిటి? సత్యం చెప్పటం, అప్పు తీర్చటం—ఇదేనా న్యాయం? దీనికి గూడ అపవాదాలుండవా? మిత్రుడొకడు స్వస్థచిత్తుడై ఉండి తనశస్త్రాలు నావద్ద దాచి తరువాత స్వాస్థ్యం కోలుపోయి నా ఆయుధాలు నాకిమ్మని అంటాడనుకోండి. నేను వానిని అతని కిచ్చివేయాలా? ఇచ్చివేయాలని ఎవరూ చెప్పరు. అలా చేయటం సముచితమని అనరు. ఆ స్థితిలో ఉన్నవానికి సత్యం చెప్పాలని ఆశంసించరు.

నీవు చెప్పింది యుక్తమే నని అతడన్నాడు.

అలాగైతే సత్యం చెప్పటం, అప్పు తీర్చటం అనేది న్యాయానికి సరియైన నిర్వచనం కాజాలదని అన్నా.

సిమోనిడీజ్ చెప్పింది ప్రమాణమైతే అది యుక్తమే నని పాలిమార్కస్ అన్నాడు.

దేవబలులు తొందరపెడుతున్నవి. కాబట్టి నేను వెళ్ళాలి. నావాదం పాలి మార్కస్‌కు, తక్కిన సదస్యులకు అప్పగిస్తున్నా నని సిఫాలస్ అన్నాడు.

పాలిమార్కస్ మీ వారసుడు కాడా? అని నేనడిగాను.

కాకపోవట మేమిటి?అని అతడు నవ్వుతూ కార్యతత్పరుడై వెళ్లిపోయాడు.

ఓయీ వారసుడా! న్యాయాన్నిగూర్చి సిమోనిడీజ్ ఏమి చెప్పాడు? నీమత మేమిటి? కొంచెం వివరించు, అని నేను అడిగాను.

అప్పు తీర్చటం న్యాయం. అంతవరకు అతడు చెప్పింది యుక్తమే నని అతడు సమాధానమిచ్చాడు.

అలాంటి ప్రజ్ఞాశాలి మాటలో సంశయపాటు శోచనీయమే. కాని దాని అర్థం మీకు స్పష్టంగా కనబడుతున్నా నాకు మాత్రం అలా కని పించటం లేదు. ఇంతకు ముందు చెప్పుకొన్నట్లు నావద్ద దాచుకొన్న శస్త్రాలో, మరొక వస్తువో, అస్వస్థచిత్తుడై కోరినప్పుడు నేనిచ్చివేయవలె ననటం సిమోనిడీజ్ తాత్పర్యం కాజాలదు. అయినా తొల్లి పుచ్చు కొన్నది ఋణం కాదన వీలు లేదు.

అవును.

అస్వస్థచిత్తుడై న్యాసమర్థిస్తే నేను దానిని తిరిగి ఇచ్చివేయ నక్కర లేదు గదా?

అక్కర లేదు.

అప్పు తీర్చటమే న్యాయమన్న సిమోనిడీజ్ ప్రకృతార్థానికి గూడ తన నిర్వచనం అన్వయించా లని ఉద్దేశించలేదు గదా?

నిజమే. మిత్రుడు తనమిత్రునకు మేలు చేయాలి కాని కీడు చేయ రాదు.

ఇరువురకు అన్యోన్యమైత్రి ఉందనుకో. అందు ఒకడు మరొకనివద్ద ధనం

దాచుకొంటాడు. తరువాత కొంతకాలానికి మతిచెడి అతడు తనధనం తనకు ఇచ్చివేయమంటాడనుకో. నిజంగా అలా ఇచ్చివేయటం అతనికి అనర్థకారి అవుతుంది. అలాంటప్పుడు ఆధనసమర్పణ ఋణం తీర్చటం కాదని సిమోనిడీజ్ తాత్పర్యమంటావా?

నిజంగా అంతే.

మనం శత్రువులకు తీర్చవలసిన అప్పును తీర్చాలి గదా?

నిజమే. వారికి ఋణపడిన దానిని ముట్టజెప్పాలి. శత్రువు శత్రువునకు ఏమి ముట్టచెప్పటం అర్థం? కీడే కదా? అలాగే చేయవలసి ఉంటుందని నేనర్థం చేసికొంటున్నానని అతడన్నాడు.

అలాగే అయితే కవులవలెనే సిమోనిడీజ్ కూడ న్యాయతత్త్వాన్ని ఘోరంగా నిర్వచించాడు. ఎందుకంటే ఎవని కర్హమైన అర్థం వాని కర్పించటమే న్యాయమని అతని తాత్పర్యం. దీనిని అతడు ఋణమంటున్నాడు.

ఇదే అతని తాత్పర్యమై ఉండాలి.

ఎంత విడ్డూరం! ఆయుర్వేదం ఏ సముచితార్థాన్ని ఎవనికిస్తుంది? అని అతన్నడిగితే అతడేమి చెప్పిఉండేవాడు? అని నేను ప్రశ్నించాను.

ఆయుర్వేదం మందులిచ్చి మానవదేహాలకు పథ్యం నిర్దేశిస్తుందని అతడు నిస్సంశయంగా చెబుతాడు.

పాకకళ ఇచ్చే సముచితార్థ మేమిటి?

ఆహారపదార్థాలకు పక్వతను చేకూరుస్తుంది.

మరి న్యాయ మనుగ్రహించే దేమిటి? ఎవరికి దానిని ప్రసాదిస్తుంది?

సోక్రటిస్! పై దృష్టాంతాలనుబట్టి చెప్పాలంటే, మిత్రుల కుపకారం అమిత్రుల కపకారం కావించే కళే న్యాయం.

అతని తాత్పర్య మదేనా?

అదే కావాలి.

మంచమెక్కినప్పుడు మిత్రులకుపకారం, శత్రులకపకారం చెయ్య గలిగిన వాడెవ్వడు?

వైద్యుడు.

మరి నౌకాయానం చేస్తుండగా సముద్రప్రమాదాలకు గురైనప్పుడో?

Acc No
Cl. No

నావికుడు.

న్యాయవంతుడు అమిత్రులకపకారం, మిత్రులకుపకారం ఎలా చేయగలుగుతున్నాడు?

ఒకనిపై దాడివెడలి, మరొకనితో మైత్రి పాటించి.

పాలిమార్కస్! ఆరోగ్యవంతుడై ఉండగా మానవునకు వైద్యునితో పనిలేదు గదా?

ఉండదు.

సముద్రయానం చేయనప్పుడు నావికునితో నిమిత్తం కలుగదుగదా?

ఉండదు.

అలాగే శాంతి నెలకొని ఉన్నప్పుడు న్యాయంవలన ప్రయోజనం కలుగదు గదా?

నేనట్లనను.

అంటే యుద్ధకాలంలోవలెనే శాంతిసమయంలో కూడ న్యాయం వలన ప్రయోజన మున్నద నే కదా నీ భావం?

అవును. అంతే.

అంటే పంటకు సేద్యం లాగానే అది ఆవశ్యకమంటావు ?

ఆం.

పాదుకాప్రాప్తికి పాదుకాకారిత్వం లాగానే అది అవసర మని కదా నీ తాత్పర్యం ?

అంతే.

అలాగే న్యాయసముపార్జనంవల్ల శాంతి సమయంలో కలిగే ప్రయోజన మేమిటి ?

సోక్రటిస్, ఒప్పందాలలో న్యాయం ఉపయోగపడుతుంది.

ఒప్పందా లంటే భాగస్వామ్యాలనే కదా నీ భావం ?

అవును.

చదరంగంలో ఎవనితో పొత్తు లాభదాయకం ? నేర్పరితోనా, న్యాయ వంతునితోనా ?

నేర్పరితోనే.

ఇటుకకట్టుబడిలోనో ? తాపీపనివానితోకంటె న్యాయవంతునితో పొత్తు లాభదాయకమా ?

కాదు, దాని వైపరీత్యమే.

వీణావాదనంలో న్యాయవంతునితోడి పొత్తుకంటె వైణికుని పొత్తు లాభం. అలాగే వైణికునిపొత్తు కంటె న్యాయవంతునిపొత్తు ఎందు లాభదాయక మాతుంది ?

ద్రవ్యవిషయంలో.

నిజమే పాలిమార్కస్ ! కాని డబ్బు ఉపయోగించవలసివచ్చినప్పుడు

మాత్రం కాదు. ఉదాహరణకు గుర్రం కొనవలసివచ్చినా అమ్మవలసివచ్చినా న్యాయవంతుని సాయం అపేక్షించవు. గుర్రాల సంగతి తెలిసినవాడుంటే మంచిది. ఏమంటావు?

నిజమే.

నౌకను కొనదలచినప్పుడు నావికుడో నౌకానిర్మాయకుడో ఉంటే మంచిది కదా?

అవును.

అలాగే ఎలాంటి ద్రవ్యవ్యవహారాలలో న్యాయవంతుడు మేలు?

ధనం భద్రంగా దాచుకో దలచినప్పుడు.

అంటే ధనం వెచ్చించక దాచుకోదలచినప్పుడనే కదా నీ తాత్పర్యం?

ఆఁ.

అంటే ధనంతో పనిలేనప్పుడే న్యాయం అక్కరకు వస్తుందని కదా అర్థం?

అలాగే కనిపిస్తున్నది.

కొడవలి భద్రపరచుకోవలసి వచ్చినప్పుడే న్యాయం వ్యక్తికీ, రాజ్యానికీ ఉపయోగపడుతుంది. దానిని వాడవలసివచ్చినప్పుడు మాత్రం తోటమాలి విద్యయే ఉపయోగపడుతుంది. అంతేనా?

అవును.

ఇంతకూ డాలు కాని, వీణ కాని ఉపయోగించక దాచుకోవలసి వస్తే న్యాయం అక్కరకు వస్తుంది. ఉపయోగించవలసివచ్చినప్పుడు మాత్రం సైనికవిద్య, వైణికత్వం అక్కరకు వస్తుందంటారు?

అంతే.

కాబట్టి ఇదే ఇతరవస్తువులకు కూడ అన్వయిస్తుంది. అంటే వానిని ఉపయోగించనప్పుడు న్యాయం ప్రయోజనకారి అవుతుంది. ఉపయోగించ వలసివచ్చినప్పుడు ప్రయోజనకారి కాదు. అవునా?

అలాగే కనిపిస్తున్నది.

ఆపక్షంలో న్యాయం అంతగా ప్రయోజనకారి కాదు. అయితే ఇంకొక విషయం కూడ ఆలోచింతాము. ముష్టియుద్ధంలో కాని మరొక యుద్ధంలో కాని దెబ్బకుదెబ్బ తీయగలిగినవాడే దెబ్బకాచుకోగలడు గదా?

అవును.

రోగం బారిపడక తప్పించుకోగలిగినవాడు గాని, నిరోధించ గలిగిన వాడు గాని దానిని సృష్టించ సమర్థుడు కదా?

అవును.

తన జాడ తెలియనీక శత్రువును ముట్టడించగలవాడే కదా ఉత్తమ సేనాపతి?

నిశ్చితంగా అంతే.

అప్పుడు ఉత్తమరక్షకుడు చోరశిఖామణి కూడ అవుతున్నాడు కదా?

అలాగే కనబడుతున్నది.

ధనరక్షణలో న్యాయవంతుడు సమర్థుడైనప్పుడు దాని అపహరణలోకూడ అతడు సమర్థుడౌతున్నాడు.

అలాగే ఉన్నది.

ఇంతకూ న్యాయవంతుడు గజదొంగగా తేలుతున్నాడు. ఈ పాఠమే హోమర్ కృతినుంచి నేర్చుకొన్నావని అనుమానిస్తున్నా. ఎందుకంటే ఒడిస్సియస్‌కు మాతామహుడు తనకు అభిమానపాత్రుడు అయిన

ఆటోలికస్‌ను గూర్చి చెబుతూ హోమర్, "చౌర్యానృతాలలో అతడు మానవులందరినీ మించినమేటి," అని శ్లాఘించాడు. కాబట్టి న్యాయమనేది చౌర్యకళ అని నీవు, హోమరు, సిమోనిడీజ్ అంగీకరిస్తారు. అయితే మిత్రామిత్రుల ఉపకారాపకారాల కోసం దీనిని ఆదరించవలసి ఉంటుందంటారు. ఇదే కదా మీరు చెబుతున్నది?

మొదట ఏమన్నానో తెలియకపోయినా అది మాత్రం కాదు. మిత్రామిత్రుల కుపకారాపకారాచరణమే న్యాయమని నా వాదన.

పోనీ మరొక ప్రశ్న: మిత్రామిత్రులన్నప్పుడు నిజంగా అలాంటివారనా, లేక పైకి అలా కనిపించేవారనా మన తాత్పర్యం?

మానవుడు తాను మంచివారనుకొన్నవారిని ప్రేమిస్తాడు, చెడ్డవా రనుకొన్నవారిని ద్వేషిస్తాడు.

అయితే మంచిచెడుగుల విషయంలో మానవులు పొరపడరా? అసత్పురుషులు సత్పురుషులుగా, సత్పురుషులు అసత్పురుషులుగా కనిపించవచ్చును గదా?

నిజమే.

అలాంటప్పుడు మంచివారు శత్రువులు, చెడ్డవారు మిత్రులు అవుతారు కదా?

అవును.

ఆ పక్షంలో చెడ్డవారికి మేలు, మంచివారికి కీడు చేయటం వారికి సముచితమే అవుతుంది కదా?

అవును.

మరి సత్పురుషులు న్యాయం చేస్తారే కాని, అన్యాయం చేయరుకదా?

నిజమే.

అయితే నీ వాదాన్నిబట్టి కీడు చేయనివారికి కీడు చేయటం న్యాయ మౌతుంది కదా?

అలా కాదు సోక్రటీస్! ఈ వాదం దారుణం.

అయితే మనం న్యాయవంతులకు మేలు, అన్యాయవంతులకు కీడు చేయ వలసి ఉంటుందా?

ఇదే మేలు.

మరి దీనివల్ల కలుగుతున్న పర్యవసానం ఆలోచించు. మానవస్వభావం గ్రహించలేని వ్యక్తులనేకులు దుష్టులతో చెలిమి చేస్తారు. అలాంటి దుష్టమిత్రులకు అపకారం చేయవలసి ఉంటుంది. సత్పురుషులతో శత్రుత్వం సంపాదించినప్పుడు సత్పురుషులైన శత్రువులకు ఉపకారం కావించవలసి ఉంటుంది. ఈ పక్షంలో సిమోనిడీజ్ తాత్పర్యంగా నిర్దిష్టమైన దానికి కేవలం విరుద్ధార్థం ఏర్పడుతుంది.

అత డందుకొన్నాడు:— నిజమే. కాని మిత్రామిత్ర శబ్దప్రయోగవిష యంలో పొరపడ్డాము. ఆ దోషం మనం సవరించుకోవాలి.

"ఆ దోష మేమిటి?" నేను పొలిమార్కస్‌ను ప్రశ్నించాను.

మంచివానివలె కనిపించే వాడు, లేదా మంచివాడుగా భావింపబడ్డవాడు మిత్రుడవుతాడని మనం అనుకొన్నాము.

మరి ఈ ప్రమాదాన్ని ఎలా సవరించాలి?

నిజానికి మంచివాడైఉండి మంచివానివలె కనిపించేవాడే మిత్రుడని మనం చెప్పుకోవాలి. మంచివానివలె కనిపిస్తూ వాస్తవంగా మంచివాడు కాని వాడు మిత్రునిలాగా కనిపిస్తాడు కాని, నిజంగా మిత్రుడు కాడు. శత్రువు విషయంలో కూడ ఇలాగే చెప్పుకోవచ్చును.

మనకు మంచివారు మిత్రులు, చెడ్డవారు శత్రువులు అనేకదా నీ వాదన?

అవును.

మిత్రులకు మేలు, అమిత్రులకు కీడు చేయటమే న్యాయమని మనం మొదట్లో చెప్పుకొన్నాము. కేవలం అలాగే కాక ఇలా కూడ చెప్పుకోవాలి. సన్మిత్రులకు మేలు, దుష్టశత్రువులకు కీడు చేయటమే న్యాయమని చెప్పాలి.

అవును. ఇదే నాకు సత్యంగా తోస్తున్నది.

ఇంతకూ న్యాయవంతుడైనవాడు ఎలాంటి వానికైనా కీడు చేయవచ్చునా?

అటు దుండగులు ఇటు పగతురు అయినవారికి నిస్సందేహంగా కీడు చేయాలి.

హాని కావిస్తే అశ్వాలు బాగుపడతవా, చెడిపోతవా ?

చెడిపోతవి.

అంటే అశ్వలక్షణాలు భ్రష్టాలవుతవి. అంతే కాని సారమేయలక్షణాలు భ్రష్టాలు కావు.

అవును. గుర్రాల ఉత్తమలక్షణాలకే చేటువస్తుంది.

సారమేయాలు కీడ్పాటు పొందినప్పుడు వాని లక్షణాలకే చేటు వస్తుంది కాని, అశ్వలక్షణాలకు కీడు కలుగదు గదా ?

అంతే.

హానికి గురియైన మానవులలో మానవసహజమైన సద్గుణం భగ్నమై పోదుగదా ?

లేదు.

న్యాయమనేది మానవుని సద్గుణమే కదా ?

అఁ.

2)

హానిపొందిన మనుజులు విధిగా అన్యాయపరులవుతారా?

పర్యవసాన మంతే.

అయితే గాయకుడు తన సంగీతకళతో మానవులను సంగీతానభిజ్ఞులను చేస్తున్నాడా?

లేదు.

అశ్వికుడు తన విద్యచే ఇతరులను దుష్టాశ్వికులను చేస్తున్నాడా?

అసంభవం.

మరి న్యాయవంతుడు తన న్యాయంచేత మానవులను అన్యాయపరులను చేయగలడా? లేక ఇంకా సామాన్యంగా చెప్పాలంటే న్యాయవంతులు తమ సద్గుణాలతో మానవులను దుష్టులను చేయగలరా?

లేదు.

ఉష్ణం శైత్యాన్ని ఉత్పాదించదు కదా?

ఉఁహూఁ.

చెట్టతనం తేమను కలిగించదు గదా?

లేదు.

న్యాయవంతులు కూడ ఎవరికీ కీడు కావించలేరు.

అవును. కీడు చేయటం కల్ల.

న్యాయవంతుడే మంచివాడు కదా?

అవును.

అయినప్పుడు మిత్రునకు కాని మరొకనికి కాని కీడుసేత న్యాయవంతుని చేష్ట కాజాలదు. అలాంటిది అన్యాయవంతుని చర్య అవుతుంది. అవునా?

నిజమే.

అయినప్పుడు ఋణమీగటమే న్యాయం. మిత్రులకు తీర్చవలసీ ఉన్నదానిని తీర్చటం న్యాయం. శత్రువులకు చెల్లించవలసి ఉన్నదానిని చెల్లించటం అన్యాయం. ఇలా అంటే అది వివేకం కాదు. ఇంతకు ముందు వివరించి నట్లు ఒకనికి కీడు చేయటం న్యాయం కానప్పుడు ప్రకృతవచనం యుక్తం కాదు.

మీతో నే నేకీభవిస్తాను, అని పొలిమార్కస్ అన్నాడు.

మరి ఇలాంటి భాషణం సిమోనిడీజ్‌కు కాని, బియాస్‌కుకాని, పిట్టకస్‌కు కాని, మరొక ప్రజ్ఞాశాలికి కాని, లేక మరొక మహర్షికి కాని ఎవరా పాదించినా, వారితో నీవూ నేను కాదని పోరాడ సిద్ధమే కదా?

ఇంకా సందేహమా!

మరి ఈ సూక్తి ఎవరిదో చెప్పనా?

ఎవరిదంటారు?

పెరియాండర్ కాని, పెర్డికాస్ కాని, జర్జెస్ కాని, థెబస్ దేశీయుడు ఇస్మేనియాస్ కాని, లేక మహత్తరమైన ఆత్మవిశ్వాసమున్న మరొక సంపన్నుడు కాని మిత్రామిత్రులకు ఉపకారాపకారాలు చేయటమే న్యాయమని మొదట చెప్పి ఉంటాడు.

నిజమే.

ఇంతకూ న్యాయానికి చెప్పుకొన్న ఈ నిర్వచనం కూడ నిలవనిపక్షంలో

మరేమి చెప్ప వీలవుతుంది?

ఇలా చర్చ సాగుతుండగా మధ్యలో అందుకోటానికి థ్రాసిమాకస్ పెక్కుసార్లు ప్రయత్నించాడు. కాని పర్యవసానం విన కుతూహల పడుతున్న తక్కినవారు పడనీయ లేదు. అయినా పాలిమార్కస్, నేనూ ప్రసంగం ముగించగానే అవకాశం చిక్కింది. మరేమాత్రం అతడు ఆచుకోలేకపోయాడు. ఉంకించి దూకే బెబ్బులిలాగ మామీదికి వచ్చాడు. అతన్ని చూడగానే విభ్రాంతుల మయ్యాము.

సదస్యులపై అతడు ఒక్కసారిగా కాంద్రుడు మన్నాడు:—సోక్రటీస్! మిమ్మందర్నీ ఏ అజ్ఞానం ఆవరించింది? ఎందుకు దాగుడుమూత లాడుతారు? వాస్తవంగా న్యాయమంటే ఏమిటో మీకు తెలిసికోవాలని ఉంటే ప్రశ్నించటమే కాదు, సమాధానం కూడ చెప్పాలి. ప్రతిపక్షవాదనిరాకరణంతో గౌరవం సంపాదించి సంతృప్తిపడ యత్నించరాదు. మీ సొంత సమాధానం చెప్పాలి. ఎవరైన ప్రశ్నిస్తారు. సమాధానమే చెప్పలేరు. న్యాయమంటే మేలనో, లాభమనో, సంపాదనమనో, ప్రయోజనమనో చెప్పినా చెప్పకపోయినా ఒకటే. ఇలాంటి అర్థరహితవచనం నాకు సమ్మతం కాదు. విస్పష్టత, నిష్కర్ష కావాలి.

అతని మాటలతో నాకు భయభ్రాంతులు కలిగాయి. కంపనరహితంగా అతని వంక చూడలేకపోయాను. తదేకదీక్షతో అతనివంక చూస్తూ ఉండకపోతే నేను స్తంభించిపోయి ఉండేవాణ్ణనుకొంటాను. కోపం పొంగి పొరలుతుండే సమయంలో అతన్ని చూచాను కాబట్టి అతనికి సమాధానం చెప్పగలిగాను.

వణకిపోతూ అన్నా:— థ్రాసిమాకస్! మమ్మింత నిర్దాక్షిణ్యంగా చూడకు. వాదంలో పాలిమార్కస్ నేనూ స్వల్పప్రమాదాలకు పాల్పడి ఉంటే ఉండవచ్చును. కాని ఇది బుద్ధిపూర్వకంగా చేసినదోషం మాత్రం కాదు. బంగారు కణిక కోసం వెదకుతూ చేతులారా దానిని ఒండొరుల మాటుకు నెట్టుకొని కానక కాళ్ళు త్రొక్కుకొంటామా? ఆ బంగారు కణికకంటె న్యాయం ఎంతో అమూల్యం. దానిని అన్వేషిస్తున్న మేము శక్తి వంచనలేక పాటుపడటం లేదని ఎందు కారోపిస్తావు? అలా కాదు. దానిని ఎంతో అభిలషిస్తున్నాము. దానికై ఆరాటపడుతున్నాము. కాని

మా కది శక్యం. కాకుండా ఉన్నది. అలాంటప్పుడు సర్వం తెలిసిన మీవంటివారు మమ్మ కనికరించాలి కాని మాపై కోపించరాదు.

ఏడకు పోతుంది నైజం! అని అంటూ అతడు వికటహాసంతో ఉపక్ర మించాడు:—అదే నీ ఎకసక్కెపుతీరు. నేను ముందే కనిపెట్టలేదా? అతన్ని ఏమడిగినా చెప్పడు. సమాధానపరిహరణకై వ్యంగ్యమో, ఛలమో, జల్పమో ఆశ్రయిస్తాడని నేనిదివరకే మీకు చెప్పాను కదా?

నే నందుకొన్నా:— థ్రాసిమాకస్! నీవు తత్త్వవేత్తవు. "ఏ సంఖ్య లతో పన్నెండు వస్తుంది? రెండార్లు, మూడునాలుగులు, నాలుగుమూళ్ళు— ఇలాంటి అర్థరహితవచనం పనికిరా"దని ఒకడన్నాడట. నీ ప్రశ్నతీరు ఇలా ఉంటె సమాధానం నీకెవడూ చెప్పలేడు. కాని. ఒకడిలా ఎదురు ప్రశ్న వేశాడనుకొందాము:— థ్రాసిమాకస్! నీ యర్థమేమిటి? నీవు నిషేధిస్తున్న సంఖ్యలలో ఏ ఒకటి అయినా సరియైన సమాధానం అవు తుంది. దానిని పరిహరించి మరొక తప్పుడుసంఖ్య చెప్పాలా? ఇదేనా నీ తాత్పర్యం?—ఇలా అడిగితే నీ సమాధాన మేమిటి?

అబ్బే, ఈరెండూ కేవలం ఒకటేగా! అని అతడు వెటకారంగా అన్నాడు.

ఎందుకు కారాదు? ఒకవేళ కాకపోయినా ప్రశ్నించినవానికి ఒకటిగా కనిపించవచ్చును. అతన్ని నీవూ నేనూ నిషేధించినా, నిషేధించక పోయినా తాను అనుకొన్నది అతడు చెప్పగూడదా?

ఇంతకూ నిషేధించిన సమాధానాల్లో ఒకటి చెప్పబోతున్నా వన్నమాట?

ప్రమాదగ్రస్త మయినా నాకు సముచితంగా తోచినదానిని నేను చెప్ప రాదా?

న్యాయప్రశ్నకు ఇంతకు ముందు చెప్పకొన్న వాటికంటె మరొక సమా ధానం చెబితే ఏ శిక్షకు ఒప్పకొంటావు? అని అతడు ప్రశ్నించాడు.

నేనా? అజ్ఞాని ప్రజ్ఞావంతులనుంచి నేర్చుకోవాలి. దానికి నేను ఎప్పుడూ

సిద్ధమే.

ఏమిటీ! డబ్బు ఇచ్చుకోవా? ఎంత చక్కని ఎత్తు!

ఉన్నప్పుడు చెల్లిస్తాను.

గ్లాకన్ వెంటనే అందుకొన్నాడు:— సోక్రటిస్! నీకు డబ్బు ఉన్నది. థ్రాసిమాకస్! డబ్బుకోసం నీవేమీ ఆందోళనపడనక్కరలేదు. సోక్రటిస్ కోసం మేమంతా చందాలు వేసికొని యిస్తాము.

బాగుంది లక్షణం! సోక్రటిస్ సంగతి తెలియనిదేముంది? తానో సమాధానం చెప్పడు; మరొకరు చెబితేనో, ఈకకు ఈక, తోకకు తోక చీల్చి పెడతాడు.

నే నందుకొన్నా:—అలా మాటాడుతా వేమిటి? తెలిసినవానికి, తెలుసునని చెప్పుకొంటున్నవానికి ఏమీ తెలియనివాడు ఏమి సమాధానం చెబుతాడు? ఒకవేళ లీలామాత్రపు భావాలున్నా ప్రామాణికుడైనవాడు చెప్పవద్దని నిషేధించి నప్పుడు ఏమి చేస్తాడు? అలాంటప్పుడు తెలుసునని చెప్పుకొంటూ, తెలిసినది చెప్పగల నీవంటి వ్యక్తి మాటాడాలి. కరుణించి సదస్యులనూ నన్ను ఉద్ధరించటానికైనా సమాధానం చెప్పండి.

గ్లాకన్ తదితరసదస్యులు నాతోపాటు అతని సమాధానం అభ్యర్థించారు. థ్రాసిమాకస్ కూడ మాటాడవలె నని తహతహ పడుతున్నాడు. దీనికి కారణం ఉన్నది. సరియైన సమాధానం తనకు తెలుసుననీ, దానిని వెల్లడించి తన వైశిష్ట్యం చాటుకోవచ్చు ననీ అనుకొంటున్నాడు. కాని మొదట నాసమాధానంకోసం పట్టుదల చూపుతున్నట్లు నటించి చివరికి తన ప్రత్యుత్తరం చెప్పనంగీకరించాడు.

సోక్రటిస్ తెలివితేట లొకసారి చూడండి. తా నేమో సమాధానం చెప్పడు. ఇతరులనుంచి నేర్చుకోటానికి మాత్రం తయారు. తెలిపేవానికి కనీసం కృతజ్ఞత అయినా చూపడు.

ఇతరులనుంచి నేర్చుకొంటాను. ఇది ముమ్మాటికి నిజం. కాని నేను కృత

ఘ్నుణ్ణంటే మాత్రం ఒప్పుకోను. నాకు డబ్బులేదు. శ్లాఘనశక్తి మాత్రం ఉన్నది. దానితో నా ఋణం తీర్చుకొంటాను. చక్కగా చెప్పాడని తోచినప్పుడు ఎవ్వనినైనా ఎంత శ్లాఘిస్తానో సమాధానం చెప్పిన తరువాత నీకే స్పష్ట మవుతుంది. ఇంతకూ చక్కని సమాధాన మిస్తావని ఆశ.

అతను అందుకొన్నాడు:— అయితే విను. న్యాయమంటే బలవంతుల ప్రయోజనం. అంతకంటె అన్యం కాదని నేను చెబుతున్నా. ఇప్పుడు నన్నెందుకు శ్లాఘించవు? అయినా నీవు మెచ్చుకోవు.

నేను సమాధానం ప్రారంభించా:— ముందు నీచెప్పినదానిని అర్థం చేసికోనీ. న్యాయమంటే బలవంతుల ప్రయోజన మనికదా నీవు చెబుతున్నది? థ్రాసిమాకస్ దీని అర్థమేమిటి? వస్తాదు పాలిడమస్ మనకంటె బలశాలి. మాంసభక్షణం తన శరీరానికి బలకరమని గ్రహిస్తాడు. ఆ మాంసభక్షణ దుర్బలులమైన మనకు కూడ మంచిది; అదే సముచితం, అర్థామేనా నీ తాత్పర్యం?

సోక్రటిస్, ఘోరం చేస్తున్నావు. సరిగా వాదభంజకమైన అర్థమే తీస్తావు గదా?

స్వామీ, అలా కాదు. నీ మాటలు అర్థంచేసికోవాలని ప్రయత్నిస్తున్నా. నీవైన కొంత విప్పిచెప్పి ఉంటే బాగుండేది.

అయితే,విను. ప్రభుత్వరూపాలు భిన్నంగా ఉంటవని ఎన్నడూ వినలేదా? నిరంకుశప్రభుత్వాలున్నవి, ప్రజాస్వామికా లున్నవి, అరిస్టోక్రసీలు ఉన్నవి.

ఆవును.

ప్రతిరాజ్యంలోనూ ప్రభుత్వమే పాలకశక్తిగా ఉంటుంది.

నిజమే.

ఈ విభిన్నరూపప్రభుత్వాలు తమ తమ విభిన్నప్రయోజనాలను పురస్క

రించుకొని నిరంకుశాలు, ప్రజాస్వామికాలు, అరిస్టోక్రసీకి ఉచితాలు అయిన చట్టాలు చేస్తుంటవి. స్వప్రయోజనార్థం కల్పితాలైన ఈ చట్టాలే న్యాయం. ఈ న్యాయాన్నే అవి తమ ప్రజలకు ప్రసాదిస్తుంటవి. వానిని ఉల్లంఘించేవాడు శాసనోల్లంఘకుడనీ, అన్యాయపరుడనీ ఆ చట్టాలు అతనిని దండిస్తవి. ఇలా అన్నిరాజ్యాలలో ఒకే న్యాయసూత్రం ఉన్నది. ప్రభుత్వప్రయోజనమే ఆ న్యాయం. ప్రభుత్వానికి అధికారం ఉంటుందని ఒప్పుకోక తప్పదు గదా? కాబట్టి యిలా యుక్తియుక్తంగా ఊహించవచ్చు. ప్రతిచోట ఒకేన్యాయం ప్రవర్తిల్లుతున్నది. బలవంతుల ప్రయోజనమే న్యాయం. ఇదే నాతాత్పర్యం.

ఇప్పుడు అర్థమయింది. ఇక నీ చెప్పినది యథార్థమో కాదో తెలిసికో యత్నిస్తాను. అయితే ముందు ఒకటి చెప్పాలి. నన్ను వాడవలదని నిషేధించిన ప్రయోజనశబ్దాన్నే నీవు కూడ నీ న్యాయనిర్వచనంలో ప్రయోగించావు. ఏది ఎలా ఉన్నా నీ నిర్వచనంలో 'బలవంతుల' అన్నపదం చేర్చావు.

ఈ చిన్న చేర్పునకు అవకాశం ఇవ్వాలి.

చిన్నదైనా పెద్దదైనా అంతగా నీవు దానిని పాటించ నక్కరలేదు. కాని నీవు చెప్పేది సత్యమో కాదో మనం ముందు పరిశీలించాలి. న్యాయమనేది ఒకవిధమైన ప్రయోజనమని మన ముభయులమూ అంగీకరించాము. అయితే "బలవంతుల" అన్న విశేషం నీవు చేరుస్తున్నావు. ఈ చేర్పు సత్యార్థప్రతిపాదకమని నమ్మిక చిక్కటంలేదు. కాబట్టి ఇంకా, పరిశీలించాలి.

అలాగే కానీండి.

సరే, ముందీసంగతి చెప్పండి. ప్రజలు తమపాలకుల శాసనాలను శిరసావహించటం న్యాయమే కదా?

ఆఁ.

అయితే రాజ్యపాలకులెన్నడూ ప్రమాదపడరా? కాక ఒక్కొక్కప్పుడు

ప్రమాదపడవచ్చునా?

ప్రమాదపడవచ్చును.

మరి శాసనాలు చేసేటప్పుడు ఒకప్పుడు సరిగా చేయటం మరొకప్పుడు ప్రమాదపడటం సంభవమే కదా?

సంభవమే.

సరిగా శాసనాలు చేసినప్పుడు వాటిని ప్రయోజనానుగుణంగా చేస్తారు. ప్రమాదపడినప్పుడు ప్రయోజనానికి విరుద్ధంగా చేస్తారు. ఇంతవరకూ ఒప్పుకొంటావా?

ఆఁ.

వారు చేసిన శాసనాలను వారి ప్రజలు శిరసావహించాలి. దీనినే నీవు న్యాయమంటున్నావు కదా?

సందేహమేమున్నది?

మరి నీ వాదాన్నిబట్టి న్యాయమనేది బలవంతుల ప్రయోజనంకాక తద్విపరీతం కావటం లేదా?

ఏమిటీ? అని అతడు ప్రశ్నించాడు.

నీవు చెప్పినదానినే తిరిగి చెప్పుతున్నానని అనుకొంటున్నా. అయినా జాగ్రత్తగా పరిశీలింతాము. తాము శాసిస్తున్నప్పుడు స్వప్రయోజనాలలో పాలకులు ప్రమాదపడవచ్చుననీ, వారి శాసనాలను శిరసావహించటమే న్యాయమని మనం ఒప్పుకొన్నాము. అవునా?

అవును.

తమకు హానికరమైన వాటిని ఆచరించ వలసినదని పాలకులు ఉద్దేశరహి

తంగా శాసించినప్పుడది బలవంతుల ప్రయోజనం కాదని కూడ నీవు గ్రహించి ఉండాలి. ఎందుకంటే విహితశాసనాలను ప్రజలు పాలించ టమే న్యాయమని నీవు చెబుతున్నావు గదా? అయితే బలవంతుల ప్రయోజనార్థం కాక తదనర్థకార్థమై నిర్వహించటానికి శాసింపబడు తున్నారని అనివార్యంగా సిద్ధిస్తున్నది. ఈ అర్థం ఎలా పరిహరణీయమో మనీషి శేఖరులు చెప్పాలి.

సోక్రటిస్! ఇంతకన్నా స్పష్టార్థం మరొకటి ఉండదని పాలిమార్కస్ అందుకొన్నాడు.

నిజమే. కాని నీసాక్ష్యం అతడు ఒప్పుకోవాలి కదా? అని క్లిటోఫన్ మధ్యలో అందుకొన్నాడు.

ఎవరి సాక్ష్యం అక్కరలేదు. కొన్ని సందర్భాలలో పాలకులు తమకు ప్రయోజనకారులు కానివాటిని శాసించవచ్చుననీ, వాటిని ప్రజలు పాలిం చటమే న్యాయమనీ థ్రాసిమాకస్ స్వయంగా ఒప్పుకొంటున్నాడు అని పాలిమార్కస్ అన్నాడు.

"నిజమే, పాలిమార్కస్! తమ పాలకుల ఆజ్ఞను నిర్వర్తించటం న్యాయం." థ్రాసిమాకస్ అంగీకరించాడు.

నిజమే క్లిటోఫన్! బలవంతుల ప్రయోజనమే న్యాయమని కూడ అతడు చెప్పాడు. ఈ రెండు ప్రతిపాదనలను ఆమోదించటంతో తనకు ప్రయో జనకారి కానిదానిని బలవంతుడు బలహీనులకు విధించవచ్చునని కూడ అతడు ఒప్పుకొంటున్నాడు. దీనినిబట్టి న్యాయమనేది బలవంతునికి ప్రయోజనకారీ కావచ్చును, అపకారీకావచ్చును. అంటే బలవంతుని ప్రయోజనమే కాక మరొక అనర్థంకూడ సిద్ధిస్తున్నది.

క్లిటోఫన్ అందుకొన్నాడు:— బలవంతుల ప్రయోజనమంటే తమకు ప్రయోజనకరమని బలవంతులు భావించిన అర్థమని అతని తాత్పర్యం. ఈ అర్థాన్నే దుర్బలుడు ఆచరించాలి. దీనినే అతడు న్యాయమని చెప్పాడు.

ఇవి అతని మాటలు కావు, అని పాలిమార్కస్ ఆక్షేపణకు దొర కొన్నాడు.

అప్పుడు నేనన్నా:— పోనీండి, అవి తన మాటలేనని ఇప్పుడు చెప్పినా ఒప్పుకొందాము. థ్రాసిమాకస్! నీవే చెప్పు: న్యాయమంటే నీ తాత్పర్యమేమిటి? వాస్తవం కానీ కాకపోనీ, తనకు ప్రయోజనకరమని బలవంతుడు భావించిన అర్థమే కదా?

అతడు అందుకొన్నాడు:— అలా కానే కాదు. ప్రమాదగ్రస్తుడు బలవంతుడని అంటానా?

పాలకుడు అప్రమాది కాడు; ఒకప్పుడు పొరపడవచ్చునని నీవు అంగీకరించినప్పుడు నాకు అలాంటి అభిప్రాయమే కలిగింది.

సోక్రటీస్! నీవు కూటసాక్షివలె వాదిస్తున్నావు. ఇదంతా ఏ రీతిగా ఉన్నదో గ్రహించావా? రోగనిదానగ్రహణంలో పొరపడినప్పుడు వైద్యుడు వైద్యుడవుతాడా? లెక్కలో పొరపడినవాడు గణకుడు అవుతాడా? వ్యాకరణంలో తప్పుచెప్పినవాడు వైయాకరణుడవుతాడా? అన్నట్లుంది. అయినా వైద్యుడేమి, గణకుడేమి, వైయాకరణుడేమి పొరపడ్డాడని అంటాము. ఇదంతా మాటతీరు. అంతే కాని వాస్తవానికి వైయాకరణుడు కాని, మరొక నిపుణుడు కాని, అన్వర్థనామధేయుడైన వాడు పొరపడడు. వారి నైపుణ్యం భగ్నమైతే తప్ప వారిలో ఎవ్వరూ ప్రమాదగ్రస్తులు కారు. ఒకవేళ పొరపడితే వారు తత్కళావిశారదులు కారు. సార్థకనాముడైన ఏఋషి, ఏపరిపాలకుడు ప్రమాదగ్రస్తుడు కాడు. "ప్రమాదో ధీమతామపి" అన్న సూక్తి లోకంలో ఉన్నది కదా! ఈ సామాన్యోక్తినే ఆశ్రయించాను. కాని నిష్కర్షగా చెప్పాలంటే— అన్నట్లు నిష్కర్ష నీకు ప్రియంకదా!—పాలకుడు పాలకశబ్ద వాచ్యుడుగా ఉన్నంతకాలం అప్రమత్తుడు. అప్రమత్తుడు కావటంవల్ల తనకు ప్రయోజనకారి అయినఅర్థాన్నే శాసిస్తాడు. పాలితుడు అతని శాసనాలను పాలించవలసి ఉంటుంది. కాబట్టి నేను లోగడ చెప్పాను, ఇప్పుడు చెబుతున్నాను: బలవంతుని ప్రయోజనమే న్యాయం.

థ్రాసిమాకస్! వాస్తవంగా నేను కూటసాక్షివలె వాదిస్తున్నట్లు కని

పిస్తున్నానా?

ఇంకా సంశయమా?

ఇంతకూ నీ వాదం భంజించాలని యీ ప్రశ్నలడుగుతున్నట్లు భావిస్తున్నావా?

భావించట మేమున్నది? వాస్తవంగా అంతే. నీకు తెలుసు. త్వరలోనే బయట పడతావుగా. కేవలం వాదబలంతో నెగ్గలేవు.

మిత్రమా, అలాంటి ప్రయత్నం చేయను. మన యిరువురకు అపోహలు పోవాలి. దానికై ముందు ఒకప్రశ్న అడుగుతాను. పాలకుడు లేదా బలవంతుడు అధికుడు గాబట్టి అతనిప్రయోజనాన్ని బలహీనుడు ఆచరించాలని అంటున్నావు. ఏఅర్థంలో–సామాన్యార్థంలోనా? నిర్దిష్టార్థంలోనా?

నిర్దిష్టతమార్థంలోనే. ఇప్పుడు చేతనైతే వంచించు. కూటసాక్ష్యం ప్రారంభించు. నీ దయాదాక్షిణ్యాలేమీ అభిలషించను. అయితే నన్ను నీ వెన్నడూ వంచించలేవు. అది అసాధ్యం.

థ్రాసిమాకస్! ప్రయత్నించి వంచించేటంత ఉన్మత్తుడనా? అంతకంటె కేసరి జటాచ్ఛటలు పెకల్చటం తేలిక.

అందాక దేనికి? నిమిషం క్రింద దానికై ప్రయత్నించావు. విఫలత పొందావు.

నేనందుకొన్నా:— ఈ మర్యాదలు చాలు. ముందు నిన్నొకప్రశ్న అడగటం మంచిది. నీ పేర్కొంటున్న నిర్దిష్టార్థంలో వైద్యుడెవడు? రోగులకు స్వాస్థ్యం చేకూర్చేవాడా, లేక డబ్బు సంపాదించేవాడా? నే నిప్పుడు యథార్థవైద్యుని గూర్చి అడుగుతున్నానని గుర్తుంచుకో.

రోగులకు రోగశాంతి కూర్చేవాడు.

మరి నావికాధిపతో? నేను యథార్థనావికాధిపతిని గూర్చి అడుగు

తున్నా. అతడు నావికులకు అధిపతా? లేక కేవలం నావికుడా?

నావికులకు అధిపతి.

అతడు నౌకలలో పయనిస్తాడన్నవిషయం మనకిప్పుడుముఖ్యం కాదు. అతడు నావికుడన్న విషయం కూడ ముఖ్యం కాదు. అతనిని విశిష్టుని కావిస్తున్న 'నౌకాధిపతి' అన్న పేరు నౌకాయానానికి ఏమాత్రం సంబంధించింది కాదు. అయితే ఆ పదం అతని నైపుణ్యాన్నీ, నావికులపై అతని కున్న అధికారాన్నీ తెలుపుతుంది.

నిజమే.

ప్రతివృత్తికి ఒక ప్రయోజనం ఉంటుందంటావా?

నిశ్చితంగా.

దానిని పాటించి వర్ధిల్లజేయటానికే వృత్తి ప్రవర్తిల్లాలి గదా?

అవును. వృత్తికి అదే లక్ష్యం.

ఏ వృత్తికైనా నిజపూర్ణతాసిద్ధియే కదా ప్రయోజనం?

అంటే నీతాత్పర్యం?

ఇదిగో శరీరదృష్టాంతంతో నా తాత్పర్యం వివరిస్తాను. శరీరం స్వయం సంపూర్ణమా? లేక దానికి అపేక్షలు ఉన్నవా? అని మీరు అడుగుతారనుకోండి. నేనేమి చెప్పాలి? నిశ్చితంగా దానికి వాంఛలున్నవి. ఎందుకంటే అది వ్యాధిగ్రస్తం కావచ్చును. అప్పుడు చికిత్సను అభిలషిస్తుంది. ఈ విధంగా దానికి ప్రయోజనం, అపేక్ష ఉన్నది. దానినే వైద్యవిద్య తీరుస్తుంది. ఇందుకే వైద్యం వచ్చింది. ఇదే వైద్య ప్రయోజనం. ఈ చెప్పినది యథార్థమే కదా?

అవునని అతడొప్పుకొన్నాడు.

అయితే కన్ను చూపును, చెవి వినికిని కోల్పడి, ఈ దోషాలను చక్క బరచుకొనేనిమిత్తం వేరొకవృత్తి సాయం కోరుతవి. అలాగే వైద్యవిద్య గాని మరొక విద్యగాని కొరవడుతుందా? లేదా ఏదేని ఒకగుణంచే అసమగ్రమాతుందా? వృత్తివిద్య ఇలాంటి అసమగ్రతకు పాల్పడి, ఆ అసమగ్రతాదోషపరిహరణకు మరొకవిద్యను, ఆ విద్యకున్న అసమగ్రతను పరిహరించటానికి వేరొకవిద్యను—ఇలా అంతం లేకుండా అన్యవిద్యలను అభిలషిస్తుందా? అట్లు కాక వృత్తివిద్యలు స్వప్రయోజనాలను మాత్రమే సాధించవలసి ఉంటుందా? లేక వానికి స్వప్రయోజనాలు కానీ, ఇతర ములవల్ల పొందదగిన ప్రయోజనాలుకానీ ఉండవా? లోపము, అస మగ్రత లేనప్పుడు స్వవిద్యచే గాని అన్యవిద్యచే గాని దానిని సంస్క రించవలసిన అవసరం ఉండదు. అలా లోటు లేనప్పుడు విద్యలు తమకు విషయాలైనవాని ప్రయోజనాలకై పాటుపడవలసి ఉంటుంది. పరి పూర్ణమూ, అకుంఠితమూ, యథార్థమూ అయిన ప్రతివిద్య స్వచ్ఛమై నిర్ద ష్టంగా ఉంటుంది. ఈ మాటలను నీవుచెబుతున్న నిశ్చితార్థంలో గ్రహించి నేను యథార్థం చెప్పానో లేదో చెప్పు.

నీవు చెప్పినది యథార్థమే.

అయినప్పుడు వైద్యం తన ప్రయోజనం కాక శరీరప్రయోజనాన్ని విచా రిస్తుంది కదా?

అవును.

అశ్వశిక్షకత్వం స్వప్రయోజనాలను ఆలోచించదు. అశ్వశ్రేయస్సును ఆలోచిస్తుంది. అట్లే ఏ విద్యలైనా స్వప్రయోజనాలను ఆలోచించవు. ఎందుకంటే వాటికి స్వప్రయోజనాలు ఉండవు. అవి కేవలం తమకు విషయాలైన వాటియందు శ్రద్ధ తీసికొంటవి.

నిజమేనని అతడు ఒప్పుకొన్నాడు.

థ్రాసిమాకస్, విద్యలు తమవిషయాలకంటె మిన్నలు, అనుశాసకాలుకదా?

అతడు కష్టంమీద ఒప్పుకొన్నాడు.

అలాంటప్పుడు ఏ విద్య అయినా (కళ అయినా) బలవంతునిప్రయోజనం లేదా అధికుని ప్రయోజనం ఆలోచించనూ ఆలోచించదు, దానిని విధించనూ విధించదు. తనకు పాలనీయులైన వారి ప్రయోజనం ఆలోచిస్తుంది; దానినే శాసిస్తుంది. అంతేనా ?

ఈ వాక్యాన్ని కూడ అతడు వివదించ యత్నించి చివరకు ఒప్పుకొన్నాడు.

తిరిగి ప్రారంభించాను: వైద్యుడైనవాడు మందిస్తూ స్వప్రయోజనం చూచుకొనక రోగి మేలు చూస్తాడు. ఎందుకంటే నిజమైన వైద్యుడు కూడ పాలకుడే. మానవశరీరం అతనికి పరిపాలనీయం. అంతే కాని కేవలం డబ్బు పోగు జేసికొనేవాడు వైద్యుడు కాడు. ఇది ఆమోదిస్తావా?

ఆఁ.

అలాగే నావికాధిపతి కూడ యథార్థంగా నావిక పాలకుడే కాని కేవల నావికుడు కాడు కదా?

నిజమే.

అలాంటి నావికాధిపతి తనక్రింద పనిచేసే నావికుల శ్రేయస్సు కోరి ఆదేశించి అవకాశాలు కల్పిస్తాడు కాని స్వప్రయోజనం కోసం వ్యవహరించడు గదా ?

దీనికి అతికష్టంతో అతడు ఒప్పుకొన్నాడు.

థ్రాసిమాకస్ ! ఏ పరిపాలనలోనూ యథార్థపాలకుడు తనకు ప్రయోజనకరమైనదానిని ఆలోచించడు. తదనుగుణంగాను శాసించడు. అతడు తనకు పరిపాలనీయులైన వారి ప్రయోజనం, లేదా తన విద్యకు అర్హమైన ప్రయోజనం చూస్తాడు. దానినే శాసిస్తాడు. దానికోసమే అతడు యత్నిస్తాడు. తాను చెప్పే ప్రతిదానిలోను, చేసే ప్రతిపనిలోను దానినే విచారిస్తాడు.

వాదం ఈ మెట్టుకు రాగానే న్యాయనిర్వచనం పూర్తిగా తలక్రిందులై

పోయిందని ప్రతివానికి పొడకట్టింది. థ్రాసిమాకస్ నాకు జవాబు చెప్పటానికి బదులుగా నన్నే ప్రశ్నించాడు:—

సోక్రటిస్ ! నీకు దాది ఉన్నదా?

సమాధానం చెప్పక ఇలాంటి ప్రశ్న వేస్తావెందుకు? అని నేను ప్రశ్నించాను.

ఎందుకా? సింగాణపు సింగారం ఒలుకుతుంటే ఊరుకున్నది కాని నీముక్కు తుడవలేదు. గొర్రెలు వేరు, గొర్రెలకాపరి వేరని గుర్తించే మార్గం కూడ బోధించింది కాదు.

"అంటే?" నేనుప్రశ్నించా.

ఎందుకంటే గొర్రెలకాపరి గొర్రెలను, ఆలకాపరి ఆవులను వాటి శ్రేయస్సు కోసమే పాలిస్తున్నారు కాని, తమ మేలుకోసం కాని, తమ యజమాని మేలుకోసం కాని కాదని ఊహాగానం చేస్తున్నావు. అంతే కాదు, రాజ్యపాలకులు నిజంగా పాలకులైతే, తమ ప్రజలు గొర్రెలవంటివారని అనుకోరనీ, తమ శ్రేయస్సును ఎప్పుడూ ఆలోచించరనీ ఊహించుకొంటు న్నావు. లేదు, లాభం లేదు. న్యాయవిషయంలోను, న్యాయవంతుల విషయంలోను నీవు పూర్తిగా పెడత్రోవ పడుతున్నావు. ఈ అపోహ చాలదూరం పోయింది. న్యాయం, న్యాయవంతులు మరొకరికి ప్రయోజనకారు లన్నసంగతి గూడ గుర్తించ లేకపోతున్నావు. అంటే న్యాయమనేది బలవంతుడైన పాలకునికి శ్రేయస్సు, దుర్బలుడైన సేవకునికి కీడు అని కూడ గ్రహింప లేకపోతున్నావు. దీని వైపరీత్యమే అన్యాయం. ఎందువల్లనంటే అన్యాయపరుడు అమాయికుడైన న్యాయవంతునిపై ఆధిపత్యం చెలాయిస్తున్నాడు. ఆ పాలకుడు బలవంతుడు. అతని ప్రజలు అతనికి శ్రేయస్కరమైనదానిని నిర్వర్తిస్తారు. అతని సౌఖ్యం కోసం పాటుపడతారు. కాని అది వారి శ్రేయస్సుకు దవీయం. ఓయీ వెర్రి బాగుల సోక్రటిస్! అన్యాయవంతునితో పోల్చి చూస్తే న్యాయవంతుడెప్పుడూ నష్టపడుతూనే ఉంటాడు. (1) వ్యక్తిగతవ్యాపారాలే తీసికో. అన్యాయవంతుడు న్యాయవంతునితో పొత్తుకలిసి తరువాత విడిపోయి నప్పుడల్లా అన్యాయవంతుడే లాభపడటం, న్యాయవంతుడే నష్టపడటం

జరుగుతుంది. (2) రాజ్యంలో వారు సాగించే వ్యవహారాలు చూడు: ఆదాయపు పన్ను కట్టవలసి వచ్చినప్పుడు ఒకే ఆదాయానికి న్యాయవంతుడు అధికంగా పన్ను చెల్లిస్తాడు. అన్యాయవంతుడు తక్కువ చెల్లిస్తాడు. ప్రభుత్వంనుంచి ఎప్పుడైనా ఏదేని పొందవలసి వచ్చినప్పుడు మొదటివానికి ఏమీ రాదు, రెండవవాడు అధికంగా గుంజుకొంటాడు. ఒక పదవిని స్వీకరించినప్పుడు ఏమి జరుగుతుందో చూడు: న్యాయవంతుడు న్యాయానికి తలఒగ్గి ఉంటాడు. దానితో స్వకీయవ్యవహారాలలో ప్రాలుమాలుతాడు. ఇతరనష్టాలకు గురి అవుతాడు. ప్రభుత్వంనుంచి ఎలాంటి లాభం పొందలేడు. పైగా శాసనవిరుద్ధమార్గాలు అవలంబించి తమకు తోడ్పడలేదని మిత్రులు, పరిచితులు కూడ అతన్ని ద్వేషిస్తారు. ఇక అన్యాయవంతుని విషయమంటావా దీనికి కేవలం విపరీతం. ఇంతకు ముందు చెప్పినట్లు అన్యాయవంతునకు కలుగుతున్న అనుకూల్యం, అతడు చేస్తున్న విస్తృతఅన్యాయం చూడు. అన్యాయపరాకాష్ఠను పరిశీలిస్తేనా తాత్పర్యం స్పష్టంగా గోచరిస్తుంది. ఇలాంటి ఘోర అన్యాయస్థితిలో దుండగీడు అత్యంత సుఖిగా, అన్యాయం చేయ నిరాకరించేవాడు అత్యంత దుఃఖిగా ఉంటారు. అలాంటి అన్యాయపరాకాష్ఠే నిరంకుశత్వం. ఈ నిరంకుశత్వం వంచించి ఇతరుల ఆస్తిని కొంచెం కొంచెంగా కాక మొత్తంగా అపహరించి వేస్తుంది. ఒక్కముక్కలో చెప్పాలంటే పవిత్రాపవిత్రవస్తువులను, వైయష్టికసామాజికవస్తువులను అపహరిస్తుంది. ఈ ఘోరదారుణక్రియలో ఎప్పుడు అతడు పట్టుపడినా దండింపబడుతాడు. ఘోరావమానం పొందుతాడు. అలాంటి మహాపరాధాలు చేసేవారు ఆ యా కర్మలనుబట్టి చెప్పాలంటే దేవకులచోరులు, మానవచోరులు, బందిపోటులు, మోసగాండ్రు, దొంగలు అవుతారు. కాని ప్రజల ధనం అపహరించటమే కాక వారిని బానిసలను చేసినప్పుడు వారు ఈ నిందలకు పాల్పడకపోగా సుఖులు భోగులు అని శ్లాఘింపబడుతారు. అలా వారిని శ్లాఘించేవారు పౌరులు మాత్రమే కాదు, అన్యాయంలో దిగ్విజయం పొందాడని విన్నవారంతా శ్లాఘిస్తారు. అన్యాయానికి గురి అవుతామేమో నన్న భయంతో మానవజాతి దానిని గర్హిస్తున్నది కాని, నిజానికి దానిని అనుసరింప జంకి మాత్రం కాదు. సోక్రటిస్! నేను నిరూపించి నట్లు సముచితప్రమాణ కలితమైనప్పుడు న్యాయంకంటె అన్యాయానికి ఎక్కువ బలం, స్వాతంత్ర్యం, ఆధిపత్యం ఉంటాయి. కాబట్టి మొదట నేనన్నట్లు బలవంతుని ప్రయోజనమే న్యాయం. ఇంక అన్యాయమంటేనో వైయష్టికస్వలాభప్రయోజనాలు.

థ్రాసిమాకస్ ఇలా మాటాడి తన వాగ్ఝరులతో మా శ్రవణకుహరాలను నింపివేయగానే వెళ్ళిపోదా మనుకొన్నాడు. కాని సదస్యులు అతన్ని పోనీయలేదు. అతడచటనే నిల్చి తనవాదాన్ని నిలబెట్టుకోవాలని పట్టు బట్టారు. మమ్మ వదలి పోవలదని నేను కూడ అభ్యర్థించాను. "థ్రాసి మాకస్, నీ పలుకు లెంత భావస్ఫోరకాలు! ఆమాటలు యథార్థాలో కావో గ్రహించకముందే పారిపోతావా? మానవజీవితవిధాననిర్దేశ యత్నం నీదృష్టిలో అంత స్వల్పమా? భద్రతాసిద్ధికై మనలో ప్రతి ఒక్కరు ఎలాజీవితం గడపాలో నిర్ణయించటం అంతఅముఖ్యమా?

ఈ జిజ్ఞాస ముఖ్యం కాదని నేనంటానా? అని అతడు ప్రశ్నించాడు.

థ్రాసిమాకస్! మాపట్ల నీవు శ్రద్ధవహిస్తున్నట్లు గాని, మా సంగతి ఆలోచిస్తున్నట్లు గాని లేదు. నాకు తెలియునని చెబుతున్నావు. ఆ తెలి సినఅర్థం మేము గ్రహించి బాగుపడినా, గ్రహించక చెడిపోయినా నీకు ఏమాత్రం పట్టినట్లు లేదు. మిత్రమా, నీ జ్ఞానాన్ని దాచుకొనకు. మేము పెక్కురము ఉన్నాము. మాకు ఏమాత్రం మేలొనగూర్చినా సమృద్ధిగా ప్రతిఫలం లభిస్తుంది. నీ వాదంలో నాకు మాత్రం విశ్వాసం కలగలేదని బాహాటంగా చెబుతాను. అనియంత్రితంగా, స్వేచ్ఛగా కొనసాగనిచ్చినా న్యాయంకంటె అన్యాయంవల్ల ఎక్కువమేలు చేకూరుతుందని నేను నమ్మను. వంచనతో గాని, బలప్రయోగంతో గాని అన్యాయవంతుడు అన్యాయం చేయగలిగినా దానివలన ఎక్కువమేలు కలుగుతుందన్న నమ్మిక చిక్కటం లేదు. ప్రకృతం నేనున్న ఈ సందిగ్ధ స్థితిలోనే ఇతరులు గూడ ఉండవచ్చును. మాది పొరపాటే కావచ్చును. "అన్యా యంకంటె న్యాయం మేలని మీరు పొరపడుతున్నారు." అని నిరూపించి మాకు నచ్చజెప్పాలి.

నేనింతకుముందుచెప్పినది విశ్వాసపాత్రంగా తోచకపోతే నేనెలా మిమ్ము నమ్మించగలను? నేను చేయగలిగినది ఏమున్నది? ఉపపత్తిని సశరీరంగా మీ మనస్సుల కెక్కించమంటారా? అని అతడు ప్రశ్నిం చాడు.

ఆపని మాత్రం చేయవద్దు. నేను నిన్ను కోరేది ఒకటే. మాటపొందికను మాత్రం జారనీయకు. ఒకవేళ నీ యభిప్రాయం మార్చుకొనవలసివస్తే

బాహాటంగానే మార్చుకో. అంతే కాని వంచనకు తావీయకు. ఇంతకు ముందు మాటాడినది జ్ఞప్తికి తెచ్చుకో. నిజమైనవైద్యుని లక్షణాలు నిర్వచించినప్పుడు పాటించిననిష్కర్షను గొర్రెలకాపరి లక్షణాలను నిర్వచించేటప్పుడు పాటించ లేదు. గొర్రెలకాపరిని గొర్రెలా కాపరిగా పరిగ్రహించలేదు. కేవలం మాంసభోజనసౌఖ్యం చూచుకొనే భోక్తగా గ్రహించావు, లేదా క్రయవిక్రయలాభదృష్టితో వ్యవహరించే వర్తకునిగా పరిగణించావు. అంతే గాని గొర్రెలకాపరిగా మాత్రం గణించలేదు. అయినా అతని విద్య నిజలక్ష్యాలైన గొర్రెలమేలే ఆలోచిస్తుంది. అతడు వానికి పరమహితం ఆచరించాలి. నిజవిధులను నిర్వర్తించినప్పుడే ఆ విద్య సమగ్రం అవుతుంది. పరిపాలకుల సంగతి చెప్పినప్పుడు కూడ ఇదే చెప్పాను. యథార్థమైన పరిపాలకవిద్య వ్యక్తిగత జీవితంలోనైనా, రాజ్యంలోనైనా తనకు పరిపాలనీయులైన ప్రజలమేలు మాత్రమే పరిగణిస్తుందని నేనూహించాను. కాని నీవు మాత్రం రాజ్య పాలకులు సార్థకనామధేయులు అధికార స్వీకరణకు ఉబలాటపడతారని భావిస్తున్నట్లు కనబడుతున్నది.

భావన ఏముంది? వాస్తవంగా అంతే.

మరి తమకోసం కాక ప్రజల మేలుకోసం పాలిస్తున్నామన్న భావం లేకపోతే మానవులు ప్రతిఫలశూన్యంగా పదవులు నిర్వహించటానికి బుద్ధిపూర్వకంగా ఎందుకు ఒప్పుకోరు? మరొకప్రశ్న : విభిన్న ప్రయోజనతచే గదా విద్యలు విభిన్నాలు అవుతున్నవి? మిత్రమా, నీ అభిప్రాయమేమో చెబితే కొంత ముందుకు పోవటానికి వీలుపడుతుంది.

అవును ప్రయోజనభేదం ఉన్నది.

సామాన్యప్రయోజనమే కాక ప్రతివిద్య ఒక ప్రత్యేకప్రయోజనం చేకూరుస్తుంది. దృష్టాంతంగా వైద్యవిద్యనే తీసికో. ఇది ఆరోగ్యం చేకూరుస్తుంది. నావికవిద్య సముద్రయానభద్రత కలిగిస్తుంది.

అతడొప్పుకొన్నాడు.

పణవిద్యకు పణమే కదా ప్రయోజనం? ఈ విద్యను మరొకవిద్య యని

భ్రాంతిపడము. సముద్రప్రయాణం వల్ల నావికాధిపతి ఆరోగ్యం చక్క-బడవచ్చును. అంత మాత్రంచేత నౌకాధిపతివిద్య వైద్యవిద్య కాదు. నీవు చెప్పినట్లు భాషను సార్థకంగా వాడాలంటే నౌకాచోదనం వైద్య విద్య కాదు గదా?

అవును.

పణం పుచ్చుకొన్నప్పుడు ఒకడు ఆరోగ్యవంతుడుగా ఉన్నాడనుకో. అంతమాత్రాన పణవిద్యయే వైద్యవిద్య యని చెప్పవు గదా?

అవును.

మానవుడు కోలుకొంటే వైద్యుడు పణం పుచ్చుకొంటున్నాడు కాబట్టి వైద్యమంటే పణమని చెప్పవు గదా?

అవును.

మరి ఏ విద్యకున్న ప్రయోజనం దానిదేనని మనం అంగీకరించవచ్చునా?

నిరభ్యంతరంగా.

ఎల్ల విద్యావంతులకు సామాన్య ప్రయోజనం ఒకటి ఉన్నదంటే అది విద్యయొక్క- సామాన్యలక్షణంగా చెప్పవలసి ఉంటుంది గదా?

నిజమే.

పణం పొంది వృత్తివిద్యావంతుడు లాభం పొందుతున్నప్పుడు ఆ లాభం పణవిద్యాప్రయోజనంవల్ల లభిస్తున్నదే కాని అతడు చేపట్టిన వృత్తివిద్య వల్ల కాదు గదా?

దీనిని కష్టమ్మీద ఒప్పుకొన్నాడు.

వృత్తివిద్యావంతులు తమ వృత్తివిద్యలవల్ల పణం పొందటం లేదు. కాని

వాస్తవమేమంటే వైద్యవిద్య ఆరోగ్యాన్ని, వాస్తువిద్య గృహాన్ని ప్రసాదిస్తుంటే, పణవిద్య వానిని అనుసరిస్తున్నది. వివిధవృత్తివిద్యలు తమకు విషయభూతాలైనవానికి మేలు కలిగిస్తూ తమ తమ వ్యాపారాలను కొనసాగిస్తవి. పణవిద్యచే తక్క విద్యావంతుడు ఏ ప్రయోజనమైనా పొందుతాడా?

పొందడు.

ప్రతిఫలశూన్యంగా పనిచేసినంతమాత్రాన విద్యావంతుడు మేలొనగూర్చటం లేదా?

ఒనగూర్చక పోవటమేమి?

అప్పుడు వృత్తివిద్యలు కాని, ప్రభుత్వాలు కాని ఇంతకుముందు చెప్పుకొన్నట్లు బలవంతుల కోసం కాక దుర్బలులైన తమ ప్రజలకోసం పరిపాలన సాగిస్తూ లాభం చేకూరుస్తాయి కాని, స్వప్రయోజనాలకోసం ప్రాకులాడవు. ఈ కారణంవల్లనే ఎవడూ పరిపాలనాభారం వహింపనిష్టపడడు. తనకు ప్రమేయం కాని అనర్థకాలను పరిహరించటానికి ప్రతిఫలశూన్యంగా అధికారం స్వీకరించడు. ఎందువల్లనంటే సార్థకనాముడైన విద్యావంతుడు నిజకర్తవ్యనిర్వహణలోను, ఇతరులను శాసించటంలోనూ తన ప్రయోజనాన్ని పాటించడు. తనకు పాలనీయులైనవారి ప్రయోజనాలనే పాటిస్తాడు. కాబట్టి పాలకులను పరిపాలనాభారస్వీకారానికి ఒప్పించాలంటే డబ్బు, గౌరవము, దండన ఈ మూటిలో ఏదో ఒకదానితో సత్కరించాలి.

గ్లాకన్ వెంటనే ప్రశ్నించాడు:— సోక్రటిస్, మీ తాత్పర్యమేమిటి? ధనంతోనో గౌరవంతోనో సత్కరించాలంటే అర్థమాతున్నది. కాని దండనతో సత్కరించటమంటే బోధపడ లేదు. దండన ఎలా సత్కారమౌతుంది?

ఇంతకూ ఉత్తమపురుషులను పరిపాలనాభారస్వీకారానికి ప్రోత్సహించే ఈ సత్కారస్వభావం అర్థం కాలేదంటావు? తృష్ణ, ప్రలోభం నీచాలుగా పరిగణింపబడుతున్నవని యెరుగుదువు గదా?

అవును.

ఈ కారణంవల్ల ధనగౌరవాలు వారిని ఆకర్షించ లేవు. పరిపాలనానిర్వహణకై బాహాటంగా ధనమర్థించి సత్పురుషులు తాము డబ్బుకు అమ్ముడుపోతారని అనిపించుకోటానికి ఇష్టపడరు. ప్రభుత్వధనమపహరించి చోరులనిపించుకోటానికి సమ్మతించరు. తృష్ణావంతులు కారు కావున గౌరవాన్ని లక్ష్యపెట్టరు. కాబట్టి బలవంతంగా అధికారస్వీకారానికి ఒప్పించాలి. ఒప్పుకొనకపోతే శిక్షించాలి. ఈ హేతువుచేతనే బలవంతం చేయించుకొనక అధికారం స్వీకరించటం అగౌరవప్రదంగా భావింపబడుతున్న దనుకొంటాను. పరిపాలనాస్వీకరణనిరాకరణకు ఘోరమైనదండన ఒకటి ఉన్నది. అలా స్వీకరించకపోతే తమకంటె అధములు తమ్ము పాలించే ప్రమాద మున్నది. ఇలాంటి భయం వారిని పదవీస్వీకారానికి ప్రోత్సహిస్తుందని భావిస్తున్నా. అంతే కాని ముచ్చటపడి కాదు. గతిలేక పదవిని స్వీకరిస్తారు. ప్రయోజనం పొందుదామని కాదు; సుఖింతామని కాదు. గత్యంతరం కానక పరిపాలనాభారం అప్పగించదగిన ఉత్తములను పడయలేక పదవిని స్వీకరిస్తారు. ఇలా భావించటానికి కారణం ఉన్నది. ఒక పట్టణంలోని పౌరులంతా సత్పురుషులైనప్పుడు, పదవులకై నేడెంతగా ప్రాకులాడుతున్నారో అంతగా తత్పరిహారణకు వత్సందాలు పోతారు. కాబట్టి యథార్థపరిపాలకుడు స్వాభావికంగా స్వప్రయోజనానికి ప్రాకులాడడని విస్పష్టంగా రుజువవుతున్నది. కాబట్టి జ్ఞానసంపన్నులైనమానవులు పరులవలన ఇలాంటి లాభం పొందాలని కోరుతారు కాని ఇతరుల లాభసిద్ధికై తహతహలు పొందరు. కాబట్టి బలవంతుని ప్రయోజనమే న్యాయమని చెబుతున్న థ్రాసిమాకస్‌తో ఏకీభవించలేను. ఇంకా ఈ విషయాన్ని గూర్చి అధికంగా చర్చించ నక్కరలేదు. కాని థ్రాసిమాకస్ న్యాయవంతుని జీవితంకంటె అన్యాయవంతునిజీవితమే ఎక్కువ లాభదాయకమంటున్నాడు. ఈ వింత మాట అత్యంతముఖ్యం. దీనిని గూర్చి తరువాత పరిశీలించవచ్చును. ఇంతకూ మాలో ఎవరు సత్యం చెప్పారు? గ్లాకన్, ఇందులో ఏ జీవితం నీకు సమ్మతం?

నావరకు నేను న్యాయవంతుని జీవితమే శ్రేయస్కరమని భావిస్తున్నానని అతడు సమాధాన మిచ్చాడు.

థ్రాసిమాకస్ వర్ణించిన అన్యాయపరుని లాభాలన్నీ విన్నావా?

ఆఁ, విన్నా. కాని అతడు నన్ను నమ్మించలేకపోయాడు. మరి అతని వాదం సత్యం కాదని అతనిని నమ్మించేమార్గ మేదైనా లభిస్తుందేమో చూదామా?

అవశ్యం.

అతడొక ఉపన్యాసమిచ్చి, దానికి సమాధానంగా న్యాయంవల్ల కలిగే మేళ్ళను లెక్కిస్తూ మనం మరొక ఉపన్యాసమిచ్చి, అతడు దానికి సమాధానం చెప్పి, దానికి మనం సమాధానం చెబితే, ఉభయపక్షాలు తమ తమ వాదాల మేళ్ళను లెక్కించాలి. పోల్చాలి. ఇలా కావించి నిర్ణయం చెప్పటానికి తీర్పరులు కావాలి. అట్లు కాక మన మింతకుముందు చేసినట్లు విచారక్రమంలో ఎప్పటి కప్పుడు అంగీకృతిని తెలుపుతూ ముందుకు సాగితే వాదిమధ్యవర్తుల పనులు రెండూ మనమే నిర్వర్తించుకొనవచ్చును.

ఇది బాగున్నదని అతడన్నాడు.

"ఇంతకూ ఏది బాగున్నదంటావు?" నేను ప్రశ్నించాను.

మీరు సూచించినపద్ధతే.

సరే. థ్రాసిమాకస్, నీవు మొట్టమొదటనుంచి ప్రారంభించి నాకు సమాధానం చెబుతున్నావనుకో. పరిపూర్ణన్యాయంకంటె పరిపూర్ణ అన్యాయం శ్రేయస్కరమని కదా నీవు చెబుతున్నది?

అవును. దానికి కారణాలు గూడ ఇదివరకే చెప్పాను.

వాటిని గూర్చి నీ యభిప్రాయ మేమిటి? వాటిలో ఒకటి పుణ్యం, రెండవది పాపమని అంటావా?

నిస్సందేహంగా.

అయితే న్యాయం పుణ్యమనీ, అన్యాయం పాపమనీ భావిస్తున్నావని అనుకోవచ్చునా ?

ఏమి మధురస్వప్నం! అందులోనూ అన్యాయం లాభదాయకమనీ, న్యాయం కాదనీ నేను అంటున్నప్పుడు ఇది మరీచక్కగా అతుకుతుంది కదూ ?

మరేమంటావు ?

కేవలం దానికి విరుద్ధమంటాను.

ఇంతకూ న్యాయం పాపమంటావా ?

లేదు, అత్యంత అమాయికత్వమంటాను.

మరి అన్యాయం బలమంటావా ?

లేదు, అది వివేచనమంటాను.

మరి అన్యాయపరులు నీకు జ్ఞానులుగా, సత్పురుషులుగా కనిపిస్తారా ?

అతడు అందుకొన్నాడు:— ఏది ఎట్లాఉన్నా పరిపూర్ణంగా అన్యాయవంతులై రాజ్యాలను జాతులనూ లొంచగలిగిన శక్తిమంతులు మహాపురుషులే. అయితే జేబులుకొట్టేవారు నాలెక్కలో సత్పురుషులని మీరు భావిస్తున్నట్లున్నారు. పట్టుబడనంతకాలం ఈ వృత్తివల్ల కూడ లాభాలున్నవి. అయితే నేను పేర్కొన్నవాటిముందివి ఒకలెక్క కాదు.

థ్రాసిమాకస్, నిన్నపార్థం చేసికొంటున్నానని అనుకోను. కాని అన్యాయాన్ని జ్ఞానపుణ్యాల కోవలోను, న్యాయాన్ని తద్విపరీతరాశిలోను చేరుస్తున్నావు. ఇదే నాకు విభ్రాంతికరంగా ఉన్నది.

అవును. నేనలాగే వర్గీకరిస్తున్నాను.

అప్పుడు నీవాదం బలవత్తరమే కాక అనిరాకరణీయంగా కనిపిస్తున్నది. అందరిలాగ నీవు కూడ అన్యాయం పాపమని అంగీకరించి ఉంటే ఎల్లరూ అంగీకరించిన సూత్రాలను పురస్కరించుకొని నీకు ప్రత్యుత్తర మివ్వటానికి వీలుండేది. కాని నీవు అన్యాయం మాననీయమనీ బలవత్తర మనీ అంటున్నావు. మేమింతకు ముందు న్యాయానికి ఆపాదిస్తున్న సద్గుణాల నన్నిటినీ నీవు అన్యాయానికి ఆపాదిస్తున్నావు. అన్యాయం జ్ఞానపుణ్యాలతో సమానమని చెప్పటానికి నీవు వెనకాడటం లేదు.

నా అభిప్రాయాన్ని సరిగ్గా గ్రహించావు.

నీ అభిమతాన్నే చెబుతున్నావు. అందు సంశయం లేదు. కాబట్టి పర్యవ సానం తేలేటంతవరకు నావాదం కొనసాగించాలి కాని వెనుకంజ వేయ రాదు. ఎందుకంటే ఇప్పుడు నీలో చిత్తశుద్ధి కనిపిస్తున్నది. అంతే కాని మమ్ము పరిహసించి ఆనందించాలన్న భావం నీలో కనిపించటం లేదు.

చిత్తశుద్ధితో వాదిస్తాను, వాదించను. అదంతా దేనికి? నా వాదాన్ని ఖండించటం నీకర్తవ్యం.

అవును. నా కర్తవ్యమదే. అయితే ఒకప్రశ్నకు దయచేసి సమాధానం చెబుతావా? న్యాయవంతుడు, మరొక న్యాయవంతునికి అన్యాయం చేసి లాభం పొంద ప్రయత్నిస్తాడా?

లేదు. అలాచేస్తే అతడు అమాయికుడు, పరిహాసాస్పదుడూ ఎందుకవు తాడు?

మరి న్యాయమైన కర్మను ఉల్లంఘించటానికి యత్నిస్తాడా?

లేదు.

అన్యాయవంతునకు అన్యాయం చేసి లాభం పొందటం అతనిదృష్టిలో ఏమవుతుంది? దానిని న్యాయంగా పరిగణిస్తాడా? అన్యాయంగా పరిగణిస్తాడా?

న్యాయమే ననుకొంటాడు; లాభం పొంద యత్నిస్తాడు. కాని అతడు అలా చేయలేడు.

చేయగలడా, లేదా అన్నది ముఖ్యం కాదు. న్యాయవంతుడు మరొక న్యాయవంతునికంటె ఎక్కువ లాభం పొంద నిరాకరిస్తున్నాడు గదా? అలాంటివాడు అన్యాయవంతునికి అన్యాయం చేసి ఎక్కువ లాభం పొందగోరుతాడా? ఇదే నాప్రశ్న.

అవును. కోరుతాడు.

మరి అన్యాయవంతుడో? న్యాయవంతునికంటె తానెక్కువ లాభం పొందాలనీ, న్యాయవిహితమైన దానికంటె అధికంగా లాగుకోవాలనీ కోరుతాడా?

సహజంగా కోరుతాడు. అందరికంటె తనకెక్కువ రావాలంటాడు.

కాబట్టి అన్యాయవంతుడు అందరికంటె ఎక్కువ పొందయత్నిస్తాడు. శతథా పోరాడుతాడు.

అవును.

అయితే ఈవిషయాన్ని యిలా చెప్పుకొందాము:— న్యాయవంతుడు సజాతీయునికంటె ఎక్కువ లాభం పొందగోరడు, కాని తనకు విపరీతుడు, విజాతీయుడుఅయిన వానికంటె ఎక్కువ లాభం పొందగోరుతాడు. మరి అన్యాయవంతుడు తనకు సజాతీయ విజాతీయులైన వారి ఇరువురికంటె అధికలాభం పొందవలెనని కాంక్షిస్తాడు.

చక్కగా చెప్పావు.

మరి అన్యాయవంతుడు జ్ఞాని, సత్పురుషుడు; న్యాయవంతుడీ ఉభయులలో ఏఒకడూ కాడు.

ఈసారి కూడ చక్కగ ముక్తసరిగ చెప్పావు.

అన్యాయవంతుడు సత్పురుషజ్ఞానులకు సదృశుడు; న్యాయవంతుడు తద్విపరీతుడు కదా?

అవును. ఏకస్వభావంకలవారు సదృశులవుతారు. భిన్నస్వభావులు కారు.

ఎల్లవాడు సగోత్రసదృశుడే కదా?

అవును.

సరే, ఇప్పుడు విద్యల దృష్టాంతం తీసికొందాము. ఒకడు గాయకుడైతే మరొకడు కాకపోవచ్చును గదా?

అవును.

మరి వీరిలో ఎవడు జ్ఞాని? ఎవడు అజ్ఞాని?

గాయకుడు జ్ఞానవంతుడు; అన్యుడు అజ్ఞాని.

జ్ఞానియైనవాడు సత్పురుషుడు, అజ్ఞాని అసత్పురుషుడు, అవునా?

అవును.

ఇది వైద్యునికి గూడ అన్వయిస్తుందా?

అన్వయిస్తుంది.

గాయకుడు తన వీణను ఆయత్తపరచుకొనేటప్పుడు తీగల బిగింపులో కాని, సడలింపులోకాని గాయకుని అధిగమించడు; అధిగమిస్తానని చెప్పుకోడు. అవునా?

నిజమే.

అయితే సంగీతానభిజ్ఞుని అధిగమిస్తానని చెప్పుకొంటాడు కదా?

అవును.

మరి వైద్యుడో పథ్యం విషయంలో వైద్యుని అధిగమించాలని కానీ, వైద్యశాస్త్రాన్ని మించిపోవాలని కానీ కోరుతాడా?

లేదు.

మరి వైద్యశాస్త్రానభిజ్ఞుని మించగోరుతాడు గదా?

అవును.

మరి జ్ఞానాజ్ఞానాల సంగతి చూదాము. జ్ఞానవంతుడు మరొక జ్ఞానవంతుని కంటె అతిశయించి చెప్పాలని కాని చేయాలని కాని కోరుతాడో లేదో ఆలోచించు. ఒకేసన్ని వేశంలో తనకు సదృశుడైనవాడు చెప్పేదానినే చెబుతాడు. అతడు చేసేదానినే తానూచేస్తాడు. అవునా?

అలాగే జరుగుతుంది.

మరి అజ్ఞానో? జ్ఞానికంటె గాని, అజ్ఞానికంటె గాని అధికంగా పొందాలని కోరడా?

కోరుతాడు.

మరి తెలిసినవాడు జ్ఞాని కదా?

అవును.

జ్ఞాని సత్పురుషుడు కదా?

అవును.

జ్ఞానీ సత్పురుషుడు అయినవాడు ఆత్మసదృశునికంటె ఎక్కువ పొంద గోరడు. కాని అసమానగోత్రులకంటె ఎక్కువ పొందగోరుతాడు కదా?

అవును.

మరి అసత్పురుషుడూ అజ్ఞాని అయినవాడు ఆ యిరువురికంటె ఎక్కువ లాభం పొందజూస్తాడు గదా?

నిజమే.

అయితే అన్యాయవంతుడు ఆత్మసదృశవిపరీతుల ఇరువురికంటె అధికంగా లాభం పొందజూస్తాడని మనము చెప్పుకోలేదా, థ్రాసిమాకస్? ఇవి నీమాటలు కావా?

అవును.

న్యాయవంతుడు తనకు అసదృశుడైనవానిని అధిగమిస్తాడే కాని, ఆత్మసదృశుని అధిగమించడని కూడ అన్నావు కదా?

అవును.

అలాంటప్పుడు న్యాయవంతుడు జ్ఞానిసత్పురుషులకు సదృశుడై, అన్యాయవంతుడు పాపమూఢులకు సదృశుడు అవుతాడు గదా?

అలాగే కనబడుతున్నది.

మరి వారిలో ప్రతివాడు సగోత్రునివంటివాడే కదా?

అది ఎప్పుడో ఒప్పుకొన్నాము.

కాబట్టి న్యాయవంతుడు జ్ఞానీ సత్పురుషుడూ అవుతున్నాడు. అన్యాయవంతుడు పాపీ మూఢుడూఅని తేలుతున్నది.

ఇవన్నీ నేను అడుగుతుంటే థ్రాసిమాకస్ వెంటనే ఒప్పుకోలేదు. అతికష్టమ్మీద ఒప్పుకొన్నాడు. అది సెగలు చిమ్ముతున్న వేసంగిప్రొద్దు. సెలయేళ్ళుకట్టి చెమటలతనికి దిగకారుతున్నవి. మున్నెన్నడూ చూడని

వింత కనిపించింది. థ్రాసిమాకస్ సిగ్గుపడ్డాడు. న్యాయం పుణ్యమూ జ్ఞానమూ అనీ, అన్యాయం పాపమూ అజ్ఞానమూఅనీ మేము ఒప్పుకొన్నాము. అందువల్ల నేను మరొకవిషయం ప్రారంభించాను.

సరే ఆవిషయం తేలిపోయింది. కాని అన్యాయానికి బలమున్నదని ముచ్చటించుకొన్నాము. గుర్తున్నదా ?

లేకేమి? ఉన్నది. కాని నీవుచెప్పేది నేను ఆమోదిస్తానని కాని, లేక నేను సమాధానం చెప్పలేననికాని భావించకు; నేను సమాధానం చెప్పటం సంభవిస్తే వాగ్వర్షం కురిపిస్తున్నానని నీవు నన్ను నిందించటం నిశ్చయం. కాబట్టి నన్ను మాటాడ నీయదలచుకొన్నావా మాటాడనీ, లేక ప్రశ్న అడుగదలచుకొన్నావా అడుగు. కథలు చెప్పేముసలమ్మకు ఊఁకొడుతున్నట్లే ఊఁకొడుతూ అవుననో, కాదనో తల ఆడిస్తాను.

అట్లు కాదు, నీ అభిప్రాయానికి విరుద్ధంగామాత్రం తల ఆడించవద్దు, అని నేను హెచ్చరించాను.

నన్ను మాటాడనీయవు గదా! అందువల్ల నీ సంతృప్తికోసం అలాగే చేస్తాను. అంతకన్నా మరేమి చేయను ?

అది కుదరదు. నీ కిష్టమైతేనే అడుగుతాను, సమాధానం చెప్పు.

సరే, కానీ.

న్యాయాన్యాయాల తత్త్వం సరిగ పరిశీలించాలి. కాబట్టి వెనుకటిప్రశ్నే తిరిగివేస్తాను. న్యాయంకంటె అన్యాయం బలీయమనీ శక్తిమంతమనీ వాకొనటం జరిగింది. అయితే అన్యాయం అజ్ఞానమూ పాపమూ అనీ, న్యాయం జ్ఞానమూ పుణ్యమూ అనీ తేలిపోయింది. ఇచట తిరిగి ఎవరూ శంకించ నక్కరలేదు. థ్రాసిమాకస్, ఈ విషయమే మరొక దృష్టితో పరిశీలించ గోరుతున్నాను. ఒకరాజ్యం అన్యాయసక్తం కావచ్చును. ఇతరరాజ్యాలను బానిససీమలుగ చేయ యత్నించవచ్చును. లేదా ఇదివరకే అలా చేసి ఉండవచ్చును. పెక్కింటిని దాస్యంలో బంధించవచ్చును. దీనిని నీవు కాదనవు కదా ?

నిజమే. అయితే మరొకటి గూడ ఉన్నది. అత్యంత సమర్థమై అన్యాయంలో పరాకాష్ఠ పొందినరాజ్యం చాలవరకు అలా చేయవచ్చును.

ఇదే నీ వాదమని నాకు తెలుసు. కాని నేనొకటి ఆలోచిస్తున్నా. బలీయమైన రాజ్యానికి కలుగుతున్న ఈశక్తి న్యాయసహితమా, న్యాయ విరహితమా ? లేక న్యాయపురస్సరంగా ప్రదర్శితమాతున్నదా, అన్యాయ పురస్సరంగా ప్రదర్శితమాతున్నదా ?

నీ దృక్పథం యథార్థమై న్యాయమే జ్ఞానమైతే ఆశక్తి న్యాయసహిత మాతుంది. నావాదం యథార్థమైతే న్యాయవిరహిత మాతుంది.

థ్రాసిమాకస్, నీవు అవుననీ కాదనీ తల ఊపటమే కాదు. చక్కని సమాధానాలు చెబుతున్నావు. మహా సంతోషం !

నీ సంతృప్తికోసం చెబుతున్నాను.

కృతజ్ఞుణ్ణి. అనుగ్రహించి మరొకటి గూడ చెప్పు. అన్యోన్యం హాని కావించుకొనే రాజ్యం గాని, సైన్యం గాని, పచ్చిదొంగలమూక గాని, దుండగులగుంపు గాని కలిసికట్టుగా పనిచేయగల దనుకొంటావా ?

లేదు. అసంభవమని అతడన్నాడు.

ఒండొరులకు ఎగ్గు చేసికొనకపోతే వారు సంతనకట్టుగా పనిచేయవచ్చును గదా ?

అవును.

ఇలా ఎందుకు జరుగుతున్నది ? అన్యాయం విభేదాలు, ద్వేషాలు, కలహాలు తెచ్చిపెడుతుంది. న్యాయం సామరస్యం, స్నేహం కల్పిస్తుంది. ఇది నిజం కాదా థ్రాసిమాకస్ ?

నీతో కలహం నాకిష్టం లేదు. కాబట్టి ఒప్పుకొంటాను.

చాల మంచివాడవు; కాని మరొకటి కూడ చెప్పు: అన్యాయం ఎందున్నా-బానిసలలో ఉన్నా, స్వతంత్రులలో ఉన్నా, మరెక్కడ ఉన్నా — ద్వేషం తెచ్చిపెడుతుంది. కాబట్టి అన్యోన్యద్వేషం కల్పించి, పొరపొచ్చాలు తెచ్చిపెట్టి సంఘీభవించి పనిచేయలేని అశక్తతను కల్పించదా?

కల్పిస్తుంది.

అన్యాయం కేవలం ఇరువురు వ్యక్తులందే ఉన్నా, వారిద్దరు తగాదాపడి, పోరాడుకొని ఒండొరులకే కాక న్యాయవంతులకు కూడ శత్రువులు కారా?

అవుతారు.

అన్యాయం ఒకవ్యక్తిలోనే ఉన్నదనుకో. ఆ అన్యాయం పరాజితమై పోతుందా? లేక తన సహజశక్తిని కోల్పోక అలాగే ఉంటుందా? నీ అభిప్రాయ మేమిటి?

అలాగే ఉందనుకొందాము. ఉంటే?

ఈ అన్యాయం ఎందున్నా—రాజ్యంలో ఉన్నా, సైన్యంలో ఉన్నా మరేసంస్థలో ఉన్నా—ఆ సంస్థ ద్రోహాలకు పాల్పడి కలిసికట్టుగా పని చేయలేదు. ఇట్టి అన్యాయం తనకు తాను శత్రువే కాక తన్నెదుర్కొనే న్యాయవంతులకు కూడ శత్రువవుతుంది.

అవును. నిశ్చితంగా అంతే.

అన్యాయం ఏ వ్యక్తిలో ఉన్నా ఇంత హానికరమే కదా? తనతో తనకు పొత్తు కుదరనీదు. కాబట్టి ఆ వ్యక్తికి కర్మాచరణం దుశ్శకమౌతుంది. పైగా న్యాయవంతునితో శత్రుత్వం తెచ్చిపెడుతుంది. ఇది నిజమే కాదా థ్రాసిమాకస్?

అవును.

మరి దేవతలు గూడ న్యాయవంతులే కదా?

అలాంటివారే ననుకొందాము.

ఆ పక్షంలో దేవతలకు అన్యాయవంతుడు శత్రువు, న్యాయవంతుడు మిత్రుడు కారా?

విజయసంతోషంతో పొంగిపో, నీ వాదవైదగ్ధ్యం చూచుకొని మురిసిపో. సదస్యులకు ప్రీతి కలుగుతుంది కాబట్టి నీ వాదాన్ని ఎదుర్కోను.

సరే సమాధానాలు చెబుతూ నావిందు పూర్తి గానీ. న్యాయవంతులు అన్యాయవంతులకంటె జ్ఞానవంతులు, ఉత్తములు, సమర్థులుఅనీ, అన్యాయవంతులు కలిసి పనిచేయలేరనీ ఇదివరకే నిరూపించాము. అంతే కాదు కలిసి పనిచేసేవారు అన్యాయవంతులని చెప్ప వీలులేదు. యథార్థానికి వారు అన్యాయవంతులు కారు. కేవలం పాపులే అయితే వారు ఒండొరుల కుత్తుకలు నులుముకొని ఉండేవారు. వారు కలిసి పనిచేస్తున్నారంటే ఏ న్యాయలేశమైనా వారిలో ఉండాలి. అలా కాకపోతే ఒండొరులకే కాక వారు తమబారిని బడ్డవారికి కూడ హానిచేసి ఉండేవారు. కాని వారు నిజానికి ప్రారంభంలో అర్ధఘాతుకులు. అంతే కాని నిజంగా పూర్ణ ఘాతుకులై అన్యాయపరులే అయితే వారు కార్యాచరణకు అసమర్థులై ఉండేవారు. ఇదే నిజం కాని నీవు చెప్పినది మాత్రం కాదని నావిశ్వాసం. అయితే అన్యాయవంతులకంటె న్యాయవంతులు సుఖతరజీవనులు అవుతారా? అన్న మరొక ప్రశ్న కూడ ఆలోచించటానికి పూనుకొన్నాము. ఇంతకు ముందు చెప్పిన కారణాలనుబట్టి న్యాయవంతులు సుఖతరజీవనులనే భావిస్తున్నాను. అయినా దీనిని జాగ్రత్తగా పరిశీలించ గోరుతున్నాను. ఎందుకంటే ఇది అంత స్వల్పవిషయం కాదు. మానవజీవనసూత్రమే దీని మీద ఆధారపడి ఉన్నది.

సరే, అలాగే కానీయండి.

అయితే ప్రశ్నతో ప్రారంభిస్తాను. అశ్వానికి ప్రయోజన మొకటి ఉన్నదంటావా?

ఉన్నది.

అశ్వానికి కాని మరొకదానికి కాని, ప్రయోజనం ఉన్నది. ఆ ప్రయోజనం వేరొకదానివల్ల సాధ్యం కాదు. లేదా ఆ ప్రయోజనం దానివల్ల నెరవేరినంతచక్కగా మరొకదానివల్ల నెరవేరదు. దీని కంగీకరిస్తావా?

నీ తాత్పర్యమేమో బోధపడ లేదు.

ఇదిగో వివరిస్తా: కన్ను లేకపోతే చూడగలవా?

లేదు.

చెవిలేక వినగలవా ?

లేదు.

ఇవే ఆ యింద్రియాలకు ప్రయోజనా లనవచ్చునా ?

అవును.

ద్రాక్షతీగలను కటారితోనో, ఉలితోనో, మరొక సాధనంతోనో కొట్టివేయవచ్చును గదా ?

అవును.

కాని ఆ పనికి ప్రత్యేకంగా ఉన్న కొడవలితో తెగగొట్టినట్లుగా కొట్టివేయ వలనుపడదు గదా ?

నిజమే.

కాబట్టి ఇదే కొడవలి ప్రయోజనమని మనం చెప్పుకోవచ్చును గదా?

అవును.

ఇంతకూ నేనడిగిన ప్రశ్న యేమిటి? వస్తుప్రయోజన మన్నప్పుడు ఆ ప్రయోజనం వేరొకవస్తువువల్ల సాధ్యం కారాదు. లేదా ఆప్రయోజనం మరొకదానివల్ల అంతచక్కగా నెరవేరరాదు. ఇప్పుడు నా తాత్పర్యం, కష్టం కాదు.

ఆఁ, బోధపడింది. ఒప్పుకొన్నా.

మరి ప్రయోజనం ఉన్నదానికి విశిష్టత కూడ ఉంటుంది కదా? కంటికి ప్రయోజన మున్నదాఅని తిరిగి నిన్ను ప్రశ్నించ నక్కరలేదు గదా?

లేదు.

మరి కంటికొకవిశిష్టత లేదా?

ఉన్నది.

అలాగే చెవికి ఒకప్రయోజనం, విశిష్టత లేవా?

ఉన్నవి.

ఇలాగే ప్రతివస్తువునకూ ఒక ప్రయోజనం, విశిష్టత ఉంటవి కదా?

నిజమే.

తమ విశిష్టత కొరవడి దోషం ఏర్పడినప్పుడు కన్నులు తమ ప్రయోజనం సాధించగలవా?

గ్రుడ్డివై వస్తువులను చూడలేనప్పుడు ఎలా సాధిస్తవి?

తమ విశిష్టత అయిన చూపును కోల్పోయినప్పుడు అవి నిజప్రయోజనాన్ని సాధించలేవంటావు. నేనింకా అంతవరకు రాలేదు. స్వప్రయోజనాలను సాధించే వస్తువులు స్వవిశిష్టతా యుక్తములైనప్పుడు వానినిసాధించి దోషగ్రస్తములైనప్పుడు సాధించవా?

అవును.

ఇదే చెవులకు కూడ అన్వయిస్తుందా? అంటే స్వవిశిష్టతను కోల్పోయి నప్పుడు అవి తమ ప్రయోజనం సాధించలేవు గదా!

నిజమే.

ఇదే ఇతరవస్తువు లన్నిటికీ వర్తిస్తుంది గదా?

వర్తిస్తుంది.

సరే. అన్యవస్తువుచే సాధ్యం కాని ప్రయోజనం ఆత్మకు లేదా? ఉదాహరణకు పర్యవేక్షణం, అనుశాసనం, వివేచనం వంటివానిని తీసికొందాము. ఇవి ఆత్మకు సముచితాలు కదా? అట్లుకాక మరొకదానికి వీనిని ఆపాదించవచ్చునా?

లేదు.

ఆత్మకు గలప్రయోజనాలలో మనుగడను ఒకటిగా పరిగణించ నక్కర లేదా?

నిశ్చితంగా పరిగణించాలి.

మరి ఆత్మకు ఒకవిశిష్టత కూడ ఉన్నది కదా?

అవును, ఉన్నది.

ఆ విశిష్టత నష్టమైనప్పుడు ఆత్మ తనప్రయోజనం సాధించగలదా, లేదా?

లేదు.

అప్పుడు పాపాత్ముడైన దుష్టపాలకుడు దుష్టపర్యవేక్షకుడు కావాలి; పుణ్యాత్ముడు పుణ్యపాలకుడు కావాలి.

అవును.

మరి న్యాయం ఆత్మవిశిష్టత అనీ, అన్యాయం ఆత్మగతదోషమనీ మనం ఒప్పుకొన్నాము గదా?

అవును. ఒప్పుకొన్నాము.

కాబట్టి న్యాయవంతమైన ఆత్మ, న్యాయవంతుడైన మానవుడు సమ్యగ్జీవనం సాగిస్తారు. అన్యాయవంతుడైన మానవుడు దుష్టజీవనం సాగిస్తాడు. అవునా?

నీవాదం దీనినే నిరూపిస్తున్నది.

సమ్యగ్జీవనుడు ఆనందమయుడు, సుఖి. దుష్టజీవనుడు తదన్యుడు. అవునా?

అంతే.

ఇంతకూ న్యాయవంతుడు సుఖీ, అన్యాయవంతుడు దుఃఖీ అవుతారు కదా?

అవును.

మరి సుఖమే కాని దుఃఖం లాభదాయకం కాదు.

అవును.

మిత్రమా, థ్రాసిమాకస్! అప్పుడు న్యాయంకంటె అన్యాయం ఎప్పుడూ లాభదాయకం కాజాలదు.

సోక్రటిస్, ఇదిపర్వదినం. హాయిగా కాలం గడపు.

నాపట్ల సౌమ్యమూర్తివై అధిక్షేపించక వదలిపెట్టావు. నీకు కృతజ్ఞుణ్ణి. అయినా నాకు విందువిందు లభించలేదు. అది నాదోషమే కాని

నీదోషం కాదు. భోజనప్రియుడు వరుసగా వడ్డిస్తున్న ప్రతిపదార్థాన్ని కొంచెం కొంచెం చవిచూస్తాడు. అయితేముందు వడ్డించినపదార్థాన్ని చక్కగా ఆస్వాదించకే తరువాతి పదార్థం గ్రహిస్తాడు. అలాగే నేను కూడ ముందుతలపెట్టిన న్యాయస్వభావాన్ని విచారించక శాఖాచంక్రమణం చేశాను. ప్రధానవిచారం వదలి న్యాయం పుణ్యమా జ్ఞానమా, లేక అజ్ఞానమా పాపమా అన్నపరిశీలనకు ఉపక్రమించాను. న్యాయాన్యాయాల లాభపరిశీలన వచ్చినప్పుడు తత్పరిశీలనం పరిహరించ లేకపోయాను. ఈ చర్చ అంతకు పర్యవసానం ఏమిటి? నాకేమీ తెలియలేదని తేలింది. ఎందుకంటే న్యాయమంటే ఏమిటో నాకు తెలియదు. అది పుణ్యమో పాపమో ఎరుగను. న్యాయవంతుడైన మానవుడు సుఖవంతుడో దుఃఖవంతుడో చెప్పలేను.

# రెండవ ప్రకరణం

ఈ మాటలతో చర్చ ముగించానని అనుకొన్నాను. కాని వాస్తవానికి ఈ సమాప్తి కేవలం ప్రారంభంగా తేలింది. భల్లూకపుపట్టు పట్టే గ్లాకన్ థ్రాసిమాకస్ విరమణంతో అసంతృప్తిపొంది యుద్ధం పూర్తిచేయాలనుకొన్నాడు. అందువల్ల అతడు అందుకొని, ‘‘సోక్రటీస్! ఇంతకు అన్యాయ్యంగా ఉండటంకంటె న్యాయ్యంగా ప్రవర్తించటమే ఎప్పటికీ మంచిదని నమ్మించ గోరుతున్నావా? లేక నమ్మించినట్లు కనిపించ గోరుతున్నావా?’’ అని ప్రశ్నించాడు.

నాకు శక్యమైతే నిజంగా మిమ్ము నమ్మించాలనే ఉన్నదని నేను అన్నాను.

అయితే మీయత్నం సఫలం కాలేదు. మిమ్మొకప్రశ్న అడుగుతాను చెప్పండి: అర్థాలను ఎలా వర్గీకరిస్తారు? ప్రయోజనాలనుబట్టి కాక తమకు తాముగా కోరదగిన అర్థాలు లేవా? దృష్టాంతంగా అనపకారులైన సుఖాలు వినోదాలు తీసికోండి. వాటివల్ల అప్పటికప్పుడు సంతోషం కలుగుతుంది కాని వేరే ప్రయోజనం ఉండదు.

అలాంటి అర్థవర్గం ఉన్నదని నేనూ ఒప్పుకొంటానని అన్నాను.

తమకై తాముగా అభిలషించదగినవై ప్రయోజనాలనుబట్టి కూడ కోరదగిన జ్ఞానం, దృష్టి, ఆరోగ్యంవంటి మరొకరీతి అర్థాలు కూడ లేవా?

లేకేమి? ఉన్నవి.

వ్యాయామం, సపర్యాచరణం, వైద్యవిద్య, ధనసంపాదనోపాయాలు—

ఇలాంటి అర్థాలు మూడవజాతికిచెందినవి ఉన్నవని ఒప్పుకోరా? ఇవి కూడ మనకు మేలు సమకూరుస్తవి. కాని వీటిని అప్రియాలుగా పరిగణిస్తాము. ప్రయోజనాలనుబట్టి వీటిని కోరుకొంటున్నారే గాని స్వతః కామ్యాలని ఎవరూ కోరుకొనటం లేదు. అవునా?

నిజమే, ఈ మూడవవర్గం కూడ ఉన్నది. ఇంతకు ఈ ప్రశ్న ఎందుకడుగుతున్నట్లు?

ఎందుకా? ఈ మూడువర్గాలలో న్యాయాన్ని మీరు ఎందులో చేరుస్తారో తెలిసికొందామని.

ఉత్కృష్టవర్గంలో చేరుస్తాను. భద్ర మభిలషించేవాడు స్వతఃకామ్యాలు, ప్రయోజనకామ్యాలు అయిన అర్థాలే కామిస్తాడు. వాటిలోనే న్యాయాన్ని చేరుస్తాను.

ఎందరో మరొకరీతిగా భావిస్తున్నారు. న్యాయం క్లేశావహవర్గంలో చేరుతుందని వారి తలంపు. తమకుతామై అప్రియాలు, పరిహరణీయాలు, కేవలం బహుమానప్రతిష్ఠలకోసం అపేక్షణీయాలు అయిన అర్థాలలో దానిని చేరుస్తున్నారు.

వారి ఆలోచనతీరు అలాగే ఉన్నది. ఆ సంగతి నాకు తెలుసు. థ్రాసిమాకస్ న్యాయాన్ని తెగడి అన్యాయాన్ని పొగడినప్పుడు గూడా అతడు ఈ వాదాన్నే ప్రతిపాదించాడు. కాని నేను అతని వాదం మెచ్చుకోలేని మూఢుణ్ణి, అని నేను అన్నాను.

అతనివాదంవలెనే నావాదం కూడ మీరు వినాలని నాకోరిక. విన్నపిదప మీకు, నాకు ఏకీభావం కుదురుతుందో లేదో చూస్తాను. ఎందుకంటే నాగస్వరం విన్న నాగుబాములాగా మీ కంఠధ్వనికి అతడు అంతలోనే మైమరచినట్లు కనిపించాడు. అంతేకాని ఇంతవరకు న్యాయాన్యాయ స్వరూపం తేలలేదనిపిస్తున్నది. ప్రయోజనాలను ఆవల ఉంచి న్యాయాన్యాయాలు తమకు తాముగా ఎలావుంటవో, మనస్సులో చేరి అవి ఎలా పనిచేస్తవో తెలిసికోవాలని ఉన్నది. మీరు ఒప్పుకొంటే థ్రాసిమాకస్ వాదం మరొకసారి అనువదిస్తాను. ముందు ప్రజలకు సర్వసామాన్యంగా

ఉన్న దృక్పథాన్నిబట్టి న్యాయస్వభావాన్ని, దాని అవతరణను ముచ్చటిస్తాను. ఆ తరువాత న్యాయమనుష్ఠించేవారు తమకిష్టం లేకపోయినా గత్యంతరం లేక ఆచరిస్తున్నారే కాని మేలని యెంచి ఆచరించటం లేదని నిరూపిస్తాను. ఇక మూడవఅంశం: న్యాయవంతుని జీవితంకంటె అన్యాయవంతుని జీవితం ఎంతో మెరుగని వారనుకొంటున్నారు. అందువల్ల ఆ నడవడి సహేతుకమే. అయితే నేను మాత్రం వారి అభిప్రాయంతో ఏకీభవించలేను. కాని థ్రాసిమాకస్ మున్నుగాగల లక్షలాది ఇతరజనుల ఎలుగులు నాచెవులను గింగురుకొలుపుతుంటే విభ్రాంతి పొందుతున్నానని మాత్రం ఒప్పుకొంటాను. అన్యాయంకంటె న్యాయం ఉత్తమమని సంతృప్తికరంగా ఎవరూ నిరూపించగా వినలేదు. న్యాయం తనకు తానుగా మంచిదని శ్లాఘిస్తే వినాలని ఉన్నది. అప్పుడే నాకు సంతృప్తి కలుగుతుంది. దీనిని చాలవరకు మీవల్లనే వినగలుగుతానని ఆశిస్తున్నాను. కాబట్టి నా శక్తికొలది అన్యాయజీవితాన్ని శ్లాఘిస్తాను. ఏ తీరున న్యాయాన్ని శ్లాఘించి మీరు అన్యాయాన్ని తెగనాడితే వినాలని కోరుతున్నానో నా మాటాడేతీరే సూచిస్తుంది. మరి యీ నాప్రతిపాదన మీకు సమ్మతమేనా?

ఆఁ, అంతికంటె ముచ్చటించదగిన దేముంది?

అతడు అందుకొన్నాడు:— మహాసంతోషం! అయితే యింతకు ముందు పేర్కొన్నట్లుగా న్యాయస్వభావ మేమిటి? అది ఎలా అవతరిస్తున్నది? అన్నవిషయాలతో నా ప్రసంగం ప్రారంభిస్తాను:—

అన్యాయాచరణం సుఖమే కాని, దానిఅనుభూతిమాత్రం దుఃఖం. అయితే సుఖంకంటె దుఃఖం మెండని వారంటారు. అన్యాయం స్వయంగా ఆచరించి అనుభవించినవారు దుఃఖం పరిహరించి, సుఖం అనుభవించలేక యీ రెండు పరిహరించటం మేలని భావిస్తారు. దీని ఫలంగా చట్టాలు ఒడంబడికలు ఏర్పడుతున్నవి. శాసనవిహితమైనదానిని ఈ విధంగా న్యాయమని పేర్కొంటున్నారు. ఇదే న్యాయస్వభావం. ఇలాగే న్యాయం అవతరించిందని వారు వక్కాణిస్తున్నారు. అటు అన్యాయం చేసి శిక్షనుంచి తప్పించుకొనటానికీ, ఇటు ప్రతీకారరహితంగా అన్యాయానికి గురియై అనుభవించటానికీ, న్యాయం మధ్యస్థంగా ఉంటుంది. ఇలా మధ్యస్థమై సుఖదాయి కాక అల్పదుఃఖదాయి కావటంవల్ల న్యాయం సహింపబడుతున్నది. అన్యాయాచరణకు చాలనివారు కావటంవల్ల దానిని మానవులు

గౌరవిస్తున్నారు. ప్రతిఘటనం శక్యమే అయితే మానవశబ్దవాచ్యుడు ఎవడూ అలాంటిఒడంబడికలకు ఎన్నడూ ఒప్పుకోడు. ఒప్పుకొంటే పిచ్చివాడవుతాడు. న్యాయం పుట్టుపూర్వోత్తరాలు ఇలాంటివని చెప్పగా వింటున్నాము.

న్యాయమనుష్ఠించేవారు దానియందు ఇష్టంలేకపోయినా, అన్యాయం ఆచరించటానికి శక్తి లేక అనుష్ఠిస్తున్నారని తేలికగా ఊహించవచ్చును. న్యాయవంతునికి అన్యాయవంతునికి ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించటానికి వలసిన శక్తి నిచ్చి వారి వాంఛలు వారిని ఎచటికి చేరవేస్తాయో చూదాము. అటున్యాయవంతుడు ఇటు అన్యాయవంతుడు ఒకేమార్గం పడుతారు. ఇరువురూ స్వప్రయోజనమే అనుసరిస్తారు. నిజానికి అందరూ ఇంతే. అయితే చట్టపుబలమే వారిని న్యాయపథానికి మళ్ళిస్తున్నది. ఇంతకూ నేను కల్పించాలని చెబుతున్న స్వాతంత్ర్యశక్తి లిడియా దేశీయుడూ క్రోయిసస్‌పూర్వికుడైన గైజస్‌కు లభించిన శక్తివంటిది కావాలి. సంప్రదాయజ్ఞులు దానిని ఇలా వివరిస్తున్నారు: లిడియాదేశపురాజు కొలువులో గైజస్ గొర్రెలకాపరిగా ఉండేవాడు. ఒకసారి పెద్దపెట్టున గాలివాన వచ్చింది. అప్పుడు భూకంపం బయలుదేరి అతడు గొర్రెలను మేపుకొంటున్నచోట గొప్ప బిలం ఏర్పడింది. అది చూచి దిగ్భ్రాంతుడై మెల్లగ తేరుకొని, అతడు బిలమార్గాన లోపలికి దిగి వెళ్ళాడు. అలా వెళ్ళగా అతనికి తలుపులున్న కంచుగుర్రం కనిపించింది. అతడు వంగి తలుపులగుండా చూచాడు. నిలువెత్తునఉన్న మృతకళేబరం కనిపించింది. ఆ కళేబరానికి ఉంగరంతప్ప మరేమీ లేదు. ఆ ఉంగరం పుచ్చుకొని అతడు వెళ్ళినమార్గాన తిరిగివచ్చాడు. మాసాని కొకసారి సమావేశమై గొర్రెలమందల లెక్కలు తేల్చి రాజుకు వర్తమానమంపటం ఆ కాపరులకు ఆచారం. ఆ ఆచారం ప్రకారం వారు నాడుసమావేశమయ్యారు. గైజస్ ఉంగరం వ్రేలికి పెట్టుకొని ఆ సమావేశానికి వచ్చి వారిలో కూర్చున్నాడు. అతడు అలా కూర్చుండి ఎందుకో ఉంగరపు రాతిభాగం అరచేతివైపు తిప్పాడు. తిప్పటమే తడవుగ ఉన్నవాడున్నట్లు అదృశ్యమయ్యాడు. అతడు లేడనుకొని సదస్యులు అతనినిగూర్చి ముచ్చటించుకొనసాగారు. దీనితో అతనికి ఎక్కడలేని విస్మయం కలిగింది. మళ్ళీ అతడు తన ఉంగరపురాతిని ఎప్పటివలె పైకితిప్పి మళ్ళీ కనిపించసాగాడు. ఇలా ఉంగరపురాతిని క్రిందికి పైకి పెక్కుసార్లు తిప్పాడు. తిప్పినప్పుడల్లా ఇలాగే జరిగింది. రాతిని అరచేతివైపునకు తిప్పినప్పుడల్లా అదృశ్యమయ్యేవాడు. పైకి తిప్పగానే ప్రత్యక్షమయ్యేవాడు. ఆ తరువాత

దూతలలో తనొకనిగా నియమింపజేసికొని అతడు రాజాస్థానానికి వెళ్ళాడు. అతడక్కడ రాణిని చెరిచి, ఆమె సహాయంతో రాజుపై కుట్ర పన్ని, అతన్ని సంహరించి, రాజ్యం అపహరించాడు. అలాంటి ఉంగరాలు రెండు ఉండి వాటిలో ఒకటి న్యాయవంతుడు, మరొకటి అన్యాయవంతుడు ధరించారనుకొందాము. ఏ మానవుడైన న్యాయంనుంచి చలించనంత వజ్రస్వభావుడని ఊహించలేము. సంతకు పోయి తనకు ఇష్టము వచ్చిన ఏ వస్తువైనా అపహరించ వీలుంటే, ఇళ్ళల్లో చొరబడి ఇష్టమైన స్త్రీతో నిద్రచేయ వలనుపడితే, ఇచ్చవచ్చినవారిని చంపి ఇచ్చవచ్చిన వారిని చెరనుంచి విడిపించే అవకాశముంటే, దేవునివలె సర్వశక్తులుంటే ఏ మానవుడూ పరులసొమ్ము తాకకుండ ఉండడు. అప్పుడు న్యాయవంతుని నడవడి అన్యాయవంతుని నడవడి ఒకేతీరున ఉంటవి. తుదకు ఉభయులు ఒకేరేవున తేలుతారు. మానవుడు న్యాయవంతుడై మెలగుతున్నాడంటే ఏరి కోరిన పూనికతో గాదు. న్యాయం హితమొనగూరుస్తుందన్న నిశ్చితబుద్ధితో గాదు. గత్యంతరం లేక అనుష్ఠిస్తున్నాడు. ఎట్టికీడు రాదు; సురక్షితంగా అన్యాయం ఆచరించవచ్చునని నిశ్చయమేర్పడినప్పుడల్లా అతడు అన్యాయవంతుడుగానే ఉంటాడు. దీనికి ఇంతకు ముందు చెప్పుకొన్న కథే ప్రబలదృష్టాంతం. న్యాయంకంటె అన్యాయమే వ్యక్తికి ఎక్కువ లాభదాయకమని మానవులంతా తమ హృదయాల్లో భావిస్తున్నారు. ఇలా వాదించేవారు తమవాదమే యథార్థమంటారు. అంధంకరణశక్తి సంపాదించి ఏ దోషం పొంత పోక పరుల సొమ్ము తాకనివ్యక్తి ఒకడు ఉన్నాడే అందాము. అలాంటి వానిని ప్రేక్షకులు ఇతరులముందు మెచ్చుకోవచ్చును. తాము గూడ అన్యాయం చారిని పడవచ్చునన్న భీతితో పైపైలాంఛనాలను జరుపవచ్చును. కాని లోలోపల మాత్రం అలాంటివాడు అత్యంతనిర్భాగ్యుడనీ, మూఢుడనీ భావిస్తారు.

ఇక న్యాయాన్యాయవంతుల జీవితతత్త్వం గ్రహించాలంటే, ముందు వారిని వేరుపరచాలి. అంతకు వినా మరొకమార్గం లేదు. మరి ఈ వేర్పాటు ఎలా సాధ్యం? ఇందుకు నా సూచన ఒకటి ఉంది. అన్యాయవంతుని పూర్తిగా అన్యాయవంతునిగాను, న్యాయవంతుని పూర్తిగా న్యాయవంతునిగాను ఉండనీయుండి. ఈ ఉభయులలో ఎవరినుంచి దేనినీ తీసివేయరాదు. వారి వారి జీవితకర్తవ్యనిర్వహణకు వలసిన పరిపూర్ణ సామగ్రిని కల్పింతాము. నిపుణుడైన నావికుడేమి, వైద్యుడేమి ప్రజ్ఞావిశేషంతో తనశక్తులను గ్రహించి వానివాని మేరలలో నిలుపుతాడు.

ఎప్పుడైన వైఫల్యం కలిగితే అతడు వెంటనే చక్కదిద్దుకొంటాడు. ఇలాంటి వృత్తివిద్యానిపుణునివలెనే అన్యాయవంతుని గూడ ఉండనీయండి. అతడు అన్యాయప్రవర్తనం క్రమమార్గాన సాగిస్తూ అందులో పరాకాష్ఠ పొందాలంటే అతని ప్రవర్తనం నిగూఢంగా ఉండాలి. అతని చర్యలు బయటపడినవో అతడు ఎవడూ కాకుండా పోతాడు. ఇందుకు కారణం ఒకటి. తాను న్యాయవంతుడు కాకపోయినా న్యాయవంతుడని పేరుమోసినప్పుడే అన్యాయం పరాకాష్ఠ పొందుతుంది. కాగా పరమ అన్యాయవంతునిలో పరమఅన్యాయం ఉంటుందని చెప్పుకోవాలి. ఇందులో తీసివేత ఉండరాదు. అతడు పరమ అన్యాయచర్యలు కావిస్తూ న్యాయవంతుడన్న మహత్తరఖ్యాతిని సంపాదించాడని మనం అంగీకరించాలి. తప్పటడుగు వేసిఉంటే అతడు తిరిగి సద్దుకోగలిగి ఉండాలి. అతని చర్యలు బయటికి పొక్కితే వాటిని సమర్థించుకోగలిగిన మాటకారితనం అతనికి ఉండాలి. బలప్రయోగం ఆవశ్యకమైతే దానికి వలసిన ధైర్యం, ధనమిత్రసంపత్తి అతనికి ఉండాలి. అతని ప్రక్కనే స్వకీయ ఉదాత్తతతో నిరాడంబరతతో న్యాయవంతుని నిలబెడదాము. ఈస్క్యలస్ వచించినట్లు అతడు వాస్తవంగా మంచివాడే కాని మంచివాడువలె కనిపించడు. మంచివాడట్లు కనిపించరాదు. కనిపిస్తే అతనిని గౌరవిస్తారు, బహూకరిస్తారు. అలాంటివేళ అతడు న్యాయమర్థించి న్యాయవంతుడుగా ఉంటున్నాడో, లేక గౌరవబహుమానాలర్థించి న్యాయవంతుడుగా ఉంటున్నాడో మనకు ఎరుకపడదు. కాబట్టి అతనిని కేవల న్యాయసంవృతుని చేదాము. అంతే కాని మరొక ఆచ్ఛాదనం అతనికి కల్పించరాదు. అన్యాయజీవితానికి కేవలం విరుద్ధమైన జీవితదశలో ఉన్నట్లుగా అతనిని ఊహింతాము. మానవులలో అతనిని ఉత్తమోత్తమునిగా నిలుపుదాము. అతనిని లోకం అత్యంతనీచునిగా తలపోస్తుందనుకొందాము. అప్పుడే అతడు నిశితపరీక్షకు గురి అవుతాడు. అప్పుడే అతడు అపకీర్తికి, దాని ఫలితాలకు జంకుతాడో లేదో మనకు తేలుతుంది. అతడలాగే తుదిగడియ దాకా ఉన్నాడనుకొందాము. అంటే వాస్తవంగా న్యాయవంతుడై ఉండి కూడ అన్యాయవంతునివలె కనిపిస్తున్నాడన్నమాట. ఈ విధంగా న్యాయాన్యాయవంతు లిరువురు తమ ఉచ్ఛస్థితి పొందినప్పుడు వారిలో ఎవడు అధికసుఖవంతుడో నిర్ణయించండి.

అరే! వారేమన్నా కంచువిగ్రహాలా ఏమిటి, ఉత్సాహంతో ఒకనికి మించిన మెరుగు మరొకనికి పెడుతున్నావు? అని నేను అన్నాను.

ఏదో నా శక్తికొలది నేను చేస్తున్నాను. ఇంతకూ వారి స్వభావమేమో మనకు తెలుసు కాబట్టి వారి కెలాంటి జీవితం సిద్ధించబోతున్నదో గ్రహించటం కష్టం కాదు. దానినే నేనూ వర్ణిస్తాను. అయితే ఈ వర్ణన మీకు కొంత మొరటుగ తోచవచ్చును. కాని ఈ చెప్పబోతున్నమాటలు నావి కావు. అన్యాయసంకీర్తనపరులు చెప్పేమాటలనే నా నోటి మీదుగా చెబుతున్నాను. అన్యాయవంతుడట్లు కనిపించిన న్యాయవంతుడు కొరడాదెబ్బలు తింటాడు. హింసకయంత్రమందు అతనిని ఆరోపిస్తారు. ఆ యంత్రానికి అతని పెడరెక్కలు విరిచి కడతారు. అతని కన్నులు కొరవులతో మాడ్చివేస్తారు. వధ్యశిల కెక్కిస్తారు. న్యాయవంతుడువలె కనిపించవలెనే కాని న్యాయవంతుడై ఉండరాదని అప్పుడు అతనికి అర్థమౌతుంది. ఈస్క్యులస్ పలికినమాటలు నిజంగా అన్యాయపరునకే చక్కగా అన్వయిస్తవి గాని, న్యాయపరునకు అన్వయించవు. కారణం అన్యాయవంతుడు వాస్తవాన్ని అనుసరిస్తున్నాడు గాని ఆభాసాలను (Appearances) అనుసరించటం లేదు. అతడు వాస్తవంగా అన్యాయవంతుడుగా ఉండవలెననుకొంటున్నాడు కాని అన్యాయవంతునివలె కనిపించాలని అనుకొనటంలేదు.

"సార మవ్వాని చిత్తకేదారభూమి
దాన మొలకొత్తు మేలైన తలఁపుగుంపు."

న్యాయవంతుడని ప్రజలనుకొంటారు కాబట్టి నగరంలో అతనికి అధికారం ఏర్పడుతుంది. అతడు తనకిచ్చవచ్చిన యాపెను పెండ్లాడ గలుగుతాడు, నచ్చినచోట వియ్యమందగలుగుతాడు. వర్తకవ్యాపారాలు ఇచ్చవచ్చిన చోట లాభసాటిగా సాగిస్తాడు. కారణం అతనికి అన్యాయవిషయమైన అపోహలుండవు. ప్రతిపోటీలోను—ప్రజారంగంలో గాని, వ్యక్తిగత రంగంలో గాని— ప్రత్యర్థుల చేతికి అతనిచేయి మీదవుతుంది. వారిని నష్టపరిచి తాను లాభం పొందుతాడు. ఇలా భాగ్యవంతుడై తన సంపత్తితో మిత్రామిత్రులకు ఉపకారాపకారాలు చేస్తాడు. పైగా యజ్ఞయాగాలు చేసి దేవతలకు సమృద్ధిగా ఉదాత్తంగా కానుకలు సమర్పించగలుగుతాడు. న్యాయవంతునికంటె అతడు అధికంగా ఉదాత్తఫణితిలో దేవతలనేమి, తాను గౌరవించదలచుకొన్న వ్యక్తులనేమి ఆరాధించగలడు. అందువల్ల న్యాయవంతులకంటె అతడు దేవతల కెక్కువ ప్రీతిపాత్రుడవుతాడు. ఈ విధంగా న్యాయవంతుని జీవితంకంటె అన్యాయవంతుని జీవితం సుఖతరం కావటానికి దేవమానవలోకమంతా తోడ్పడుతుందని అంటారు.

నేను గ్లాకన్‌కు ఏదో సమాధానం చెప్పబోయాను. అంతలోనే అతని సోదరుడైన యాడైమాంటస్ మధ్యలో అందుకొన్నాడు:—“సోక్రటిస్! ఇంతకు మించి మరి చెప్పవలసినది లేదనుకొంటున్నావా?”

ఇంకా ఏమున్నదని నేను అన్నాను.

అన్నిటికన్నా ప్రబలతరవిషయం పేర్కొనవలసినదైనా పేర్కొనలేదని అతడన్నాడు.

అవునులే అన్నకు తమ్ముడూ, తమ్మునికి అన్నా కాకపోతే మరెవరవుతారు. అలాగే కానీ, ఎక్కడన్నా కొంచెం కొరత ఉందేమో నీవు దానిని పూర్తిచేయి. అయితే గ్లాకన్ ఇదివరకే నన్ను చిత్తుచేశాడు. నా న్యాయసమర్థనశక్తి ఉడిగించాడు.

వెంటనే యాడైమాంటస్ అందుకొన్నాడు. నీ టకటొంకులు అవతలపెట్టి నన్ను గూడ కొంత మాటాడనీ. న్యాయాన్యాయ దూషణభూషణలలో గ్లాకన్ తాత్పర్యం వివరించాలంటే అతని వాదనలో మరొక అంశం చెప్పవలసి ఉంది. తల్లిదండ్రులు గురువులు తమబిడ్డలకు వినేయజనానికి, “న్యాయవంతులుకం”డని చెవినిల్లుకట్టుకొని చెపుతుంటారు. దేనికి? కేవలం న్యాయాపేక్షతో కాదు. శీలార్థులై, యశఃకాములై చెపుతున్నారు. అన్యాయవంతులైనా న్యాయవంతులని పేరుమోస్తే ఉన్నతోద్యోగాలు, పెళ్ళిపేరంటములు మున్నైన మేళ్ళు సమకూరుతవని గ్లాకన్ పేర్కొన్నాడు. అవి తమవారికి కలగాలన్న ఆసక్తితో వారు అలా బోధిస్తుంటారు. ఏది ఎలాఉన్నా న్యాయవంతులు కావటంకంటె న్యాయవంతులవలె కనిపించటం ఈ కోవకు చెందిన వ్యక్తులకు ముఖ్యం. న్యాయవంతులట్లు కనిపించిన వారియందు దేవతలు సంప్రీతులవుతారని వీరంటారు. పవిత్రులపై దైవం అనుగ్రహవృష్టి కురుస్తుందని అంటారు. ఇదంతా మహానుభావులు, మహాకవులు అయిన హెసియడ్, హోమర్ చెప్పినదానితో సరిపోతున్నది. హెసియడ్ అన్నాడు:—

“న్యాయరూపులౌవారల యామ్రతరులు
శిరములం దాల్చు ఫలభారగురుత, శాఖ
లందు వహియించు మధుకోశహారి రేఖ
దేవతాకోటిచే సమాదిష్టమగుచు.”

ఇలాంటి సచ్ఛీలసంపత్తి వారికెంతగానో కలుగుతుందని కీర్తింపబడ్డది. హోమర్‌కు కూడా ఈ భావమే ఉన్నట్టు కనిపిస్తున్నది. ఎందుకంటే,

"పాలితధర్ముఁడైన నరపాలుని పావనపాలనంబునన్
నీలమణీవిభాసి యవనీతల మెల్లను సస్యవృద్ధిమై
గ్రాలు, తరువ్రజమ్ము ఫలరాజివినమ్రత మై దనర్చు, గో
పాళి సమాంసమీనయయి వర్ధిలు వార్ధులఁగంగు మీనులన్."

అని వ్రాశాడు.

న్యాయవంతునకు కలిగే ప్రతిఫలసంపత్తి మరీ ఉదాత్తంగా ఉంటుందని మసీయస్ అతనికుమారుడూ వర్ణించారు. మునులు సుఖాసీనులై పుష్ప మాలాలంకృతశిరస్కులై నిరంతరపానగోష్ఠీనిరతులై ఉండే పుణ్య లోకానికి న్యాయవంతులు పోతారని వారు పేర్కొన్నారు. పుణ్య సంపత్తివల్ల కలుగగల ఉత్తమఫలం పానపారవశ్యనిత్యతయేయని వారి తాత్పర్యమైనట్లు కనిపిస్తుంది. మరికొందరు మరొకమెట్టు పైకి పోయి చెబుతున్నారు:— న్యాయవంతుల సంతతి గూడ మూడు నాలుగు తరాల వరకు ఆ పుణ్యఫలం అనుభవిస్తుందంటున్నారు. ఈ ధోరణిలో వారు న్యాయాన్ని కీర్తిస్తున్నారు. మరి క్రూరులకు దీనికి విపరీతమైన స్థితి కలుగుతుందని వర్ణిస్తున్నారు. అటువంటివారిని నరకపంకంలో పాతి వేస్తారట. జల్లెళ్ళతో నీరు చేరవేయిస్తారట. ఇహలోకయాత్రలో కూడ వారు అపకీర్తికి పాల్పడుతారట. అన్యాయవంతులని పేరుపడ్డ న్యాయ వంతులకు ప్రాప్తాలయ్యే ఘోరశిక్షలను గ్లాకన్ పేర్కొన్నాడు. ఆ శిక్షలన్నీ వీరు అనుభవిస్తారట. వారు సంకీర్తనం చేస్తున్న అర్థం దీని కేమాత్రం తీసిపోదు. మొత్తం మీద ఇదీ న్యాయాన్యాయ భూషణ దూషణపరుల విధానం.

న్యాయాన్యాయాలను గూర్చి కవులే కాక వచనరచయితలు గూడ మరొకవిధంగా ప్రస్తావిస్తున్నారు. సోక్రటిస్! మీరు దీన్ని గూడ ఆలోచించాలి. న్యాయం, పుణ్యం మాననీయాలే కాని కష్టసాధ్యాలు; దుఃఖప్రదాలు. పాపంవల్ల, అన్యాయంవల్ల భోగాలు తేలికగ లభిస్తవి. ఈ అన్యాయపాపాలను చట్టమూ ప్రజాభిప్రాయము మాత్రమే గర్హిస్తు న్నవని మానవజాతి అంతా ఎల్లప్పుడూ ముక్తకంఠంతో చాటుతున్నది. అనృతవర్తనంకంటె ఋజువర్తనం తక్కువ లాభదాయకమని ప్రజ లంటారు. దుర్మార్గులు సుఖపడతారని ఒప్పుకొనటానికి వారు సంసిద్ధులే. అలాంటి దుష్టులకు భాగ్యమున్నా, పలుకుబడి ఉన్నా, ప్రజలు చాటు మాటుగానేమి బాహాటంగానేమి వారిని గౌరవించటానికి ఆయత్తపడ

తారు. దుర్బలులూ నిరుపేదలూ అయితే మంచివారిని కూడా వారు ఏవగించుకొంటారు; ఉపేక్షిస్తారు. వీటన్నిటికంటె గూడ పుణ్యాన్ని గూర్చి దేవతలనుగూర్చి వారు చేసే ప్రసంగాలు చిత్రవిచిత్రంగా ఉంటవి. దేవతలు సత్పురుషులకు ఆపదలు దుఃఖాలు కల్పిస్తారనీ, దుర్మార్గులకు సుఖశ్రేయస్సులు సమకూరుస్తారని వారంటారు. జోగులు, ప్రవక్తలు సంపన్నగృహస్థుల ఇండ్లకు పోయి, "హోమాలతో మంత్రతంత్రాలతో సంతర్పణలతో మీరు కాని, మీ పూర్వులు కాని చేసిన పాపాలను నశింప జేస్తాము. దేవతలు మాకలాంటి దివ్యశక్తిని అనుగ్రహించా"రని చెప్పి వారిని నమ్మిస్తారు. "మా అభిచారికక్రియలతో, జపాలతో దేవతలనైన ఆకట్టి స్వల్పవ్యయంతో శత్రువునకు హాని కలిగిస్తాము. అతనిపాప పుణ్యాలు అందుకు అడ్డుపడవు" అని వారు శపథాలు చేస్తారు. ఈ పను లన్నిటికి వారు కవులను ప్రమాణంగా చూపుతారు. పాపవర్తనం సుగమం చేస్తూ వారు హెసియడ్ వ్రాసిన యీ క్రింది వాక్యాలను ఉదహరిస్తారు:— "కష్టపడకుండానే పాపం సమృద్ధిగా లభిస్తుంది. ఆ మార్గం సుగమం. దాని గమ్యం సన్నిహితం. కాని పుణ్యమంత తేలిక కాదు. దేవతలు అద్దాని సిద్ధికి ఎన్నో కష్టాలు, అవరోధాలు కల్పిస్తారు."

పుణ్యపథం సుదీర్ఘం, అతిదుర్గమం. దేవతల మనస్సులను గూడ మానవులు మార్చవచ్చునని హోమర్ చేత సాక్ష్యమిప్పిస్తున్నారు. ఎందుకంటే అతడు ఇలా వ్రాశాడు:—

"దేవతలను గూడ వారి లక్ష్యాలనుంచి మార్చవచ్చును. ధర్మం ఉల్లం ఘించి, పాపం ఒడిగట్టిన మానవులు దేవతలను ప్రార్థించి బలులతో, దీనాభ్యర్థనలతో సోమరసదానాలతో మాంసగంధాలతో వారి కోపాన్ని పరిహరించవచ్చును."

మసీయస్, ఆర్ఫియస్ అన్నవారు విద్యాధిదేవతలకు చంద్రకళకు కలిగిన సంతతి అని చిరంతనులు చెబుతారు. వారు వ్రాసిన పెక్కుగ్రంథాలను ప్రమాణాలుగా చూపుతారు. వాటిని పురస్కరించుకొని కర్మకాండ జరుపుతూ బలుల సమర్పిస్తూ వ్యక్తులే గాక రాజ్యాలకు రాజ్యాలే పాప పరిహారం పొందవచ్చు. ప్రాయశ్చిత్తం చేసికోవచ్చు. అలాంటి కర్మలు తీరికవేళలందు వినోదం కల్పిస్తవనీ, అటు చచ్చినవారికీ ఇటు బ్రతికిఉన్న వారికీ మేలు చేకూరుస్తవనీ, వారు బోధించి అందుకు పురికొల్పుతున్నారు. ముఖ్యంగా ప్రేతకర్మలు అచింత్యాలు అంటారు. ఇవి మృతజీవులను నరకయాతనలనుండి రక్షిస్తవట. వానిని నిర్వర్తించక ప్రాలుమాలితే

ఎలాంటి దుర్గతి సంభవిస్తుందో ఎవరికీ తెలియదు.

అతడు తన ప్రసంగాన్ని అలాగే కొనసాగిస్తూ అన్నాడు:— పాప పుణ్యాలు ఇట్టివని విన్నప్పుడు, వాటిని గూర్చి దేవమానవులు ఇలా భావిస్తున్నారని ఆకర్ణించినప్పుడు పసిపాపల మనస్సులు ఎలా పరిణమిస్తవో ఒకసారి ఆలోచించండి. వారి మనస్సులు సుకుమారాలు, సుగ్రాహులు. కనిపించిన పూవునందలి మకరందం గ్రోలటానికి ఆయత్తమయ్యే తుమ్మెదలు. పాపపుణ్యాలను గూర్చి వారలాంటి ప్రసంగాలు విన్నప్పుడు ఏమవుతుంది? చరితార్థతాసంపాదనకై తాము ఎలా తయారు కావాలనుకొంటారు? ఏ మార్గం అనుసరించాలనుకొంటారు? పిండార్ చెప్పినట్లు

"బ్రతికి యుండునంతవఱకు రక్షయొసంగు
ప్రబలదుర్గమెట్లు పడయఁగలను?
శీఘ్రమెద్ది యందు చేర్పంగఁ జాలునో
న్యాయపథము వంచనాపథమ్మొ?"

అని తలపోస్తారు. నేను నిజంగా న్యాయవంతుడనై ఉండి న్యాయవంతుణ్ణని భావింపబడకపోతే లాభం ఏ మాత్రం లేదని ప్రజలు అంటూ ఉంటారు. అలా భావింపబడక పోతే దుఃఖమూ నష్టమూ తప్పవు. నేను అన్యాయవంతుడనే అయినా న్యాయపరుడనన్న ఖ్యాతి సంపాదిస్తే నాకు దివ్యజీవితం లభిస్తుందంటారు. ఆభాసం సత్యాన్ని బాధించి సౌఖ్యానికి ప్రధానహేతువు అవుతుందని తాత్త్వికులు నిరూపిస్తున్నారు. కాబట్టి నేను ఆభాసాన్ని గూర్చే ఎక్కువగా ఆలోచించాలి. మహర్షి ఆర్కిలోకస్ ఉపదేశించినట్లు పుణ్యాభాసాన్ని తలచావడిగ చేసికొని గర్భంలో క్రూరవంచకాన్ని పెంచాలి. అయితే దౌర్మార్గ్యాన్ని దాచటం తరచుగ కష్టమేనని ఎవరో అంటే విన్నాను. అయితే మహత్తర కార్యమేదీ అంత తేలిక కాదంటాను. ఏది ఎలా ఉన్నా ఈ వాదపర్యవసానం ఇది: మనం సుఖపడాలంటే ఈ మార్గమే అనుసరించాలి. రహస్యగోపనకై మనం రహస్యసంఘాలు, రాజకీయసమితులు ఏర్పరచుకొంటాము. న్యాయస్థానాలను సభలను ఒప్పించేవిద్యను బోధించే వాదప్రౌఢులైన ఆచార్యులున్నారు. కొంతవరకు సమ్మతితోను, కొంత బలప్రయోగంతోను అన్యాయ్యంగా లాభాలు సంపాదించి శిక్షపడకుండా నేను తప్పించుకోవాలి. అయినా దేవతలను వంచించలేము, మెడలువిరిచి వారిని ఒప్పించలేమని ఉద్ఘోషించే స్వరమొకటి నాకు వినబడుతూనే ఉన్నది. మరి

దేవతలనబడేవారు లేకపోతేనో? కాక వారికి మానవులజోలి పట్టక పోతేనో? ఇందులో ఏది సిద్ధాంతమైనా రహస్యగోపనమందు జాగృతి వహించాలా? దేవతలున్నారు, వారు మనసంగతి పట్టించుకొంటారు అన్నా వారిసంగతి మనకు సంప్రదాయైకవేద్యం. కవులభివర్ణించిన వంశానుక్రమణికలనుబట్టి మాత్రమే వారిసంగతి మనకు తెలుస్తుంది. ఈ జ్ఞానము కలిగిస్తున్న కవులు గూడ బలులతో ప్రార్థనలతో ఆహుతులతో వారి మనస్సులు మార్చ వచ్చునంటున్నారు. ఈ రెంటిని మనం నమ్మాలి, లేదా మానివేయాలి. కవులవర్ణనం యథార్థమైతే మనం అన్యాయపరులమై దానివల్ల సంపాదించిన దానితో దేవబలులర్పించటం మేలు. ఎందుకంటే మనం న్యాయపరులమైతే దేవతలు ఆగ్రహించక పోవచ్చును. కాని అన్యాయంవల్ల వచ్చేలాభాలు కోల్పోతాము. మరి అన్యాయవంతులమైతే వచ్చేలాభాలను దక్కించుకొని ప్రార్థనలతో దేవతలను సంతుష్టులను చేసి శిక్షనుంచి తప్పించుకోవచ్చును. అయితే ఈ లోకంలో మనం చేసిన పాపకార్యాలకు పరలోకంలో (అధోలోకంలో) మనం కాని మన సంతతి కాని ప్రతిఫలం అనుభవించవలసి ఉంటుందని అనవచ్చును. నిజమే కాని ప్రాయశ్చిత్తకర్మలు క్షమాదాతలైన దేవతలూ ఉన్నారు. వీరికి మహత్తరశక్తి ఉన్నది గదా అన్నభావం కలుగుతుంది. ఈభావాన్నే మహారాజ్యాలు ఉద్ఘోషిస్తున్నవి. దేవతలకు అనుగుబిడ్డలైన కవులూ, ప్రవక్తలూ ఇట్టి ఆప్తోపదేశమే చేస్తున్నారు. అన్యాయవంతులమైనా న్యాయవంతులమైనట్లు కనిపిస్తే చాలు. ఇహలోకంలోను పరలోకంలోను ఇటు మానవుల అనుగ్రహం అటు దేవతల అనుగ్రహం సంపాదించవచ్చునని అత్యధికసంఖ్యాకులంటున్నారు. ప్రామాణికులైన విద్వాంసులు ఉద్ఘోషిస్తున్నారు. ఇలా చెపుతున్నప్పుడు ఏ సూత్రాన్ని పురస్కరించుకొని హీనతమమైన అన్యాయాన్ని పరిహరించి న్యాయాన్ని వరించాలి? ఇదంతా తెలిసి ప్రతిభ, వ్యక్తిత్వం, పదవి, సంపత్తి ఉన్న ఏ మానవుడు న్యాయాన్ని గౌరవించటానికి ఇష్టపడతాడు, సోక్రటిస్? నిజానికి న్యాయం ఇంతది అంతది అని సంకీర్తనం చేస్తుంటే అతడు నవ్వును ఎలా ఆపుకోగలుగుతాడు? ఒకవేళ నా మాటలు యథార్థాలు కావని నిరూపించగలిగి న్యాయం ఉత్తమమైనదని సంతృప్తి పొందేవాడు ఎవడైనా ఉంటాడేపోండి, అతడు అన్యాయవంతులకు అలుగడు. అట్టివారిని క్షమించటానికి సిద్ధపడతాడు. ఎందువల్లనంటే మానవులు కావలెనని కోరి అన్యాయపరులు కావటం లేదు. అన్యాయమందు దైవదత్తమైన ద్వేషం ఉంటేతప్ప సత్యమైన జ్ఞానం

లభిస్తేతప్ప ఎవడూ న్యాయం అనుష్ఠించలేడని గ్రహిస్తాడు. భీరుత్వం వల్లనో, వయోదౌర్బల్యంవల్లనో, వేరొకదుర్బలతవల్లనో అన్యాయపరుడై ప్రవర్తింపజాలనివాడే అన్యాయాన్ని నిందిస్తాడు. అధికారం సంప్రాప్తించినప్పుడు అతడు కూడ సాధ్యపడినంతవరకు అన్యాయపరుడు అవుతున్నాడు. కాబట్టి నాచెప్పిన అర్థం రుజువవుతున్నది.

సోక్రటిస్, ఈ దీర్ఘచర్చకు కారణం ఒకటే, మొదటనే అన్నయ్య నేను మనవి చేసికొన్నాము. ఐతిహాసికపురుషులనుంచి సమకాలికులవరకు న్యాయపక్షపాత్రులులలో ఒకరు కూడ కీర్తిగౌరవలాభప్రమేయతను ఆవలఉంచి కేవలంగా అన్యాయాన్ని దూషించినవారు గాని న్యాయాన్ని శ్లాఘించినవారు గాని లేరు. దీనితో మేము ఎంత విస్మయచకితుల మయ్యామో వాదప్రారంభంలోనే చెప్పాము. పద్యంలో గాని గద్యంలో గాని న్యాయంవల్లనేమి, అన్యాయంవల్లనేమి ఆత్మనధిష్ఠించే యథార్థ ప్రధానస్వభావాన్ని ఎవరూ సరిగా వర్ణించలేదు.(ఈ స్వభావం దేవతలకు గాని మానవమాత్రులకు గాని గోచరించక పోవచ్చును. అది వేరేసంగతి.) మానవాత్మగత విషయాలన్నిటిలో న్యాయం ఉత్తమోత్తమమని, అన్యాయం ఘోరతమ అనర్థకమని ఒకరూ నిరూపించలేదు. "న్యాయం ఉత్తమోత్తమం అన్యాయం అధమాధమం" అన్నభావం విశ్వవ్యాప్తమైతే, చిన్నతనంనుంచి మాకు దీనిని బోధించి నమ్మించి ఉన్నట్లయితే అన్యాయ పరిహరణార్థమై ఒండొరులపై కాపలా కాయవలసిన అవసరం ఉండేది కాదు. అన్యాయం చేస్తే ఘోరతమ అనర్థకం వచ్చి చుట్టుకొంటుందన్న భయంతో ప్రతివాడు తనపైతాను కాపుండేవాడు. మొత్తమ్మీద న్యాయాన్యాయాలను గూర్చి థ్రాసిమాకస్ కాని ఇతరులు కాని వ్యక్తం చేస్తున్న అభిప్రాయం ఇది. మరి నా యభిప్రాయం చెప్పాలంటే ఇది సత్యదూరం. అయితే సిద్ధాంతం మీవల్ల విందామన్న కుతూహలంకొద్దీ పూర్వపక్షం యథాశక్తిని అనువదించాను. అన్యాయంకంటె న్యాయమెలా గొప్పదో చెప్పటమే కాక న్యాయాన్యాయవంతులకు వాటివల్ల కలిగేఫలాలను మీరు విశదీకరించాలి. ఎలా ఒకటి కళ్యాణప్రదమై రెండవది దుర్దమానర్థకమాతుందో మీరు చెప్పాలని కోరుతున్నాను. గ్లాకన్ అర్థించినట్లు న్యాయాన్యాయాలను గూర్చి లోకులకున్న భావాలను ఆవల ఉంచండి. వాటిని గూర్చి వెలువడిన అన్యథాఖ్యాతిని పరిహరించి సఖ్యాతిని చేర్కొనకపోతే న్యాయాన్యాయాభాసాల దూషణభూషణలే మీ తాత్పర్యం కాని, తత్త్వనిరూపణం మీ తాత్పర్యం కాదని భావించవలసి వస్తుంది. ఈ పక్షంలో థ్రాసిమాకస్ చెప్పినట్లుగా అన్యాయం ఆచరిస్తూ

పట్టుపడకుండా ఉండాలని మీరు కూడ ఉపదేశిస్తున్నారని అనుకోవలసి వస్తుంది. "అన్యునకెవనికో లాభం కలిగించేదే న్యాయం, బలవంతునకు లాభకరమైనదే న్యాయం. తనకు లాభకరమై దుర్బలునకు నష్టదాయకమైనది న్యాయం," అన్న థ్రాసిమాకస్ మతంతో మీరు ఏకీభవిస్తున్నారని భావించవలసి వస్తుంది. "న్యాయం ఉత్తమోత్తమ కోటికి చెందినది. ప్రయోజనదృష్టితోనే కాక, దృష్టిశ్రవణజ్ఞానారోగ్యాలవలెనే అది స్వతఃకామ్య"మని మీరు అంగీకరించారు. కాబట్టి న్యాయసంకీర్తన సందర్భంలో మీరు ఒకఅంశాన్ని ప్రధానంగా పాటించాలని కోరుతున్నాను. న్యాయాన్యాయాలు అనుష్ఠాతలకు ముఖ్యంగా కలిగించే మేలుకీళ్ళను మీరు స్పష్టంగా వివరించాలి. న్యాయాన్యాయాలవల్ల కలిగే గౌరవాగౌరవాదికాన్ని ఇతరులు కొండంతలుచేసి భూషణదూషణలు కావిస్తే కావించనీయండి. అదొక వాదపద్ధతి. వారలా వాదిస్తే క్షంతవ్యమే కాని మీరు మాత్రం అలా చేయరని ఆశిస్తున్నాను. ఈ ప్రశ్నకు సమాధానం అర్థించి జీవితమంతా వెచ్చించి కృషిచేస్తున్న మీనుండి ఇంతకంటె ఉత్తమమైన సమాధానం వస్తుందని ఆసపడుతున్నాను. కాబట్టి అన్యాయంకంటె న్యాయం మేలని మాత్రమే కాక న్యాయాన్యాయాలు దేవమానవులకు కనిపించినా కనిపించకపోయినా అనుష్ఠాతలకు క్రమంగా మేలుకీళ్ళు కలిగిస్తవని కూడ మీరు నిరూపించాలి.

మొదటినుంచి గ్లాకన్, యాడైమాంటస్‌ల తెలివితేటలందు నాకు గౌరవముండేది. పైమాటలకు సంతోషించి అన్నాను. "మెగారాయుద్ధంలో కీర్తిగడించినప్పుడు గ్లాకన్ భక్తుడు వీరగీతాలతో మిమ్ము శ్లాఘిస్తూ 'అరిస్టాన్ కుమారులారా! ప్రఖ్యాత వీర తేజఃప్రసూతులారా!' అని కదా సంబోధించింది! అవును ఆ ఎత్తుగడ అనుచితం కాదు. అన్యాయం గొప్పదని ఇంత సమర్థతతో వాదిస్తూ కూడ మీ ఉపపత్తులు మీకే సంతృప్తి కలిగించకపోవటంలో ఒకానొక దివ్యత్వం గోచరిస్తున్నది. కేవలం మీ ప్రసంగాన్నిబట్టి చూస్తే మిమ్ము అనుమానించ వలసివచ్చేది. కాని మీ స్వభావం నాకు తెలుసు. మీ వాదంలో మీకే నమ్మకం లేదు. అయితే మీయందు విశ్వాసం పెరుగుతున్నకొలది మీకు ఏమి సమాధానం చెప్పాలో తోచటం లేదు. నిజంగా ఇప్పుడు సందిగ్ధావస్థలో పడ్డాను. కర్తవ్యసామర్థ్యం నాకు లేదని తెలుసు. అయితే అన్యాయంకంటె న్యాయం గొప్పదని థ్రాసిమాకస్‌కు రుజువుపరచానని అనుకొన్నాను. కాని ఆ సమాధానంతో మీకు సంతృప్తి కలుగలేదు. కాబట్టి నా అసమ

ర్థత నాకిప్పుడు స్పష్టంగా గోచరిస్తున్నది. అయినా న్యాయవిషయంలో నోటపలుకు, ముక్కున ఊపిరి ఉండగా నేను సహాయం నిరాకరించలేను. న్యాయం దూషణకు పాల్పడుతుంటే చెవులార వింటూ ఉపేక్షించటం మహాపాతకం. కాబట్టి చేతనైనంతవరకు తోడ్పడటం నా కర్తవ్యం.

ఆ ప్రశ్నను త్రోసిపుచ్చక ప్రత్యుత్తరం మీరు తప్పక అన్వేషించాలని గ్లాకనూ తక్కినవారు నన్ను ప్రార్థించారు. ముందు న్యాయాన్యాయాల స్వరూపం తేల్చి ఆ పిమ్మట వాటిప్రయోజనాలను నిర్ధరించండని వారు కోరారు. ఆ పక్షంలో విచారం సునిశితంగా సాగించాలి. దానికి సూక్ష్మేక్షిక అవసరమని నాకున్న అభిప్రాయం వారికి చెప్పాను. మనం నిశితబుద్ధులం కాము. కాబట్టి చెప్పబోతున్న మార్గమే తేలిక. 'చిన్న అక్షరాలను దూరంనుంచి చదువు,' అని మందదృష్టిని ఒకానొకడు అడిగాడనుకొందాము. విశాలప్రదేశంలో పెద్దఅక్షరాలతో అదే విషయం మరొకచోట చూడవచ్చునని వేరొకనికి తోచిందేపో. అక్షరాలు ఒకటే అయి ముందు పెద్దక్షరాలు చదివినతరువాత చిన్నక్షరాలను చదవటానికి వీలు చిక్కిందనుకో. ఈ అవకాశం అదృష్టమే కదా?" అని నేను అన్నాను.

"నిజమే, కాని ఈ దృష్టాంతం ప్రకృతవిచారానికి ఎలా తోడ్పడుతుంది?" యాడైమాంటస్ ప్రశ్నించాడు.

ఎలాగో చెబుతా. న్యాయం ఒకప్పుడు వ్యక్తిగుణమనీ, మరొకప్పుడు రాజ్య (సమాజ) గుణమనీ పేర్కొనబడుతున్నది కదా?

అవును.

మరి వ్యక్తికంటె రాజ్యం పెద్దది కదా?

నిజమే.

అలాంటప్పుడు పెద్దవస్తువులలో న్యాయపరిమాణం పెద్దదై సుగ్రాహ్యమవుతుంది. కాబట్టి రాజ్యంలో గోచరించే న్యాయాన్యాయాల స్వభావం ముందు పరిశీలించి ఆ తరువాత వ్యక్తియందు గోచరించేవానితత్త్వం పరిశీ

లింతాము ఈ విధంగా పెద్దవాటినుంచి చిన్నవాటికి వచ్చి తరువాత వాటిని తావిళ్ళు వేదాము.

ఈ సూచన బాగుందని అతడన్నాడు.

రాజ్యం ఎలా ఉద్భవిస్తున్నదో చూస్తే న్యాయాన్యాయాలు ఎలా అవతరిస్తున్నవో గ్రహించవచ్చును.

అవును.

రాజ్యనిర్మితి పూర్తి అయితే ప్రకృతలక్ష్యం తేలికగా సిద్ధిస్తుంది గదా?

నిజమే.

కాబట్టి మనం రాజ్యనిర్మితికి ప్రయత్నించాలి. మరి ఇలాంటిపనికి లోతు ఆలోచించక దిగరాదు.

అయితే అలాగే కానివ్వండని యాడైమాంటస్ అన్నాడు.

“మానవజాతి అవసరాలనుబట్టి రాజ్యం ఏర్పడుతుందనుకొంటాను. ఏ మానవుడూ స్వయంసంపూర్ణుడు కాడు. మన అందరకు ఎన్నో అవసరాలు, వాంఛితాలు ఉంటవి. రాజ్యావతరణకు ఇదే కారణం. కాక మరొక హేతువేదైన ఉన్నదా?” నేను ప్రశ్నించాను.

లేదు.

మనకు అనేకవాంఛితాలు, అవసరాలు ఉన్నవి. వాటిని తీర్చటానికి వ్యక్తులనేకులు ఉండాలి. ఒకప్రయోజనానికి ఒకరిసాయం, మరొక ప్రయోజనానికి మరొకరిసాయం స్వీకరిస్తాము. ఈ భాగస్వాములు, సహాయులు ఒకేప్రాంతంలో వ్యవస్థీకృతులైనపుడు, తత్ప్రాంతవాసుల సంఘం రాజ్యమనబడుతున్నది.

అతడవునన్నాడు.

ఒండొరులకు ఇచ్చిపుచ్చుకోలు జరుగుతుంది. ఒకడు ఇస్తే మరొకడు పుచ్చుకొంటాడు. ఇలాంటి వినిమయం తమకు లాభమని ప్రజలు సాగిస్తారు.

అక్షరాల నిజం.

అయితే భావమాత్రమైన రాజ్యాన్ని సృజిద్దాము. దేనికైనా ఆవశ్యకతే కదా సృష్టికర్త?

సహజంగా అంతే.

అవసరాలన్నిటిలో మొట్టమొదటిదీ ముఖ్యమైనదీ తిండి. తిండి మనుగడకు మూలం.

నిశ్చితంగా అంతే.

రెండవ అవసరం నివాసం. మూడవది వస్త్రాదికం.

అవును.

మనరాజ్యం ఈ ప్రబలవాంఛితాన్ని ఎలా తీర్చుకొంటుందో ఇప్పుడు పరిశీలింతాము. ఒకడు కర్షకుడు, ఇంకొకడు వాస్తుశిల్పి, వేరొకడు నేతగాడు. వీరికి తోడు చర్మకారుని గాని లేక శారీరకవాంఛను తీర్చే మరొక వృత్తిపరుని కాని చేరుద్దామా?

చేర్చటం అవసరం.

ఇంతకూ ఎంత కాదనుకొన్నా రాజ్యమన్నప్పుడు నలుగురైదుగురు మనుజులన్నా ఉండాలి.

అవును, ఉండాలి.

మరి వారివృత్తి ఎలా సాగుతుంది? ప్రతివాడు తన కృషిఫలం ఉమ్మడి

పొత్తుతో కలుపుతాడా? పోలికడే ఉన్నాడనుకో. అతడు తమ నలుగు రికి చాలినంతతిండి సమకూర్చటానికి నాలుగురెట్లు పాటుపడతాడా? లేక ఇతరులతో ప్రమేయం పెట్టుకొనక వారికి వలసినధాన్యం పండించక కేవలం తనకు కావలసినంతవరకే నాలుగోవంతు కృషి నాలుగోవంతు కాలంలో చేసి తక్కిన ముప్పాతిక కాలం గృహమో, వస్త్రాలో, పాద రక్షలో నిర్మించుకొంటూ ఇతరులతో పొత్తులేక తన అవసరాలు మాత్రమే గడపుకొంటాడా?

పంట పండించటమే అతని లక్ష్యం కావాలి గాని, ప్రతిదాని ఉత్పత్తి కోసం అతడు ప్రాకులాడరాదని యాడైమాంటస్ అన్నాడు.

అవును. అదే లెస్స. నీవు ఇలా అంటున్నప్పుడు నాకు మరొకటి జ్ఞప్తికి వస్తున్నది. మనమంతా ఒకేతీరున లేము. భిన్నవృత్తులకు యోగ్యమైన భిన్నస్వభావాలు మనకున్నవి.

అవును.

కార్మికుడు తనపనిని ఎప్పుడు చక్కగా చేస్తాడు? అనేక వృత్తులున్న ప్పుడా? ఏకవృత్తి ఉన్నప్పుడా?

ఏకవృత్తి ఉన్నప్పుడే.

పైగా తరుణంలో చేయకపోతే పనిచెడుతుంది కదా?

అవును.

ఒకపని జరగాలనుకో. అది చేసేవానికి తీరుబడి అయ్యేదాక కాచుకొని ఉండదు గదా? అందువల్ల తాను చేస్తున్నపని తనకు ప్రధానలక్ష్యం కావాలి.

అవును.

తన స్వభావానికి అనుగుణమైనవృత్తి చేబట్టి ఇతరం మాని పాటుపడి

నప్పుడు ఎల్లవస్తువులు సమృద్ధంగా సులువుగా ఉత్పన్నమౌతవి. మిన్నగా కూడ ఉంటవి.

నిజంగా అంతే.

అలాంటప్పుడు రాజ్యానికి నలుగురు కాదు, పెక్కురుకావాలి. ఎందుకంటే రైతు తనకు కావలసిన నాగలి, పలుగు, పార మున్నైనకొరముట్లు తాను చేసికోడు. వాస్తుశిల్పికి ఎన్నో కొరముట్లు అవసరం. అతడే వాటిని తయారుచేసికోడు. అలాగే నేతగాడు, చర్మకారుడు.

అవును.

అలాంటప్పుడు వడ్రంగులు, కమ్మరులు, ఇంకా అనేకవృత్తులవారు మన చిన్నరాజ్యంలో పొత్తుకలుస్తారు. వీరంతా చేరగానే మనరాజ్యం విస్తరిల్లుతున్నది.

విస్తరిల్లక తప్పదు.

మనరైతులు దుక్కిదున్నాలంటే ఎడ్లు కావాలి. వాస్తుశిల్పులకు ఇటుకమున్నైనవి చేరవేయటానికి భారవాహకజంతువులు అవసరం. నేతగాండ్రకు ఉన్ని, చర్మకారులకు తోళ్ళు అవసరం. వీటికోసం ఆలకాపర్లను, గొర్రెలకాపర్లను, ఇతరపశుపాలకులను చేరుద్దాము. ఇలా చేర్చినా మనరాజ్యం అంతవిస్తృతం కాదు.

నిజమే. కాని వీరంతా ఉన్నప్పుడు అది అంత చిన్నరాజ్యం కూడ కాదు.

అది అలాఉండగా ఏవస్తువూ దిగుమతి చేసికోవలసినఅవసరం కలుగని చోట నగరం నిర్మింతామంటే అలాంటిచోటు దొరకదు.

అవును దుర్లభమే.

అలాంటప్పుడు వలసినవస్తువులను మరొకనగరంనుంచి మనరాజ్యానికి చేరవేసేవర్గం మరొకటి ఉండాలి కదా?

ఉండక తప్పదు.

వస్తువులు సరఫరా చేసేవారికి వలసినవి కొనిపోక వణిజుడు వట్టిచేతులతో వెళ్ళితే, వట్టిచేతులతోనే తిరిగిరావలసి ఉంటుంది.

అవును.

కాబట్టి మనదేశంలో ఉత్పన్నమయ్యేసరకు మనవారికే కాదు, మనవారి అవసరాలు తీర్చేవారికి కూడ చాలినంత గుణపరిమాణాలు కలిగి ఉండాలి.

అవును.లేకపోతే బండి నడవదు.

అలాంటప్పుడు రైతులు, శిల్పులు, ఇతర నాగరకులు దండిగా ఉండాలి.

అవును.

మరి వణిజులన్నాము. వారు కూడ అవసరమని వేరే చెప్పనక్కరలేదు కదా ?

లేదు.

మరి సరకులు సముద్రం దాటించాలంటే నిపుణులైన నావికులు కూడ అధికసంఖ్యాకులు అవసరమవుతారు గదా ?

అవును. తగినంతమంది ఉండాలి.

మరి రాజ్యంలో పౌరులు తమసరకుల ఇచ్చిపుచ్చుకోలు ఎలా సాగిస్తారు?

పౌరులను సమాజంగా ఏర్పరచి రాజ్యాన్ని నిర్మించినపుడు మన ప్రధాన లక్ష్యాలలో ఈ ఇచ్చిపుచ్చుకోలు ఒకటని గుర్తున్నదా ?

లేకేమి ? ఉన్నది

అలాంటప్పుడు వారికి విపణి (మార్కెట్టు) క్రయవిక్రయార్థం ద్రవ్యమూ కావాలి.

అవును

కర్షకుడో, శిల్పో తనసరకు విపణికి తెస్తాడనుకొందాము. అతడు వచ్చినప్పుడు వినిమయక్రియానిర్వహణార్థం ఎవరూ ఉండరేమో. అప్పుడతడు తనవృత్తి మానుకొని విపణిలో చేతులు ముడుచుకొని కూర్చోవాలి కదా?
అక్కరలేదు. అతని అవసర మెఱిగిన విక్రేతలు అతనికక్కడ లభిస్తారు. చక్కగా వ్యవస్థితమైన రాజ్యంలో దేహదార్ఢ్యం లేక బలహీనులై ఇతర వృత్తికి దేనికి యోగ్యులు కానివారు సామాన్యంగా ఉంటారు. బస్తీకాపురం వారి విధి. అమ్మగోరేవారిసరకు ధనమిచ్చి కొని, కొనదలచుకొన్నవారికి దానినమ్మి ధనం పుచ్చుకొనటం వారి కర్తవ్యం.
ఈ విధంగా మనరాజ్యంలో చిల్లరవర్తకుల వర్గం ఏర్పడుతుంది. బస్తీలో ఉండి క్రయవిక్రయనిమగ్నులైనవారిని నైగములని, ఒకపట్టణంనుంచి మరొకపట్టణానికి క్రయవిక్రయార్థం పోయేవారిని వైదేహకులని కదా అంటాము?
వీరేకాక సేవకవర్గం మరొకటి ఉంది. ఉత్తమసహచరులకుండదగిన బుద్ధివిశేషం వీరికి ఉండదు. కాని కష్టపడి పనిచేయటానికి సమృద్ధిగా శారీరకబలం వీరికి ఉంటుంది. ఈ బలాన్ని వీరు అమ్ముకొని జీవిస్తారు. ఇలాంటివారిని భుజిష్యులని కదా అంటారు? వేతనం భుజించటంచేత వారికాపేరు వచ్చింది.

అవును.

మరి వీరితో మనకు ప్రజానీకం ఏర్పడుతుంది.

నిజమే.

యాడైమాంటస్! ఇప్పుడు మనరాజ్యం సమగ్రమైనట్లే కదా?

అయినదనే నా అభిప్రాయం.

ఇంతకూ న్యాయమెక్కడ ఉన్నది? అన్యాయమెక్కడ ఉన్నది? రాజ్యంలో ఏ భాగమందు అవి ఉత్పన్నమవుతున్నవి?

బహుశః పౌరుల పరస్పరవ్యవహారాలలోనే ఉద్భవించాలి. మరొకచోట ఉప్పతిల్లేఅవకాశం ఉన్నదనుకోను.

నీసూచన యథార్థం. ఇప్పుడు వెనుదీయక విషయం సాకల్యంగా ఆలోచింతాము.

మనరాజ్యం ఇప్పుడు ప్రజలతో నిండి కొలకొలమంటున్నది. ముందు వారి జీవితపద్ధతి ఎలాఉంటుందో చూదాము. ధాన్యాలు, ఆసవాలు, వస్త్రాలు, పాదుకలు ఉత్పాదించి వారు ఇళ్ళుకట్టుకోరా? ఇళ్ళువాకిళ్ళు ఏర్పడ్డతరువాత వేసవిలో వస్త్రవిరహితులై నగ్నపాదులై పాటుపడతారు. చలికాలంలో ఉడుపులు తాల్చి పాదుకాసహితులై కృషిచేస్తారు. యవలతిండితో బ్రతుకుతారు. గోధుమపిండి పిసికి రొట్టెలు 'కేకులు' తయారుచేస్తారు వాటిని ఆకులలోనో, దొన్నెలలోనో వడ్డించుకొంటారు. దారుకాసనాల మీదనో, వేత్రాసనాలమీదనో కూర్చుండి భుజిస్తారు. వారు కుటుంబ సమేతులై స్వయంగా తయారుచేసికొన్న ఆసవాలను సేవిస్తూ పుష్పమాలాలంకృతశిరస్కులై దేవతాసంకీర్తనం చేస్తూ సుఖగోష్ఠి జరుపుతూ విందులు గుడుస్తారు. దారిద్ర్యసంగ్రామప్రమాదాలను గుర్తించి తమ కుటుంబాలను ఆయాన్ని మించనీక జాగ్రత్తపడతారు.

ఇంతకూ వారిభోజనాలలో వ్యంజనాలు లేవే! అని మధ్యలో గ్లాకన్ అడ్డుతగిలాడు.

నిజమే మరచిపోయాను. భోజనంలో వ్యంజనాలు ఉండాలి. ఉప్పు, నేయి, పెరుగు, కూరలు, దుంపలు కావాలి. ఎడారిప్రాంతంవారికి అత్తిపండ్లు, బఠానీలు, చిక్కుళ్ళు ఇద్దాము. మితంగా మద్యం సేవిస్తూ ఖాద్యబీజాలు నిప్పుల్లో కాల్చుకొంటారు. అలాంటి తిండితో నిండుముదిమి నెక్కేదాక రోగం రొప్పు లేక సుఖంగా జీవిస్తారని భావించవచ్చును. అట్టి జీవితమే వారు తమ సంతతికి గూడ సంక్రమింపజేస్తారు.

పశువులరాజ్యం నిర్మించ దలచుకొంటే అంతకన్నా మరేమి అక్కర లేదు.

“ఇంతకు నీవు ఏమి కావాలంటావు, గ్లాకన్ ?” నేను ప్రశ్నించాను.

ఏమున్నది? సామాన్యజీవితసౌకర్యాలైనా కల్పించాలి. సుఖాపేక్షకులైన ప్రజలకు తాళువారాలు (సోఫాలు), కూర్చుండి భుజించటానికి అనువుగ బల్లలు కావాలి. రుచికరపదార్థాలు,మధురపదార్థాలు వాంఛిస్తారు.

ఆ! ఇప్పుడు బోధపడింది. ఇంతకూ సామాన్యరాజ్యం కాక భోగభాగ్యలతో తులతూగే రాజ్యం ఎలా ఏర్పడుతుందో చూడమంటావు. రాజ్యసృష్టి జరిగిపోయింది. అయినా దీనితో మునిగిపోయింది లేదు. పైగా ఈ రాజ్యంలో న్యాయాన్యాయాలు ఎలా ఉద్భవిస్తవో చూడటానికి అవకాశాలు మెండు. నేను వర్ణించిన రాజ్యమే ఉత్తమరాజ్యాంగసమన్వితం. అయినా భోగోత్కటమైన రాజ్యం కూడ చూడాలంటే నాకు అభ్యంతరం లేదు. చాలమందికి నిరాడంబరజీవితం సంతృప్తి కలిగించదు. తాళువారాలు, బల్లలు, ఇతరగృహోపకరణాలు వారు చేర్చాలంటారు. దివ్యభక్ష్యాలు, పరిమళాలు, అగురులు, వేశ్యలు, మధురభక్ష్యాలు ఏకరీతివి కాక నానాభంగులుగా, నానాజాతులుగా ఉండాలంటారు. అప్పుడు ఇంతకుముందు నేనుపేర్కొన్న ఇళ్ళు, బట్టలు, చెప్పులు వంటి అవసరాలను అధిగమించిపోవాలి. చిత్రలేఖకాలంకరిష్ణుల కళలు కొనలు సాగాలి. దంతసువర్ణాది నానావిధద్రవ్యాలు సంపాదించాలి.

అవును.

ఆ పక్షంలో మనరాజ్యం సరిహద్దులు పెంచాలి. ఉత్తమమైన మన మొదటిరాజ్యం ఏమాత్రం చాలదు. ప్రకృతిసిద్ధవాంఛాపూర్తికి అవసరంకాని అనేకవృత్తులతో రాజ్యం నిండి నిబిడీకృతం కావలసివస్తుంది. వేటగాండ్రు, నటకులు తండోపతండాలుగా కావలసివస్తారు. ఆకారరూపపరిష్కారానికి ప్రత్యేకంగా ఒక తెగ ఉండవలసివస్తుంది. సంగీతసాహిత్యోపాసకజాతి మరొకటి ఉండాలి. కవులు, నాటకకర్తలు, నటులు, నర్తకులు, రూపకప్రయోజకులు, మహిళావస్తుసమేతంగా విభిన్న వస్తువులను తయారుచేసేవారూ కావాలి. బోధకులు, దాదులు, పరిచారికలు, మంగళ్ళు, సూదకులు అవసరం కారా? మన మొదటిరాజ్యంలో వరాహపాలకులను అవసరం లేదని విడిచిపుచ్చాము. ఇప్పుడు వారు అవసరం కాదా? పైగా ప్రజలు వివిధమాంసభోజనులైనప్పుడు ఇతర

జంతుజాతులెన్నో కావాలి.

అవును.

ఇలా జీవిస్తున్నప్పుడు మునుపటికంటె వైద్యుల అవశ్యకత కూడ అధికమే కదా ?

అవును, అది కూడ పెరుగుతుంది.

ప్రాథమికవాసులను పోషించజాలినదేశం ఇప్పుడు స్వల్పమై అందుకు చాలనిది అవుతుంది.

అవును.

పసి మేతకు, ప్రజల తిండికి ఇరుగుపొరుగుల భూమి కొంత మనకు అగత్యమవుతుంది. మనవలె వారి అవసరాలు కూడ మేరమీరితే, అంగరంగ వైభవం అనుభవించాలంటే మనభూమి వారికి కొంత కావలసివస్తుంది.

సోక్రటిస్ ! అది ఎటూ తప్పదు.

అయితే మనం యుద్ధానికి దిగవలసి ఉంటుంది, గ్లాకన్ !

గత్యంతరం లేదు.

యుద్ధంవల్ల మేలా కీడా అన్నసంగతి అటుంచు. యుద్ధాలకు, రాజ్యంలోని సర్వానర్థాలకు మూలకారణం కనుగొన్నాము. మన రాజ్యం మరొకసారి విస్తరిల్లాలి. అంటే ఒకమహాసైన్యం కావాలి. మనకున్నదానిపై దండెత్తి వచ్చినవారిని ఇది ఎదుర్కొని పోరాడాలి. అంతే కాదు. ఇంతకుముందు మనం వర్ణించిన వస్తువులకోసం, వ్యక్తుల రక్షణకోసం యుద్ధం చేయాలి.

"సైన్యం దేనికి? ఉన్న ప్రజాకోటి తన్ను తాను రక్షించుకో లేదా?" అతడు ప్రశ్నించాడు.

అంత నేనన్నా: లేదు రాజ్యనిర్మితికి ఉపక్రమించినప్పుడు మనమంతా ఒకసూత్రం పాటించాము. అదే నిజమైతే ఆత్మరక్షణ ప్రజకు సాధ్యం కాదు. ఒకేవ్యక్తి పెక్కువృత్తులను జయప్రదంగా నిర్వర్తించలేడన్నాము. గుర్తున్నదా?

లేకేమి? ఉన్నది.

మరి యుద్ధకర్మ వృత్తి కాదా?

ఎలా కాకపోతుంది?

పాదుకాశిల్పవృత్తికి వలసినంతశ్రద్ధ యుద్ధక్రియకు అవసరం కాదా?

అవసరమే.

మనపాదుకలు చక్కగా కుట్టించుకొనటం కోసం చర్మకారుడు రైతు కారాదన్నాము; నేతకాడూ కారాదు, వాస్తుశిల్పీ కారాదని నిషేధించాము. అతడు తనవృత్తిని మాత్రమే చేయాలన్నాము. అలాగే ప్రతివానికి నిజస్వభావోచితమైన పనిమాత్రమే అప్పగించాము. యావజ్జీవం ఆ పని చేయాలి కాని మరొకపని చేపట్టరాదు. లభించిన అవకాశాలు జారవిడువకపోతే అతడు శిల్పి అవుతాడు. సైనికుని కర్తవ్యం చక్కగ నెరవేరాలి. అంతకంటె ముఖ్యం మరొకటి లేదు. ఒకడు ఏ కర్షకుడో, చర్మకారుడో, శిల్పో అయి, అటు యుద్ధవీరుడు కూడా కాగలడా? యుద్ధనైపుణి అంత సుసాధమా? చిన్ననాటినుంచి కృషి చేయక ఎప్పుడో తోచినప్పుడు ఆడేఆటగాడు ప్రపంచంలో ఎక్కడా చదరంగంలో కాని, ద్యూతక్రీడలో కాని నేర్పరి కాలేడు. ఎలాంటిపరికరాలైనా మానవుణ్ణి ప్రజ్ఞావంతుని చేయలేవు. దక్షాదక్షుని కావించలేవు. పరికరప్రయోగం అభ్యసించనివానికీ, ఎన్నడూ వాటియందు శ్రద్ధ వహించనివానికీ పరికరాలు నిరుపయోగాలు. ఖడ్గమో మరొక ఆయుధమో పట్టుకొన్నంతమాత్రాన ఒకరోజులోనే అతడు శూరుడు కాడు.

"అవును, మానవులకు స్వప్రయోగం నేర్పే పరికరాలు లేవు.ఉంటేనా!" అతడు నిట్టూర్చాడు.

మరి రక్షకుని (గార్డియన్) విధులు ఎంత ఉదాత్తాలు అయితే, అతనికి అంత అధికంగా విశ్రాంతి, ప్రజ్ఞ, అభ్యాసం అవసరం కాదా?

నిస్సందేహంగా.

వృత్తికి తగినస్వభావం అతనికి ఉండనక్కరలేదా?

నిశ్చితంగా కావాలి.

ఆ పక్షంలో నగరరక్షణకై యోగ్యప్రకృతులనే ఎన్నుకొనటం మన ధర్మంకాదా?

అవును.

అయితే ఆ ఎన్నిక అంత తేలిక కాదు. అయినా సాహసించి యథాశక్తిని ప్రయత్నింతాము.

అలాగే.

కనుగలిగి కాపాడే ఉదాత్తయువకుడు సుశిక్షితసారమేయసదృశుడు కాడా?

అంటే?

మరేమీ లేదు. శత్రువును పసికట్టి పట్టుకోవాలి. పట్టుకొని పోరాడగల బలం ఉండాలి.

అవును. ఈ గుణగణాలు ఉభయులకు అవసరమని అతడన్నాడు.

తీవ్రంగా పోరాడాలంటే రక్షకుడు ధీరుడు కావాలి కదా?

అవును.

ఉత్సాహం లేకపోతే ధీరుడు కాగలడా? (కొంచెం ఆలోచించి చూడు.)

ఆ ఉత్సాహమే లేనప్పుడు అశ్వమైనా సారమేయమైనా, మరొకజంతు వైనా ధీరంగా ఉంటుందా?

లేదు.

ఉత్సాహధీరతలు ఎంత దుర్దమాలు, ఎంత దుర్జయాలు! ఆ గుణాలున్న ఏ ప్రాణి అయినా ఎంత నిర్భయంగా అజేయంగా ఉంటుందో చూడ లేదా?

చూడకేమి? చూచా.

రక్షకునకు కావలసిన శారీరకగుణాలేవో తేలినట్లే కదా?

అవును.

మానసికగుణాలు కూడ తేలినట్లే. అతని ఆత్మ ఉత్సాహధీరతాపూర్ణం కావాలి.

అవును.

మరి ఇలాంటి ఉత్సాహపూర్ణులు ఒండొరులతోను, ఇతరులతోను కయ్యా నికి కాలుద్రవ్వరా?

చిక్కే వచ్చింది. ఈ సమస్య అంత తేలికగా పరిష్కారం కాదని అత డన్నాడు.

నిజానికి వారు శత్రువులకు భయంకరులై మిత్రులందు స్నిగ్ధులుగా ఉండాలి. లేని పక్షంలో శత్రువులు వేరుగా చంపనక్కరలేదు. తమ్ము తామే నాశనం చేసికొంటారు.

నిజంగా అలాగే జరుగుతుంది.

7)

అలాంటప్పుడు ఏమి చెయ్యాలి? ఉత్సాహోద్దీప్తిమంతుడైన సౌమ్యస్వభావుని సంపాదించటమెలా? ఈ ఉభయం పరస్పరవిరుద్ధం గదా?

నిజమే.

మరి ఈ గుణద్వయంలో ఏది లోపించినా అతడు ఉత్తమరక్షకుడు కాడు. అయితే ఈ రెంటికలయిక అసంభవంగా కనిపిస్తున్నది. కాబట్టి ఉత్తమ రక్షకుడు అసంభవమేమోననిపిస్తున్నది.

మీరు చెప్పింది యథార్థం.

అప్పుడు స్తబ్ధుడనై గతాన్ని సింహావలోకనము చేస్తూ అన్నాను:— ఇంతకు ముందు చిక్కినరూపాన్ని విస్మరించాము. కాబట్టి తికమక పడ్డాము.

అంటే?

అలాంటి విరుద్ధగుణవంతులుంటారు.

వారు ఎక్కడ లభిస్తారు?

పెంపుడుజంతువులలో అలాంటి ప్రకృతి లేకపోలేదు. ముఖ్యంగా జాగిలాన్నే చూడు. మంచిశిక్షణ పొందిన జాగిలం పరిచితులు వస్తే ఆహ్వానిస్తుంది. క్రొత్తవాడు వస్తే కొరకొరలాడుతుంది. ఇది నీకు తెలిసినవిషయమే కదా?

నిజమే.

కాబట్టి అలాంటి విరుద్ధగుణసమ్మిశ్రితుడైన రక్షకుడు ఉంటాడు. అందులో అసంభావ్యత లేదు. వైపరీత్యం అంతకన్నా లేదు.

అవును.

రక్షణయోగ్యునకు ఉత్సాహప్రకృతితోపాటు తాత్త్వికునిగుణాలు కూడ అవసరం కాదా?

మీ భావమేమో బోధపడలేదు.

నేను ప్రస్తావిస్తున్నలక్షణం జాగిలంలో స్పష్టంగా కనిపిస్తున్నది.

ఏ లక్షణమంటారు?

ఏ లక్షణమేమున్నది? జాగిలం క్రొత్తవాణ్ణి చూడగానే కుపితమై పరిచితుని చూడగానే ఆహ్వానిస్తుంది. దానికి మొదటివాడు చేసిన అపకారంలేదు; రెండవవాడు చేసిన ఉపకారంలేదు. ఇది నీకెన్నడూ విచిత్రంగా తోచలేదా?

ఎన్నడూ స్ఫురించలేదు. కాని మీరు చెప్పింది మాత్రం యథార్థం.

ఈ వాసన మాత్రం విచిత్రం. నిజంగా జాగిలం తాత్త్వికుడేనంటాను.

ఎలాగంటారు?

పరిచయాపరిచయాలనుబట్టి మిత్రామిత్రుల ముఖాలను అది గుర్తిస్తున్నది. ఈ విధంగా జ్ఞానాజ్ఞానాల ప్రమాణాలనుబట్టి యిష్టానిష్టతలను నిర్ణయించుకొంటున్నజంతువు జ్ఞానప్రణయి కాదా?

అవును.

అవగాహనప్రీతి జ్ఞానప్రణయం కాదా? మరి జ్ఞానప్రణయమే కదా తత్త్వజ్ఞానం?

అవును, ఆ రెండూ ఒకటే.

మిత్రులతోను పరిచితులతోను సౌమ్యంగాఉండే వ్యక్తి స్వభావంచేత జ్ఞానప్రణయి అని చెప్పవచ్చును గదా?

నిరభ్యంతరంగా.

నిజంగా రాజ్యానికి ఉదాత్తరక్షకుడై ఉండదగినవానిలో తాత్త్విక జ్ఞానం, ఉత్సాహం, చురుకుదనం, బలం మిళితమై ఉండాలి గదా?

తప్పక ఉండాలి.

ఇంతకూ ఇష్టప్రకృతులను కనుగొన్నాము. అయితే వారికి ఎలాంటిశిక్షణ ఇవ్వాలి? ఈ ప్రశ్నకు ఉత్తరం లభిస్తే, న్యాయాన్యాయాలకు మూల మేది? అన్నప్రశ్నకు సమాధానం లభిస్తుందని నా అనుమానం. అయితే ప్రకృతార్థమేదీ విడిచిపుచ్చటం నాకు సమ్మతం కాదు. అట్లని శాఖా చంక్రమణమూ చేయరాదు.

ఈ పరిశీలనం మాకు ఎంతగానో ఉపయోగిస్తుందని యాడైమాంటస్ అన్నాడు.

ఆ లెక్కలో కొంత శ్రమకలిగినా దీనిని వదలరాదని నేనన్నాను.

అవును.

అయితే జాగు దేనికి? ఉపక్రమింతాము. కథలో విశ్రాంతికాలం కడపుదాము. మనవీరుల విద్యాబోధనమే మనం చెప్పుకొనబోయే కథ.

అలాగే.

ఇంతకూ వారికి ఎట్టి విద్య బోధించాలి? సంప్రదాయసిద్ధంగా ఉన్నదాని కంటె మేలైనది లేదు. అది రెండుభాగాలు: ఒకటి శరీరార్థమైన వ్యాయామం, రెండు ఆత్మార్థమైన సంగీతం.

అవును.

విద్యాబోధనం సంగీతంతో ప్రారంభించి ఆతరువాత వ్యాయామానికి వెళ్ళుదామా?

అలాగే.

సంగీతమన్నప్పుడు దానిలో సాహిత్యాన్ని కూడ చేరుస్తారా, లేదా?

చేర్చకేమి? తప్పక చేరుస్తాము.

మరి సాహిత్యమంటే యథార్థసాహిత్యము, అయథార్థసాహిత్యము కావచ్చును గదా?

అవును.

పిల్లలకు ద్వివిధసాహిత్యం బోధించాలి కాబట్టి ముందు అయథార్థ సాహిత్యబోధనంతో ప్రారంభింతామా?

మీ భావమేమో బోధపడ లేదని అతడన్నాడు.

కేవలం అసత్యాలు కాకపోయినా ప్రధానంగా కాల్పనికాలైనకథలతో బాలవిద్యాబోధనం ప్రారంభిస్తాము. వ్యాయామాభ్యాసానికి తగిన వయసురాని పిల్లలకు ఈ కథలను చెబుతాము.

అవును.

వ్యాయామాభ్యాసానికి పూర్వం సంగీతం బోధించాలన్నప్పుడు నా తాత్పర్యమిదే.

అలాగైతే సరే.

ఏపనికైనా ఆరంభదశ అత్యంతముఖ్యం. అందులోనూ పిన్నలై పూప ప్రాయంలో ఉన్నప్పుడు ఎంత ముఖ్యమో చెప్పాలా? ఆ తరుణంలోనే శీలం నిర్దిష్టరూపం పొందుతుంది. ఇష్టసంస్కారం అప్పుడే తేలికగా అలవడుతుంది.

అవును.

ప్రాలుమాలి వివేకరహితంగా ఏ కథలైనా ఏవ్యక్తులనుంచి అయినా పిల్లలను విననీయవచ్చునా? పెరిగి పెద్దవారైనప్పుడు ఏ బుద్ధులు, ఏ గుణాలు, ఏ భావాలు వారికి ఉండాలనుకొంటామో వాటికి దరిదాపు విపరీతాలైనవాటిని గ్రహింపనీయవచ్చునా?

అదెంతమాత్రం తగదు.

ఆ పక్షంలో కాల్పనికరచయితలపై ఆంక్ష విధించటం ప్రథమకర్తవ్యం. పర్యవేక్షకులు సత్కాల్పనలను స్వీకరించి అసత్కాల్పనలను త్రోసివేయాలి. వారు ఆమోదించినవాటినే తల్లులు దాదులు పిల్లలకు చెప్పాలని కోరాలి. అలాంటి కథలతో గాత్రవృద్ధియందలిశ్రద్ధకంటె ఎక్కువ శ్రద్ధతో శిశువులమనస్సును వారు దిద్దితీర్చాలి. ఈ లెక్కలో ఇప్పుడు వాడుకలో ఉన్న కథలలో పెక్కింటిని మానివేయాలి.

"ఏ కథలు మానివేయాలంటారు?" అతడు ప్రశ్నించాడు.

చిన్నవాటికి పెద్దవి లక్ష్యాలు. కాబట్టి వాటి అన్నిటితీరు ఒకటే. పెద్దవాటిలోను, చిన్నవాటిలోను ఒకేతత్త్వం కనిపిస్తున్నదని అన్నాను.

కావచ్చును. అయితే పెద్దవని వేటినంటున్నారో ఇంకా బోధపడలేదు.

మానవజాతి కథకులలో ఉత్తములైన హోమర్, హెసియడ్ మున్నైన కవులు వ్రాసినకథలు.

"ఇంతకూ ఏ కథలంటారు? వాటిలో ఉన్నదోషమేమిటి?" అతడు కుతూహలంతో అడిగాడు.

ఏ దోషమా? ఘోరతమదోషం. అసత్యవచనదోషం. అందులోనూ వికృతమైన అసత్యం.

ఆ దోషం ఎక్కడ ఉన్నదంటారు?

చిత్రకారుడు ప్రతిబింబం చిత్రిస్తూ మూలంతో పోలికలులేని రూపం గీస్తే

ఏలాంటి ఘోరదోషమేర్పడుతుందో దేవతల ప్రకృతినేమి వీరుల ప్రకృతి నేమి అపవర్ణించినపుడు అలాంటి ఘోరదోషమే ఏర్పడుతుంది.

అలాంటిదోషం అత్యంతగర్హణీయమే. అందు సందేహం లేదు. కాని ఏ కథలు అట్టివంటారు?

ముఖ్యంగా యురానస్‌నుగూర్చి కవిచెప్పినఅసత్యం ఘోరం; పరమ వికృతం. యురానస్ ఏవో చేశాడనీ, అందుకతనిపై పగతీర్చుకొనటానికి క్రోనస్ ఏవేవో చేశాడనీ హెసియడ్ వర్ణించినసంఘటనలు దారుణాలు. క్రోనస్‌కావించిన కృత్యాలు, అతన్ని కొడుకు పెట్టినబాధలు ఒకవేళ యథార్థాలే అయినా, విచారరహితులగు పిల్లలకు చెప్పదగినవి కావు. వీలైతే అందు మౌనం వహించాలి. కాక చెప్పకతప్పనిపక్షంలో విజ్ఞులైన ఏ కొద్దిమందికో రహస్యంగా చెప్పాలి.

అవును, ఈ కల్పనలు పరమహేయాలు.

నిజానికి మనరాజ్యంలో తిరిగి ఈ కథలు చెప్పరాదు. "తాను మహాప రాధాలు చేసినా విపరీతంకాదు. తప్పుచేసినతండ్రిని ఎలాశిక్షించినా దేవతలలో ప్రథముడు ఉత్తమోత్తముడు చూపిన మార్గాన్ని అనుసరించ డమే కాని అన్యంకా"దని పిల్లలకు బోధించరాదు.

నేనూ ఒప్పుకొంటాను. అట్టికథలు పునఃకథనయోగ్యాలు కావు.

అంతఃకలహం పరమనీచమని భావిరక్షకులు భావించాలనుకొంటే స్వర్గంలో ప్రవర్తిల్లినయుద్ధాలను ప్రస్తావించరాదు. దేవతలు ఒండొరులపై పన్నినకుతంత్రాలు, సాగించినపోరాటాలు పేర్కొనరాదు. ఎందుకంటే అవి యథార్థాలు కావు. రాక్షసులయుద్ధాలు మనం ప్రస్తావించరాదు. వాటిని మన వస్త్రాలపై చిత్రించనీయరాదు. దేవతలు, మహావీరులు మిత్రులతోను బంధువులతోను సాగించిన యుద్ధాలవిషయంలో మనం మౌనం వహించాలి. "స్పర్ధ అపవిత్రం. ఇంతవరకు అట్టిది పౌరులలో బయలుదేరలేదు," అని మనం చెబుతాము. ఇలాగే పెద్దలు పిన్నలకు బోధించాలి. వారు పెరిగి పెద్దవారైనతరువాత కూడ కవులు వారికా ధోరణిలోనే తమరచనలను వ్రాయాలని ఆదేశించాలి. హెఫీస్టస్ తనతల్లి

హేరాను ఎలా బంధించాడో, వేరొకసందర్భంలో తనతల్లిని దండిస్తున్న తండ్రినుంచి ఆమెను కాపాడపూనుకొన్న హెఫీస్టస్‌ను జియూస్ ఎలా స్వర్గంనుంచి తరిమివేశాడో చెప్పరాదు. హోమర్ వర్ణించిన దేవతల అంతర్యుద్ధాలు ప్రతిషేధ్యాలు. ఇలాంటి కథలకు, ఉపాఖ్యానాలకు అంతరార్థాలున్నా లేకపోయినా, వీటిని మనరాజ్యంలో ప్రవేశించనీయ రాదు. ఎందుకంటే లేతహృదయాలు ఏవి అంతరార్థసహితాలో ఏవి కావో గ్రహించలేవు. ఆ వయస్సులో విన్నదంతా గాఢంగా నాటుకొని పోతుంది. కాబట్టి పవిత్రభావాలకు పరమలక్ష్యాలైన కథలనే పిల్లలకు ప్రప్రథమంగా వినిపించాలి.

మీరుచెప్పింది యథార్థం. కాని "అలాంటి పరమలక్ష్యాలు ఎక్కడ లభిస్తవి? ఏ కథలు మీరు అలాంటి వనుకొంటున్నారు?" అని ఎవరైన ప్రశ్నిస్తే మనం ఏమి చెప్పాలి?

యాడైమాంటస్, నీవూ నేను రాజ్యస్థాపకులము గాని, కవులము కాము. కవులు తమరచనలను ఏ రూపంలో నిబంధించాలో, వారి అవధులేవో రాజ్యస్థాపకులకు తెలిసిఉండాలి. అంతేకాని కథారచన వారి కర్తవ్యం కాదు.

నిజమే, కాని కవులు దేవతలను గూర్చి వ్రాస్తున్నప్పుడు ఏ నియమాలు పాటించాలంటారు ?

స్థూలంగా చెప్పాలంటే—మహాకావ్యం వ్రాయనీ, గేయకావ్యం వ్రాయనీ, విషాదాంతరూపకం వ్రాయనీ, ప్రస్తావనవచ్చినప్పుడు కవి ఈశ్వరుని యథార్థస్వరూపంతో చిత్రించాలి.

నిజమే.

నిజంగా ఈశ్వరుడు శివంకరుడు గదా? అతనిని అలాగే చిత్రించవద్దా?

అలాగే చిత్రించాలి.

శివంకరం అశివంకరం కాదు గదా ?

ఎలా అవుతుంది?

అశివేతరం బాధించదు గదా?

బాధించదు.

బాధాకరం కానిది కీడుచేయదు గదా?

చేయదు.

కీడు చేయనిది అనర్థహేతువు కాదు గదా?

కాదు.

కాబట్టి శివంకరం లాభదాయకమే కదా?

అవును.

అందువల్ల అది భద్రహేతువే కదా?

అవును.

కాబట్టి శివంకరమైనది ఎల్లదానికి హేతువు కాదు. కేవలం భద్రస్థితికి మాత్రమే హేతువు.

నిశ్చితంగా అంతే.

ఈశ్వరుడు శివంకరుడైనప్పుడు, పెక్కురు ప్రతిపాదిస్తున్నట్లు అతడు ఎల్ల వస్తువులకు కర్త కాడు. కేవలం కొన్నింటికే కర్త. అంతేకాని మానవులకు సంభవించేవానిలో అత్యధికభాగానికి అతడు కర్తకాడు. ఎందువల్లనంటే మానవజీవితంలో శివంకరాలు స్వల్పసంఖ్యాకాలు. అనర్థకాలు బహుళసంఖ్యాకాలు. శివత్వానికి ఈశ్వరుడే హేతువు. అనర్థకాలకు హేతువులను అన్యత్ర పరిశీలించాలి కాని, ఈశ్వరుని కాపా

దించరాదు.

ఇదే యథార్థమనిపిస్తున్నది.

ఆ పక్షంలో ఈ క్రింది అసత్యాలను చెప్పే హోమర్ గాని, మరొక కవి గాని శ్రోతవ్యుడు కాడు.

"భాండయుగళముందు స్వర్గాధినాథుని
సౌధభాగమందు సమ్మదవ్య
ధా ప్రపూర్ణమగుచు."

ఈ భాండాల రెంటినుంచి గ్రహించి స్వర్గాధిపతి మిశ్రితద్రవ్యమిచ్చినపుడు ఆ గ్రహీత

"కొన్ని వేళలందుఁ గుడుచును దుఃఖమ్ము,
అన్యవేళ సౌఖ్యమనుభవించు."

అట్లు కాక అతడు అసమ్మిశ్రితదుఃఖాసవపూర్ణచషకం పొందితే

"జ్వలితమగు బుభుక్షు శార్దూలమై వాని
నఱిమి తఱుము నాదిగంతభూమి."

ఇట్టివి శ్రవణయోగ్యాలు గావు. మనకు సుఖదుఃఖాలను జియూస్ మాత్రమే కల్పిస్తాడని కాని, వాస్తవానికి పవిత్రవాగ్దానం చేసి పాండరస్ స్వయంగా భంగపరచిఉండగా ఎథీని జియూస్‌లిరువురు అలా చేయించారని కాని, థెమిస్ జియూస్‌లే దేవతల అంతస్సంఘర్షణను యుద్ధాన్ని ప్రోత్స హించారని కాని ఎవరైన వాడిస్తే వారికి మన ఆమోదముద్ర లభించదు. ఈస్క్యలస్ పలికిన ఈ క్రిందివాక్యాలు మనపిల్లలను విననీయరాదు.

"వంశనాశమ్ము గావింపవలచెనేని
జనులలో విత్తు విధి దోషసముదయమ్ము."

కవి నయోబి కష్టాలను చిత్రించినా (ప్రకృతపద్యాలు ఈ విషాదాంత రూపకంలోనివే), పెలోప్స్ వంశక్లేశాలను అభివర్ణించినా, ట్రోజన్ యుద్ధం చిత్రించినా, లేదా తత్సదృశమైన మరొకకథ వ్రాసినా, ఈ కష్టాలు ఈశ్వరకల్పితాలని చెప్పనీయరాదు. ఒకవేళ ఈశ్వరకృతులే అంటే దానికి సమర్థనీయమైన కారణమేదైనా రచయిత కల్పించాలి. ఈశ్వరుడు ధర్మాన్నే పాలించాడు. అలాంటి శిక్షవల్ల వారికి మేలే జరిగిందని అతడు చెప్పాలి. అట్లు చెప్పక శిక్షితులైనవారు శోచనీయు లయ్యారని, ఆ దుఃస్థితికి ఈశ్వరుడే కారణమని కవిని చెప్పనీయరాదు. దుష్టులు దండ్యులు; అందువల్ల వారు దుఃఖం పొందారు. అలాంటి

దండనం ఈశ్వరునివల్ల పొంది వారు ఉత్తమగతి పొందారని చెప్ప వచ్చును. ఈశ్వరుడు కళ్యాణప్రదుడు కాబట్టి ఎవనికైనా కీడు కలిగితే దానికి అతడే కారణమంటే మనం తీవ్రంగా ప్రత్యాఖ్యానించాలి. అలాంటిదానిని గద్యంలో నిగదించరాదు. పద్యంలో పలికించరాదు. వ్యవస్థితరాజ్యంలో ఆబాలవృద్ధం ఎవరూ వినరాదు, పాడరాదు. అట్టి కల్పన ఆత్మవినాశకరం, నిరయాత్మకం, పాపావహం.

మీతో ఏకీభవిస్తాను. ఈ చట్టం ఆమోదిస్తానని అతడన్నాడు.

కాబట్టి ఈశ్వరుడు ఎల్లవస్తువులకు కాక శివంకరాలకు మాత్రమే కర్త అన్నసూత్రం దేవతాగాథలకు పూర్తిగా అన్వయించాలి. దీనికి కవులు గాయకులు బద్ధులైఉండాలి.

ఇది యుక్తమేనని అతడన్నాడు.

మరి రెండవసూత్రం సంగతి ఏమిటి? ఈశ్వరుడు ఇప్పుడొకరూపం వేరొకప్పుడు వేరొక రూపం ధరించి వంచిస్తున్నాడని కవులు వర్ణిస్తు న్నారు. అతడిలా వంచించటానికి ఐంద్రజాలికుడా? అట్లుకాక అతడు అవికారి, అవ్యయుడు, నిత్యైకరూపుడా?

దీర్ఘమాలోచించక సమాధానం చెప్పలేనని అతడన్నాడు.

అది అలా ఉంచు. ఏ వస్తువులోనైనా ఒకమార్పు వచ్చినపుడు, ఆ మార్పు ఆ వస్తువువల్లనైనా రావాలి, లేదా మరొకదానివల్లనైనా రావాలి.

అవును.

ఉత్తమవస్తువులు అంతంతమాత్రాన వికృతి వినాశాలకు పాల్పడవు. దృష్టాంతానికి అత్యంత ఆరోగ్యవంతమై బలిష్ఠంగాఉన్న మానవదేహమే తీసికో. అది మద్యమాంసాలతో వికారం పొందదు. ఏపుగా పెరుగుతున్న మొక్క గాడ్పువల్ల గాని, సూర్యోష్ణంవల్ల గాని, అలాంటి మరొక కారణంవల్ల గాని ఒకమాత్రాన వాడిపోదు.

అవును.

అలాగే ధీరతముడు ప్రజ్ఞాశాలి అయినవాడు బాహ్యప్రభావంవల్ల విభ్రాంతుడు కాడు; వ్యగ్రత పొందడు. ఒకపట్టున అలాంటిది జరుగదు.

నిజమే.

ఈ సూత్రమే చిత్రవస్తువులన్నిటికి వర్తిస్తుంది. ఉదాహరణకు ఇండ్లు, ఉపకరణాలు, వస్త్రాలు తీసికో. ఇవి మంచివై చక్కని నిర్మితిగలవైనప్పుడు కాలంవల్లనేమి స్థితిగతులవల్లనేమి ఒకమాత్రాన భ్రష్టంకావు.

నిజమే.

ఎల్లవస్తువులు మానవకల్పితమైనా, ప్రకృతికల్పితమైనా, ఉభయకల్పితమైనా, బాహ్యకారణాలవల్ల చెడిపోవటం అరుదు గదా?

అవును.

మరి ఈశ్వరుడూ, ఈశ్వరకల్పితాలు ఎల్లభంగుల నిర్దోషాలే కదా?

అవును.

కాబట్టి బాహ్యప్రభావం అతనిని నిర్బంధించి బహురూపాలెత్తించలేదు.

అది అసంభవం.

మరి అతడు తనకు తాను మారవచ్చును గదా?

అవును. అతడెప్పుడైనా రూపాంతరం పొందవలసివస్తే దానికతడే కారణం కావాలి.

తన్ను తాను మార్చుకొని ఉంటే మేలైనరూపం పొందుతాడా, లేక హీనతరంగా వికృతంగా మారుతాడా?

మారటమే జరిగితే హీనావస్థే పొందాలి. ఎందుకంటే ఆదిలో అతనిసద్గుణసంపత్తిలో కాని, సౌందర్యంలో కాని, లోపమున్నదని భావించవీలులేదు.

చక్కగా చెప్పావు. యాడైమాంటస్! మానవుడైనా, దేవుడైనా హీనతను కోరుకొంటాడా?

లేదు.

ఈశ్వరుడు పరమసుందరుడు, ఉత్తమోత్తమ రూపుడు అని ఊహిస్తున్నాము. ఆ యీశ్వరుడు వికారం పొంద సమ్మతిస్తాడనటం అయోగ్యం. ప్రతి దేవత ఎల్లప్పుడు నిజరూపంతో భాసిస్తుంది.

వివేకమల్లే శాసిస్తున్నది.

ఆపత్కంలో

"చిత్రచిత్రమ్ము నన్యదేశీయమైన
బహుళరూపమ్ము వహియించి పట్టణముల
తిరుగుచుండు నాసక్తిమై దేవగణము."

అని ఏకవీ చెప్పరాదు. ప్రోటియస్, థెటిస్‌లను ఎవరూ నిందాపాత్రులను చేయరాదు. విషాదాంతరూపకంలోకాని, మరొకకావ్యంలోకాని సన్న్యాసినిరూపంతో హెరాను ప్రవేశపెట్టి

"ప్రాణదాతలౌ ఆర్గోమహాస్రవంతి
కాతనుజలకు మీరు భైక్షమ్ములిండు."

అని యాచిస్తున్నట్లు చిత్రింపనీయరాదు. ఇట్టి అసత్యాలు మనకు ఏమాత్రం యోగ్యాలు కావు. కవుల ప్రభావానికి లోగి తల్లులు

"నిదురపోవయ్య నాతండ్రి నిదురపొమ్ము
నిన్ను గొనిపోవ నీరేయి యెన్నొ మాయ
రూపులెత్తి యీ నగరంపు ద్రోవలందు
తక్కు తారుచున్నది దేవతాచయమ్ము."

అంటూ తమ బిడ్డలను భయపెట్టరాదు. ఇలా చేస్తే బిడ్డలను పిరికిపందలను చేయటమే కాక దేవతలను గూడ నిందించటమౌతుంది.

అవును. అలాంటిదేదీ జరగరాదు.

దేవతలు అవికారులే అయినా తమ మాయాశక్తితో బహురూపాలు పొందుతారన్న భావం మనకు కలిగించవచ్చును గదా?

అవును.

అయితే ఈశ్వరుడు మాటలచే గాని, చేతలచే గాని, అసత్యప్రకటనకు అంగీకరిస్తాడా? తన వికృతరూపం ప్రదర్శించగోరుతాడా?

ఏమో చెప్పలేను.

నిజమైనఅసత్యం చెప్పటానికి (ఇందులో విరోధం లేదని సమ్మతిస్తే) మానవులు దేవతలు ఏవగిస్తారు. ఈ సంగతినీకు తెలియదా?

అంటే మీ తాత్పర్యం?

అత్యంతఆత్మీయవిషయాలలో, లేదా పారమార్థికవిషయాలలో వంచితుడు కావటానికి ఏ మాత్రం ఇచ్ఛగించడు. అత్యంతభయకంపితుడౌతాడు.

ఇంకా మీ తాత్పర్యం అవగతం కాలేదు.

అవగతం కావటానికేమున్నది? నా మాటలకేదో గంభీరార్థం ఉన్నదను కొంటున్నావు. పరమార్థాల విషయంలో ఆత్మవంచనకు గాని అజ్ఞానానికి గాని పాల్పడ మానవజాతి ఒప్పుకోదు. అట్టి వంచనను పరమ హేయంగా చూస్తుంది.

అవును.

ఇలా వంచితుడైనవాని ఆత్మయందలి అజ్ఞానం నిజమైన అసత్యమనవచ్చును. ఎందుకంటే వాక్యగతమైన అసత్యం అనుకృతి, అంతకుముందు మనస్సు పొందిన వికారానికి ఛాయాప్రతిమ. అంతే కాని అకలుషితమైన అసత్యం కాదు. ఇది నిజమే నంటావా?

నిజమే.

యథార్థమైన అసత్యం దేవతలకే కాదు మానవులకు కూడా అత్యంత హేయం.

అవును.

మాటలలోనిబొంకు ఒక్కొక్కప్పుడు లాభదాయకమే కాబట్టి ద్వేష్యం కాదు. ఉదాహరణకు శత్రువులతో వ్యవహరించవలసి వస్తుందనుకో. అప్పుడిది ఉపయోగపడుతుంది. మనం మిత్రులనుకొంటున్న వారికి ఉన్మాదం కాని గాఢవ్యామోహం కాని దాపరించి దానిచే వారు కీడు తలపెట్టినప్పుడు కూడ ఇది ఉపయోగపడుతుంది. మందుగా పనిచేస్తుంది. లేదా అనర్థాన్ని నిరోధిస్తుంది. మనం ముచ్చటించిన పౌరాణికకథలకు కూడ వినియోగపడుతుంది. ప్రాచీనకాలంలో ఏమి జరిగిందో మనకు తెలియదు. అయినా అసత్యాన్ని సాధ్యమైనంతవరకు సత్యంవలె భాసింపజేసి ఉపయోగించుకొంటున్నాము.

అతడిది నిజమేనన్నాడు.

ఇంతకూ ఈ కారణాలలో ఏదైనా ఒకటి ఈశ్వరునకు వర్తిస్తుందా? ప్రాచీనకాలంలో ఏమి జరిగిందో తెలియక అతడు కల్పనకు దిగాడనవచ్చునా?

అంతకంటె హాస్యాస్పదం మరొకటి ఉండదని అతడన్నాడు.

కాబట్టి ఈశ్వరుడు అబద్ధాలాడే కవిగాడు.

కాదనే చెప్పాలి.

ఒకవేళ శత్రువులకు భయపడి ఈశ్వరుడు అసత్యం చెబుతున్నాడేమో?

అది అసంభవం.

అలా కానప్పుడు అతనికి నష్టమతులు, లేదా ఉన్మత్తులు అయిన మిత్రులున్నారేమో?

నష్టమతి కాని, ఉన్మత్తుడు కాని ఈశ్వరునికి మిత్రుడు కాడు.

ఆ పక్షంలో ఈశ్వరుని అసత్యసంధానానికి హేతువేలేదని ఊహించవలసి ఉంటుంది.

అవును.

పారలౌకికతత్త్వంలో అసత్యానికి తావే లేదు గదా?

లేదు.

కాబట్టి ఈశ్వరుడు కేవలుడు. వాక్కర్మలందు సత్యస్వరూపుడు. వికారం పొందడు; సంకేతంతో గాని, మాటతో గాని, స్వప్నంతో గాని, దర్శనంతో గాని వంచించడు.

మీభావాలు నాభావాలు ఒకటేనని అతడన్నాడు.

కాబట్టి దేవతలు మాయరూపాలు తాల్చేఐంద్రజాలికులు కారు. ఏ విధంగాను మానవజాతిని వంచించరు. దివ్యవస్తువులను వర్ణించవలసివచ్చినా, వాటిని గూర్చి వ్రాయవలసివచ్చినా ఈ ద్వితీయసూత్రం పాటించాలి. ఇందులో నీవు నాతో ఏకీభవిస్తున్నావు కదా?

ఆఁ! పూర్తిగా ఏకీభవిస్తున్నా.

మనం హోమర్‌ను శ్లాఘిస్తున్నాము. అయినా అగమెమ్నన్‌కు జియూస్ కలిగించిన స్వప్నాన్ని మనంకొనియాడము. అలాగే థెటిస్ చేత ఈస్క్యులస్ పలికించిన పద్యాలను శ్లాఘించము.

"వివాహ సమయంలో అపోలో
ఉవిద నీసంతానమొందుఁగావుత పూర్ణ

పురుషాయుషము వ్యాధివిరతితోడ
అనుచు నన్దీవించినంతనే యుప్పొంగి
పోతి నానందాబ్ధి మునుకగొంటి
ఆ దివ్యవాణి సత్యమ్ము గాకన్యమ్ము
తాఁబల్కునే యంచుఁ దలఁచుకొంటి
హృదిలోన బిడ్డలకెన్నియో భద్రమ్ము
లొదవక పోవంచు నూహగొంటి
ఆ తలఁపులెల్ల స్వప్నతుల్యమ్ములయ్యె
అల్ల యుద్వాహసమయమందరుగుదెంచి
యట్లు దీవించి చనినమహానుభావుఁ
డిట్లు నాతనూభవు సంహరించె నకట!"

అని దేవతలను గూర్చి థిటిస్ చే పలికించినవాక్యాలు మనలను కృద్ధులను చేస్తవి. ఇలా వ్రాసినకవియొక్క రూపకప్రదర్శనం నిషేధించాలి. మన రక్షకులు యథార్థంగా దైవభక్తులై పవిత్రులుగా ఉండాలని కాంక్షిస్తున్నాము. కాబట్టి ఇట్టివాటిని బాలశిక్షణకై ఉపాధ్యాయు లుపయోగించరాదు.

మీసూత్రాలను పూర్ణంగా ఆమోదిస్తున్నాను. వీటిని శాసనాలవలె వినియోగించుకొంటానని అతడన్నాడు.

# మూడవ ప్రకరణం

వేలుపులందు, తల్లిదండ్రులందు భక్తిగౌరవాలు పెంపొందించి, అన్యోన్య మైత్రి వర్ధిల్లజేయవలెనంటే మనశిష్యులకు బాల్యమాదిగా కొన్ని కథలు పరిహరించి, కొన్ని కథలే బోధించాలి. మొత్తమ్మీద ఇలాంటి ఆస్తిక్యబుద్ధి ఆవశ్యకం.

అవును, నిశ్చితంగా అవసరమని అతడు అన్నాడు.

ధీరులు కావాలంటే వీటితోపాటు వారు మరికొన్ని యితరగుణాలు అల వరుచుకోవద్దా? ముఖ్యంగా మరణభీతి మాన్పేవాటిని అభ్యసించాలి. చావంటే గడగడలాడేవాడు ధీరుడవుతాడా?

అది అసంభవం.

"అధోలోకాలున్నవి. అవి నిజంగా భయానకాలు" అని నమ్మినవాడు పరాజయదాస్యాలకంటె యుద్ధమందు ప్రాణత్యాగం మేలని, భీతిని ధిక్కరించి వీరమరణం కోరుకోగలడా?

లేదు.

కాబట్టి పిరికిమందు నూరిపోసేకథలు చెప్పేవారిపై నియంత్రణాధికారం సంపాదించి, "అధోలోకాలను భయంకరంగా చిత్రించకండి; మీ వర్ణ నలు వట్టిబూటకాలు. ఈ అనృతాలు మనభావియోధులకు తీరని అపకారం కలిగిస్తవి. కాబట్టి ఆ లోకాలను ప్రశంసించం"డని వారిని ప్రార్థించాలి.

అవును, అది మనకర్తవ్యమని అతడన్నాడు.

ఆ పక్షంలో ఇప్పుడు పేర్కొనబోతున్న సూత్రాలవంటి దురుక్తులను తుడిచివేయవలసి ఉంటుంది:—

"ప్రేతలోకమునకు నేతనగుటకంటె
జేసెఁడైన పొలము లేనివాని
జేరి వరవుడమ్ము సేయుట యేరీతిఁ
బాఱఁజూచుకొన్న వరము నాకు."

ప్లాటోయొక్క భయాన్ని అభివర్ణించే ఈ క్రిందిపద్యాన్ని తొలగించాలి:—

"అమరలోకాలకేని భయానకమ్ము
లైన వీచినారక దారుణాలయములు
సురమనుష్యలోకమ్ములు చూచునేమొ."

అంతేకాదు:

"దారుణంబిది యేమి యీ దండధరుని
లోకమునయందు బుద్ధి గోల్పోయి ఘోర
భూతరూపమ్ముతో నాత్మ పొలయునొక్కొ?"

టైరిసియస్‌ను చిత్రించినపద్యం—

"అతఁడు మాత్రమే బోధసమన్వితుండు
అన్యులెల్ల పర్విడు నీడలైరి."

ఈ పద్యం గూడ అలాంటిదే:

"పౌరుషము దలపోసి యౌవనము నెంచి
గోడు గుడుచుచు దేహమ్ము వీడి యాత్మ
క్రిందిలోకమ్మునకుఁ బోయె."

అంతే కాదు:—

"కర్ణదుస్సహమైన యాక్రందనమ్ము
సేయుచును బోయె ధూమమ్ము వోయినట్లు
ముక్తదేహుఁడధోలోకమునకు."

మరి

"అంధతరకందరాన దివాంధగణము
లొండునొండు తాఁకుచు వ్రేలుచుండి యచట
నొకఁడు పట్టుగోల్పడి కూల నొక్కమొగిని
ఘోరరుతి పొనర్చుచు సమాకులతనొందు
నట్లు పరలోకమేగు జీవాత్మలెల్ల
కూయిపెట్టుచు బిట్టు వ్యాకులతనొందె."

ఈ చరణాలు, ఇంకా ఇలాంటిభాగాలు మనం తీసివేస్తే కోపించరాదని

హోమర్‌ను తక్కినకవులను కోరాలి. వీటిని తీసివేస్తున్నామంటే కవిత్వం లేదని కాదు; ప్రజల శ్రవణాలకు పేయాలు కావనీ కాదు. వీటిలో కవితాప్రభావం మెండైనకొలది మృత్యువుకంటె దాస్యానికి మిక్కిలిగా భీతిల్లవలసిన పిన్నపెద్దల చెవులకివి అపథ్యాలవుతవి.

నిస్సందేహంగా అంతే.

విన్నంతమాత్రాన శ్రోతలకు భయోత్కంపం కలిగించే అధోలోకవర్ణన లన్నీ మనం త్రోసివేయాలి. కోసైటస్, స్టిక్స్, అధోలోకభూతాలు, వికృతాకారాలు మున్నైనవాటినన్నిటినీ పూర్తిగా పరిహరించాలి. ఇలాంటి కథలకు ఏదో ఒకప్రయోజనం మొదలే ఉండదని నేను చెప్పను. కాని ఇట్టి కథాశ్రవణంవల్ల మన రక్షకులు భయసులభులై దుర్బలులు కావచ్చును.

అవును, ఆ ప్రమాదమున్నది.

కాబట్టి అలాంటివి ఏమాత్రం తగవు. వాటికంటె భిన్నాలు, గంభీరాలు అయినవాటిని వ్రాయించి సంకీర్తనం చేయించాలి.

అవును.

ప్రఖ్యాతపురుషుల ప్రలాపవిలాప పరిహరణకు ఉపక్రమింతామా?

ఇవి కూడ ఆకోవకు చెందినవే కదా!

ప్రలాపాదులు యోగ్యాలా? ఆలోచించు. సత్పురుషుడైన తనమిత్రునకు మరణం సంప్రాప్తిస్తే, ఉత్తమపురుషుడు దానిని దారుణంగా పరిగణించడని మన భావం.

అవును.

కాబట్టి మరణించిన మిత్రునికై దురంతదుఃస్థితి తనకు దాపరించినట్లు శోకించడు.

అవును.

అలాంటి సత్పురుషుడు తనకంటె అన్యం అపేక్షించడు. తనసుఖానికి తాను చాలు. కాబట్టి అన్యపురుషాపేక్ష చాల తక్కువ.

నిజమే.

అందువల్ల పుత్రమరణమేమి, సోదరనిధనమేమి, ధనవినాశమేమి అతనిని బాధించదు.

నిశ్చయంగా అంతే.

ఒకవేళ ఇట్టి దుఃస్థితి ఏదైనా దాపరించినా అతడు విలపించడు. అత్యంత నిగ్రహంతో సహిస్తాడు.

అవును కలతపొందడు.

కాబట్టి అలాంటివిఖ్యాతపురుషుల విలాపాలు పరిహరించి వాటిని స్త్రీలకు, నీచులకు వదలివేయటం యోగ్యం. దేశరక్షణకై మనవల్ల శిక్షణపొందు తున్నవారికి అలాంటి నీచానుకరణం జుగుప్సాకరం.

మీ వాక్యాలు యుక్తియుక్తాలు.

ఎకిలీజ్ దివ్యజన్ముడు. అట్టివాడు దుఃఖోపహతుడై ధూళిలో చతికిల బడ్డాడట. పొర్లిగింతలు పెట్టాడట. శోకావేశంతో నిర్జనసముద్రతీరాన పరుగెత్తాడట. బూడిదను ఇరుచేతులతో నెత్తిన పోసికొన్నాడట. వైన వైనాలుపెట్టి శోకించినట్లు హోమర్ వ్రాశాడు. అతనిని ఇలా చిత్రించ రాదని హోమర్‌ను, ఇతరకవులను మనం మరొకసారి కోరాలి. దేవతా కోటికి బంధువైన ప్రియామ్

"పాంసులఁ దోఁగుచు న్మనుజవర్గముఁ బిల్చెను పేరుపేరునన్."

అని హోమర్ వర్ణించిఉండరాదు. ఎట్టి స్థితిగతులందైన దేవతలు—

"హా విధీ కంటినేమి వీరాధివీరు
మృత్యుదేవతకై సమర్పించుకొంటిని."

ఇలాంటి పరిదేవనలు చేస్తున్నట్లు చిత్రించదగదని అతనిని మరిమరి కోరాలి. దేవతలను పరిచితులను కావించక తప్పదన్నపక్షంలో దేవదేవుని చేత

"నాదుకనులారఁ గాంచుచున్నాఁడ నాప్త
మిత్రుఁడిట్లు భీకరవన్యమృగము వోలె
పట్టణము చుట్టు వేటాడఁబడుచునుండ
మనము దుఃఖాబ్ధియందున మునిఁగిపోయె."

అనికాని,
"దుర్భరం! విధి నాయందు దయతప్పింది. మానవులలో నాకు పరమ హితుడైన సర్పెడన్ పెట్రోక్లస్ చేతిలో మరణించబోతున్నాడు"— ఇలాంటి వాక్యాలు పలికించి దేవతావరేణ్యుని ఇంతఘోరంగా అవమానించరాదు. యాడైమాంటస్, ఇలాంటి అసభ్య దేవతావర్ణనలు శ్రద్ధాళువులై మనయువకులు ఆకర్ణించి నవ్వుకొనటానికి మారుగా ఏమనుకొంటారో ఎరుగుదువా? "దేవతలే అలా చేశారే, మానవమాత్రుడను నేనలా చేస్తే గౌరవభంగం ఎలాకలుగుతుంది?" అనుకొంటారు. అట్టి విలాపాలు, చేష్టలు చెయ్యాలని బుద్ధిపుట్టినప్పుడు అది నింద్యమనుకోరు. ఏ స్వల్పనిమిత్తమేర్పడినా, సిగ్గిల్లక నిగ్రహించుకొనక రోదిస్తారు. వైనవైనాలుపెట్టి శోకాలు తీస్తారు.

మీచెప్పింది యథార్థం.

అట్లు జరగరాదు. మనవాదం ప్రతిపాదిస్తున్న అర్థమే ఇది. ఇంతకన్న ఉత్తమవాదం వెలువడి మనవాదాన్ని దూరాపాస్తం చేసేదాక మన వాదాన్నే తూచాతప్పక అనుసరించాలి.

అవును.

మనరక్షకులు విహాసనలోలురు కారాదు. హాస్యం పరాంకోటి పొందితే వైపరీత్యం సంభవిస్తుంది.

అలాగే తోస్తున్నది.

ఆ పక్షంలో మానవమాత్రులయినా, మాననీయులైనవ్యక్తులు విహాసన

వివశులైనట్లు చిత్రితులు కారాదు. ముఖ్యంగా దేవతలు అట్టిదానికి లోనయ్యారని చిత్రించటం ఏమాత్రం యోగ్యం కాదు.

అవును.

"ఆ హెఫీస్టసు సౌధమ్మునందు నడచు
తీరు పొడగాంచుచున్న యాదిత్యకోటి
అప్రశమనీయమైన విహాసమునకు
వివశమై నవ్వె (సదము కంపించిపోవ)."

అని హోమర్ వర్ణించాడు. ఇట్టి వర్ణనలు ఏమాత్రం సహ్యాలు కావు. నీ అభిప్రాయాలనుబట్టి వీటిని అనుమతించరాదు గదా?

మీ అభిమతం నాకంటగడుతున్నారు. సరే దానికేమి గాని, మనం వాటిని సమ్మతించరాదు.

మరి సత్యం అమూల్యం. అసత్యం దేవతలకు ద్వేషభాజనమని చెప్పు కొన్నాము. మానవులకు మాత్రమే అది రసవటివలె పనికివస్తుంది. మరి రసాదులు వాడవలసినవారు వైద్యులు. ఇతరులు వానిజోలికైనా పోరాదు.

నిజమే.

అనృతాధికారం ఆవశ్యకమంటే అది కేవలం రాజ్యపాలకులకు మాత్రమే ఉండాలి. వారు గూడా దానిని ప్రజాక్షేమమర్థించి కేవలం ఏ శాత్రవ వ్యవహారమందో, ఏ ప్రజావ్యవహారమందో వినియోగించటానికి మనం సమ్మతింపవచ్చును. అంతకు తక్క అన్యులెవరూ దానిపొంత పోరాదు. పాలకులకు ఈ అధికారం ఉన్నా సామాన్యపౌరుడు మాత్రం బొంకరాదు. అది దారుణాపరాధం. రోగి వైద్యునికి గాని, వ్యాయామాభ్యాసి గురువునకు గాని, వ్యాధిని శరీరస్థితిని చెప్పక అసత్యం చెప్పాడే పో; అలాగే నౌకనుగూర్చి, సహచరులనుగూర్చి, తనకూ సహచరులకు జరుగు తున్నదానినిగూర్చి నావికుడు అధిపతికి అసత్యం చెప్పాడేపో— అది ఘోరాపరాధం కాదా?

నిజమే.

తాను గాక రాజ్యంలో అన్యుడెవడైనా

"అర్చకుండైన రథకారుఁడైన కాక
వైద్యుఁడైన నితరవృత్తి పరుఁడెయైన"

బొంకుతుండగా పట్టువడితే పాలకుడు కఠోరంగా దండిస్తాడు; రాజ్యనౌకను విద్రోహవినాశహేతువైన అసత్యప్రచారం కావించినందుకు శిక్షిస్తాడు.

భావనిర్మితమైన మనరాజ్యం కార్యరూపం సంతరించినప్పుడు నిశ్చితంగా అలాగే జరుగుతుంది.

మన యువలోకం నిగ్రహం కలిగి ఉండాలి కదా?

అవును.

నిగ్రహ ప్రధానలక్షణాలేమిటి? ఆజ్ఞాపాలనం, ఆత్మసంయమనం ముఖ్యాలు కదా?

అవును.

హోమర్ కావ్యంలోని డయొమీడ్ అంటున్నాడు: "మనమ, పోకిళ్ళు మాని నామాట వినుము." దీనికి పిమ్మట ఈ చరణా లున్నవి:—

"వాహినీనాథ శాసనబద్ధమగుచు
వీరతేజమ్ము దిక్కులఁ బిక్కటిల్ల
యవనసైన్యమ్ము ప్రస్థితమయ్యె నపుడు."—

ఇలాంటి భావాలు మనమాదరించాలి గదా?

తప్పక.

మరి

"తప్పఁద్రావి విభ్రాంత నేత్రములతోడ
అదరు కృష్ణశాబకహృదయమ్ముతోడ"—

ఇత్యాదిగా ఉన్న వాక్యాలో? హద్దుపద్దులు మీరి సామాన్యపౌరులు తమ ఏలికలను గూర్చి ఇట్టి అనుచితప్రలాపాలు, అధిక్షేపాలు పద్యంలోనో గద్యంలోనో పలికితే అది సముచితమంటావా?

కానేకాదు.

అట్టివి కొంతవినోదం కల్పిస్తే కల్పించవచ్చును. కాని, నిగ్రహానికి దోహద మియ్యవు. కాబట్టి అవి మన యువకులకు అపథ్యకారులంటాను. మరి నీవో?

ఏకీభవిస్తాను.

"భోజనభాజనమ్ములు ప్రపూర్ణములయ్యెను శాకపాకవి
భ్రాజితరుచ్యమాంసముల; వడ్డన సేయఁదొడంగె నంత సే
వాజన మెల్ల మద్యముల వారిగఁ జాలును జాలునంచు పే
రోజను భోక్తలన్న వినకుండఁగ బూజపుబంతిలోపలన్."—

ఇలాంటి వాటికంటె ఉదాత్తాలు లేవని అత్యంతప్రజ్ఞావంతులచే పలికిస్తే విన్న యువకునకది నిగ్రహం సమకూరుస్తుందా?

మరి

"దారుణక్షుధాకలితుఁడై దొరుకంటె
జనునకెందును ఘోరంపుఁజావు లేదు."—

అన్న వర్ణనమో? జియూస్ వృత్తాంతాన్ని గూర్చి నీ అభిప్రాయమేమిటి? ఇతర దేవతలూ మానవులూ అంతా నిద్రపోతూఉంటే అతడు నిర్నిద్రుడై తంత్రాలు ఆలోచిస్తుంటాడు. ఆ సమయంలో హెరా కనిపిస్తుంది. ఆ ఆలోచనలన్నీ ఒక్కసారిగా మటుమాయమవుతవి. కామావేశుడై కుటీరప్రవేశ వ్యవధానం కూడ ఓర్వక ఆ మెతో కటిక నేలమీద నే సంభోగం అర్థిస్తూ "మన తలిదండ్రుల ఎరుకలేకుండా నే ప్రథమంలో ప్రణయకలాపాలు సాగించినరోజుల్లో కూడ ఇంతగా నిన్ను కామించలే"దంటాడు. ఇలాంటి రహఃకార్యకలాపాలు సాగిస్తున్నందుకు హెఫీస్టస్ ఎరీజ్‌ను యాఫ్రొడైట్‌ను శృంఖలాలతో బంధిస్తున్నట్లు వర్ణిస్తున్న కథకేమంటావు?

ఇలాంటివి వారికి శ్రవణయోగ్యాలు కావనే నానిశ్చయమని అతడన్నాడు.

మరి ప్రఖ్యాతపురుషులు స్వయంగా చూపిన ఉదాత్తనిగ్రహం, కష్టసహనం వారు చూడాలి. కర్ణపర్వంగా ఆలించాలి.

"ఇంతకంటె బెట్టిదము సహింపలేదె
డెందమా భరింపుము దీనిఁ గుందకనుచు
రొమ్ము తాటించుకొనుచుఁ గ్రోధమ్ముతోడ
నాత్మనిందానుసంసక్తుఁడయ్యె నతఁడు."

ఇట్టివాక్యాలు శ్రావ్యాలు కావా?

నిశ్చితంగా.

కానుకలకు గాని ద్రవ్యానికి గాని వారు చేతులు చాచరాదు. అది తగనే తగదు.

"కానుకలు ప్రియములు సురలకు
కానుకలు ప్రియములు నరేంద్రగణములకైనన్"—

ఇట్టి వాక్యాలు వారికి వినిపించరాదు. "యవనులనుంచి కానుకలు స్వీకరించక వారికి సహాయం చేయవద్దు. వాటిని పొందక నీక్రోధం ఉపసంహరించుకోవద్దు" అని ఫీనిక్స్ తనశిష్యుడు ఎకిలీజ్‌కు ఉపదేశించాడట. ఇది ఆమోదయోగ్యం కాదు. లేదా ఇట్టి ఉపదేశం అతడు శిష్యునకు బోధించి ఉండడు. ఎకిలీజ్ ధనలుబ్ధుడంటే నమ్మలేము. అతడు అగమెమ్నన్‌నుంచి లంచాలు పుచ్చుకొనే లోభి కాడు. ధనం పుచ్చుకొన్నపిమ్మటనే అతడు హెక్టర్‌శవాన్ని కొనిపోనిచ్చాడు, కాని పరిహారవిరహితంగా అతడు దానికి సమ్మతించలేదన్నది కేవలం అసముచితం.

నిజంగా ఇట్టివి అయోగ్యాలని అతన్నాడు.

హోమరంటే నాకెంతో ఇష్టం. కాని ఇట్టిగుణాలు ఎకిలీజ్‌కు ఆపాదించి అతడు పరమదైవద్రోహం ఒడిగట్టుకొంటున్నాడు. దీనికింకా ఇతర దృష్టాంతాలున్నవి. ఎకిలీజ్ అపాలోతో అంటాడు:

"ఇంతద్రోహమ్ము నాకాచరించినాఁడ
వోరి బృందారకాధమా ఓరి వితథ
బాణసంధానపాండిత్య వలనుపడదు
గాక కలదుప్రతీకారకాంక్ష ఘనము."

అతడు నదీదేవునిపట్ల సావజ్ఞంగా ప్రవర్తించాడట. తొల్లి స్పెర్చీయస్ నదీదేవునకు సమర్పిస్తానని మొక్కుకొన్న తనకేశపాశాన్ని చనిపోయిన పెట్రొక్లస్‌కు సమర్పించాడట. హెక్టర్‌దేహాన్ని పెట్రొక్లస్‌సమాధి

చుట్టూ ఈడ్చి బందీలను చితివద్ద సంహరించాడట. ఇలాంటిదోషాలు అతడు చేశాడంటే నేను నమ్మను. అతడు సామాన్యుడు కాడు; చైరన్ శిష్యుడు మానవలోకంలో అత్యంతసాధుమూర్తిగా ప్రఖ్యాతికెక్కి జియూస్‌వంశంలో మూడవపురుషాంతరంవాడైన పీల్యూస్‌వల్ల దేవతా గర్భాన జన్మించిన దివ్యమూర్తి. అట్టివాడు అటు లోభితాలిప్తనైచ్యానికీ, ఇటు ఉత్కటదేవమానవద్వేషానికి దాసుడై వర్తించేటంత బుద్ధిహీనుడని మనపౌరులు నమ్మరాదు. అది నాకు సమ్మతం కాదు.

మీరు చెప్పింది సముచితమని అతడంగీకరించాడు.

పోసైడన్ కుమారుడు థీస్యూస్, జియూస్ కుమారుడు పెయిరిథోస్ నారీశీలభంజనోద్యోగులై వెళ్ళారని చెప్పేకథలు మనం విశ్వసించరాదు. వాటిని చెప్పనీయరాదు. ఇలాంటి దారుణాపవిత్రకృత్యాలు ఏ వీరుడో లేక సురకుమారుడో ఆచరించినట్లు నవ్యులు అసత్యాలుకల్పిస్తున్నారు. వీనిని గూడ నమ్మరాదు. ఇట్టివానిని తిరిగి చెప్పరాదని నిషేధించాలి. ఇలాంటి ఘోరకృత్యాలు వారు చేయలేదని కవులచే చెప్పించాలి. లేదా అట్టివి చేసినవారు దేవతలు కారని అయినా ప్రకటించాలి. అంతే కాని, దివ్యులై ఉండి ఇట్టి ఘోరకృత్యాలు చేశారని మాత్రం వారు వర్ణించటానికి మనం అణుమాత్రమైనా సమ్మతించరాదు. అనర్థాలకు దేవతలే కారణమని కాని, మానవులలో వీరులు ఉత్తములు కారని కానీ వారు వ్రాయరాదు. అట్టి రచనకే అవకాశమీయరాదు. ఇలాంటి భావనలు పవిత్రాలు కావు. యథార్థాలూ కావు. దేవతలవల్ల అనర్థం పొడమదని మనం ఇదివరకే నిరూపించాము.

అవును.

అట్టి భావాలవల్ల శ్రోతలకు దుర్వికారాలు కలుగవచ్చును. దేవతాబంధువులిలాగే చేశారు, చేస్తారని నిజంగా నమ్మితే వారు తమదోషాలపట్ల ఉపేక్ష వహిస్తారు. యువకుల నైతికనిష్ఠ సడలుతుంది. కాబట్టి ఇలాంటి కథలకు మనం స్వస్తి చెప్పాలి.

చెప్పక తప్పదని అతడు నన్ను సమర్థించాడు.

ఏవి చెప్పదగినవో ఏవి చెప్పరాదో మనం ఇప్పుడు పరిశీలిస్తున్నాము కాబట్టి ఇంకా ఏవైనా వదలిపెట్టామేమో చూదాము. దివ్యులను, దివ్యాదివ్యులను, వీరులను, పాతాళలోకాలను ఎలా వర్ణించాలో నిర్ణయించాము.

అవును.

ఇక మానవులను గూర్చి చెప్పాలి. ప్రకృతవిషయంలో మిగిలిఉన్నది ఈ భాగమే కదా?

అవును.

అయితే ఈ ప్రశ్నకిప్పుడు సమాధానం చెప్పేస్థితిలో లేము.

ఎందుకని?

మనకవులు, కథకులు మానవులవిషయంలో ఘోరతర అసత్యాలు వ్రాశారు. దుర్మార్గులు తరచుగా సుఖవంతులవుతారట; సత్పురుషులు దుఃఖభాజనులట. వెల్లడి కానప్పుడు అన్యాయం లాభదాయకమట. న్యాయమనేది ఒకనికి నష్టకారియై వేరొకనికి లాభదాయకమౌతుందట. ఇట్టి అసత్యాలు చెప్పరాదని వారిని నిషేధించాలి. కేవలం వీటివైపరీత్యం కీర్తించాలని వారిని శాసించాలి.

అలాగే చేదాము.

ఇప్పుడు నేను చెప్పినది యథార్థమని అంగీకరిస్తే మనం ఇంతకుముందు వివదించిన అర్థం నీవు పరోక్షంగా ఆమోదించినట్లే.

మీ అనుమానం యథార్థం.

కాబట్టి న్యాయమంటే ఏమిటి? న్యాయవంతుడుగా కనిపించినా కనిపించకపోయినా దానివల్ల ఎలా మేలు కలుగుతుంది? అన్నప్రశ్నలకు సమాధానం నిర్ణయించనంతవరకు మానవులవిషయమై ఇట్టివి చెప్పవచ్చునా, లేదా? అన్నప్రశ్నకు సమాధానం నిర్ణయించ వీలుపడదు.

నిశ్చితంగా అంతే.

కవితావిషయాలు ఇక చాలు. ఇప్పుడు శైలిని గూర్చి మాటాడుకొందాము. ఇది గూడ సమాప్తమైతే అటు వస్తువును, ఇటు ఉక్తిభంగినీ ముగించి నట్లవుతుంది.

మీ తాత్పర్యం బోధపడలేదని యాడైమాంటస్ అన్నాడు.

ఇంతకు బోధపడేటట్లు చెప్పాలి కదా ? ఇలా చెబితే నా తాత్పర్యం అవగత మాతుందేమో చూస్తాను:—ఏ పౌరాణికగాథలైనా, కవిత్వమైనా సన్ని వేశాలకథనమే కదా! ఆ సన్నివేశాలు ప్రాచీనాలైనా, వర్తమానా లైనా, భవిష్యాలైనా సన్నివేశాలు కాకపోవు.

అవును.

కథనమన్నప్పు డది కేవలకథనాత్మకం కావచ్చును, లేదా అనుకరణా త్మకం కావచ్చును, లేదా తదుభయాత్మకం కావచ్చును.

ఇక్కడ మళ్ళీ బోధపడటం లేదు.

నాభావం చెప్పటానికింత అవస్థపడుతున్నానంటే నా బోధకత్వం నిజంగా హాస్యాస్పదంగా ఉండాలి. విషయమంతా కాక ఒకకొంత భాగాన్ని విడగొట్టి ప్రదర్శిస్తాను. ఇలియడ్ కావ్యంలోని మొదటి చరణాలు గుర్తున్నవి కదా ? క్రిశస్ తనకుమార్తెను విడిచిపెట్టుమని అగమెమ్నన్‌ను ప్రార్థించగా అతడు మండిపడతాడు. విఫలమనోరథుడై ఎకీన్స్‌ను అగ్రహోపహతులను చేయవలసినదని క్రిశస్ భగవంతుని ప్రార్థిస్తాడు.

"ఎల్లయవనుల నతఁడు ప్రార్థించె మనుజ
వల్లభుల ఆట్రియసు తనూభవుల వెండి
వేడుకొనియె—"

అన్నచరణాలవరకు కవి తానుగా మాటాడుతున్నాడు. అంతే కాని తాను మరొకడన్నభావం కలిగించటం లేదు. ఆమీది పాదాలలో క్రిశస్ భూమికను వహించి అప్పుడు మాటాడుతున్నది వృద్ధార్చకుడే కాని తాను

కాదన్ననమ్మకం మనకు కలిగించేనిమిత్తం కవి చేయవలసినదంతా చేస్తున్నాడు. ఈ ద్వైధరూపంతోనే ట్రాయ్‌లోను, ఇథాకాలోను, ఒడిసీ కావ్యమంతటిలోను మొదటినుంచి తుదివరకూ జరిగినసన్నివేశాలను అతడు చిత్రించాడు.

అవును.

అప్పుడప్పుడు కవి తానుగా చెబుతున్నభాగాలలోను పాత్రమాటలకు నడుమనున్న భాగాలలోను ఉన్నది కథనమే కదా?

నిజమే.

కవి మరొకనిరూపంతో మాటాడుతున్నప్పుడు తాను అనుకరిస్తున్న వ్యక్తిశైలినే అలవరచుకొంటాడని చెప్పవచ్చును గదా?

అవును.

గొంతుతో గాని, చేష్టతో గాని మరొకవ్యక్తి తీరును తానలవరచుకొన్నప్పుడు తాను నటిస్తున్న పాత్రకది అనుకరణమే కదా?

సహజంగా అంతే.

కాబట్టి కవి కథనం ఇట్టిచోట అనుకరణముఖాన సాగుతున్నదని చెప్పవచ్చును గదా?

అవును.

అలా కాక కవి కనిపిస్తూ, అతడు తన్ను మాటుపరచుకొనక మాటాడుతున్నప్పుడు అనుకరణం పరిత్యక్తం అవుతున్నది. అతనికవిత్వం అప్పుడు కేవలం కథనం అవుతున్నది. ఏమో మీతాత్పర్యం నాకు బోధపడలేదని మళ్ళీ నీవనకుండా నాభావం విస్పష్టపరుస్తాను. పుత్రికావిమోచన శుల్కం పుచ్చుకొని వచ్చి అర్చకుడు ఎకీన్సును ముఖ్యంగా రాజులను తనకుమారికను విడిచిపుచ్చవలసినదని వేడుకొన్నాడు. ఇట్లు వ్రాసిన

తరువాత హోమర్ క్రిశస్ పలికినట్లు కాక తానే వచించినట్లు వ్రాసి ఉంటే ఆ వాక్యాలు అనుకరణాలు కాక కథానకాలుగా ఉండేవి. అట్లే వ్రాసిఉంటే యీ భాగం ఇలా ఉంటుంది (నేను కవిని కాదు గదా! కాబట్టి ఛందోవిరహితంగా చెబుతాను): "యవనులు ట్రాయ్ నగరాన్ని స్వాయత్తం కావించుకొని విజయోపేతులై తిరిగివచ్చి, తన పుత్రికను సురక్షితంగా అప్పగించి, శుల్కం గ్రహించి, దైవభక్తిపరులై వర్థిల్లునట్లనుగ్రహింపవలసినదని అర్చకుడు దేవుని ప్రార్థించాడు. యవను లంతా సంతసించి అతనిని సమ్మానించి అతనికోరికను ఆమోదించారు. కాని అగమెమ్నన్ మాత్రం అగ్గిమీది గుగ్గిలమయ్యాడు. మళ్ళీ ఆ చాయ లలోనైనా అతని మొగం మరల కనిపించరాదన్నాడు. అతని యోగ దండం కాని, జపమాలిక కాని అతన్ని కాపాడలేవని కఠోరంగా చెప్పాడు. క్రిశస్ పుత్రికకు విమోచనం కల్ల. తనతోపాటు ఆమె ఆర్గోస్ నగరంలో ముదివగ్గు కావలసినదేనని అగమెమ్నన్ నిప్పులు కురిశాడు. ఆ మాటలకు ఆ ముదిమిమూట వణకిపోయాడు. అతడు నోట మాట రాక శిబిరం విడిచి వెళ్ళాడు. అతడు అలా వెడలిపోయి అపాలోను ప్రార్థించాడు. అతనికి ప్రీతిపాత్రంగా తాను కట్టించినగుళ్ళు వ్రేల్చిన వ్రేల్పులు పేర్కొన్నాడు. ఆ పుణ్యకార్యఫలం అనుగ్రహించవలసినదని వేడుకొన్నాడు. తన కన్నీటిధారలనే అంపజాలుగా ఎకీన్స్‌పై కురిపించి తనపగ తీర్పుమని ప్రార్థించాడు." ఇలా చెప్పినప్పు డిది కేవలం కథనం.

ఇప్పుడు తెలిసిందని ఆతడన్నాడు.

ఈ పేర్కొన్నదానికి విపరీతపద్ధతిని తేలికగా ఊహించవచ్చును. హోమర్ తానై నడుమనడుమ చెప్పినచరణాలు తొలగిస్తే సంభాషణ మాత్రమే మిగులుతుంది గదా?

ఇది కూడ బోధపడింది. ఇంతకూ విషాదాంతరూపకంలోవలెనే ఉంటుం దంటారు.

అయితే నాతాత్పర్యం బోధపడినట్లే. కావ్యాలలో కొన్ని కేవలం అనుకరణరూపంలో ఉంటవి. హాస్యకరుణప్రధానరూపకాలు ఇందుకు దృష్టాంతం. దీనికి కేవల విపరీతపద్ధతి కూడ ఒకటి ఉన్నది కదా! ఇచట కవి తానుగా మాటాడుతాడు. ఇందుకు ఆత్మాశ్రయకవిత్వం

ఉత్తమదృష్టాంతం. ఈ రెండు పద్ధతుల సమ్మేళనం పురాణేతిహాసాలలో తదితర కావ్యభేదాలలో కనిపిస్తుంది. ఇప్పుడు నేను చెబుతున్నది బోధ పడుతున్నది గదా?

ఆc. మీ తాత్పర్యం ఇప్పుడుపూర్తిగా అవగతమైనదని అతడన్నాడు.

వస్తువును గూర్చి చెప్పుకొన్నాము. ఇప్పుడు ఉక్తిని గూర్చి పరిశీలింతా మని ఇంతకు ముందు చెప్పాను. గుర్తున్నదా?

లేకేమి?

నా ప్రశ్న ఒక్కటే. కవులు కథలల్లుతున్నప్పుడు వారిని మనం అనుక రించనీయవచ్చునా? అనుకరణం యోగ్యమేనంటే ఆ కథలలో వారిని ఆమూలాగ్రం అనుకరించనివ్వాలా? లేక ఏకదేశంలో అనుకరించ నివ్వాలా? ఏకదేశంలో అనుకరింపనీయవచ్చునంటే, ఏ భాగంలో అది యోగ్యం? అట్లు కాక అసలు అనుకరణమే నిషేధ్యమా?

ఇంతకూ మనరాజ్యంలో రూపకాన్ని హాస్యప్రధానమైనా, కరుణప్రధాన మైనా అడుగిడనీయవచ్చునా అనేకదా మీప్రశ్న?

అవును. ఈ ప్రశ్నలో విశేషార్థం ఉంటే ఉండవచ్చు, ఉండకపోవచ్చు. కాని నాకిప్పుడేవిశేషమూ తెలియదు. మనవాదం ఎటు కొనిపోతే అటు పోదాము.

అలాగే కానివ్వండని అతడన్నాడు.

యాడైమాంటస్, అయితే యీ సంగతి తేల్చు: మనకర్షకులకు అను కరణం యోగ్యమా? ఇంతకుముందు ఏమి తేల్చుకొన్నాము? వ్యక్తి ఒక పనిని మాత్రమే చక్కగా నిర్వర్తించగలడు గాని పెక్కుపనులు చేయ లేడు గదా? ఒకవేళ పెక్కింటిని చేయ యత్నించినా, అతడు దేని లోనూ నేర్పరితనం సంపాదించలేడని ఇదివరకే చెప్పుకొన్నాము గదా?

అవును, గుర్తున్నది.

ఈ సూత్రం అనుకరణకు గూడ వర్తిస్తుంది. ఒకడు ఒకదానిని అనుకరించగలిగినంత నైపుణ్యంతో పెక్కింటిని అనుకరించలేడు గదా?

నిజమే.

ఒకేవ్యక్తి జీవితంలో ముఖ్యభూమిక నిర్వహిస్తూ అదేసమయంలో అనుకారి అయి జీవితంలోని పెక్కుపాత్రలను అంత సమర్థతతో నిర్వహించలేడు. అనుకరించదగినవిషయాలు అత్యంతసన్నిహితాలుగా ఉన్నా, ఒకేవ్యక్తి ఆ రెంటిలోను తుల్యకృతార్థత పొందలేడు. దృష్టాంతంగా హాస్యకరుణప్రధానరూపకకర్తలనే తీసికో. వారు అనుకారులని అంగీకరించావు కదా?

అవును. ఒకేవ్యక్తి రెంటిలో నెగ్గలేడు. ఇది వాస్తవం.

అలాగే ఒకేవ్యక్తి అటు గాయకుడు, ఇటు నటకుడు కాలేడు గదా?

అవును.

హాస్యనటనా కరుణానటనా ఒకటి కాదు. అయినా ఈ రెండూ అనుకరణలే కదా?

అవును.

యాడైమాంటస్! మానవస్వభావాన్ని సునిశితంగా చూస్తే జీవితరంగంలో కాని, నాటకరంగంమీద కాని పెక్కుపాత్రలను దక్షతతో నిర్వహించటం అసంభవంగా కనిపిస్తున్నది.

ముమ్మాటికి నిజమని అతడన్నాడు.

మనం తొలుత చెప్పుకొన్నట్లు అన్యవ్యాపారాలు వర్జించి మనరక్షకులు రాజ్యస్వాతంత్ర్యరక్షణైకనిమగ్నులై దానినే ప్రధానవృత్తిగా స్వీకరించి, ఇతరవ్యాసంగాలు వర్జించాలంటే వేరొకదానిని వారు అనుకరించరాదు. అభ్యసించరాదు. అనుకరించవలసివస్తే తమవృత్తికి యోగ్యమైన పాత్ర

లనే వారు ఆబాల్యం అనుకరించాలి. ధీరులు, నిగ్రహవంతులు, పవిత్రులు, స్వతంత్రులు మున్నగువారినే అనుకరించవలె గాని ఏవిధమైననీచత్వాన్ని గాని, సంకుచితత్వాన్ని గాని అనుకరించరాదు. అందులో అనుకరణనైపుణ్యం సంపాదించరాదు. ఎందుకన అనుకృతి అనుకార్య లక్షణాలను అనుకర్తకు సంక్రమింపజేస్తుంది. చిన్నతనంనుంచి ముదిమి వరకు అనుకరణం సాగిస్తే, ఆ అనుకరణమే అలవడి, అదే స్వభావమై మనోవాక్కాయకర్మలు మారిపోతవి. ఇది నీకెన్నడూ అనుభవగోచరం కాలేదా ?

కాకపోవటమేమి ? అయినదని అతడన్నాడు.

ఆ పక్షంలో జాగ్రత్తపడాలి. మనరక్షకులు ఉత్తములు కావాలంటు న్నాము. కాబట్టి వారు స్త్రీని అనుకరించరాదు. యువతిని అయినా వృద్ధను అయినా, మగనితో పోరాడుతున్నదానినైనా, సౌఖ్యవంచిత అయి దేవతలపై శాబ్దిచేస్తూ పోరుకాడేదానినైనా, బాధాగ్రస్తనైనా, దుఃఖార్తనైనా, శోకావిద్ధనైనా వారు అనుకరించరాదు. వ్యాధిగ్రస్తను, ప్రణయినిని, ప్రసవిత్రిని మొదలే అనుకరించరాదు.

మంచిమాట చెప్పారు.

దాసీదాసాన్ని గూడ అనుకరించరాదు.

అవును, అది అయోగ్యం.

అసత్పురుషులను అంతకన్నా అనుకరించరాదు. పిరికిపందలను గాని, ఉదాత్తేతరగుణులను గాని, త్రావియో త్రావకో దుర్భాషలాడుతూ పరులను వెక్కిరించేవారిని కాని, తమమాటలతో చేతలతో ఇరుగు పొరుగులకు అపచారం కావించేవారిని కాని అనుకరించరాదు. అట్టిశిక్షణం అనుచితం. దుర్గుణంవలెనే ఉన్మాదం గుర్తించదగినదే కాని అభ్యసించదగినది కాదు; అనుకార్యమూ కాదు.

అవును.

కమ్మరులను గాని, ఇతరకార్మికులను గాని, రేవుబోయలను గాని, అలాంటి ఇతరులను గాని వారు అనుకరించరాదు.

ఈ వృత్తులలో దేనియందూ వారు మగ్నం కావటానికి మనం సమ్మతించనప్పుడు వారికివి ఎలా సాధ్యపడతవి ?

గుర్రాల సకిలింత, ఆబోతుల రంకె, సెలయేటి గలగల, సముద్రపు ఘోష, మేఘాల గర్జ—ఇలాంటి సర్వధ్వనులూ వారు అనుకరించరాదు.

అంతే కాదు. ఉన్మత్తత నిషేధ్యం. కాబట్టి వారిచర్యల అనుకరణం కూడ ప్రతిషేధ్యమే.

ఇంతకూ సత్పురుషునికి చెప్పదగిన అర్థమేదైనా ఉన్నప్పుడు దానికి ఒక విధమైన కథనోక్తి ఉన్నది. విపరీతునికి మరొకవిధమైన కథనోక్తి ఉన్నదనే కదా నీతాత్పర్యం ?

"ఈ రెండు విధాల ఉక్తులేవంటారు ?" అతడు కుతూహలంతో అడిగాడు.

ఉదాహరణకు సత్పురుషుని సంగతే తీసికో. కథనసందర్భంలో మరొక సత్పురుషుని సూక్తి కాని, చేత కాని వచ్చిందనుకో. అతడు రెండవసత్పురుషునివలెఅభినయిస్తాడు. ఈ అనుకరణకు సిగ్గుపడడు. నిశ్చలమనస్కుడై వివేకంతో ప్రవర్తిస్తున్న సత్పురుషునిపాత్రను అనుకరించటానికి ఎల్ల విధాల ఉన్ముఖుడుగా ఉంటాడు. ఆ సత్పురుషుడు ఏ వ్యాధికో, ప్రణయానికో, మదిరాపానానికో, మరొకవిపత్తుకో గురిఅయితే అతన్ని అనుకరించటానికి ఉత్సహించడు. తనకు అయోగ్యమైన పాత్రను అనుకరింప తలపెట్టడు. అట్టిదానిని ఏవగించుకొంటాడు. ఒకవేళ అతని సారూప్యం వహించవలసివస్తే, అతడేదైనా ఒకమంచిపనిచేసిన ఆ క్షణకాలాన్ని మాత్రమే అనుకరిస్తాడు. ఇతరసమయాల్లో తాను మున్నెన్నడూ ఆచరించి యెరుగని పాత్రను అనుకరించటానికి సిగ్గుపడతాడు. నీచప్రతీకలను పురస్కరించుకొని తన్ను దిద్ది తీర్చుకొనటానికి ఏమాత్రం సమ్మతించడు. ఏదో వినోదార్థమై తప్ప అలాంటి కళాప్రయోగం తనకు అత్యంత అయోగ్యంగా భావిస్తాడు. అట్టిఅనుకరణపై అతనిమనస్సు తిరుగబడు

తుంది.

అవును.

ఇంతకు ముందు హోమర్ రచననుంచి కథానకోక్తిని ఉదహరించు కొన్నాము. ఆ కథానకోక్తినే ప్రధానంగా సత్పురుషుడు అనుసరిస్తాడు. అంటే అతని ఉక్తి అనుకరణాత్మకంగాను, కథనాత్మకంగాను ఉన్నా మొదటిఉక్తిపద్ధతి తక్కువగా, రెండవది మెండుగా ఉంటుంది. ఇంత వరకు అంగీకరిస్తావా?

తప్పక. అట్టివక్తకు కథానకోక్తే లక్ష్యం అవుతుంది.

అయితే ఇతరస్వభావుడు మరొకడు కూడా ఉన్నాడు. అతడు ఏ ఉక్తి పద్ధతికైనా వెనుకంజ వేయడు. అతడెంత అధముడైతే అంత హృదయ రహితంగా ఉంటాడు. అతనికేదీ పరమనీచమై పరిహరణీయం కాదు. దేని అనుకరణకైనా అతడు సిద్ధమే. ఆ అనుకరణం కూడ పరిహాసార్థం కాదు. చిత్తశుద్ధితో మహాసభలో అనుకరిస్తాడు. ఇంతకుముందు చెప్పి నట్లు మేఘగర్జనలు, జంఝూమారుతధ్వనులు, చక్రాల కిరకిరలు, గిలకల చప్పుళ్ళు, రకరకాల పిల్లంగ్రోవుల పలుకుబళ్ళు, సన్నాయికర్రల కూతలు, బాకాల మ్రోతలు— ఒకటేమిటి?— అన్ని వాద్యాలధ్వనులు అనుకరిస్తాడు. కుక్కవలె మొరుగుతాడు. గాడిదవలె ఓండ్రపెడుతాడు. కోడివలె కూస్తాడు. అతనికళ అంతా స్వరచేష్టానుకరణాత్మకంగా ఉంటుంది. అందులో కథనోక్తి అత్యల్పం.

అవును, అతని కథనపద్ధతి అలాగే ఉంటుంది.

కాబట్టి ముఖ్యమైన కథనోక్తి విధానాలు రెండే కదా?

అవును.

ఈ రెంటిలో ఒకటి నిరాడంబరం. ఇందులో అలతిమార్పులు మాత్రమే ఉంటవి. ఆ నిరాడంబరతకు తగిన నడక (Harmony), తూగు (Rhythm) జతపరిచి వక్త సరిగా మాటాడినప్పుడు ఒకేతీరు ఏర్పడుతుంది. పెద్ద

మార్పులుండవు. కాబట్టి అతని ఉక్తి ఒకే నడకతో, ఒకే తూగుతో కొనసాగుతుంది.

నిజమే.

మరి రెండవది అలా కాదు. అందులో ఎన్నో మార్పులుంటవి. అందువల్ల దానికి తగిన తీరు ఏర్పడాలంటే రకరకాల నడకలు, తూగులు అవసరం కాదా?

అదీ నిజమేనని అతడన్నాడు.

సమస్తకవిత్వం, శబ్దపూర్వకమైన ఎల్ల అభివ్యక్తి ఈ ఉక్తిభంగుల రెంటితోను, లేదా ఈ రెంటి సమ్మిశ్రణంతోనూ అధిగతమాతుంది. ఈ రెంటిలో గాని, లేక ఒకదానిలో గాని తప్ప మరొకవిధంగా ఎవడూ కథనం సాగించలేడు.

అవును, అన్నీ వాటిలోనే అంతర్గతాలవుతవి, అని అతడన్నాడు.

ఇంతకూ మనరాజ్యంలో ఉక్తిభంగుల మూటినీ ప్రవేశపెట్టాలా? లేక అమిశ్రితభంగులరెంటిని ప్రవేశపెట్టాలా? వానిని మానుకొని మిశ్రితభంగినే ప్రవేశపెట్టాలా?

కేవలం సద్గుణానుకరణను ప్రవేశపెట్టటమే నాకు సమ్మతం.

అయితే సమ్మిశ్రితమైనఉక్తి కూడ మిక్కిలి సమ్మోహనంగా ఉంటుందే? వాస్తవానికి నీవు కోరినదానికి విరుద్ధమైన మూకాభినయం పిల్లలకు, దాదులకు, ప్రజాసామాన్యానికి అత్యంతప్రీతిపాత్రంగా ఉంటుంది.

నేను కాదనటం లేదు.

ఇంతకూ తనస్వభావంలోని ద్వైవిధ్యం, నానాత్వం దిగద్రావి మానవుడు ఏకపాత్రను మాత్రమే నిర్వహిస్తున్నాడు కాబట్టి 'మూకాభినయంవంటి సమ్మిశ్రితఉక్తిభంగి మనరాజ్యానికి యోగ్యం కాదనే కదా నీతలపు?

అవును.

ఈ కారణంవల్లనే మనరాజ్యంలో (మనరాజ్యంలో మాత్రమే) చర్మకారుడు చర్మకారుడుగానే ఉంటాడు కాని, కర్ణధారితను గూడ చేపట్టడు. అలాగే రైతు రైతే కాని న్యాయవాదిత్వం కూడ నిర్వర్తించడు. సైనికుడు సైనికుడే కాని వాణిజ్యం కూడ తలకెత్తుకోడు. ఇలాగే అన్నివిషయాలలోను.

అవును.

కాబట్టి దేనికైనా అనుకరించగల ఈ నటనమహాశయుడు మనదగ్గరకు వచ్చి తన్నూ, తనవిద్యను ప్రదర్శించగోరితే, "మీరు మధురమూర్తులు, పవిత్రులు, విభ్రాంతికారులు" అని అతనికి ప్రణామమర్పించి పూజాసత్కారాలు చేసి, "మీవంటివారికి మారాజ్యం యోగ్యం కాదు. చట్టం మీ ఉనికికి సమ్మతించదు" అని చెప్పాలి. అతనికి చందనతాంబూలాలిచ్చి దోసెడుపూలు నెత్తిన పోసి మరొకరాజ్యానికి అతన్ని పంపివేయాలి. ఎందుకంటే రక్షకుల విద్యావిధాననిర్ణయసందర్భంలో మన లక్ష్యాలేవో నిర్ణయించుకొన్నాము. ఆ లక్ష్యాల సాధనకై సత్పురుషుల ఉక్తిభంగినే అసిధారావ్రతియై అనుకరించే కవిని లేదా కథకుని మాత్రమే మనం నియోగింప సంకల్పిస్తున్నాము.

అధికారం ఉంటే మనం విధిగా అలాగే చేస్తామని అతడన్నాడు.

వస్తువు, ఉక్తిభంగి—ఈ రెంటినీ చర్చించాము. మనరక్షకులకు ఒసగవలసిన సాహిత్యవిద్యాశిక్షణస్వరూపాన్ని తేల్చుకొన్నట్లే కదా?

ఆఁ. నేనూ అదే అనుకొంటున్నానని అతడన్నాడు.

ఆతరువాత వచ్చేవి రాగగీతాలే కదా?

అవును.

స్వవచనవ్యాఘాతం లేకుండా ఉండాలంటే వీటిని గూర్చి ఏమి చెప్ప

కోవాలో మనకు అందరకూ విదితమే.

గ్లాకన్ నవ్వుతూ అందుకొన్నాడు:— "అందరిలో నేను చేరనను కొంటాను. ఆలోచించి చెబుదామన్నా అవి ఎలా ఉండాలో నేను ఊహించలేను."

గేయమన్నప్పుడు మాట, పాట, తాళం అన్న మూడు అంశాలు ఉంట వన్న జ్ఞానమైనా ఉన్నది గదా?

ఆఁ. అంతవరకు తెలుసు.

మరి మాటలు సాహిత్యగతాలైనా, సంగీతగతాలైనా భేదించవు గదా?

ఆ రెంటియందు అవి సమానసూత్రబద్ధాలే. ఆ సూత్రాలేవో ఇదివరకే నిర్ణయించుకొన్నాము.

అవును.

ఇంక రాగతాళాలన్నవి పదాలనుబట్టి ఉంటవి గదా?

నిశ్చితంగా అంతే.

వస్తువును గూర్చి చర్చించినప్పుడు కరుణప్రధానగేయాలు మనకు అనావశ్యకాలని చెప్పుకొన్నాము.

నిజమే.

నీకు సంగీతపరిజ్ఞానం ఉన్నది కాబట్టి రాగాలలో ఏవి కరుణవ్యంజకాలో నీవే చెప్పాలి.

మీరు కోరుతున్నవి ఫలమంజరి, భూపాలరాగం, సింహేంద్రమధ్యమ (?) మున్నైనవి.

అయితే వీటిని బహిష్కరించాలి. శీలం రక్షించుకోవలసిన స్త్రీలకైనా పనికిరావన్నప్పుడు పురుషులకు అంతకన్నా పనికిరావని వేరే చెప్పాలా?

లేదు.

మదిరావివశత్వం, కోమలత్వం, లాలసత్వం పాలకులశీలానికి ఏమాత్రం యోగ్యాలు కావు.

నిజమే.

ఈ వివశత్వాదికం రేకెత్తించే రాగాలెవ్వి?

కళ్యాణి (?) మున్నైనవి.

మరి ఇవి సైనికంగా అణుమాత్రమైనా ఉపయోగపడుతవా?

లేదు. మీదుమిక్కిలి విరుద్ధాలు. వీటిని గూడ తీసివేస్తే మిగిలేవి నాట శ్రీరాగాదులు (?) మాత్రమేనని అతడన్నాడు.

రాగాలసంగతి నాకు బొత్తిగా తెలియదు. కాని ఒకటిమాత్రం ఉండా లంటాను. వీరపురుషునకు ప్రమాదం సంభవిస్తుంది. లేదా, అతడు కఠోర ప్రతిజ్ఞ చేయవలసివస్తుంది. కాదు, తనపక్షం వీగుతుంటుంది. లేదా, వ్రణాలకో, మృత్యువునకో, మరొకవిపత్తునకో పాల్పడవలసి వస్తుంది. అప్పుడతడు విధివిహితాలను అచంచలమనస్కుడై సహించక తప్ప దన్న దృఢసంకల్పంతో హుంకరిస్తాడు. ఆ హుంకారానికి, ఆ వజ్ర కఠోరసంకల్పానికి అనుగుణమైన రాగం కావాలి. యుద్ధప్రమాదం లేక స్వతంత్రప్రవర్తనకు వీలున్నసమయంలో నిత్యవ్యవహారణకు, దైవనుతికి, ఉపదేశానికి, ఉపదేశపాలనకు వివేకవంతుడై ప్రవర్తించి లక్ష్యసిద్ధి పొంది విజయగర్వవివశుడు కాక నిగ్రహవంతుడై ప్రవర్తించటానికి అను గుణమైన రాగం కావాలి. ఈ రెండుపనులకు యోగ్యాలైన రాగాలను మిగల్చండి. అంటే, విహితానుష్ఠానం, స్వాతంత్ర్యం, కలిమిలేముల యందలి సమస్థితి, ధైర్యం, నిగ్రహం— వీటికి అనుకూలాలైన రాగాలను ఉండనీయండి.

అవును, నేనింతకుముందు చెప్పిన ఖరహరప్రియాది (?) రాగాలు ఇందుకు పనికివస్తాయి.

మన గేయాలకు, పాటలకు (Melodies) వీటిని మాత్రమే వినియోగించ వలసిన పక్షంలో స్వరబాహుళ్యం (Multiplicity of notes) కాని, అత్యంతశ్లిష్టస్వరదాయి కాని మనకు అక్కరలేదు.

అవును.

ఆ పక్షంలో ముమ్మొనలుగలిగి శ్లిష్టస్వరప్రదాయకాలైన కృతకతంత్రీ వాద్యవిశేషాలను గాని, బహుతంత్రులు గలిగి విస్మయావహాలై స్వర మేళనలకు అవకాశమిచ్చేవాద్యాలనుగానీ నిర్మించేవారిని మనం పోషించము.

అవును.

మరి వేణునిర్మాయకులు, వాదకులూ ఉన్నారు. వారి సంగతేమిటి? శ్లిష్టరాగవాదనలో తంత్రీవాద్యాలన్నీ కలిసి కల్పించగలిగిన అనర్థం కంటె ఒక వేణువు చేయగలకీడు మెండు గదా? వాస్తవానికి రాగమాలిక (Panharmonic music) వేణువుకు అనుకరణమే కదా? అలాంటి వేణువును మనరాజ్యంలో అడుగిడనిస్తావా?

ఏమాత్రం వీలులేదు.

ఆపక్షంలో మనరాజ్యం గోటువాద్యాలను మాత్రమే వాడుకొంటుంది. పల్లెపట్టుల గొల్లలు సన్నాయికర్ర వాడుకోవచ్చును.

మనవాదం ప్రతిపాదిస్తున్న అర్థం అదే గదా?

అలాంటప్పుడు మార్స్యయస్‌కంటె అతని వాద్యాలకంటె అపోలో అతని వాద్యాలు మేలని భావించటంలో విడ్డూరం లేదు.*

---

*ఒకసారి మార్స్యయస్ సన్నాయిని పురస్కరించుకొని తనతో సాటిగా

అవును.

అరే! ఇంతకుముందువరకు అతిసంఖ్యాకంగా ఉన్నదనుకొన్న రాజ్యాన్ని అనుకోనకుండానే తగ్గించ మొదలుపెట్టాము.

మంచిపనే చేశాము.

అయితే ఈ ప్రక్షాళనక్రియను పూర్తి చేదాము. రాగాలతరువాత తాళం వస్తుంది. ఈ తాళం గూడ ఇంతకుముందు పేర్కొన్నసూత్రాలకు బద్ధమై ఉండాలి. మనం శ్లిష్టచ్ఛందోవిధానాలనేమి, ప్రతిజాతిఛందస్సునేమి పరిశీలించ నక్కరలేదు. ధీరసమరస జీవితాభివ్యంజక తాళాలను మాత్రమే మనం అన్వేషించాలి. వాటిని కనుగొన్న తరువాత సదృశ స్వభావాలైన పదాలకు అనుగుణంగా వాటిని నిబంధించాలి. అంతేగాని ఛందోరాగానుగుణంగా మాటలు కూర్చరాదు. ఇంతకు ఈతాళాలేవో నిర్దేశించటం మనకర్తవ్యం. రాగాలను తెలిపినట్లే ఈ తాళాలను గూడ నీవే నాకు బోధించాలి.

నేనేమీ చెప్పలేను. చతుస్స్వరప్రస్తారభేదంతో ఎల్లరాగాలు కలుగుతున్నట్లే తాలసూత్రత్రయంవల్ల ఛందఃపద్ధతులు ఏర్పడుతున్నవని మాత్రం ఎరుగుదును. అంతేగాని అవి ఏ యే జీవితాలకు ప్రతిబింబాలో చెప్పలేను.

ఆ పక్షంలో డేమన్♦ను సంప్రదించాలి. ఏ యేతాళాలు నీచతాదుర్విదగ్ధతాదిక దుర్గుణవ్యంజకాలో, ఏవేవి విపరీతగుణవ్యంజకాలో అతడే చెబుతాడు. అతడొకసారి వీరగీతాన్ని, క్లిష్టగతిగలగీతాన్ని ప్రస్తరించి

---

సంగీతం వినిపించవలసినదని అపాలోను సవాలుచేశాడట. ఆ పంతానికి ఆమోదించి అపాలో విద్యాధిదేవతలను మధ్యవర్తినులనుగా నిలిపి తన గోటువాద్యంతో మార్శియస్‌ను సంగీతంలో ఓడించి, ఆ పిదప అతన్ని సంహరించాడని యవనుల ఐతిహ్యం.

♦ఇతడు క్రీస్తుపూర్వం 5వ శతాబ్దివాడు. సంగీతశాస్త్రవిశారదుడు. పెరిక్లీజ్ ప్రధానశిష్యుడు. సోక్రటిస్‌కు సంగీతవిద్యాగురువని కొందరంటారు.

చెబుతుండగా విన్నట్లు గుర్తు. భగణాలను గూర్చి ముచ్చటిస్తూ వాటిని ఏదో ఒకవిధంగా కూర్చాడు. ఆ కూర్పేదో సరిగా జ్ఞప్తికి రావటంలేదు. కాని, చరణం ఆరోహణావరోహణాలతో సమంగా ఉండేటట్లు చేశాడు. లగాలతో గూడిన తాళాలను గూర్చి, గలాలతో గూడినతాళాలను గూర్చి ప్రస్తావిస్తూ ఒకటి హ్రస్వాలతోను, మరొకటి దీర్ఘాలతోను ఉంటుందని చెప్పినట్లు గుర్తు. కొన్ని సందర్భాలలో తాళంతోపాటు గణగతినో లేక ఉభయమేళనాన్నో శ్లాఘించటమో నిందించటమో సంభవించింది. అతని తాత్పర్యమేమో నాకు తెలియదు. ఏది ఎలాఉన్నా ఈ విషయాలలో డేమన్‌ను సంప్రదించటం మేలు. ఎందుకంటే ఈ విషయవిచారణ కష్టం.

అవునని అతడన్నాడు.

అందచందాల కలిమిలేములు తాళంమీద ఆధారపడుతవిగదా ?

నిశ్చితంగా అంతే.

మరి తాళం శైలినిబట్టి ఉంటుంది అలాగే శ్రుతులు, అపశ్రుతులు గూడ శైలిని అనుసరిస్తవి. ఎందుకంటే పదాన్నిబట్టి తాళం ఏర్పడుతుంది కాని, తాళాన్నిబట్టి పదమేర్పడదని కదా మనమేర్పరచుకొన్న నియమం?

అవును, పదాన్ని అనుసరించే అవి అన్నీ ఉండాలి.

మరి పదమూ, శైలి మానసికస్థితిపై ఆధారపడుతవి గదా ?

అవును.

మరి తక్కినవన్నీ ఈ శైలిమీదనే కదా ఆధారపడేవి ?

అవును.

శైలీరాగతాళాల రామణీయకం లావణ్యం, నిరాడంబరతమీద ఆధారపడుతవి. నిరాడంబరత అంటే సమ్యగ్వ్యవస్థితమనశ్శీలసంపన్నుని నిరా-

డంబరత గాని, అజ్ఞానానికి పర్యాయపదమైన నిరాడంబరత కాదు. ఏమంటావు?

చక్కగా చెప్పారంటాను.

మనయువకులు తమ జీవితకర్తవ్యం నిర్వహించాలంటే ఈ లావణ్యం, ఈ పొందిక వారికి నిరంతరలక్ష్యాలుగా ఉండనక్కరలేదా?

తప్పక.

చిత్రకారునికళ, సృజనాత్మకమైన ప్రతికళ వీటితో నిండి తొణికిసలాడుతుంటుంది. నేత, కుట్టు, వాస్తువు, ప్రతికర్మ, ప్రకృతి, జంతువులు, తరులతాగుల్మాలు— వీటి అన్నిటిలో లావణ్యభావమో, అభావమో గోచరిస్తున్నది. లావణ్యసామరస్యాలు సద్గుణసంపత్తికి తోబుట్టువులైనట్లే, వికారం, వ్యతికరం దుష్టశబ్దాలకు దుష్టప్రకృతులకు తోబుట్టువులు. ఇవి వాటిని ఆశ్రయించి ఉంటవి.

మీరు చెప్పింది యథార్థమని అతడన్నాడు.

ఇంతకూ "మీకృతులలో భద్రతాప్రతిబింబాన్నే వ్యక్తీకరించాలి. దీనిని ధిక్కరించి అన్యథాకల్పిస్తే రాజ్యబహిష్కారం తప్పదు" అని మనం కవులనుమాత్రమే శాసించాలా? లేక ఇతరకళాఖండనిర్మాతలనుగూడ ఆదేశించాలా? అవగుణం, నిగ్రహరాహిత్యం, అనౌచిత్యం, నైచ్యం-వీనిరూపాలను శిల్పంలో భవననిర్మాణంలో, ఇతరసృజనాత్మక కళాఖండాలలో ప్రదర్శించరాదని నిషేధించాలా? తమసృష్టితో పౌరుల అభిరుచిని కలుషితం చేస్తారు కాబట్టి మనసూత్రాన్ని పాటించని ఎల్ల కళాఖండస్రష్టల స్వైరవ్యాపారాన్ని మనరాజ్యంలో ప్రతిషేధించాలా? మన పాలకులు నైతికవైకల్యప్రతిబింబాల నడుమ పెరగటానికి సమ్మతించము. అనర్థకారణ్యంలో అనుదినం విషమూలికాసేవనం చేసిచేసి వారు తమఆత్మలలో అవినీతి మాలిన్యం పెంపొందించుకొనటానికి అంగీకరించము. సౌందర్యలావణ్యాల యథార్థతత్త్వం వివేచించగలిగినవారే మనకు కలాఖండస్రష్టలుగా ఉండాలి. అప్పుడే మనయువకులు ఆరోగ్యప్రదమైన లోకంలో రమణీయదృశ్యశ్రవ్యాలనడుమ విహరిస్తూ ప్రతి

దానిలోని శివత్వాన్ని గ్రహిస్తారు. నిర్మలప్రశాంతప్రాంతాలనుంచి వీచే మలయమారుతంవలె సత్కృతులనుంచి పొంగిపొరలే సుధాప్రవాహం చక్షుష్కర్ణంద్వారా లోపలికి ప్రవహించి అవ్యక్తంగా ఆబాల్యమూ ఆత్మను వివేచనాసౌందర్యంతో సాయుజ్యసారూప్యం పొందజేస్తుంది.

అంతకన్నా ఉదాత్తశిక్షణ ఏముంటుంది? అని అతడన్నాడు.

గ్లాకన్! ఇతరసాధనాలన్నిటికంటె సంగీతసాహిత్యశిక్షణ అత్యంతశక్తిమంతం. ఎందుకంటే రాగతాళాలు, గుణరీతులు ఆత్మయొక్క అంతరాంతరాలలో ప్రవేశించి దానిని రమణీయం చేస్తవి. వీని వైపరీత్యం ఆత్మను వికృతం చేస్తవి. ఉత్తమమైనవిద్యను పొందినవాడు కళలోను, ప్రకృతిలోను ఉన్నలోపాలను, దోషాలను నిశితబుద్ధితో కనుగొంటాడు. సమ్యగభిరుచిగలిగి శివంకరాన్ని మెచ్చుకొంటాడు; ఆనందిస్తాడు; గ్రహిస్తాడు. గ్రహించి ఉదాత్తుడవుతాడు. చెడుగును చూచి చీకాకుపడతాడు; ఏవగించుకొంటాడు. ఇదంతా కారణం ఎరుగజాలని పిన్నతనంలోనే జరిగిపోతుంది. వివేకవంతుడైనపిమ్మట అట్టి విద్యను బోధించి శివంకరంతో ఆబాల్యపరిచయం కల్పించిన గురువును గుర్తించి నమస్కరిస్తాడు.

అవును. మనయువకులకు సంగీతసాహిత్యవిద్యాశిక్షణ ఆవశ్యకం. మీ అభిప్రాయంతోను, మీ చూపినకారణాలతోను నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

చదువు ప్రారంభించినప్పుడు వర్ణసమామ్నాయమంతా రావాలి. ఏ కలయికలో ఉన్నా, ఏ ప్రమాణంలో ఉన్నా, దానిని గ్రహించగలిగినప్పుడే సంతృప్తి పొందుతాము. అంతే కాని వర్ణాలు చిన్నవా పెద్దవా అని చూడము. కనిపించినచోటనెల్ల వానిని చదువయత్నిస్తాము. అవి ఎక్కడ గోచరించినా గుర్తించగలిగినప్పుడే పఠనవిద్యాపూర్ణత సిద్ధించిందని భావిస్తాము.

అవును.

అక్షరాలు వచ్చిఉంటే వాని ప్రతిబింబాలు జలంలో కనిపించినా అద్దంలో గోచరించినా గుర్తించగలము. కాబట్టి అవగాహనం సిద్ధించి

నప్పుడు అటు మూలాన్ని, ఇటు ప్రతిబింబాన్ని గ్రహింప సాధ్య పడుతుంది.

అవును ఆ జ్ఞానం లేకపోతే లాభంలేదు.

అలాగే మనమైనా, మనవల్ల శిక్షణపొందవలసిన భవిష్యపాలకులైనా ప్రధానతత్త్వాలు ఏ సంశ్లిష్టరూపాలతో ఎక్కడ గోచరించినా, చిన్న వానిలో కనిపించినా పెద్దవానిలో కనిపించినా, ఆలక్ష్యంచేయక గుర్తించి అవి అన్నీ ఒకేకళకు, శాస్త్రానికి చెందినవన్న విశ్వాసం పొంద నంతవరకు విద్యావంతులుగా తలపరాదని నావాదం.

నిజంగా అంతే.

మంచిమనస్సు, చక్కనిరూపు కలిసి ఏకాకృతిపొంది గోచరించినప్పుడది పరమమనోహరదృశ్యమే కదా ?

అవును, కన్నులే ఉండాలి.

పరమమనోహరార్థం పరమస్పృహణీయమే కదా ?

నిజమే.

సమరసాత్ముడు పరమమనోహరమూర్తిని గాఢంగా ప్రేమిస్తాడు గాని, విరసుని ప్రేమించలేడు.

అవును, ఆత్మలో లోపమున్నప్పుడు అలాగే జరుగుతుంది. కాని శారీరక దోషం మాత్రమే ఉన్నప్పుడు మానవుడు సహనపరుడై ఆ వ్యక్తిని ప్రేమిస్తాడు.

ఇట్టి అనుభవం నీకు కలిగినదన్నమాట. దీనిని నేనూ ఒప్పుకొంటాను. కాని ఒకప్రశ్న : సుఖాతిశయానికీ, నిగ్రహానికీ ఏమన్నా సంబంధ మున్నదా ?

ఎలా ఉంటుంది? దుఃఖాతిశయంవలెనే సుఖాతిశయం కూడ మానవుని ఎందుకూ కొరగానీదు.

మరి సద్గుణంతో దానికేమైనా సంబంధమున్నదా?

ఏమీ లేదు.

అతిమాత్రతా నిగ్రహారాహిత్యాలతో దానికి చుట్టరికమున్నదా?

లేకేమి? ఆ ఉభయమూ అత్యంతసన్నిహితం.

మరి స్త్రీపురుషకామంకన్నా అధికమైన సుఖమున్నదా?

అంతకన్నా ఉన్మాదకారి కూడ లేదు.

నిగ్రహవంతమై సరసమైన నియతిసౌందర్యాల ప్రణయమే కదా యథార్థ ప్రణయం?

అవునని అతడంగీకరించాడు.

అలాంటప్పుడు నిగ్రహారాహిత్యం కాని, ఉన్మాదం కాని, యథార్థప్రణయానికి దరిదాపులలో గూడ కనిపించరాదు.

నిశ్చయంగా అంతే.

ఆ పక్షంలో ప్రణయులు ఉన్మాదకనిగ్రహశూన్యసుఖాన్ని దరిచేరనీయరాదు. వారిది యథార్థప్రణయమే అయితే ఆ జంటలో ఎవరికీ దానితో నిమిత్తం ఉండదు గదా?

అవును. అట్టిది సమీపానికి గూడ రారాదు, సోక్రటిస్!

మనం నిర్మిస్తున్నరాజ్యంలో ఈ శాసనం చేస్తామనుకొంటాను. తండ్రి కొడుకువద్ద తీసికొనే చనవుకన్న మించినచనవును మిత్రుడు తనచెలికాని

వద్ద తీసికోరాదు. అదయినా ఉత్తమప్రయోజనాపేక్షతోనే చేయాలి. పైగా దానికి ఆచెలికాని ఆమోదం అతడు పొందాలి. ఇంతకూ చెలిమి మేరలు మీరకుండ నిలుపటానికే ఈ నియమం. అంతకుమించి అతడు వ్యవహరించరాదు. వ్యవహరించాడో అతనిని సంస్కారశూన్యునిగా, మొప్పెగా పరిగణించాలి.

మీతో ఏకీభవిస్తున్నానని అతడన్నాడు.

సంగీతసాహిత్యాలను గూర్చి ఇది చాలు. దీనితో చక్కని సమాప్తి ఏర్పడుతున్నది. ఎందుకంటే సంగీతసాహిత్యాలకు సౌందర్యారాధన కంటె మరొక ప్రయోజనమేమున్నది?

దీనికి నేనూ అంగీకరిస్తాను.

సంగీత సాహిత్యాల తరువాత మనయువకులు అభ్యసించవలసినది వ్యాయామం.

అవును.

సంగీతసాహిత్యాలవలెనే వ్యాయామాన్ని చిన్నతనంలోనే ప్రారంభించాలి. అయితే ఈ శిక్షణ జాగరూకతతో జీవితమంతా కొనసాగాలి. ఈ సందర్భంలో నాకొక అభిప్రాయమున్నది. నీవు కూడ దీనిని సమర్థిస్తావనుకొంటాను. ఏది ఎలాఉన్నా నాకున్న అభిప్రాయం ఇదీ: ఉత్తమ శరీరం తన సద్గుణాతిశయంచేత ఆత్మను సంస్కరించలేదు. కాని ఉత్తమమైనఆత్మ తనగుణాతిశయంచేత దాన్ని సంస్కరించి చక్కబరుస్తుంది. దీనికి నీవేమంటావు?

ఒప్పుకొంటాను.

అలాంటప్పుడు సముచితశిక్షణ పొందినమనస్సుకు మనం శరీరభద్రతను అప్పగించటం యోగ్యమే అవుతుంది. విశేషాలు మాని సామాన్యాంశాలు మాత్రమే చెబుతాను.

మంచిది. అలాగే కానివ్వండి.

పాలకులు మదిరాపానం పరిహరించాలని ఇదివరకే చెప్పుకొన్నాము. ఎందు కంటే పాలకుడు తనబడలు తనకు తెలియక ఏ ప్రపంచంలో ఎక్కడ ఉన్నాడో ఎరుగనిస్థితిలో ఉండరాదు.

అవును, ఆత్మరక్షణార్థం ఒకపాలకుడు మరొకపాలకుని సాయమపేక్షించటం హాస్యాస్పదం.

మరి వారి ఆహారంసంగతి ఏమిటి? ముఖ్యతమమైనపోటీకై వారు శిక్షణ పొందుతున్నారు గదా?

నిజమే.

సామాన్యవ్యాయామశాలుల శారీరకాభ్యాసం వారికి యోగ్యమవుతుందా?

ఎందుకు కాదు?

వ్యాయామశాలుల అభ్యాసం నిదురమత్తు కలిగిస్తుంది. పైగా ఆరోగ్య భంజకం. వారు జీవితమంతా నిద్రపోతుంటారు. ఆహారవిహారాలలో ఏ కొంచెం మార్పు వచ్చినా అత్యంతప్రమాదకరమైన వ్యాధులకు గురి అవుతారు. ఈ విషయం నీవెన్నడూ గమనించలేదా?

నిజమే.

సారమేయాలవలె నిరంతరం జాగరూకులై ఉండవలసిన మనవీరులకు అంతకన్న మేలైనశిక్షణ అవసరం. జైత్రయాత్రకు బయలుదేరినప్పుడు ఎన్నో నీటిమార్పులు, తిండిమార్పులు కలుగుతవి. వేసంగివెట్టకు ఉడికిపోవాలి. చలికాలపు ఇవానికి కొంగరపోవాలి. అట్టిస్థితిలో గూడ వారు నారోగ్యానికి పాల్పడరాదు.

అవును, నా అభిప్రాయం గూడ అదే.

ఉత్తమవ్యాయామమూ, మనం ఇంతకుముందు చెప్పుకొన్న సంగీతసాహిత్య విద్య కవలబిడ్డలవుతవి.

ఎలాగంటారు ?

ఎలాగేమున్నది ? మనం చెప్పుకొన్న సంగీతసాహిత్యాలవలెనే నిరాడంబరమై ఉత్తమంగాఉండే వ్యాయామపద్ధతి ఒకటి ఉన్నది. ముఖ్యంగా సైనికవ్యాయామం ఇలాగే ఉంటుంది.

అంటే ?

నా తాత్పర్యమేమో హోమరే విస్పష్టం చేస్తున్నాడు! యుద్ధయాత్రా నిమగ్నులైన తనవీరులకు అతడు వీరభోజనం కల్పించాడు. హెలిస్పంట్ తీరంలో ఆ వీరులు తమ స్కంధావారం ఏర్పరచుకొన్నా, వారికి మత్స్యాలు లేవు. శూల్యాలు తక్క వండివార్చిన మాంసాలు లేవు. ఇవే సైనికులకు సముచితాహారం. గనగనమండే మంటలు తప్ప మరి కుండలు గాని, పెనములు గాని వెంట మోసికొనిపోనక్కరలేదు.

అవును.

మసాళాలు, తిరుగబోతలు. మధురపదార్థాలు హోమర్ ఎక్కడా పేర్కొనలేదు. వాటిని అలా నిషేధించినవాడు అతడొకడే కాదు, ఇంకా ఎందరో ఉన్నారు. ఆరోగ్యం కాపాడుకొనాలంటే అటువంటి పదార్థాలు వాడరాదని వ్యాయామశాలులంతా చక్కగా ఎరిగిన విషయమే.

అవును. ఇది తెలిసి ఉన్నప్పుడు వాటిని వాడకుండటం సముచితం.

ఆ పక్షంలో సైరక్యూజన్ విందులు గాని, సిసిలియన్ వంటకాలపోకిళ్ళు గాని నీవు ఆమోదించలేవు గదా ?

అవును.

మనుజుడు సరియైనస్థితిలో ఉండాలంటే అతనికి కరింథియన్ కన్య చెలిమికత్తెగా ఉండటానికి సమ్మతిస్తావా?

లేదు.

మరి ఎథీనియన్ వంటకాల నాజూకులు నీకు సమ్మతాలేనా?

కాదు.

అలాంటి ఆహారాలు, జీవనాలు నానారాగతాళబద్ధమైన గీతాలవంటివని చెప్పవచ్చును.

అంతకాక మరేమున్నది?

అక్కడ నానారాగతాళసమ్మేళనంవల్ల విశృంఖలత ఉద్భవిస్తే, ఇక్కడ వీటివల్ల వ్యాధులు సంభవిస్తున్నవి. సంగీతనిరాడంబరత మనోనిగ్రహానికి, వ్యాయామనిరాడంబరత ఆరోగ్యానికి హేతువులు.

యథార్థం.

రాజ్యంలో నిగ్రహరాహిత్యం, వ్యాధి బలిసినప్పుడు న్యాయస్థానాలు, వైద్యశాలలు మెండవుతవి. బానిసలే కాక స్వతంత్రులు గూడ తమ యందు శ్రద్ధాభక్తులు చూపుతున్నప్పుడు న్యాయవైద్యవిద్యలు గీర్వాణం పోతవి.

సహజంగా అంతే.

శ్రామికులు, అధములు మాత్రమే కాక విద్యావంతులమని చెప్పుకొనే వారు కూడ సమర్థులైన వైద్యుల నైపుణ్యం, న్యాయవాదుల వైదుష్యం అభిలషిస్తున్నారంటే విద్యావిధానస్థితి ఎంత ఘోరంగా శోచనీయంగా ఉందో వేరే చెప్పాలా? స్వదేశాలలో లేవు కాబట్టి ఆ శాస్త్రాలకోసం విదేశాలు పోవలసి వస్తున్నదన్నా, పోయి అచట ఇతరులకు తన్ను అప్ప గించుకొని వారిని తనప్రభువులుగా, నియంతలుగా మన్నిస్తున్నాడన్నా

అవమానం కాదా? అదిసుశిక్షణాభావానికి ప్రబలనిదర్శనం కాదా?

అంతకంటె అవమానమేమున్నది?

దానికంటె అనర్థం మరొకటి ఉన్నది. బ్రతికినంతకాలం మానవుడు వివాదగ్రస్తుడై వాదిగానో ప్రతివాదిగానో న్యాయస్థానాలచుట్టూ ప్రదక్షిణం చేస్తుంటాడు. అలాంటివాడు తన వివాదనైపుణ్యానికి ఎంతో గర్విస్తాడు. అబద్ధతలో తానే మిన్ననని భావిస్తాడు. అతడుత్రొక్కని తప్పుడుత్రోవ అంటూ ఉండదు. న్యాయదంష్ట్రల బారిపడక ఎల్లకలుగులు దూరి వెలువడే కుటిలసర్పంవలె వర్తిస్తాడు. నిజపీఠంపై కునికిపాట్లు పడే న్యాయాధికారితో నిమిత్తంలేని నిర్మలప్రశాంత జీవితవిధానం ఎంత సుఖంగా ఉంటుందో ఎరుగడు. ఈ స్థితి వెనుకటిదానికంటె ఘోరం కాదా?

అవును. ఈ అవస్థ మరీ శోచనీయమని అతడన్నాడు.

వ్రణం మాన్పుకోవలసివచ్చినప్పుడో, అంటువ్యాధులు విజృంభించినప్పుడో వైద్యసహాయం కోరటంలో అర్థమున్నది. కాని నిగ్రహం కోల్పోయి, లౌల్యానికి దోసిలొగ్గి, ఆహారవిహారదోషాలతో తమశరీరాలను మురికికూపాలను కావించుకొని, ఔషధసహాయం అభిలషిస్తూ వైద్యులను నూతనవ్యాధినిదానాలకై ప్రోత్సహించటం అవమానకరం కాదా?

నిజమే. వ్యాధులకు విచిత్రనిదానాలు వెలువడుతున్నవి.

అయితే ఎస్క్లిపియస్ (ధన్వంతరివంటివైద్యుడు) కాలంలో ఇలాంటి వ్యాధులుండేవంటే నేను నమ్మను. హోమర్ పేర్కొన్నట్లు ట్రాయ్ నగరంవద్ద యురిపిలస్ క్షతగాత్రుడై అత్యుష్ణదాయిఅయిన కషాయం సేవిస్తాడు. అచటఉన్న మేటివైద్యులు అట్టికషాయమిచ్చిన ఆమెను నిందించలేదు. అతనివ్రణం మాన్పపూనుకొన్న పెట్రోక్లస్ కూడ ఆమెను మందలించలేదు.

ఆ స్థితిలో అట్టి కషాయమివ్వటం విచిత్రంగానే ఉన్నదని అతడన్నాడు.

ఒకటి గుర్తుంచుకొంటే ఇందులో విడ్డూరమేమీ ఉండదు. హెరోడి కస్ కు పూర్వం వైద్యమండలి ఈనాడువలె రోగాలను పోషించి వృద్ధి చేసేవిధానాన్ని బోధించలేదు. హెరోడికస్ మల్లవిద్యాగురువు. పైగా తానోరోగి. వ్యాయామంచేస్తూ ఔషధసేవనంచేసే చికిత్సాపద్ధతి అతడు కనిపెట్టాడు. ఆ పద్ధతితో తన్నుతాను హింసించుకొన్నాడు. తక్కిన లోకాన్ని హింసించే పద్ధతి కనిపెట్టాడు.

అంటే ?

చచ్చినచావూ బ్రతికినబ్రతుకూ గాని స్థితి తెచ్చిపెట్టాడు. మృత్యుంకర రోగానికి గురియై ఏ ప్రొద్దూ తనకు తాను చికిత్స చేసికొంటూ వచ్చాడు. దానితో తిరిగి పూర్తిగా కోల్కొనే అవకాశంలేక జీవితమంతా అవిటి బ్రతుకే అయిపోయింది. ఏరోజూ తనకు చికిత్స చేసికొనక తప్పేది కాదు. పథ్యం ఏనాడు ఏకొంచెం తప్పినా నరకయాతన అనుభవించేవాడు. ఈ విధంగా మృత్యువుకు ఎల్లప్పుడూ భయపడుతూనే, వైద్యశాస్త్ర సహాయంతో ముదుసలితనం వచ్చేటంతవరకు బ్రతికాడు.

నైపుణ్యానికి తగ్గఫలం లభించింది.

అవును, అజ్ఞానానికి తగ్గఫలమే లభించింది. ఎస్క్లిపియస్ తన శిష్యపరంపరకు ఈ విధానం ఉపదేశించలేదంటే తెలియక కాదు. అందులో అనుభవం లేకనూ కాదు. సువ్యవస్థితరాజ్యాలలో ప్రతిపౌరునికి అవశ్యం అనుష్ఠించవలసిన వృత్తి ఒకటి ఉంటుంది. అందువల్ల అతడు నిత్యరోగిగా కాలం దొర్లించటానికి అవకాశం ఉండదు. ఈ సంగతి తెలిసే అతడు ఈ చికిత్సావిధానం బోధించలేదు. అయితే ఇది కష్టజీవికి వర్తించినంతగా భాగ్యవంతులకు వర్తించదని భావిస్తున్నాము.

అంటే మీతాత్పర్యం?

ఏమీలేదు. ఏ వడ్రంగికో జబ్బుచేస్తే, అది త్వరలో నయమయ్యేమార్గం చెప్పవలసిందని వైద్యుని కోరుతాడు. వమనానికో, విరేచనానికో మందు అడుగుతాడు. లేదా వాతతోనో, కోతతోనో తనకు చికిత్స చేయవలసిందని కోరుతాడు. అలాకాక, "నీవు ఇన్నిమాసాలపాటు ఈ యీ ఆహారం

తీసికోవాలి; తలకు ఈ యీ కట్లు కడుతుండాలి; ఆ యా పట్లు వేయాలి'' అని ఏవైద్యుడైనా చెబితే అతడేమనుకొంటాడు? ''వృత్తి మానుకొని ఈ రోగానికి నేనెక్కడ చేతలు చేసేది? అలాంటి అవిటి బ్రతుకు ఉన్నా ఒకటే, ఊడినా ఒకటే'' అని భావించి, ఆ సలహా యిచ్చిన వైద్యునికి స్వస్తిచెప్పి తన అలవాట్లు కొనసాగిస్తాడు. అలా సాగిస్తూ తనవృత్తిని చూచుకొంటాడు. శరీరం నిలవదో మరణిస్తాడు. దానితో అతని చెరే విరగడవుతుంది.

అవును, అతని స్థితిలో ఉన్నప్పుడు వైద్యశాస్త్రాన్ని ఆమేరకే వాడు కోవాలి అని అతడన్నాడు.

అతనికి వృత్తి అంటూ ఒకటి ఉండె. ఆ వృత్తిపోతే జీవితంలో అతనికి కలిగే లాభమేమున్నది? అని నేనన్నాను.

నిజమేనని అతడు అంగీకరించాడు.

మరి భాగ్యవంతునివిషయమంటేనో అలా కాదు. జీవితకాలంలో ప్రత్యే కంగా అతడీపని చేయాలని నిర్బంధం లేదు.

అవును, అతనికట్టిది ఉండదనుకొంటాను.

''బినటానికి ఉన్నప్పుడు మానవుడు పుణ్యం ఆర్జించాలి'' అన్న ఫొసి లైడ్స్♦ సూక్తిని నీవెన్నడు వినలేదా?

వాస్తవానికి ఆపని అంతకుముందే ప్రారంభించాలి.

ఇక్కడ తగాదా దేనికి? అది అలాఉంచి మనం ఒకప్రశ్న ఆలోచిం చాలి. పుణ్యసముపార్జనం భాగ్యవంతునికి కర్తవ్యమా? లేక ఆ సము పార్జనం లేకుండానే అతడు జీవించవచ్చునా? అదే అతని కర్తవ్య మన్నపక్షంలో మనం మరొకప్రశ్నకు కూడ సమాధానం చెప్పు కోవాలి. రోగసపర్యాచరణం వడ్రంగికీ, మరొకశిల్పికీ నిజవృత్తి

---

♦ఇతడు నీతిపద్యాలు వ్రాశాడు.

తత్పరతలో నిరోధకమైనప్పుడు ఫానిలైడ్స్‌నూ క్షితిపాలనలో అది భాగ్యవంతునకు నిరోధకం కాదా?

సందేహం దేనికి? వ్యాయామసూత్రాలను అధిగమించి శరీరం జాగ్రత్తగా కాపాడుకోవలసి వచ్చినప్పుడు అది పుణ్యసముపార్జనక్రియకు ప్రబల శత్రువే అవుతుంది.

అవును. గృహవ్యవహారనిర్వహణలోనేమి, సైనికవ్యవహారనిర్వహణలోనేమి, ప్రభుత్వకార్యాలయవ్యవహారనిర్వహణలోనేమి అదిప్రతిబంధకమే. అంతకన్నా విశేషం మరొకటి ఉన్నది. చదువుకోవాలన్నా, ధ్యానించాలన్నా, ఆలోచించాలన్నా అది ప్రబలప్రతిబంధకమాతుంది. తలనొప్పి వచ్చినా, తలదిమ్ము వచ్చినా దానికి తత్త్వశాస్త్రాధ్యయనం కారణమన్న అనుమానం కలుగుతుంది. ఈ విధంగా పుణ్యసంపాదనకు యత్నిస్తే నిరోధమేర్పడుతుంది. ఎందువల్లనంటే తనకువ్యాధి కలుగుతున్నదని అతడు ఊహిస్తుంటాడు. తన శరీరస్థితిని గూర్చి ఎప్పుడూ ఆందోళనపడుతుంటాడు.

అవును, అలాగే జరుగుతుంది.

అందువల్లనే ఆరోగ్యవంతాలైన దేహాలు, సదభ్యాసాలు ఉండి నిర్దిష్ట రోగపీడితులైనవారికి మాత్రమే ప్రజ్ఞావంతుడైన ఎస్క్లిపియస్ తన వైద్యవిద్యానైపుణ్యాన్ని ప్రదర్శించాడు.ఇలాంటి వ్యాధులను ఔషధాలతోనో, శస్త్రచికిత్సతోనో నయంచేసి యథాప్రకారంగా జీవించండన్నాడు. ఇదంతా కేవలం రాజ్యశ్రేయాన్ని పురస్కరించుకొనే చేశాడు. రోగశీర్ణదేహులకు విపరీతంగా మందులుపోసి కఠోరఆహారనియమాలు దీర్ఘకాలం విధించి, స్వాస్థ్యం కలిగించటానికి అతడుప్రయత్నించిఉండడు. నిరర్థకజీవితాలను పొడిగించటం అతనికిష్టంలేదు. దుర్బలులైన తలిదండ్రులు దుర్బలతరసంతానాన్ని కనటం అతనికి నచ్చదు. సామాన్యపద్ధతిని బ్రతకటానికి మనుజునకు శక్యం కానప్పుడు, అట్టివానికి స్వాస్థ్యం కలిగించవలసిన పనిలేదు. ఎందువల్లనంటే ఆస్వాస్థ్యం అతనికి గాని, రాజ్యానికి గాని ప్రయోజనకారి కాదు.

ఇంతకూ ఎస్క్లిపియస్‌ను మీరు రాజ్యతంత్రజ్ఞునిగా పరిగణిస్తున్నారన్న

మాట.

స్పష్టంగా అంతే. అతని స్వభావం అతనికుమారులవల్ల ఇంకా ఎక్కువగా విశదమౌతున్నది. ప్రాచీనకాలంలో వారు వీరులన్నవిషయం గుర్తుంచుకో. నేను చెబుతున్న చికిత్సావిధానం ట్రాయ్ ముట్టడికాలంలో అవలంబించారు. మెనిలాస్‌ను పాండరస్ గాయపరిచినప్పుడు వారు

"గాయమందుండి దుష్టరక్తమ్ము పీల్చి
హాయిగొల్పఁ జిలికిరి దివ్యౌషధమ్ము."

అన్నపంక్తులు నీకు గుర్తేకదా! అంతేకాని ఆ పిమ్మట ఏ పదార్థాలు తినాలో, ఏవి త్రాగాలో వారు మెనిలాస్‌కు బోధించలేదు. యురిపిలస్ విషయంలో గూడ ఇంతే జరిగింది. వారూహించిన చికిత్సలు గాయం కలుగకముందు ఆరోగ్యవంతుడై సరియైన అలవాటులున్నవాని స్వాస్థ్య కల్పనకు మాత్రమే యోగ్యాలు. అతడు 'ప్రామ్నియన్' ఆసవం సేవించి ఉండకపోయినా తిరిగి కోల్కొని ఉండేవాడు. అంతే కాని అనారోగ్యవంతులు, నిగ్రహశూన్యులు అయి తమకు గాని, పరులకు గాని పనికిరానివారితో ఆ వైద్యులకు ప్రమేయం లేదు. వైద్యవిద్య అట్టివారి ఆరోగ్యప్రదానంకోసం పుట్టలేదు. వారు కుబేరులైనా, ఎస్క్లిపియస్ కుమారులు వారికి మందివ్వ నిరాకరించి ఉండేవారు.

నిజంగా ఆ కుమారులు నిశితబుద్ధులు.

అవును. కాని విషాదాంతరూపకకర్తలు, పిండార్ మన ఆజ్ఞలను ఉల్లంఘించి, ఎస్క్లిపియస్ అపాలోకుమారుడని తెలిసి కూడా మరణోన్ముఖుడైన భాగ్యవంతునివద్ద అతడు డబ్బుపుచ్చుకొని అతని వ్యాధి కుదిర్చాడనీ, ఆ కారణంవల్ల అతడు పిడుగుప్రేటుకు గురి అయ్యాడని అంటారు. మనం లోగడ తేల్చుకొన్న సిద్ధాంతాన్నిబట్టి వారు చెబుతున్నవాటిని నమ్మము. అతడు దేవతాపుత్రుడైతే అతనికేమాత్రం ధనవ్యామోహం ఉండదంటాము. నిజంగా ప్రలోభి అయితే అతడు దేవతాపుత్రుడు కాదంటాము.

సోక్రటిస్! మీరు చెప్పినదంతా బాగానే ఉన్నది కాని, మిమ్మొక ప్రశ్న అడగాలని ఉన్నది. ఎల్లశరీరతత్త్వాలెరిగి ఎట్టి రోగమైనా మాన్పగల వైద్యశ్రేష్ఠులు రాజ్యంలో ఉండనక్కరలేదా? దక్షుడైన

న్యాయాధికారికి ధార్మికాధార్మికుల తత్త్వాలు తెలిసిఉండవలసినట్లే వారికీ శరీరతత్త్వాలు తెలియనక్కరలేదా?

ఉత్తములైన న్యాయాధికారులు, వైద్యులు ఉండాలని నేనూ అంటాను. అయితే ఎవరిని ఉత్తములుగా భావిస్తున్నానో తెలుసునా?

ఎవరిని?

శక్యమైతే చెబుతాను. కాని నీవు పరస్పరసంబంధంలేని ఇరువురిని జోడిస్తున్నావు.

ఏమి చేస్తున్నానంటారు?

వైద్యులకు న్యాయాధిపతులకు పొత్తు కలిపావు. ఉత్తమవైద్యులకు బాల్యంనుంచి వైద్యవిద్యతో పరిచయముండి వ్యాధుల పూర్ణానుభవం సంపాదించాలి. వారికి పూర్ణారోగ్యం ఉండరాదు. వారిశరీరాలు వివిధ వ్యాధులకు గురిఅయి ఉండాలి. ఎందుకంటే వ్యాధిచికిత్సకు వారిదేహాలు సాధనాలు కావు. సాధనాలే అయితే వారు ఏనాడు కూడ ఎట్టివ్యాధికీ గురిఅయి ఉండరాదు. కాని వారు దేహంతో కాక బుద్ధితో వ్యాధిని నివారిస్తున్నారు. ఆ బుద్ధే రుగ్ణమైపోతే వారు ఏ రోగం కుదర్చలేరు.

అతడు నిజమే అన్నాడు.

మరి న్యాయాధికారి విషయంలో అలా కాదు. అతడు తనమనస్సుతో ఇతరమనస్సును అనుశాసిస్తున్నాడు. కాబట్టి అతడు కుటిలబుద్ధులనడుమ పెరుగ నక్కరలేదు. ఆబాల్యం వారితో కలిసి మెలిసి ఉండనక్కరలేదు. రోగుల రోగాలు త్వరితంగా గ్రహించటానికి వైద్యునికి స్వానుభవం ఉండవలసినట్లుగా అపరాధుల నేరాలు త్వరగా గ్రహించటానికి అట్టి నేరాలను స్వయంగా చేసిఉండవలసిన పనిలేదు. ధర్మవిహితంగా తీర్పు చెప్పటానికి నిష్పాక్షికచిత్తుడు బాల్యదశలో అపరాధపరిచయం పొంది ఉండనక్కరలేదు. ఈ కారణంవల్లనే సత్పురుషులు అమాయికులై వంచకుల మోసాలకు గురికావటం సంభవిస్తున్నది. దోషమంటే ఎలా ఉంటుందో ఆ పుణ్యచరిత్రులకు తెలియదు.

అవును, వారు వంచనాసులభులు.

అందువల్లనే న్యాయాధికారి యువకుడు కారాదు. అతడు అపరాధులను తెలిసికోగలిగి ఉండాలి. ఇలాంటిది స్వకీయవృత్తంనుంచి కాక ఇతరుల దుష్టప్రవృత్తిని సుదీర్ఘం పరిశీలించి గ్రహించాలి. అతనికి జ్ఞానమే తోడు గాని, స్వానుభవం మాత్రం కాదు.

ఆదర్శప్రాయుడైన న్యాయాధికారి అలాగే ఉండాలి.

కాబట్టి అతడు సత్పురుషుడై ఉంటాడు (ఇదే నీప్రశ్నకు సమాధానం); బుద్ధిమంతుడే సత్పురుషుడు. ఇప్పుడు వంచకప్రకృతిని, శంకనీయస్వభావాన్ని పరిశీలించాము. అపరాధాలు అనేకం చేసి, వాటిలో తానే మిన్ననని భావించేవాడు తోడివారితో ప్రవర్తించేతీరు చాలవిచిత్రం. ఎందుకంటే తన్నుబట్టి ఇతరులను కొలుస్తాడు. అయితే అతడు అనుభవవృద్ధులైన సత్పురుషులమధ్య చేరినప్పుడు తన నిర్హేతుకశంకలతో మూఢుడుగా కనిపిస్తాడు. తనకు ఋజుత్వం తెలియదు కాబట్టి అతడు సత్పురుషుని గుర్తించలేడు. కాని, లోకంలో సత్పురుషులకంటె దుష్టులు మెండు. కాబట్టి దుష్టసంపర్కం తరుచుగా లభిస్తుంది. కాబట్టి అతడు తన్ను మూఢునిగా భావించక విజ్ఞానిననుకొంటాడు. ఇతరులు గూడ అలాగే భావిస్తారు.

మీ మాటయథార్థమని అతడన్నాడు.

ఇంతకూ మనం అన్వేషిస్తున్నది ప్రజ్ఞాశాలి, సత్పురుషుడు అయిన న్యాయాధికారిని. అంతే కాని అపరాధంలో ఆరితేరినవానిని గాదు. వీనికంటె అతడు అన్యుడు. ఎందువల్లనంటే పాపం పుణ్యాన్ని గుర్తించలేదు గాని, పుణ్యప్రకృతి కాలశిక్షితుడై పాపపుణ్యాల రెంటినీ గుర్తిస్తాడు. నాదృష్టిలో పుణ్యవంతుడే వివేకి కాని, పాపాత్ముడు కాడు.

నా అభిప్రాయం కూడ అంతే.

కాగా నీరాజ్యంలో నీవు ప్రవేశపెట్టే వైద్యవిధానం ఇలా ఉంటుంది. చట్టమూ ధర్మమూ ఇలా ఉంటాయి. వైద్యులు ఉత్తమప్రకృతులకు ఆధి

వ్యాధులు మాన్చి ఆరోగ్యం కలిగిస్తారు. అసాధ్యాలైన రుగ్ణదేహులను మృత్యువునకు వదలివేస్తారు. కలుషితులై మరల్పరాని దుష్టబుద్ధులు ఆత్మనాశనం కలిగించుకొంటారు.

అవును. రోగులకు, రాజ్యానికి అదే ఉత్తమ పద్ధతి.

మనయువకులు మనం నిర్దేశించిన నిరాడంబరవిద్యను పొంది నిగ్రహవంతులౌతారు. వారు న్యాయస్థానాలు ఎక్కటానికి ఒకపట్టున సమ్మతించరు.

అవును.

విద్యావంతుడు కూడ ఇదే మార్గం అవలంబిస్తూ నిరాడంబరవ్యాయామంతో సంతృప్తి పొందుతాడు. ఎప్పుడో వైపరీత్యం సంభవించినప్పుడు తక్క ఔషధంతో అతనికి నిమిత్తం ఉండదు.

అవును.

తనప్రకృతిలో ఉన్నశక్తినీ, ఉత్సాహాన్నీ జాగరితం చేయటానికి అతడు వ్యాయామం చేస్తాడే కాని సామాన్యపుమల్లునివలె కండలు పెంచుకొనటానికి కాదు.

చక్కగా చెప్పారు.

సంగీతవిద్యావ్యాయామాభ్యాసాలు ఆత్మశిక్షణకు దేహరక్షణకు ఏర్పడినవని సామాన్యంగా భావిస్తుంటారు. కాని, వాస్తవానికి వానిలక్ష్యం అది. కాదు.

మరేమిటి?

ఉభయవిద్యలకు ప్రధానలక్ష్యం ఆత్మవికాసమే.

"ఎలాగంటారు?" అతడు జిజ్ఞాసతో అడిగాడు.

మనస్సు కేవలం వ్యాయామమందే లగ్నమైనా, కాక సంగీతవిద్యయందే లగ్నమైనా కలిగేమార్పు నీవెన్నడూ గమనించలేదా?

ఎలాంటి మార్పు వస్తుందంటారు?

ఒకదానివల్ల మొరకుదనం, క్రౌర్యం, రెండవదానివల్ల సౌకుమార్యం, దౌర్బల్యం కలుగుతవి.

నిజమే. వట్టివస్తాదు వన్యజంతువై, వ్యాయామరహితుడైన విద్యావంతుడు అతిసౌకుమార్యదౌర్బల్యకలితుడై ఉంటారు. ఈ క్రౌర్యం మానసికస్థితివల్ల కలుగుతున్నది. సరియైనసంస్కారం పొందితే ఇది ధైర్యంగా మారుతుంది. ఈ సంస్కారణం అతిమాత్రమైతే కాఠిన్యం, మొరకుతనం ఏర్పడుతవి.

అవును.

దీనికి విలక్షణుడై తాత్త్వికుడు సౌమ్యంగా ఉంటాడు. ఈ సౌమ్యత్వం అతిమాత్రమైనప్పుడు సౌకుమార్యంగా మారుతుంది. సముచితశిక్షణ పొందినప్పుడు సౌమ్యత, సమత్వం ఏర్పడుతవి.

అది యథార్థం.

మన మతంప్రకారం పాలకులకు ఈ రెండుగుణాలు ఉండాలి కదా?

తప్పదు.

ఈ రెంటికీ సామరస్యం ఏర్పడాలి.

అవును.

సమరసచిత్తం నిగ్రహవంతమై ధీరంగా ఉంటుంది.

నిజమే.

సమరసభావం లేని ఆత్మ భీరువూ మూర్ఖమే కదా?

అవును.

సంగీతప్రభావానికి లోగి మానవుడు తన శ్రవఃపుటాలతో కోమలమధుర రాగాలాపాలను గ్రోలినప్పుడు గీతానందంలో అతనిప్రాణాలు ఓలలాడుతవి. ప్రారంభంలో ఉత్సాహకలితంగా ఉన్నా అతనిఆత్మ పెళుసైకొరమాలక ఉక్కువలె పదునెక్కుతుంది. ఈ ఆర్ద్రీకరణం, మార్దవీకరణం ఇంకా కొనసాగితే అతడు ఆదశలో ద్రవీభావం పొందనారంభిస్తాడు. ధైర్యోత్సాహాలు నశిస్తవి. ఆత్మలోని సుస్థిరత కూడ ధ్వంసమైపోతుంది. అతడు దుర్బలయోధ అవుతాడు.

అది అక్షరాల నిజం.

అతనిలోని ధృతి దుర్బలంగా ఉన్నప్పుడు ఈ చెప్పిన పరిణతి త్వరితంగా జరిగిపోతుంది. ఆ ధృతి మెండుగా ఉంటే ఆత్మద్రవీభావశక్తమైన సంగీతం అతనికి చిరాకు కలిగిస్తుంది. అల్పకారణానికే మండిపడి అంతలో శాంతుడవుతాడు. ధృతిమంతుడై ఉండటానికి బదులుగా అతడు ఉద్ధతస్వభావం పొంది కార్యశూరతను కోల్పోతాడు.

అవును. అలాగే జరుగుతుంది.

అలాగే వ్యాయామాధిక్యంవల్లకూడ సంభవిస్తుంది. తీవ్రంగా వ్యాయామం చేస్తూ, అధికంగా భుజిస్తున్నప్పుడు సంగీతతత్త్వశాస్త్రాభ్యాసిగుణాలకు విపరీతాలైనగుణాలు సంక్రమిస్తవి. శారీరకఉచ్చస్థితివల్ల గర్వోత్సాహాలు ఉద్దీపించి అతడు రెండింతలవుతాడు.

నిశ్చయంగా అంతే జరుగుతుంది.

అలాంటప్పుడు ఏమి జరుగుతుందో తెలుసా? మరొకపనిలేక విద్యావ్యాసంగం కలుగనప్పుడు అతనికున్న కొలదితెలివితేటలు గూడ మందగిస్తవి. విద్యాభ్యాసం, జిజ్ఞాస, ఆలోచన, సంస్కారం లేకపోవటంవల్లా, మనస్సు జాగృతి పొందకపోవటంవల్లా, పెట్టుపోతలు లేకపోవటంవల్లా,

ఇంద్రియకాలుష్యం క్షాళితం కాకపోవటంవల్లా తెలివితేటలు అంధాలై పోతవి.

నిజంగా అలాగే జరుగుతుంది.

దానిపర్యవసానంగా అతడు అనాగరకుడై యుక్తిప్రయోగంతెలియని తత్త్వద్వేషిగా తయారవుతాడు. అంటే ఆటవికజంతువుగా, హింసా క్రౌర్యమూర్తిగా తయారవుతాడు. మరొకతీరున వ్యవహరించటం అతనికి తెలియదు. అతడు అజ్ఞానంతో, పాపపుంజంతో కాపురం చేస్తుంటాడు. ఔచిత్యం, లాలిత్యం అంటే ఎలా ఉంటవో తెలియనిస్థితిలో ఉంటాడు.

అవును.

మానవప్రకృతికి రెండు లక్షణాలున్నవి: ఒకటి ఉత్సాహం, రెండు జిజ్ఞాస. ఏ దైవమో వీనికి అనుకూలంగా రెండు విద్యలను మానవజాతికి ప్రసాదించింది. తంత్రీవాద్యంలోని విభిన్నతంత్రులను సడలించికాని, బిగించికాని ఏకశ్రుతికి లగించవలసినట్లే ఈ రెంటిని గూడ సమరస భావానుగుణంగా లగించుకొనటానికి ఆ దైవం అనుగ్రహించింది.

అదే తాత్పర్యమైనట్లు కనిపిస్తున్నది.

విద్యను సముచితపద్ధతిలో వ్యాయామంతో మిశ్రితంకావించి ఆత్మాను గుణంగా తయారు చేయగలిగినవాడు విద్వాంసుడు. తీగలను లగింపగలి గినవానికంటె అతడే ఉత్తమపండితుడు.

సోక్రటీస్ ! మీరన్నది యథార్థం.

పరిపాలన కొనసాగవలెనంటే అలాంటి పర్యవేక్షకప్రతిభ మనరాజ్యానికి నిరంతరం కావాలి.

అవును. అలాంటి ప్రతిభావంతుడావశ్యకం.

మొత్తమ్మీద ప్రకృతిలక్షణాలూ, విద్యావిధానలక్షణాలు ఇవి. అలాంటప్పుడు పౌరులనాట్యాలు, మృగయావిహారాలు, వ్యాయామవిశేషాలు, ఆశ్వికవిద్యాప్రదర్శనవివరణలు ప్రత్యేకంగా చర్చించి ప్రయోజనమేముంది? వీని వివరాలన్నీ ప్రధానసూత్రమ్మీద ఆధారపడుతవి. ఆ ప్రధానసూత్రం కనుగొన్నతరువాత వీటిపరిష్కారం కష్టం కాదు.

అవును. కష్టమేమున్నది?

సరే, తరువాతిప్రశ్న యేమిటి? పాలకులెవరో పాలితులెవరో తేల్చవలసి ఉంటుందా?

అవును.

పెద్దవాడు పిన్నవానిని శాసించాలి. ఇక్కడ సందేహం లేదు గదా?

లేదు.

అంటే ఉత్తములు పాలించాలి.

అది నిర్వివాదం.

సరే, ఉత్తమకర్షకులెవరు? కర్షణంలో అత్యంతంగా నిపుణులైనవారే కదా?

అవును.

మనరాజ్యపాలకులు ఉత్తమపాలకులై ఉండాలి. కాబట్టి పాలకలక్షణం అత్యంత అధికంగా ఉన్నవారే పాలకులు కావాలి.

నిజమే.

లక్ష్యసిద్ధికి వలసినప్రజ్ఞాసామర్థ్యాలు కలిగి రాజ్యంలో ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

అవును.

తాను ప్రేమిస్తున్న దానియందే మానవుడు ఎక్కువ శ్రద్ధవహిస్తాడు గదా ?

అవును.

తనహితాహితలక్ష్యాలక్ష్యాలకు సమానమైన హితాహితలక్ష్యాలక్ష్యాలు కలదానిని అతడు మిక్కిలిగా ప్రేమిస్తాడు గదా ?

అవును.

ఇప్పుడు అలాంటివారిని నిర్ణయించవలసిఉంది. తమ దేశశ్రేయస్సుకోసం పాలకులలో ఎవరు యావజ్జీవం పరమశ్రద్ధ వహిస్తారో, దేశఅహితాచరణ మందు తీవ్రమై ముఖ్యద్వేషాలు ప్రకటిస్తారో గుర్తించాలి.

అవును. అలాంటివారే యోగ్యులు.

ప్రతిదశలోను వారు తమసంకల్పాన్ని పాలిస్తూ, బలప్రయోగంవల్ల గాని, ప్రచారవ్యామోహంవల్ల గాని రాజ్యవిషయంలో తమకున్న విధిని విస్మరించక పరిత్యజించక జాగరూకులై మెలగుతున్నారో లేదో పరిశీలించాలి.

పరిత్యజించటమా ? అది ఎలా సంభవం ?

వివరిస్తున్నాను గదా ! ఇష్టపూర్వకంగా గాని, తత్ప్రతికూలంగా గాని సంకల్పంనుంచి మానవునిమనస్సు ప్రచ్యుతి పొందవచ్చును. ఒకటి అసత్యమని గుర్తించి, సత్యమేదో తెలిసికొన్నప్పుడు మానవుడు ఇష్టపూర్వకంగా మారుతాడు. సత్యం తెలియనప్పుడు తనకిష్టం లేకపోయినా మారుతాడు.

ఇష్టపూర్వకంగా ఒకసంకల్పాన్ని జారవిడవటమనేది అర్థమవుతున్నది. కాని ఇష్టంలేకుండా సంకల్పాన్ని జారవిడవటమంటే అర్థం కావటం లేదు.

మానవులు అనిష్టతతో మంచిని, ఇష్టతతో చెడుగును కోల్పోవటం నీవు చూడలేదా? సత్యప్రాపణమే మేలు, సత్యాపనయమే కీడు గదా? మరి వస్తువులను యథాతథంగా గ్రహించటమే సత్యం గ్రహించటమని అంగీకరిస్తావు గదా?

ఆc. తనకిష్టం లేకుండానే మానవజాతి సత్యవంచితమాతున్నదన్న మీ అభిప్రాయంతో నేనేకీభవిస్తాను.

మరి ఈ అనిచ్ఛాపూర్వకవంచనం చౌర్యంవల్లనో, బలప్రయోగంవల్లనో, మోహంవల్లనో ఆపాదింపబడుతున్నది.

మీ తాత్పర్యమింకా బోధపడలేదు.

అయితే నేను విషాదాంతరూపకకర్తలవలె అవ్యక్తంగా మాటాడుతున్నానేమోనన్నశంక కలుగుతున్నది. కొందరు మానవులు ఉపదేశంవల్ల మారుతారు; ఇతరులు మరపువల్ల మారిపోతారు. యుక్తి ఒకతరగతివారి మనస్సును హరిస్తుంది; కాలం తదన్యుల మనస్సు హరిస్తుంది. దీనినే నేను చౌర్యమంటాను. ఇప్పుడు నా తాత్పర్యం బోధపడిందా?

ఆc.

బలవంతాన మారినవారంటే బాధాతిశయంచే గాని, దుఃఖోత్కటతచే గాని తమ అభిప్రాయం మార్చుకొన్నవారు.

బోధపడుతున్నది. మీరుచెప్పినది యథార్థం.

సమ్మోహితులంటే మృదుసుఖప్రభావంవల్ల గాని, కఠోరభీతిప్రభావంవల్ల గాని తమమనస్సు మార్చుకొన్నవారంటాను. దీనికి నీవు అంగీకరిస్తావా?

తప్పక. వంచించేప్రతిదానిని సమ్మోహకమని అనవచ్చును.

కాబట్టి ఎవరు రాజ్యశ్రేయస్సే తమజీవితలక్ష్యం కావించుకొని దానిని అత్యంతభద్రంగా కాపాడుకొంటారో మనం పరిశీలించాలి. చిన్నతనం

నుంచి వారిప్రవర్తనం కనిపెడుతుండాలి. తమలక్ష్యం మరచిపోవటానికీ, వంచితులు కావటానికి తగినకార్యకలాపాలు చేయించాలి. అప్పటికీ లక్ష్యం మరవక, వంచనకు పాల్పడక నిలిచినవారిని ఎన్నుకోవాలి. ఈ పరీక్షలో ఓడినవారిని త్రోసివేయాలి. ఇది సముచితమార్గమంటావా ?

అవును.

ఈ గుణాలున్నవని తేల్చుకొనటానికి కష్టాలు, సుఖాలు, సంఘర్షణలూ కల్పించాలి.

ఇది చక్కగా ఉన్నది.

ఆ తరువాత వారిపై సమ్మోహకాలను ప్రయోగించి వారిని పరీక్షించాలి. ఇది మూడోపరీక్ష. వారిప్రవర్తన అప్పుడు గూడా ఎలా ఉంటుందో చూడాలి. గుర్రానికి బెదురున్నదో లేదో తేల్చుకొనటానికి సంకులధ్వని పొడమేచోటికి కొనిపోతాము. అలాగే మనయువకులను కూడ భయానక ఘట్టాలలోనికి కొనిపోవాలి. మళ్ళీ సుఖాలు కల్పించాలి. అగ్నిలో సువర్ణవిశుద్ధిని పరీక్షించినదానికంటె మిన్నగా పరీక్షించాలి. సర్వమోహాలకు అతీతులో కాదో, సదా ఉదాత్తస్వభావులుగా ఉంటారో లేదో, తమ్మూ, తమ నేర్చినవిద్యనూ చక్కగా పరిరక్షించుకొంటారో లేదో, వ్యక్తికీ సమాజానికీ పరమప్రయోజనకారి అయిన సమరసభావాన్ని ఏ పరిస్థితులలోను కోల్పడక ఉంటారో లేదో తేల్చుకోవాలి. బాల్యయౌవనకౌమార దశలన్నిటిలో ఈ పరీక్షలన్నిటికి నిలిచి నెగ్గినవానిని రాజ్యపాలకునిగా, రక్షకునిగా నియోగించాలి. బ్రతికిఉండగాను, చనిపోయినతరువాతను గూడ అతనిని సమ్మానించాలి. చనిపోయినప్పుడు సమాధి మున్నుగాగల స్మారకచిహ్నాలు నెలకొల్పి మనం చేయగల ఉత్తమ సత్కారాలు చేయాలి. పరీక్షకు నిలవక ఓడినవారిని నిరాకరించాలి. ఇట్టిపద్ధతిని పాటించి పాలకులను, రక్షకులను ఎన్నుకొని కర్తవ్యమందు నియోగించాలి. నేను సామాన్యాంశాలను మాత్రమే పేర్కొంటున్నాను గాని విశేషాలను చెప్పటంలేదు.

ఇవి సామాన్యాంశాలని నేనూ అంగీకరిస్తానని అతడన్నాడు.

విదేశీయశత్రువులనుంచి మనలను కాపాడుతూ, మనకపకారం చేయాలన్న సంకల్పం కాని, శక్తి కాని ఎవనికీ లేకుండాచేసి పౌరులందు శాంతిని పోషించే ఈ ఉత్తమవర్గానికే సార్థకమైన రక్షకపదం వర్తించాలి. రక్షక శబ్దంతో మనమిప్పుడు పేర్కొన్నయువకులను అనుబంధులనుగా, పాలక ధర్మత్రాతలనుగా వ్యాహరించవచ్చును.

మీ అభిప్రాయాలతో నేనూ ఏకీభవిస్తానని అతడన్నాడు.

ఇంతకుముందు ప్రయోజనకారులైన అసత్యాలను గూర్చి ప్రస్తావించాను. అలాంటి మహోదాత్త అసత్యాన్ని చెప్ప వీలైతే పాలకులను నమ్మించాలి. వారిసంగతి ఎలాఉన్నా తలిమ్మారాజ్యాన్నైనా వంచించటం అవసరం. ఇది ఎలా సాధ్యం ?

ఏ అసత్యం చెప్పాలంటారు ?

క్రొత్తది కాదు. కేవలం ఫినిషియన్ కథ. ఇది ఈనాటిది కాదనుకో. ఇంతకు ముందిది ఇతరప్రాంతాల్లో పెక్కుచోట్ల జరిగినట్లు కవులు చెబుతున్నారు. అలాంటి సంఘటన మరొకసారి తిరిగి సంభవిస్తుందో లేదో చెప్పలేను. దానిని ఇప్పుడు సంభావ్యంగానైనా చేయవచ్చునో లేదో తెలియదు.

మీమాటలు ఎంతగా తొట్రిలుతున్నవి !

వింటే నాసంకోచానికి విస్మయపడవు.

శంకదేనికి ? చెప్పండి.

సరే చెబుతాను. కాని నీవంక చూడటానికి ముఖం చెల్లటం లేదు. అసలు ఈ అభూతకల్పనను ఎట్లు వ్యక్తంచేయాలో తోచటం లేదు. ఏది ఎలాఉన్నా దీనిని ముందు పాలకులకు, పిమ్మట సైనికులకు, ఆమీద ప్రజలకు చెప్పాలని ఉద్దేశిస్తున్నా. వారి శైశవం స్వప్నం. మననుండి వారు పొందిన విద్యాబుద్ధులు కేవలం ఆభాసాలు. ఆ కాలంలో వారు నిజానికి వసుంధరాదేవి గర్భంలోనే ఉన్నారు. అచటనే వారి కరచర

ణాద్యవయవాలన్నీ పుట్టి పెరిగినవి. అలా సంపూర్ణదేహాలు ఏర్పడిన పిమ్మట నే వారిజనయిత్రి అయినభూదేవి వారిని బాహ్యప్రపంచంలోనికి కొనివచ్చింది. కాబట్టి వారి మాతృదేశమే వారిజనయిత్రి; స్తన్యమిచ్చి పెంచినదాది. ఆమె క్షేమానికై వారు పాటుపడాలి. శత్రుదండయాత్ర నుంచి ఆమెను వారు రక్షించాలి. పౌరులంతా భూదేవిసంతానం. అందరూ అన్నదమ్ములు.

మీ చెప్పబోతున్న అసత్యానికి సిగ్గిల్లటంలో ఆశ్చర్యమేమీ లేదని అత డన్నాడు.

అప్పుడే ఏమయింది? సగమే చెప్పాను. మిగిలినది అలాగే ఉన్నది. పౌరులకు మనం చెప్పాలి: మీరంతా సోదరులు. కాని ఈశ్వరుడు మిమ్మ విభిన్నంగా సృష్టించాడు. మీలో కొంతమందికి శాసనశక్తి ఉన్నది. అలాంటివారిని ఈశ్వరుడు సువర్ణంతో నిర్మించాడు. కాబట్టి వారు పరమ మాన్యులు. సైనికులను (అనుబంధులను Auxiliaries) రజతంతో నిర్మించాడు. కర్షకులను, ఇతరవృత్తులవారిని ఇత్తడి ఇనుము ఉపయోగించి సృష్టించాడు. ఈ జాతులు సామాన్యంగా సంతానంతో సురక్షితాలవుతవి. ఆదిలో అంతా ఒకేజాతివారైనా, స్వర్ణమయులైన పితరులకొక్కొక్కప్పుడు రజతమయుడైన పుత్రుడూ, రజతమయులైన పితరులకు స్వర్ణమయుడైన పుత్రుడూ ఉద్భవిస్తారు. జాతిస్వచ్ఛతాభిరక్షణకంటె పాలకులకు రక్షణీయమైన ఉత్తమధర్మం మరొకటి లేదు. ఇది ఈశ్వరుని ఆజ్ఞ. తమసంతతిలో ఏ యే ధాతువులు ఎలా సమ్మిశ్రితాలవుతున్నవో వారు కనిపెట్టిఉండాలి. స్వర్ణమయులైన పితరులపుత్రునిలో ఆరకూటలోహాల సమ్మేళనం సంభవిస్తే ఆతని ఉన్నతప్రతిపత్తిని ప్రకృతి మార్చివేస్తుంది. శిశువుపతితుడై కర్షకుడో అన్యవృత్తిపరుడో అవుతున్నాడని పాలకుడు జాలిపడరాదు. స్వర్ణసమ్మిశ్రణమో, రజతసమ్మిశ్రణమో కలిగిన అన్యవృత్తిపరులసంతతి ఉన్నతప్రతిపత్తి పొంది రక్షకులో, సైనికులో కావచ్చును. కాబట్టి పాలకుడు కారుణ్య క్రోధాలకు తావీయక జాగరూకుడై ప్రవర్తించాలి. ఎందువల్లనంటే ఆరకూటప్రకృతివాడో, లోహప్రకృతివాడో రాజ్యపాలకుడైతే రాజ్యం నశిస్తుందన్నశాపం ఉన్నది. మొత్తమ్మీద ఇదీ కథ. మనపౌరులను ఈ కథ నమ్మించ వీలుపడుతుందా?

ఈ తరంలో సాధ్యంకాదు. అందుకు మార్గం లేదు. కాని ఇప్పటివారి

సంతతిని, ఆ సంతతిసంతతిని, ఆతరువాతితరాలవారిని ఈ కథలు యథార్థమని నమ్మించవచ్చునని అతడన్నాడు.

అవును, ఉన్న చిక్కు కనిపిస్తూనేఉన్నది. అయినా ఇలాంటి విశ్వాసం ప్రచారమైతే పౌరులు తమరాజ్యమందూ, పరస్పరశ్రేయస్సునందూ అధిక శ్రద్ధవహిస్తారు. ఈ కట్టుకథ, ఈ కింవదంతి రెక్కలార్చి ఎల్లచోట్ల విహారం చేయాలి. మన వసుంధరాసంజాతవీరులను ఆయుధసన్నద్ధులను కావించి పాలకులనాయకత్వాన నడుపుదాము. వారు చుట్టుపట్లు పరిశీలించి దుర్గమప్రదేశంలో స్థావరమేర్పరచుకోవాలి. ఆ ప్రదేశం తమలోని తిరుగుబాటుదారులను, వృకసందోహంవలె వచ్చి పైబడే బాహ్యశత్రుసమూహాన్ని అణచివేయటానికి అనువుగా ఉండాలి. అలాంటిచోట స్కంధావారమేర్పరచుకొని దేవతాబలులు సమర్పించి ఆవాసాలు సన్నద్ధంచేసికోవాలి.

అవును, అలాగే చేయాలి.

వారి ఆవాసాలు చలివేట్టల తీంద్రనుంచి కాపాడేవిగా ఉండాలి.

అంటే వారిగృహాలనేగా మీభావం ?

అవును, అవి సైనికుల ఆవాసాలుగా ఉండాలి గాని, అంగళ్ళవలె ఉండ రాదు.

"ఈ రెంటికి భేదమేమిటి ?" అతడు ప్రశ్నించాడు.

ఇదిగో నాచేతనైనట్లు వివరిస్తున్నానుగా:—గొఱ్ఱెలకాపునకు నియోగించిన జాగిలాలు శిక్షణాభావంవల్లనో, క్షుద్బాధవల్లనో, మరొక దురభ్యాసం వల్లనో తోడేళ్ళవలె గొఱ్ఱెలపైబడి బాధిస్తవనుకో. అది ఘోరద్రోహం కాదా ?

అంతకన్న దారుణమేముంటుంది ?

అలాగే సామాన్యపౌరులకంటె బలవంతులైన మనసైనికులు ప్రజలకు

మిత్రులూ, సహచరులూ కావటానికిబదులు మితిమీరి క్రూరనియంతలు కారుగదా ?

నిజమే, దానికి తగిన కట్టుదిట్టాలు చేయాలి.

సరియైన విద్యావిధానం ఉత్తమరక్షణ కల్పించదా ?

ఇదివరకే వారు ఉత్తమశిక్షణ పొందారు కదా ?

ఏమో గ్లాకన్ ! నాకు అంతగా నమ్మిక చిక్కటం లేదు. కాని వారు అలాగే ఉండాలి. సరియైన విద్యావిధానం— దాని స్వరూపం ఎలా ఉన్నా— పరస్పరసంబంధాలలోనేమి, పాలకపాలితసంబంధాలలోనేమి వారిని నాగరకులనుగా, మానవులనుగా మార్చే అవకాశం మెండు.

అవును.

కేవలం వారివిద్య మాత్రమే కాదు, వారినివాసాలు, ఆస్తిపాస్తులు పాలకులకు ఉండవలసినలక్షణాలను భగ్నపరచి ఇతరపౌరులను వేధించుకొని తినటానికి ప్రోత్సహించవు. జ్ఞానవంతుడెవడైనా ఈమాత్రం అంగీకరించక తప్పదు.

అవును.

మరి మనం ఉద్దేశిస్తున్నలక్ష్యం సాధించాలంటే వారిజీవితవిధానం ఎలా ఉండాలో చూదాము. ఆవశ్యకతకు మించిన ఆస్తిపాస్తులేవీ వారికి ఉండరాదు. ఇది ప్రథమసూత్రం. ఎవరైనా చూడాలనుకొంటే ప్రవేశించరాని ఇల్లుగాని, భాండాగారం గాని సొంతంగా వారికి ఉండగూడదు. నిగ్రహం, ధైర్యం కలిగినయోధులకు వలసిన యోగ్యవస్తుసామాగ్రి మాత్రమే పౌరులనుంచి పుచ్చుకొనటానికి వారు అంగీకరించాలి. వారు సువారాలకు పోయి శిబిరాలలో వసించేసైనికులవలె కలసిమెలసి ఉండాలి. స్వర్ణరజతాదులు తమకు ఈశ్వరునివల్ల లభిస్తవని మనం వారికి చెబుతాము. ఆ ఉత్తమలోహం వారిలోనే ఉన్నది. కాబట్టి తుచ్ఛములైన భౌతికసువర్ణరజతాలతో వారికి నిమిత్తం లేదు. ఆ నీచద్రవ్యస్వీకారంతో వారు తమ

దివ్యప్రకృతిని అపవిత్రం చేసికోరాదు. ఎందువల్లనంటే ఎల్ల అపవిత్రకృత్యాలకు అదే మూలం. పైగా అది నశ్వరం. వారి ప్రకృతి అంటేనో నశించేది కాదు. నగరవాసులలో వీరు మాత్రమే బంగారం కాని వెండికాని ముట్టరాదు. అవి ఉన్న ఇంట ఉండరాదు. వాటిని ధరించరాదు. వానితో చేసినపాత్రలనుంచి నీరైనా తాకరాదు. ఇదే వారికి తారకం. అలాంటి వారే రాజ్యత్రాతలు. ఎప్పుడైనా ఇల్లువాకిలి, పొలంపుట్ర, గొడ్డుగోద ఏర్పడితే వారు రక్షకులు కారు, గృహస్థులౌతారు; రైతులవుతారు. ఇతర పౌరులకు మిత్రులుకాక పరమశత్రువులు ఘోరనియంతలు అవుతారు. తమ్ము ఇతరులు ద్వేషిస్తారు. ఇతరులను తాము ద్వేషిస్తారు. తాము కుతంత్రాలు సాగిస్తారు. ఇతరులు తమపై కుతంత్రాలు పన్నుతారు. బాహ్యశత్రువులకంటె అంతశ్శత్రులవలన జీవితమంతా దుర్భరభయానకావస్థలో గడపవలసివస్తుంది. అనతికాలంలోనే తమకూ, తక్కినరాజ్యానికీ వినాశం కలుగుతుంది. మనం పేర్కొని కారణాలింకా అనేకం ఉన్నవి. వీటిని బట్టి మనరాజ్యం ఈ విధంగా వ్యవస్థితం కావాలి. పాలకుల ఆవాసాదిక విషయాలలో మనం నిర్దేశిస్తున్న ఈనియమాలు ఉండాలి. అవునా?

గ్లాకన్ అంగీకరించాడు.

# నాలుగవ ప్రకరణం

యాడైమాంటస్ అడ్డుగా ప్రవేశాడు: సోక్రటిస్! నిజంగా మీరు వారిని శోచనీయావస్థ పాలుచేస్తున్నారు. వారు కూడ తమదుఃస్థితి తామే తెచ్చిపెట్టుకొంటున్నారు. వాస్తవానికి రాజ్యం వారిది. కాని, దానివల్ల వచ్చి ఒరుగుతున్నది లేదు. ఇతరులు భూములు సంపాదించుకొని పెద్దపెద్దలోగిళ్ళు కట్టుకొని దేవతలకు స్వయంగా బలులు, అతిథిఅభ్యాగతులకు సత్కారాలు కావిస్తుంటారు. ఇంట వెండిబంగారాలు తడబడుతుండగా వారు లక్ష్మీపుత్రులై ఇంద్రభోగం అనుభవిస్తుంటారు. ఇక మన నిర్భాగ్యులో కైజీతగాండ్రకంటె మిన్నకాక నిరంతరం అశ్వారూఢులై ఉంటారు. వారికిలాంటి దుఃస్థితి కల్పిస్తున్నారని అంటే మీసమాధానమేమిటి ?

అంత నేను అందుకొన్నాను:— ఔనౌను. ఏదో మొగాన ఇంత తిండి వేస్తున్నారే కాని, ఇతరులకిచ్చినట్లైనా వారికి డబ్బు ఇవ్వటం లేదు. ఎప్పుడైనా వారికి బుద్ధిపుట్టి వాహ్యాళికి వెళ్ళాలనుకొంటే వీలుండదు. కోరుకొన్నకాంతతో కులాసాగా గడపాలన్నా, ఇష్టమైన వస్తువు కొనుక్కోవాలన్నా డబ్బు ఉండదు. ఇలాంటి అధిక్షేపాలు ఎన్నైనా ఏకరువుపెట్టవచ్చును.

ఈ అధిక్షేపాలన్నీ ఉన్నాయనుకోండని అతడన్నాడు.

అంటే దీనికి అంతకూ మీసమాధానమేమి అనేగా నీతాత్పర్యం? అని నేను అతనిని ప్రశ్నించాను.

అవును.

వెనుక చెప్పుకొన్న మార్గమనుసరిస్తే మనకు సమాధానం లభిస్తుందని

నా విశ్వాసం. అలాంటి స్థితిలో ఉన్నవారు మానవులలో పరమసుఖులు కావచ్చును. ఇంతకూ మన ప్రధానలక్ష్యమేమిటి? ఏ ఒకవర్గానికో అధిక సుఖం కల్పించటం కాదు. ప్రజానీకమంతా గరిష్ఠసుఖం పొందాలి. సమాజానికి అంతకూ భద్రమెంచి వ్యవస్థీకరించినరాజ్యంలో మనకు న్యాయం గోచరించేఅవకాశం మెండు. దుర్వ్యవస్థితరాజ్యంలో అన్యాయం గోచరిస్తుంది. అలాంటి రాజ్యాలను పరిశీలించినపిమ్మట అందులో ఏది సుఖవంతమో మనం నిర్ణయించవచ్చును. ప్రకృతం మనం సుఖవంతమైన రాజ్యం వ్యవస్థాపిస్తున్నాము. ఈ వ్యవస్థాపన ఏ కొలదిమంది సుఖసంపాదనకో కాదు. ఎల్లవర్గాలు సుఖవంతంగా ఉండటానికి రాజ్యం వ్యవస్థాపిస్తున్నాము. ఇది పూర్తి అయినపిమ్మట తద్విపరీతరాజ్యం కూడ పరిశీలింతాము. మనం ఒకబొమ్మ గీస్తున్నామనుకో. ఎవరో ఒకరు మనదగ్గరకు వచ్చి "అందమైన అవయవాల చిత్రణకు అందమైన రంగులు వాడరేమిటి? కన్నులు పింగళంగా ఉండాలి. మీరు నల్లరంగు పూస్తున్నారేమిటి?" అని అంటారేనో, వారితో ఏమంటాము? "కన్నులు కన్నులువలె కనబడనంత రమణీయంగా వ్రాయమనరు కదా? ఈ వన్నెతో వీనిని చిత్రించి తక్కిన అవయవాలు వీనికనుగుణమైన వర్ణాలతో చిత్రించినప్పుడు బొమ్మ అంతా అందంగానే ఉంటుంది" అని అంటాము. అలాగే పాలకులను పాలకులుగా ఉండనీయని సౌఖ్యం కల్పించవలసినదని నీవు బలవంతపెట్టకు. ఎందువల్లనంటే రైతులకు కూడ మేము మహారాజులవేషాలు వేయగలము. వారిశీర్షాలకు స్వర్ణకిరీటాలు పెట్టగలము. నీవు కోరినట్లే ముస్తాబు చేయగలము. కుంభకారులకు హంసతూలికాతల్పసౌఖ్యం కల్పించగలము. వెచ్చవెచ్చని అగ్నిహోత్రుని సన్నిధానంలో విందులు చేయించవచ్చును. సారెను అందికలో నిల్పి అతనికిచ్చవచ్చినంతసేపే దానిపై పనిచేయించగలము. ఈ విధంగా ప్రతివర్ణాన్ని సుఖవంతం చేయవచ్చును. అలా చేస్తే రాజ్యమంతా సుఖంగా ఉంటుందని నీఊహ. ఇలాంటిభావం మా తలకెక్కించకు. నీమాట వింటే రైతు రైతు కాడు, కుమ్మరి కుమ్మరి కాడు. రాజ్యంలో ఎవనికీ ఏ ప్రత్యేకవర్ణలక్షణమూ ఉండదు. చర్మకారులలో ఇలాంటి సామాజికపతనం, పటాటోపం ఏర్పడినా అంతప్రమాదం లేదు. కాని, ధర్మాన్ని పాలించవలసినపాలకులు పాలకులు గాక కుహనాపాలకులైతే రాజ్యం ఎంత తలక్రిందులవుతుందో చూడు. రాజ్యానికి వ్యవస్థ, సౌఖ్యం ప్రసాదించగలిగినవారు వారే. మనపాలకులు యథార్థత్రాతలు కావాలి కాని, రాజ్యధ్వంసకులు కారాదని మనతాత్పర్యం. మన ప్రతి

పక్షి ఎలా ఊహిస్తున్నాడో తెలుసా? భోగభాగ్యాలతో తుల తూగుతున్న రైతులను ఊహిస్తున్నాడే కాని, రాజ్యంపట్ల తమకున్న విధిని నిర్వర్తిస్తున్నవారినిగా ఊహించటం లేదు. అలాంటప్పుడు అతనిలక్ష్యం వేరు, మనలక్ష్యం వేరు. అతనిగమ్యం రాజ్యంకాదు, మరొకటి. అందువల్ల మనం పాలకులను నియోగిస్తున్నప్పుడు వారికి వైయష్టికంగా అధికసుఖం కల్పించవలసిఉంటుందో, లేక రాజ్యానికి అంతకూ అధికసుఖం కల్పించవలసిఉంటుందో విచారించాలి. కడపటిదే నిజమైతే పాలకులు, సైనికులు, తక్కినవారు తమతమ కర్తవ్యాలను ఉత్తమంగా నిర్వహించాలి. ఈ విధంగా రాజ్యమంతా ఉదాత్తక్రమంలో పెంపొందుతుంది; వివిధవర్ణాలు (వర్గాలు Clas:e.) యథాప్రకృతినిర్దేశంగా సౌఖ్యం పొందుతవి.

మీరు చెప్పింది యథార్థమే.

నాకు మరొకటి స్ఫురిస్తున్నది. అది నీ వెంతవరకు ఆమోదిస్తావో తెలియదు.

ఏమిటది?

వృత్తుల భ్రష్టతకు రెండుకారణాలు కనిపిస్తున్నవి.

ఏ కారణాలు?

కలిమిలేములు.

పతనానికి అవి ఎలా హేతువులు?

కుంభకారుడు సంపన్నుడైనప్పుడు తనవృత్తిలో వెనుకటి శ్రద్ధ చూపుతాడా?

లేదు.

అంతంతకు అలసత, అజాగ్రుతి పెచ్చరిల్లవా?

అవును.

అంటే అప్పుడు పత్నీతపంభకారుడు అవుతాడు.

ఆఁ, భ్రష్టుడవుతాడు.

అలాకాక అతనికి డబ్బు లేదనుకొందాము. అప్పుడతడు తనకు వలసినపని ముట్లు సంపాదించలేడు. ఒడలు వంచి పనిచేయుడు. తనకొడుకులకూ, శిష్యులకూ శ్రద్ధగా పనిచేయండని చెప్పడు.

అవును.

కాబట్టి కలిమి బలిసినా, లేమి బలిసినా శ్రామికులూ, వారివృత్తులూ భ్రష్టాలవుతవి.

స్పష్టంగా అంతే.

క్రొత్తగా కనుగొన్న ఈ అనర్థకాలు వాటిల్లనీక పాలకులు భద్రపడాలి. లేకున్న తెలియకుండానే అవి రాజ్యంలో ప్రవేశిస్తవి.

ఏ అనర్థకాలంటారు ?

ఐశ్వర్యదారిద్ర్యాలు. ఒకటి భోగలాలసతకు, మరొకటి నైచ్యపాపాలకు కారణం. ఈ రెండూ అసంతృప్తికి మూలం.

నిజమే. కాని 'మనరాజ్యం ఎలా యుద్ధం చేయగలుగుతుందా ?' అన్నదే నాప్రశ్న. ముఖ్యంగా యుద్ధానికి మూలభూతమైన సాధనసంపత్తిలేక బలీయమైన శత్రురాజ్యంతో ఎలా తలపడగలుగుతుంది ?

అట్టిశత్రువుతో తలపడవలసివచ్చినప్పుడు చిక్కే వస్తుంది. అయితే అట్టి శత్రురాజ్యాలు రెండుంటే ఇబ్బంది లేదు.

ఎలాగంటారు ?

పోరాటం వచ్చినప్పుడు శిక్షితులైన మనయోధులు భాగ్యవంతులతో ఏర్పడినసైన్యంతో తలపడవలసివస్తుంది.

నిజమే.

నిజవృత్తిలో ఆరితేరినమల్లుడు, శిక్షణయెరుగక స్థూలకాయులైయున్న భాగ్యవంతులిద్దరికి సమాధానం చెప్పలేడా, యాడైమాంటస్ ?

ఇద్దరూ ఒకేసారి క్రమ్మితే తానొకడూ సరితూగలేడు.

ఏమంటావు? తాను పారిపోయినట్లే పారిపోతూ వెనుదిరిగి మొదటవచ్చి పడినవాణ్ణి ఎదుర్కోలేడా? మిటమిటలాడే ఎండలో ఈ పనే పెక్కుసార్లు చేస్తాడనుకో. ఆ నిపుణుడు స్థూలకాయులను అనేకులను చిత్తు చేయలేడా?

చేస్తాడు. అందు వైపరీత్యం లేదు.

అయినా యుద్ధక్రియలోకంటె విద్యాపరిశ్రమలోనే భాగ్యవంతులకు ఆధిక్యం ఉండవచ్చును.

నిజమే.

అలాంటప్పుడు మనయోధులు తమకు ఇమ్మడిముమ్మడిగా ఉన్నశత్రువులతో పోరాడగలరు గదా?

ఒప్పుకొంటాను. మీచెప్పింది వాస్తవం.

యుద్ధానికి దిగకపూర్వం మనపౌరులు శత్రురాజ్యాల రెంటిలో ఒకదానితో రాయబారం నడుపుతారనుకో. "వెండిబంగారాలు మాకు లేవు. అసలవి మాకు నిషిద్ధాలు. కావాలంటే మీరు పుచ్చుకోవచ్చు. కాబట్టి మీరు మాకు యుద్ధంలో తోడ్పడండి. శత్రురాజ్యంలో లభించే అమూల్యలోహాలన్నీ మీవే అని అంటారనుకో. ఈ మాటలు విన్నపిమ్మట గూడ, బలిసిఉన్న గొఱ్ఱెలమందతో కాక

సన్న నిరేచులతో డీకొనటానికి ఎవరు సమ్మతిస్తారు?

అలాంటిది జరుగకపోవచ్చును. పెక్కురాజ్యాలసంపత్తి ఏకమైనప్పుడు నిరుపేదయైన రాజ్యానికి ముప్పురావచ్చును.

మనరాజ్యాన్ని కాక ఇతరాలను రాజ్యాలంటున్నావంటే నీవు వట్టి అమాయికుడవనాలి.

ఎందుకని?

ఇతరరాజ్యాలను చెప్పవలసివస్తే అందు ప్రతిదానిని బహువచనంతో పేర్కొనాలి. వానిలో ఏదీ ఏకైకరాజ్యం కాదు. ప్రతిదీ అనేకమే. ఎందువల్లనంటే రాజ్యమెంతచిన్నదైనా దానిలో రెండుభాగాలుంటవి. ఒకటి సంపన్నులది; రెండవది పేదలది. ఇవి రెండూ ఒండొంటితో పోరుతుంటవి. ఆరెంటిలో తిరిగి అవాంతరభేదాలు అనేకాలు. వాటి నన్నిటినీ కలిపి ఏకరాజ్యంగా నీవు పరిగణిస్తున్నావంటే నీవు పొరబడుతున్నావనాలి. వానిని పెక్కులుగా పరిగణించి, ఒకదాని ఐశ్వర్యమో, అధికారమో, బలగమో ఇతరరాజ్యాలకు ఇస్తే నీకు మిత్రులు మెండవుతారు కాని శత్రువులు మెండు కారు. మనం పేర్కొన్న సువ్యవస్థనెలకొన్న నీరాజ్యం మహత్తరరాజ్యమవుతుంది. మహత్తరమంటే ప్రఖ్యాతమనీ సువిశాలమనీ నాతాత్పర్యం కాదు. వేయిమంది రక్షకులకు మించి ఉండకపోయినా ఈ రాజ్యం కార్యరంగంలో మహత్తరమే అవుతుంది. ఈ రాజ్యానికి తుల్యమైన ఏకరాజ్యం ఇటు మన యవనులలో గాని అటు బర్బరులలో గాని కనిపించదు. కాకపోతే విస్తృతిలో ఎన్నోరెట్లు పెద్దవిగా కనిపిస్తే కనిపించవచ్చును.

అది యథార్థం.

రాజ్యవిస్తృతి ఎంత ఉండాలి? ఎంత విశాలదేశం చేకూర్చుకోవాలి? ఏ మితి దాటరాదు? ఈ విషయంలో మనపాలకుల నిర్ణయమే ఉత్తమావధి

---

♦ఇట బర్బరశబ్దంజాతి వాచికాదు. తాముమాత్రమే సంస్కారసంపన్నులనీ, తక్కినజాతులన్నీ అనాగరకములనీ యవనుల నమ్మిక.

అవుతుంది.

మీరు ఏ అవధి నిర్ణయిస్తారు?

ఐక్యానికి భంగం కలుగనంత మేర రాజ్యం పెరగవచ్చునంటాను.

అదే సముచితం.

మనపాలకులకు ఈ శాసనం కూడ అందజేయాలి. మనరాజ్యం మరీపెద్దది, మరీచిన్నది కారాదు. అయితే అది ఏకంగా స్వయంసమృద్ధంగా మాత్రం ఉంచాలి.

నిజమే. మనం వారిపై అంత కఠోరశాసనం విధించటం లేదని అత డన్నాడు.

మన మింతకుముందు చెప్పుకొన్నవిశేషం ఒకటి ఉన్నది. అది ఇంతకంటె సుకరం. పాలకులసంతానం గుణహీనమైనప్పుడు అవరవర్ణసంజాతంగాను, అధమవర్ణసంతతి గుణోదాత్తమైనప్పుడు ఉన్నతవర్ణసంజాతంగాను పరిగణించటం విధి. దీనితాత్పర్యం ఒకటే. ప్రకృతి ఎవరిని దేనికి నిర్దేశిస్తున్నదో ఆపనికి మాత్రమే ఆపౌరులను నియోగించాలి. ఒక్కొక్కని ఒక్కొక్క పనియందే నియోగిస్తే, ప్రతివాడు తనవ్యాపారం నిర్వహిస్తూ ఏకైకంగా ఉంటాడు. అంతే కాని బహువ్యాపకాలు ఏర్పడవు. ఈ విధంగా రాజ్యమంతా ఏకంగా ఉంటుంది గాని అనేకంగా ఉండదు.

అవును. ఇది అంత దుష్కరం కాదు.

మనం నిర్దేశిస్తున్న నియమాలు గొప్పసూత్రాలు కావు. ఒకట జాగ్రత్త పడితే ఇవన్నీ స్వల్పాలే. ఈ ఒకటి కూడ అంతమహత్తరం కాదు. కాని, మనప్రయోజనానికి మాత్రం సమర్థం.

ఆ ఒకటి ఏమిటి?

విద్యాభివృద్ధి. మనపౌరులు విద్యావినీతులై పెరిగి పెద్దవారైనప్పుడు మనం

వదలినవిషయాలు వారే పరిష్కరించుకొంటారు. ఉదాహరణకు స్త్రీల ప్రతిపత్తి, వివాహాలు, సంతానోత్పత్తి మున్నైనవాటినే తీసికో. ఈ విషయాలను "మిత్రులకు వస్తువులన్నీ సమష్టిగా భోగ్యా"లన్న సూత్రాన్ని పురస్కరించుకొని వారు పరిష్కరించుకోవాలి.

అవును, అదే ఉత్తమమార్గం.

మరొకవిషయం. రాజ్యం సమారంభమైతే చాలు. సాగారిన చక్రంవలె అంతంతకు అధికశక్తి పొందుతుంది. సద్విద్యవల్ల సద్గుణాలు అలవడుతవి. ఈ అభివృద్ధితో మానవజాతిలో గూడ జంతువులందువలె ఉత్తమజాతి అభివృద్ధిపొందుతుంది.

అది సాధ్యమేనని అతడన్నాడు.

సంగ్రహంగా చెప్పాలంటే ముఖ్యంగా మనపాలకులు ఈ విషయాన్ని గుర్తించాలి. చదువుసాముల తీరుతెన్నులు ఆదిలో ఎలా ఉన్నవో అలాగే ఉండేటట్లు కాపాడుకోవాలి. క్రొత్తమార్పులు ప్రవేశపెట్టరాదు. అవి యథాతథంగా నిలబెట్టుకొనటానికి శక్తివంచనలేక పాటుపడాలి. "గాయకుల అతినవ్యగీతాన్ని మానవజాతి అత్యంతం గౌరవిస్తుం"దన్న కవితాత్పర్యమేమిటి? అతడు ప్రశంసిస్తున్నది క్రొత్తగీతాలను కాదు, క్రొత్తజాతిగీతాన్ని ప్రశంసిస్తున్నాడని గ్రహించాలి. ఇలాంటిదానిని అభినందించరాదు. కవి తాత్పర్యమదేనని భావించరాదు. విద్యావిషయంలో ఏ మార్పుప్రవేశపెట్టినా అది రాజ్యానికి అంతకు పెద్దముప్పు తెచ్చిపెడుతుంది. కాబట్టి దానిని నిషేధించాలి. డేమన్ కూడ ఇదే చెప్పాడు. అతడు చెప్పింది వాస్తవమని నానమ్మిక. విద్యాపద్ధతులు మారినప్పుడు వానితోపాటు ప్రధానరాజ్యసూత్రాలు కూడ మారుతవి

డేమన్ అభిప్రాయంతోను మీవిశ్వాసంతోను నేనేకీభవిస్తాను, అని యాడైమాంటస్ అన్నాడు.

అలాంటప్పుడు మనపాలకులు విద్యావిధానంలోనే తమకోటకు పునాదులు వేసికోవాలి.

లేకపోతే అరాజకత్వం తెలియకుండానే తేలికగా ప్రవేశిస్తుందని అతడన్నాడు.

అవును. వినోదరూపంతో ముందు ప్రవేశిస్తుంది. స్థూలదృష్టికి అది అనపాయంగా కనిపిస్తుంది.

ఆఁ. అయితే ఉన్న ప్రమాదం ఒకటే. ఆసరాచూచుకొని విశృంఖలత మెల్లమెల్లగా కనుగప్పి అలవాట్లలో, ఆచారాలలో ప్రవేశించి పాదుకొంటుంది. తరువాత మానవుల పరస్పరసంబంధాలలో వ్యాపించి, అచటినుంచి చట్టాలకు రాజ్యాంగాలకు ప్రాకి, తుదకు వ్యక్తిగతనియమాలను సామాజికనియమాలను ధ్వంసం చేస్తుంది.

"అది నిజమా?" నేను ప్రశ్నించాను.

నావిశ్వాసమని అతడన్నాడు.

ఇంతకూ నేను చెప్పినట్లు మనయువకులను మొదటినుంచి గట్టికట్టుదిట్టాలతో పెంచాలి. వినోదాలు నియమరహితాలైతే యువకులు గూడ నియమరహితులవుతారు కాని, సద్వర్తనులైన పౌరులుగా తయారు కారు.

అవునని అతడన్నాడు.

ఆటలు మొదలుపెట్టిననాటినుంచి సక్రమశిక్షణ పొందనారంభిస్తే విద్యాసహాయంతో వారు చక్కని నియమాభ్యాసాలు సంపాదిస్తారు. ఈ అభ్యాసం వారి కార్యకలాపాలన్నిటికీ ప్రాకి ఆభ్యుదయికస్వభావమాపాదిస్తుంది. రాజ్యంలో ఏవైనా భ్రష్టావస్థలో ఉంటే అవన్నీ మళ్ళీ చక్కబడుతవి.

అవును.

ఈ విధంగా విద్యావంతులైతే తమపూర్వులు ఉపేక్షించి ఊరకున్న స్వల్పనియమాలను అన్నిటినీ వారు తమకుతాము ఏర్పరుచుకొంటారు.

అంటే మీ తాత్పర్యం?

ఏమున్నది? పెద్దలవద్ద పిన్నలు ఎప్పుడు మారుపలుకరాదో, వారిని కూర్చుండబెట్టి తాము ప్రక్కన నిలబడి ఎలా అణగిమణగి ఉండాలో, పితరులు ఎట్టిగౌరవానికి యోగ్యులో, ఏది వినీతవేషమో, కేశసంస్కార పరిష్కారాలు ఎలా ఉండాలో, సామాన్యంగా ఏ అలవాట్లు, పద్ధతులు అనుసరించాలో—ఇలాంటివాటిని వారే నిర్ణయించి ఏర్పరుచుకొంటారు. ఏమంటావు?

నిజమే.

ఇట్టి స్వల్పవిషయాలను శాసించటం వివేకం కాదు. అసలు ఇట్టిది ఎన్నడూ జరిగిఉండదని నాఊహ. ఒకవేళ వాటిని లిఖితపూర్వకంగా నిర్దేశించినా అవి చిరకాలం మనజాలవు.

అవును.

మానవుడు అభ్యసించే విద్యనుబట్టి అతని భవిష్యజీవితం ఏర్పడుతున్న దనిపిస్తుంది. వస్తువు సదృశవస్తువును ఆకర్షించదా?

ఆకర్షిస్తుంది.

పర్యవసానంగా మహత్తరఫలం ఏర్పడుతుంది. అది మంచికే కావచ్చును; చెడ్డకే కావచ్చును.

నిశ్చితంగా అంతే.

కాబట్టి వాటివిషయంలో విశేషశాసనాలు విధించదలచుకోలేదు.

అదే యుక్తం.

మరి విపణి (మార్కెట్ల) వ్యవహారాలో? మానవుల పరస్పరసామాన్య వ్యవహారాలు, వృత్తిపరుల ఒడంబడికలు, అవమానాపకారాలు, కార్యా

రంభాలు, న్యాయాధికృతుల నియామకాలు, విపణుల శుల్కాలు, ఓడరేవుల సుంకాలు, నిబంధనలు, రాజభటుల నియామకాలు మున్నగువిషయాలెన్నో ఉన్నవి. ఈ విశేషాలన్నీ శాసనబద్ధం చేయాలా?

ఇలాంటి స్వల్పవిషయాలలో సత్పురుషులను మనం శాసించనక్కరలేదు. అవసరమైన నియమాలు వారే గుర్తించి ఏర్పరుచుకొంటారు.

అవును, మనం ప్రసాదించినశాసనాలను ఈశ్వరుడు కాపాడితే చాలు.

అలా కాకపోతే ఏవో శాసనాలు ముందుచేయటం, తరువాత వాటిని సంస్కరిస్తూ సమాజాన్ని తామేదో బాగుచేస్తున్నామన్న భ్రాంతికి లోనై కాలం వ్యర్థంచేస్తుంటారని యాడైమాంటస్ అన్నాడు.

అలాంటివారు ఆత్మనిగ్రహం లేక అతిమాత్రాభ్యాసాలు మానుకోలేని రోగులకు సదృశులంటావా?

చక్కగా చెప్పారు.

నిజంగా వారిజీవితం విచిత్రం. ఎప్పుడూ ఏదో పుచ్చుకొంటూ తమరోగాన్ని పెంచుకొంటూ, లోకులు ఏమందుచెప్పినా సేవిస్తూ, దానితో తమకు స్వాస్థ్యం చేకూరుతుందని గంపెడాసతో జీవిస్తుంటారు.

అలాంటిరోగులు సామాన్యమే.

ఇక్కడ ఒక చేవిచిత్రం. "అతిమాత్రాలైన భోజనపానాలు, వ్యభిచరణ, సోమరితనం మానితేతక్క మీరోగాన్ని ఏమందూ కుదర్చదు, ఏమూలిక, ఏతాయెతు, ఏచిట్కా కాపాడలేదు" అని ఉన్నమాట చెప్పినవారు అలాంటివారికి ప్రబలశత్రువులవుతారు.

విచిత్రమా? నిజంచెప్పినవానిపై నిప్పులు చెరగటం విచిత్రం కాదు.

ఇంతకు ఇలాంటిపెద్దలందు నీకేమాత్రం సానుభూతి లేదన్నమాట.

ఎలా ఉంటుంది?

ఇట్టి వ్యక్తులవలె ప్రవర్తించే రాజ్యాలనడవడులు కూడ నీకు సమ్మతాలు కావు. ఎందుకంటే దుర్వ్యవస్థితాలైన రాజ్యాలెన్నో ఉన్నవి. రాజ్యాంగం మార్చ యత్నించేవారికి మరణదండనంతప్పదన్న శాసనం ఉంటుంది. అయినా ఇలాంటి ఏల్బడిలోని పౌరుల ఆదరాభిమానాలు సంపాదించి, వారి అనుచితవాంఛితాలను ప్రజ్వలింపజేసి, వారిని రెచ్చగొడుతూ, వారి అభిలాషలను ముందుగానే గ్రహించి, వాటికనుగుణంగా నడుస్తూ ఉండేవారిని రాజనీతిధురంధరులనీ, నీతిశాస్త్రవిశారదులనీ పౌరులు భావిస్తుంటారు. ఇట్టిరాజ్యాలు ఇంతకుముందు చెప్పుకొన్న అపటిబ్రతుకుల వంటివి కదా?

ఆ వ్యక్తులవలెనే ఈ రాజ్యాలు దోషగ్రస్తాలు. ఇవి ఏమాత్రం నాకు నచ్చవు.

మంచిచెడ్డలకు స్వస్తిచెప్పి నిశ్చింతగా ఇలాంటి రాజకీయదోషాన్ని ప్రజ్వలింపజేసేవారి నిబ్బరాన్ని, నైపుణ్యాన్ని నీవు మెచ్చుకోవా?

మెచ్చుకొంటాను. కాని అందర్నీ కాదు. కొందరుంటారు. ప్రజాప్రశంసకు మోసపోయి, తాము మహానాయకులమని, రాజనీతికోవిదులమని భ్రాంతిపడుతారు. ఇలాంటివారిలో మెచ్చుకోవలసింది ఏమీ లేదు.

మరీ అన్యాయంగా ఉంది. వారియందు నీకు సానుభూతి ఉండాలి. ఒకనికి కొలత తెలియదనుకో. ఆ కొలత తెలియనిఅనేకులు "నీవు ఆరు మూళ్ళున్నావని" చెబితే పాపం అతడు నమ్మక ఏమిచేస్తాడు.

అలాంటివారివిషయం వేరు.

వారిపై కోపించవద్దు. నాటకంచూచి వినోదించినట్లు వారిని చూచి వినోదించవచ్చును. ఎందుకంటే వారేవో అల్పసంస్కరణలు ప్రవేశపెడుతారు. వాటితో వంచనం నామరూపాలులేక నశిస్తుందనీ, మహావర్తకాలన్నీ మటుమాయమాతవనీ వారివ్యామోహం. అంతేకాని రావణునితలలవలె కోసినకొలది తిరిగి మొలుస్తుంటవన్న సంగతి వారికి తెలియదు.

అవును, కిటుకు తెలియక వారు తలలు కోస్తుంటారు.

వ్యవస్థితరాజ్యంలోనైనా, అవ్యవస్థితరాజ్యంలోనైనా నిజమైనశాస్త్ర ఇలాంటి అల్పవిషయకశాసనాలతో లేనిపోని బాధ తెచ్చిపెట్టుకోడు. ఎందువల్లనంటే అవ్యవస్థితరాజ్యంలో అలాంటిశాసనాలు నిరర్థకాలు. వ్యవస్థితరాజ్యంలో వానికోసం శ్రమపడనక్కరలేదు. ఇంతకుముందు మనంపేర్కొన్న ప్రధానసూత్రాలను పురస్కరించుకొని ఇలాంటి విషయాలు తమకుతాముగా సిద్ధిస్తవి.

ఇంకా శాసనాలవిషయంలో మనం నిర్ణయించవలసినదేమున్నది?

ఏమీలేదు. కాని ఉదాత్తాలు, పవిత్రాలు, పరమప్రధానాలు అయిన ఈశ్వరకార్యకలాపాలున్నవి.

ఏవంటారు?

దేవాలయనిర్మాణాలు, ఆహుతులు, దివ్యాదివ్యవీరపూజలు, అంత్య సంస్కారాలు, అధోలోకవాసులసమారాధనలు మిగిలిఉన్నాయి. వీని విషయం మనకు స్వయంగా ఏమీ తెలియదు. ఇలాంటివ్యవహారాలు సంప్రదాయజ్ఞులైన వ్యాఖ్యాతలకు వదలివేయటం మేలు. అలాంటిపనిని భూకేంద్రమందున్న ఆలయంలో నిలిచి సంప్రదాయానుసారిఅయి మానవులందరికీ అపాలో మతధర్మాలుపదేశిస్తాడు.

మీరు చెప్పింది బాగున్నది. మీసూచనప్రకారమే చేదాము.

ఇంతకూ న్యాయం వీటిల్లో ఎక్కడఉన్నదో చెప్పు? మనరాజ్యనిర్మితి సమాప్తమై నివాసయోగ్యంగా తయారయింది. ఇక దివ్వె వెలిగించి నీసోదరుడైన పాలిమార్కస్‌ను, ఇతరమిత్రులను పిలిచి వారిసాయంతో న్యాయం, అన్యాయం ఎక్కడెక్కడ ఉన్నవో, వానికి భేదం ఎక్కడ ఏర్పడుతున్నదో దేవమానవులు గుర్తించినా గుర్తించకపోయినా దేనికలిమిచే మానవుడు సుఖవంతుడవుతున్నాడో అన్వేషించు.

వెంటనే గ్లాకన్ అందుకొన్నాడు:— తరుణం వచ్చినప్పుడు న్యాయానికి

శాసటయి నిలవకపోవటం మహాపరాధం. కాబట్టి నేనే న్యాయాన్ని అన్వేషిస్తానని మీరు వాగ్దానం చేయలేదా? ఇప్పుడు మాట తప్పు తారా?

నేనలా చెప్పలేదనను. నామాట చెల్లిస్తా. కాని మీరు కూడ తోడ్పడాలి.

తప్పక తోడ్పడుతామని అతడన్నాడు.

అయితే దానిని ఇలా కనుగొనవచ్చుననుకొంటాను : మనరాజ్యం సువ్యవస్థితమైతే పరిపూర్ణమవుతుంది కదా?

అవును.

పరిపూర్ణం కాబట్టి అందులో ప్రజ్ఞావీర్యాలు, న్యాయనిగ్రహాలు ఉండాలి గదా?

నిజమే.

వీటిల్లో కొన్నిటిని కనుగొన్నప్పుడు మిగిలినవి మనం అన్వేషిస్తున్న గుణాలవుతవి.

అవును.

నాలుగువస్తువులుండగా వానిలో ఒకదానికై వెదకుతున్నామనుకో. ఆ వెదకుతున్నవస్తువు మొదట కనిపించవచ్చును. అలా కనిపిస్తే చిక్కు తీరుతుంది. అలాకాక తక్కిన మూడువస్తువులు మొదటకనిపిస్తే మిగిలినది నాల్గవవస్తువవుతుంది.

అవును.

మనం అన్వేషిస్తున్న నాలుగుసద్గుణాలలో గూడ ఈ పద్ధతే అవలంబించ గూడదా?

ఎందుకవలంబించరాదు?

రాజ్యంలో మొదట ప్రజ్ఞ గోచరిస్తుంది. ఇట్లు కనిపించటంలో విశేష మున్నది.

ఆ విశేషమేమిటి?

మనం వర్ణించినరాజ్యం ప్రజ్ఞావంతమన్నాము ఎందువల్ల? దానినిర్ణయం ఉత్తమం కావటంవల్లనే కదా?

అవును.

ఉత్తమనిర్ణయం జ్ఞానంవల్ల కలుగుతుంది కాని, అజ్ఞానంవల్ల కాదుగదా?

అవును.

రాజ్యంలో గోచరించేజ్ఞానం అనేకవిధాలుగా ఉంటుంది గదా?

అవును.

వడ్రంగిజ్ఞానం ఉన్నదనుకో. ఈ జ్ఞానాన్నిబట్టి రాజ్యం ప్రజ్ఞావంతమని పించుకొంటుందా?

లేదు. కాకున్న వర్ధకినైపుణ్యానికి ఆరాజ్యం ప్రసిద్ధం కావచ్చును.

దారుకర్మజ్ఞానం కలిగి దారుపరికరవిషయమై ఉత్తమనిర్ణయం చేయగలిగి నంతమాత్రాన రాజ్యం ప్రజ్ఞావంతం కాదు.

అవును.

ఇత్తడిపాత్రల నిర్మాణకౌశలప్రదర్శకజ్ఞానాన్నిబట్టి కాని, అలాంటి మరొకజ్ఞానాన్నిబట్టి కాని మనం రాజ్యాన్ని ప్రజ్ఞావంతమనటం లేదు.

అవును.

కర్షణజ్ఞానాన్నిబట్టి గూడ ప్రజ్ఞావంతం కాదు. ఆ జ్ఞానం ఉంటే దానిని వ్యావసాయికరాజ్యమంటాము.

నిజమే.

మనం నిర్మించినరాజ్యంలో ఎవరిలోనైనా ప్రత్యేకవిషయాన్ని గాక రాజ్యానికంతకు సంబంధించిన విషయాన్ని గూర్చి బోధించేజ్ఞానం ఉన్నదా? రాజ్యం స్వవిషయంలోను, పరరాజ్యాలవిషయంలోను ఎలా వ్యవహరించాలో తెలిపేజ్ఞానం ఉన్నదంటావా?

నిశ్చితంగా ఉన్నది.

మరి ఈ జ్ఞానం ఏమిటి? ఎవరిలో ఉంటుంది?

పాలకులజ్ఞానం ఉత్తమపాలకులని మనం చెప్పుకొన్నవారిలో ఉంటుంది.

ఈ జ్ఞానంవల్ల రాజ్యానికి ఏ పేరు వస్తున్నది?

ప్రజ్ఞావంతమని.

మనరాజ్యంలో ప్రజ్ఞావంతులధికసంఖ్యాకులా? కమసాలులధికసంఖ్యాకులా?

ఇతరవర్ణాలన్నిటికంటె విశిష్టజ్ఞానసంపన్నమైన పాలకజాతిసంఖ్య చాల స్వల్పమే కదా?

అవును.

ఈ వర్గం స్వల్పసంఖ్యాకం. తక్కినవర్గాలనూ, తన్నూ పాలించే ఈ వర్గం జ్ఞానవంతం. స్వభావాన్నిబట్టి ఏర్పడినరాజ్యం ఈ జ్ఞానాన్నిబట్టి ప్రజ్ఞావంతమన్నప్రసిద్ధి పొందుతున్నది. కాబట్టి ఈ స్వల్పసంఖ్యాకవర్గజ్ఞానమే

ప్రజ్ఞాశబ్దాభిధేయమవుతున్నది.

అవును.

కాగా నాలుగుసద్గుణాలలో ఒకదాని స్వభావమేమో, అది రాజ్యంలో ఎచట ఉంటున్నదో ఏహోఒకవిధంగా మనం కనుగొన్నాము.

ఆం. ఈపని సంతృప్తికరంగా నెరవేరిందని అతడన్నాడు.

ఆతరువాత ధైర్యస్వభావమేమిటో, రాజ్యం ధీరమన్నఖ్యాతి చేకూర్చే ఈ గుణం ఏ భాగంలో ఉంటుందో కనుగొనటం కష్టం కాదుగా ?

అంటే మీతాత్పర్యం ?

ఒకరాజ్యం ధీరమని కాని భీరువని కాని పేర్కొన్నప్పుడు రాజ్యంకోసం దండెత్తిపోయి యుద్ధంచేసేవర్గమేకదా జ్ఞప్తికివచ్చేది?

ఎవరూ అన్యవర్గాన్ని స్మరించరు.

అవును. పౌరులు, తక్కినవారు ధీరులైనా భీరులైనా వారివల్ల రాజ్యం ధీరమూ కాదు, భీరువూ కాదు.

మనరాజ్యంలోని ఒకవర్గాన్నిబట్టి అది ధీరమవుతున్నది. తాను పొందిన విద్యనుబట్టి భయపడవలసినవాని స్వభావమేమో, భయపడరానివాని స్వభావమేమో నిర్ణయించేఅధికారం ఎల్లపరిస్థితులలో ఆ వర్గానికే ఉంటుంది. దానినే కదా నీవు ధీరత అంటున్నది ?

మీరు చెప్పినది బోధపడలేదు. మరొకసారి చెప్పాలి.

ధైర్యమంటే పరిత్రాణమని నా అభిప్రాయం.

దేని పరిత్రాణమంటారు ?

అభ్యసించినవిద్యనుబట్టి ఏది ఎందువల్ల ప్రమాదమో నిర్ణయించే అభిప్రాయాన్ని పరిరక్షించటం. సుఖదుఃఖసమయాలలో, ఇచ్ఛాభయాలలో, ఎల్లస్థితిగతులలో దానిని కాపాడుకొనటం పరిత్రాణమంటాను. నీకు సమ్మతమైతే దృష్టాంతం చెబుతాను.

అలాగే చెప్పండి.

రంగులద్దేవారు ఉన్నికి ఇంద్రనీలం వేయదలచుకొన్నప్పుడు శ్రద్ధపడి దానిని చలువచేస్తారు. రంగు చక్కగా పట్టటానికి కనుగలిగి శ్రమకోర్చి తెలుపుచేస్తారు. ఆతరువాతనే అద్దకం వేస్తారు. ఇలా వేసినరంగు వెలవదు, కగ్గదు. ఏక్షారజలాలలో ఎన్నిసార్లు దానిని ఉదికినా ఆ మెరుపు పోదు. ఉన్ని సరిగా చలువచేయక రంగువేస్తే అది సరిగా అంటక వెలాతెలా పోతుంది.

అవును, వెలిసిపోయినట్లు కనిపిస్తుందని అతడన్నాడు.

మనసైనికులను ఏరి చదువుసాములు నేర్పటంలో మనలక్ష్యమేమో ఇప్పుడు బోధపడిఉండాలి. శాసనవర్ణం వారికి చక్కగా అంటటానికై వలసినసన్నాహాలు చేస్తున్నాము. ఎట్టి అభిప్రాయాలు వారికి ఉండాలో, వేటిని వారు ప్రమాదకరంగా భావించాలో ప్రకృతినిబట్టి వారికి అలవరుస్తున్నాము. 'పక్కా'రంగులవలె అవి వారియందు సుస్థిరంగా నిలపటానికి ప్రయత్నిస్తున్నాము. సుఖక్షారాలు కాని, అంతకంటె ప్రబలాలైన భయదుఃఖకామాలు కాని వానిని కడుగజాలకుండా చేయాలని యత్నిస్తున్నాము. శాస్త్రవ్యవస్థచే ఏర్పడిన హితాహితభావాలను రక్షించుకొనే శక్తినే నేను ధైర్యమంటాను.

దీనికి నేనూ ఒప్పుకొంటాను. ఇంతకూ క్రూరమృగంలోను, మూర్ఖునిలోను అవిద్యాకృతగుణాన్ని ధైర్యంగా పరిగణించక పరిహరించాలంటారు. ఇలాంటిగుణం మీమతంలో శాస్త్రనిర్దిష్టధైర్యం కాదంటారు. దానికి మరొకపేరు ఉండాలంటారు.

అవును.

ఇంతకూ మీరు నిర్వచించినదేకదా ధైర్యం?

ఆఁ. దీనిని సామాన్యపౌరుని ధైర్యానికి నిర్వచనంగా స్వీకరిస్తే బాధలేదు. నీకు సమ్మతమైతే ఈ నిర్వచనాన్ని తరువాత పరిశీలింతాము. ఇంతకూ మనం న్యాయాన్ని అన్వేషిస్తున్నాము గాని ధైర్యాన్ని గాదు. కాబట్టి ప్రకృతానికి ఈనిర్వచనం చాలు.

సరే.

రాజ్యంలో మనం వెదకవలసిన సద్గుణాలు రెండున్నవి: ఒకటి నిగ్రహం, రెండవది మనం వెదకుతున్న న్యాయం.

అవును.

నిగ్రహాన్ని ఆవలఉంచి న్యాయాన్ని మనం కనుగొనగలమా ?

ఎలాసాధ్యం? పైగా నిగ్రహవిషయం వదలి న్యాయాన్ని అన్వేషించ టం నాకు సమ్మతం కాదు. కాబట్టి ముందు నిగ్రహాన్ని పరిశీలించటం మేలు.

ఆలాగే. నీకోర్కెను కాదనటం దేనికి?

మరి ప్రారంభించండి.

నాకు కనిపిస్తున్నంతలో ఇంతకుముందు పరిశీలించినవాని అన్నిటికంటె నిగ్రహంలో సమరసభావం మెండని తోస్తున్నది.

ఎలాగంటారు?

కొన్నివిధాలైనసుఖాలను, వాంఛలను వ్యవస్థీకరించి అదుపులో ఉంచ టమే నిగ్రహం. తనపై తానధికారి అన్నపదం ఈ భావాన్నే వ్యక్తం చేస్తున్నది. ఈ భావచ్ఛాయలు భాషలో గోచరిస్తున్నవి.

అవును.

తనపై తానధికారి అన్నపదం కొంత హాస్యాస్పదంగా కనిపిస్తుంది. ఎందుకంటే అధికారి సేవకుడవుతున్నాడు; సేవకుడు అధికారి అవుతున్నాడు. ఉక్తిభంగులన్నిటిలో ఒకేవ్యక్తి అటు సేవకుడు, ఇటు అధికారి అవుతున్నాడు.

నిజమే.

దీనిభావం ఒకటే. మానవునిఆత్మలో ఉత్తమప్రకృతి, అధమప్రకృతి అని రెండు ప్రకృతులున్నవి. ఉత్తమప్రకృతిచే అధమప్రకృతిని అదుపుపొదుపుల్లో ఉంచినమానవుడు తనపైతానధికారి అని చెప్పబడుతున్నాడు. అట్లుకాక దుస్సాంగత్యంవల్లనో, దుష్టబోధంవల్లనో మానవునిలోని అణీయమైన ఉత్తమ ప్రకృతి మహీయసిఅయిన అధమప్రకృతిచే నిర్జితమైనప్పుడు అతడు నిందింపబడుతున్నాడు. నియమరహితుడనీ, ఆత్మదాసుడనీ గర్హింపబడుతున్నాడు.

అవును, మీరు చెప్పినది సముచితమే.

మన నూతననిర్మితరాజ్యాన్ని పరిశీలిస్తే ఇప్పుడు పేర్కొన్న రెండువిషయాలలో ఒకటి సంసిద్ధరూపంతో గోచరిస్తుంది. నిగ్రహమే స్వాధిపత్యం అన్నప్పుడు నిజంగా అధమప్రకృతిని ఉత్తమప్రకృతి పాలించటమనేదే అర్థమైతే, రాజ్యం కూడ తనపైతానధికారి అని చెప్పవచ్చును.

అవును, మీచెప్పింది యథార్థం.

మరొకసంగతి:— పిల్లలలోను, స్త్రీలలోను, సేవకులలోను అధములై అధికసంఖ్యాకులుగాఉండే స్వతంత్రనామకులలోను బహువిధసంశ్లిష్టసుఖదుఃఖవాంఛలు ప్రాయికంగా గోచరిస్తుంటవి.

నిజంగా అంతేనని అతడన్నాడు.

జ్ఞానబోధనలు, హేతువిహితాలైన మితవాంఛలు చాల తక్కువమందికి

ఉంటాయి. అలాంటివారు కులీనులై ఉత్తమవిద్యాశిక్షణులై ఉంటారు.

అవును.

ఈ పేర్కొన్న రెండుతెగలవారికి మనరాజ్యంలో స్థానం ఉన్నది. అధికసంఖ్యాకుల నీచతరవాంఛలను స్వల్పసంఖ్యాకుల ప్రజ్ఞాసద్వాంఛలు నిగ్రహిస్తవి.

అది కనిపిస్తూనేఉన్నదని అతడన్నాడు.

తన సుఖవాంఛలను నిగ్రహించుకొనే రాజ్యమేదైనా ఉంటే అది మన రాజ్యమని చెప్పవచ్చును గదా?

సంశయమేమున్నది?

మరి నిగ్రహవంతమని కూడ అనవచ్చును గదా ?

అవును.

ఎవరు పాలకులుకావాలి? అన్నప్రశ్నకు పాలకపాలితులు సమాధానం కుదుర్చుకొన్నరాజ్యమేదైనాఉంటే అది మనరాజ్యమవుతుంది గదా?

నిస్సంశయంగా.

పౌరులు పొత్తుగలిగి ఉంటున్నప్పుడు నిగ్రహమనేది ఏ వర్గంలో ఉంటుంది? పాలకులలోనా, పాలితులలోనా ?

ఉభయులలోనూ ఉంటుందని తోస్తున్నది.

నిగ్రహమంటే సామరస్యవిశేషమని మనం చెప్పుకొన్నాము. ఇచట మనమంతగా పొరపడలేదని తోచటంలేదా ?

ఎందుకడుగుతున్నారు ?

నిగ్రహం ప్రజ్ఞాధైర్యాలకంటె విలక్షణం. మరి ప్రజ్ఞాధైర్యాలు ఏదో ఒక వర్గంలో మాత్రమే గోచరిస్తున్నవి కాని, అన్నివర్గాలలో గోచరించటం లేదు. ఏదో ఒకవర్గంలో గోచరించినప్పుడు మనం రాజ్యం ప్రజ్ఞావంతమనీ ధైర్యవంతమని అంటున్నాము. నిగ్రహం అట్లుకాదు. అది సర్వాంగీణం. స్వరప్రస్తారంలో రాగం వ్యాపించి గోచరిస్తున్నట్లే ఈ నిగ్రహం అనేది బలాబలాలతో, ప్రజ్ఞాజడిమలతో, భాగ్యాభాగ్యాలతో భాసించే విభిన్నవర్గాలలో సామరస్యరూపంతో గోచరిస్తుంది. రాజ్యాలలో గాని, వ్యక్తులలో గాని పరిపాలనాధికారం ఎవరికుండాలన్నవిషయంలో స్వభావాధికులకు అల్పులకు ఏర్పడినఒడంబడికనే మనం యథార్థమైన నిగ్రహంగా స్వీకరించవచ్చును.

మీతో నేను సంపూర్తిగా ఏకీభవిస్తున్నాను.

ఇంతకూ నాలుగు సద్గుణాలలో మూడింటిని రాజ్యంలో కనుగొన్నాము. ఇక రాజ్యాన్ని గుణవంతంచేసే నాల్గవగుణమే న్యాయం కావాలి కదా ?

అవును, పరిశేషన్యాయంచొప్పున అంతే.

గ్లాకన్ ! న్యాయం కనుగప్పి మననుంచి తప్పించుకొని పారిపోనీక వేటకాండ్రవలె మనం దానిని చుట్టుముట్టి జాగ్రత్తగా అన్వేషించాలి. అది నిస్సంశయంగా ఈ ప్రాంతంలోనే ఎక్కడో దాగిఉంటుంది. కాబట్టి కనుగలిగి చూస్తూఉండు. నీకు పొడకట్టితే చెప్పు

అంత శక్తేఉంటే ఎంత బాగుండును! ఏది ఎలాఉన్నా కేవలం నేను అనుచరుణ్ణి. మీరు నిర్దేశించిచూపితే చూడగలశక్తి మాత్రమే నాకున్నది. కాని, నాకు నేనై వెదకి పట్టుకోగలసామర్థ్యం లేదు.

అయితే దైవంమీదభారంవైచి నన్ను అనుసరించు.

అలాగే పదండి

దారి కనిపించటంలేదు. కీకారణ్యం విభ్రాంతిగొలుపుతున్నది. అయినా

ముందుకు సాగకతప్పదు.

అలాగే పోదాంపదండి.

ఈ సందర్భాన నాకేదో కనిపించింది. వెంటనే అన్నా "అదిగదిగో ఏదో దారి కనిపిస్తున్నది. అన్వేషార్థం తప్పిపోదనుకొంటాను."

శుభవార్త విన్నాను.

నిజంగా మనం మూఢులము సుమా!

అదేమిటి?

ఏమున్నది? మన అన్వేషణప్రారంభంలోనే ఎప్పుడో మన కాళ్ళముందే న్యాయం తచ్చిళ్ళాడుతూవచ్చింది. అయినా మనం చూడలేదు. ఇంత కన్నా హాస్యాస్పదమేముంటుంది? మేకపిల్లను బుజానపెట్టుకొని ఊరంతా వెదకినట్లు వెదకాము. ముందున్నదానిని చూడక ఎచటికో పోయి వెదకుతున్నాము. అందువల్ల దానిని కనుగొనలేకపోయాము.

అంటే మీ తాత్పర్యం?

వాస్తవంగా మనం చాలసేపటినుంచి న్యాయాన్నిగూర్చి ముచ్చటిస్తున్నామే కాని, దాన్ని గుర్తించలేకపోయాము.

ఈతిరుగుమురుగులతో ఎందుకు విసిగిస్తారు? ఆ చెప్పేదేదో వెంటనే చెప్పివేయండి.

రాజ్యనిర్మాణానికి మూలకందంగా మనం ఒకప్రధానసూత్రాన్ని నిర్ణయించాము. ప్రతివాడు స్వభావోచితమైన ఒకపనిని మాత్రమే చేయాలన్నాము. ఈ సూత్రమే న్యాయమాతుంది. లేదా, ఇందలిభాగమే న్యాయమాతుందంటాను.

అవును, ఒకడు ఒకపనిమాత్రమే చేయాలని మొదటినుంచి చెప్పుకొంటు

న్నాము.

పైగా, న్యాయమంటే స్వధర్మనిర్వహణమే కాని, కానిపోనిపనులన్నీ నెత్తిమీద వేసికొనటం కాదని అనేకపర్యాయాలు చెప్పుకొన్నాము. ఇతరులు గూడ ఈమాటే మనకు చెప్పారు.

అవును.

తనధర్మాన్ని తాను విశిష్టంగా నిర్వర్తించటమే న్యాయమని భావించవచ్చును. అయితే ఈ నిగమనం ఎలా సిద్ధిస్తున్నదో చెప్పగలవా ?

నాకు తెలియదు కాని, చెప్పితే వినాలని ఉన్నది.

నిగ్రహం, ధైర్యం, ప్రజ్ఞ అన్నగుణాలను మినహాయిస్తే రాజ్యంలో మిగిలేది ఇది ఒక్కటేనని నా అభిప్రాయం. తక్కినగుణాల ఉనికికి ఇదే మూలం. ఇది ఇతరగుణాలలో అంతర్భూతమై ఉండి వాటిని కాపాడుతుంది. మనం మూడుగుణాలను కనుగొన్నతరువాత మిగిలేది న్యాయమని చెప్పుకొంటున్నాము.

అంతే గదా మరి !

రాజ్యోత్కృష్టతకు ఈ నాలుగు గుణాలలో ఏది తోడ్పడుతుంది? పాలకపాలితుల ఒడంబడికలా ? లేక ప్రమాదాల యథార్థస్వరూపాన్ని ఎరిగించే సైనికవిహితతాత్త్వికజ్ఞానమా, పాలకుల ప్రజ్ఞాజాగృతులా, లేక స్వధర్మనిర్వహణమా ? అంటే స్త్రీయైనా, బాలకుడైనా, అస్వతంత్రుడైనా, పాలకుడైనా, పాలితుడైనా స్వధర్మం నిర్వహించాలన్నాము. అలాంటి స్వధర్మనిర్వహణం కాపాడుతుందా ? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం తేలికకాదు.

అవును. ఇదిగో ఇది తోడ్పడుతుందని నిర్దేశించి చెప్పటం కష్టమేనని అతడొప్పుకొన్నాడు.

రాజ్యంలో స్వధర్మనిర్వహణశక్తికీ ప్రజ్ఞానిగ్రహధైర్యాలకూ స్పర్ధ

ఏర్పడుతున్నది.

అవును.

అంటే ఇలా పోటీపడుతున్నది న్యాయమే కదా ?

అవును.

ఈ ప్రశ్నను మరొకదృక్పథంతో పరిశీలింతాము. రాజ్యంలోని ధర్మాధికారాన్ని నీవు పాలకులకే అప్పగిస్తావు గదా ?

నిశ్చితంగా.

ఎవరూ పరులసొత్తు అపహరించరాదన్న సూత్రాన్ని పురస్కరించుకొనే తీర్పు వెలువడుతుంది కదా ?

అవును. ఆసూత్రమే పాటించబడుతుంది.

అది న్యాయమే కదా ?

అవును.

ఈ దృష్టినిబట్టి కూడ తనఅర్థంతోపాటు స్వధర్మం పాలించటం న్యాయమని అంగీకరిస్తున్నాము.

నిజమే.

సరిగా ఆలోచించి నాతో ఏకీభవిస్తావో లేవో చెప్పు: వడ్రంగి ఒకడు చర్మకారవృత్తి చేస్తున్నాడనుకో; లేదా, చర్మకారుడొకడు వడ్రంగిపని చేస్తున్నాడనుకో. వారుభయులు తమపరికరాలను గాని విధులను గాని మార్చుకొన్నారనుకో. లేదా ఒకడే రెండువృత్తులు నిర్వహిస్తున్నాడనుకో. ఈ మార్పువల్ల రాజ్యానికి పెద్దగా కీడు వాటిల్లుతుందంటావా ?

లేదు.

ప్రకృతిచే నిర్దిష్టుడైన వడ్రంగి కాని, వేరొకవృత్తిపరుడు కాని, బలిమినో సలిమినో యుద్ధభటవర్గంలో చేర ప్రయత్నిస్తాడనుకో. లేదా వీరభటుడు పాలకవర్గంలో చేరయత్నిస్తాడనుకో. వాస్తవానికతడు దానికి యోగ్యుడు కాడు. అన్యుల విధులు, పరికరాలు చేపట్ట సమర్థుడు కాడు. అయినా అలా చేస్తున్నాడనుకో. లేదా ఒకడే వైశ్యవృత్తి, యుద్ధభటవృత్తి, పాలకవృత్తి చేపట్టాడనుకో. ఇలాంటిమార్పువల్ల—అంటే స్వధర్మం పరిత్యజించి, పరధర్మం స్వీకరించటంవల్ల—రాజ్యానికి వినాశం కలుగు తుంది తప్ప మరొకటి జరగదని నేనంటాను. నా ఈ అభిప్రాయంతో నీవు ఏకీభవిస్తావా?

ముమ్మాటికి.

రాజ్యంలో మూడు విస్పష్టవర్గాలు ఏర్పడుతున్నవి. ఒకవర్గం మరొక వర్గంగా మారటమేమి, ఒకవర్గధర్మం వేరొకవర్గం అనుసరించటమేమి, రాజ్యానికి అత్యంత అనర్థకహేతువు. అలా చేయటమంటే మహాద్రోహం తలపెట్టటమే కదా?

నిస్సంశయంగా.

స్వకీయరాజ్యానికి ఘోరానర్థం కలిగించటం అన్యాయమే కదా?

అవును.

ఇదే అన్యాయం. వణిజుడు, యుద్ధభటుడు, పాలకుడు తమతమ ధర్మా లను నిర్వర్తించటం న్యాయం. ఆ న్యాయంవల్ల రాజ్యం న్యాయవంత మవుతుంది.

మీతో నేనేకీభవిస్తాను.

అప్పుడే మనమంత నిశ్చితంగా తేల్చరాదు. మనం చెబుతున్న న్యాయ లక్షణం వ్యక్తిలోను రాజ్యంలోను గోచరిస్తే సందేహానికి తావుం

డదు. గోచరించకపోతే నూతనపరిశీలన ప్రారంభించవలసిఉంటుంది. న్యాయాన్ని బృహత్తరవస్తువులలో కనుగొనగలిగితే వ్యక్తిలో దానిని కనుగొనటానికి అంతగా క్లేశపడనక్కరలేదు. ఈ అభిప్రాయంతోనే మన పరిశీలనం ప్రారంభించాము కదా? ప్రారంభించిన ఈ పరిశీలనాన్ని ముగింతాము. మనకు బృహత్తరదృష్టాంతం రాజ్యమని తోచింది. దాని ప్రకారం సాధ్యమైనంత ఉత్తమరాజ్యాన్ని నిర్మించాము. ఆ ఉత్తమ రాజ్యంలో న్యాయం గోచరిస్తుందని భావించాము. మనం ఇప్పుడు కనుగొన్నవిషయాన్ని వ్యక్తికి అన్వయించి చూదాము. ఈ రెండు సరిపోతే మనం సంతృప్తిపడవచ్చును. అట్లు కాక, భేదమేర్పడితే రాజ్యాన్ని తిరిగి పరిశీలించి సిద్ధాంతాన్ని మరొకసారి సంస్కరింతాము. ఈ రెంటి ఒరపిడివల్ల వెలుగు బయలుదేరి దానిలో న్యాయం భాసించవచ్చును. అప్పుడు అభివ్యక్తమయ్యేదర్శనాన్ని మన ఆత్మలలో నెలకొల్పుకొందాము.

అదే సరియైనమార్గం. అలాగే చేదాము.

అల్పానల్పాలయిన రెండువస్తువులను ఒకేపేరుతో పేర్కొంటున్నప్పుడు అవి సదృశాలా, అసదృశాలా?

సదృశవస్తువులేనని అతడన్నాడు.

కేవలం న్యాయాన్నే తీసికొన్నప్పుడు న్యాయవంతుడైనమానవుడు తద్రాజ్యసదృశుడే గదా?

అవును.

రాజ్యంలోని మూడువర్గాలు దేనిప్రత్యేకధర్మాన్ని అది నిర్వర్తించునప్పుడు రాజ్యం న్యాయవంతమన్నాము. ఆ యా వర్గాలు ఆ యా గుణాలు ప్రదర్శించినప్పుడు రాజ్యం గూడ నిగ్రహవంతమనీ, ధీరమనీ, ప్రజ్ఞావంతమనీ భావించాము.

అవును.

వ్యక్తి గూడ అంతే. రాజ్యంలో గోచరించిన ఆ మూడుగుణాలు అత నిలో ఉన్నవి. రాజ్యంవలెనే అతడు వికారానికి పాల్పడుతున్నాడు.

అవును.

అయితే మరొకసారి మనలను స్వల్పప్రశ్న ఒకటి ఎదుర్కొంటున్నది. ఇంతకూ ఈ మూడుగుణాలు ఆత్మకున్నవా లేవా?

స్వల్పప్రశ్నా? లేదు. సోక్రటిస్, సామెతచెప్పినట్లు ప్రయోజనకారి ఎప్పుడూ కష్టసాధ్యమే.

నిజమే. ప్రకృతసమస్యాపరిష్కారానికి మనం అనుసరిస్తున్నపద్ధతి సమర్థ మని అనుకోను. సరియైనపద్ధతి మరొకటి ఉన్నది. కాని అది కష్టతరం. అయినా పూర్వపరిశీలనాప్రమాణానికి తీసిపోనిపరిష్కారం మనకు లభించవచ్చును.

దానితో మనం ఎందుకు సంతృప్తిపడరాదు? ప్రకృతపరిస్థితులలో దాని తోనే నేను సంతృప్తిపడతాను.

నాకు సంపూర్ణసంతృప్తి కలుగుతుంది.

అయితే పరిశీలనకు మాత్రం వెనుకంజవేయకండని అతడన్నాడు.

రాజ్యంలో కనిపించే ఈ గుణాలు, లక్షణాలు మనలో ప్రతిఒకనిలో ఉంటవనీ, వ్యక్తినుంచి ఇవి రాజ్యానికి సంక్రమిస్తున్నవనీ ఒప్పుకోవాలి. లేకపోతే రాజ్యానికి ఇవి దేనినుండి సంక్రమిస్తవి? ఉత్సాహగుణం రాజ్యంలో కనిపిస్తున్నప్పుడు అది అందలి ఉత్సాహవంతులైన ప్రజల నుంచి సంక్రమించలేదంటే హాస్యాస్పదం. దీనికి నిదర్శనంగా థ్రేసి యన్లనూ, సిథియన్లనూ, తక్కిన ఔత్తరాహజాతులను తీసికోవచ్చును. అలాగే జ్ఞానతృష్ణ అనేది మనప్రాంతంవారికి లక్షణం. ధనతృష్ణ ఫినిషి యన్లకూ, ఈజిప్టువాసులకూ లక్షణమని చెప్పవచ్చును.

అతడు అంగీకరించాడు.

దీనిని అర్థంచేసికొనటం కష్టం కాదు.

అవును.

అయితే మూడూ మూడుగుణాలా, లేక ఒకేగుణమా ? ఈ ప్రశ్న అంత తేలికగా కనిపించటంలేదు. ఎందుకంటే మనలోని ఒకభాగంతో గ్రహిస్తూ, వేరొకభాగంతో కోపిస్తూ, ఇంకొకభాగంతో స్వాభావికాలైన ఆకలిదప్పులను తీర్చుకోగోరుతున్నామా ? లేక, ప్రతిప్రత్యేకవ్యాపారానికి ఆత్మఅంతా ఏకకర్త అవుతున్నదా ? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం.

అవును. అక్కడే చిక్కువస్తున్నది.

అయితే అవి అన్నీ ఏకమో, అనేకమో పరిశీలించి తేల్చుకొందాము.

ఎలా తేల్చగలమంటారు ?

ఒకేవస్తువు ఒకేభాగంలో ఒకేసమయంలో పరస్పరవిరుద్ధవృత్తులకు ఆస్పదం కాజాలదు. విరుద్ధవృత్తిసమాపాదకమూ కాజాలదు. ఒకటిగా కనిపించేవస్తువులలో ఇలాంటి విరోధమున్నప్పుడు వాస్తవానికి ఆవస్తువులు ఒకటికాదు. భిన్నాలని గ్రహిస్తాము.

అవును.

ఉదాహరణకు ఈ విషయమే తీసికో: ఒకేవస్తువు ఒకేభాగంలో ఒకే కాలంలో అటు గతిమంతమూ, ఇటు స్థితిమంతమూ అవుతుందా ?

అసంభవం.

అయితే అపమార్గపరిహరణకై ముందు పదాల అర్థాలను స్పష్టంగా తేల్చుకొందాము. ఒకడు నిలబడి తల, చేతులు కదుపుతున్నాడనుకో. అతడు కదలుతూ ఉన్నాడు, కదలకపోతూనూ ఉన్నాడు అని ఎవరైనా అంటే మనం ఒప్పుకోము. ఆ వ్యక్తి శరీరంలోని ఒకభాగం కదలుతున్నది,

మరొకభాగం కదలటంలేదని అంటాము.

అవును.

ప్రతిపక్షి తనవాదాన్ని సునిశితమొనరించి ఇలా ప్రతిపాదించాడను కొందాము. స్థానంనుంచి కదలక ములికిపై తిరుగుతున్న బొంగరాన్ని ఉదాహరించి అది కదలుతున్నది, కదలటమూ లేదు అని అన్నాడను కొందాము. ఈ వాదాన్ని మనం అంగీకరించము. ఇలాంటి సందర్భాలలో కూడ వస్తువులకు ఏకైకభాగంలో 'గతి ఉండుట లేకుండుట' అన్న విరుద్ధధర్మాలను అంగీకరించము. ఆ వస్తువులకు అక్షము, పరిధి అన్న రెండుభాగాలున్నవి. వీనిలో అక్షం కదలటం లేదు. ఎందు కంటే దానిలంబత్వంలో మార్పు లేదు. పరిధిభాగంలో కదలిక ఉన్నది. అయితే వస్తుభ్రమణంలో అక్షం కుడిప్రక్కకో, ఎడమప్రక్కకో, ముందుకో, వెనుకకో వ్రాలితే ఏ దృష్టికీ అది నిర్గతికంగా కనిపించదు.

అవును. నిజం చెప్పాలంటే అంతే.

కాబట్టి ఇలాంటి ఆక్షేపణలు మనలను తికమకపెట్టవు. ఒకేవస్తువు ఏకైకాంశంలో ఏకకాలంలో అభిన్నాపేక్షలో పరస్పరవిరుద్ధవృత్తులకు ఆస్పదమాతుందని కానీ, విరుద్ధవృత్త్యాపాదకమాతుందని కానీ మనం నమ్మను.

నిశ్చితంగా అంతే.

ఇలాంటి ఆక్షేపణలన్నీ ఇప్పుడు సాకల్యంగా పరిశీలించి ఇవి అన్నీ నిరాధారాలని మనవాదం విశదీకరించనక్కరలేదు. ఇవన్నీ అసముచితా లని భావించి ముందుకుపోదాము. ఒకవేళ ఈ భావం తప్పని రుజువై నప్పుడు దీనివల్ల లభించిన నిర్ణయాలన్నీ ఉపసంహరించుకొందాము.

అవును. ఇదే సముచితం.

దీనిని అలాఉంచి అనుకూల ప్రతికూలతలు, ఇచ్ఛాద్వేషాలు, ఆకర్షణ వికర్షణలు మున్నైనవన్నీ విరుద్ధధర్మాలని అంగీకరిస్తావు కదా?

ఆ౦.

క్షుత్పిపాసలు, కామాలు, సంకల్పేచ్ఛలు—ఇవన్నీ విరుద్ధధర్మాలే కదా? కామిమనస్సు కామవిషయాన్ని అన్వేషిస్తున్నది. తాను పొందగోరిన వస్తువును తనవైపు ఆకర్షిస్తున్నది. ఒకవస్తువు తనకు రావలెననుకొన్న ప్పుడు ఇష్టావాప్తిని అర్థించి ఎవరో ప్రశ్నించినట్లుగా మనస్సు అంగీకార సూచకమైన శిరఃకంపంతో తనఇచ్ఛను సూచిస్తుంది. అవునా?

నిజమే.

మరి అనిష్టత, వాంఛాభావం—వీనిని గూర్చి ఏమంటావు? ఇవి ద్వేషణ నిరాకరణవర్గానికి చెందినవి కావా?

అవును.

కామాన్ని గూర్చి చెప్పకొన్నది యథార్థమని ఒప్పకొని, ఈ కామాలలో ప్రత్యేకవర్గమైన క్షుత్పిపాసల సంగతి చూదాము. ఎందుకంటే ఇవి ప్రఖ్యాతాలు కదా?

అవును, వాటిసంగతే చూదాము.

ఒకదానికి ఆహారం, మరొకదానికి పానీయం విషయాలు కదా?

అవును.

ఇక్కడే ఆలోచించాలి. 'పిపాస' అన్నది ఆత్మకు కలుగుతున్న పానీయ వాంఛయే కాని, విశిష్టపానీయవాంఛ కాదు గదా! ఉదాహరణకు పానీయగుణమైన వెచ్చదనం, చల్లదనం, పెక్కువతనం, తక్కువతనం కాదు. ప్రత్యేకపానీయమనీ కాదు. దప్పిక ఉష్ణానుగతమైతే శీతలజల వాంఛ ఏర్పడుతుంది. శైత్యానుగతమైతే ఉష్ణపానీయవాంఛ గలుగు తుంది. దప్పిక మెండుగాఉంటే కోరబడుతున్నపానీయం మెండుగా ఉండాలి. దప్పిక మెండుగాలేకుంటే పానీయం తక్కువగానే కావలసి వస్తుంది. కేవలదాహం కేవలపానీయాగ్ని అభిలషిస్తుంది.

అవును. మీరుచెప్పింది యథార్థం. కేవలవాంఛ కేవలవిషయాన్ని అభిల షిస్తుంది. విశిష్టవాంఛ విశిష్టవిషయాన్ని అభిలషిస్తుంది.

అయితే ఇక్కడ కొంత తికమక కలుగవచ్చును. మానవుడు కేవలం పానీయం కోరడు, మంచిపానీయం కోరుతాడు. అలాగే వట్టితిండి మాత్రమే కాదు, మంచితిండి కోరుతాడు. ఈ విధంగా మంచితనం అనేదే వాంఛకు విషయం అవుతున్నది. దాహంకూడ వాంఛయే. దానికి మంచిపానీయం విషయం. ఇలాగే ప్రతివాంఛ సద్విషయకమే అవు తున్నది అని ప్రతిపక్షి అనవచ్చును. ఇలాంటివానివిషయంలో జాగ్రత్త పడాలి.

అవును, అలాంటి అడ్డుపుల్ల అతడు వేయవచ్చును.

ఏది ఎలాఉన్నా సాపేక్షకయుగళంలో ఒకటి విశిష్టమైతే రెండవది విశిష్టం కావాలి. ఒకటి విశిష్టం కాక కేవలమైతే రెండవది కూడ విశిష్టం కాక కేవలం కావాలి.

మీతాత్పర్యం బోధపడలేదు.

సరే, అది అలాఉంచు. అధికము అన్నప్పుడు అల్పమైనదానికంటె అది అధికమైనదిగా ఉండాలి కదా?

అవును.

అధికతరము అన్నప్పుడు అల్పతరమైనదానికంటె అది అధికతరం కావాలి కదా?

నిజమే.

అధికమూ అల్పమూ అన్నవి పూర్వము యథార్థమే, భావిని యథార్థమే.

అవును. ఇంతకు ఏమంటారు?

ఎక్కువ తక్కువ, నలుమడి ఇనుమడి, బలువు సులువు, వేగము మందము, వెచ్చన చల్లన—ఇలాంటి సాపేక్షకార్థాలు గూడ సత్యమే కదా?

నిజమే.

ఈ సూత్రం శాస్త్రాలకు కూడ అన్వయించదా? శాస్త్రలక్ష్యం జ్ఞానం కదా? ప్రత్యేకశాస్త్రానికి ప్రత్యేకజ్ఞానం లక్ష్యం. ఉదాహరణకు భవన నిర్మాణశాస్త్రం తీసికొందాము. ఆ శాస్త్రలక్ష్యం ఇతరశాస్త్రజ్ఞానం కంటె భిన్నమై నిర్దిష్టజ్ఞానం అవుతున్నది. అందువల్లనే ఆ శాస్త్రాన్ని వాస్తుశాస్త్రమంటున్నారు.

అవును.

అంటే ఇతరాలకు లేని ప్రత్యేకగుణం దానికున్నది కదా?

అవును.

దానికి ప్రత్యేకగుణం ఉన్నదంటే ప్రత్యేకలక్ష్యం ఉండటమే కారణం. ఇదే ఇతరకళలకు, శాస్త్రాలకు అన్వయిస్తుంది.

అవును.

ఇప్పుడు నా తాత్పర్యం బోధపడిఉంటే, సాపేక్షాలను గూర్చి నాచెప్పిన వాక్యం నీకు బోధపడిఉంటుంది. సాపేక్షవస్తుయుగళంలో ఒకటి విశేషణరహితమైనప్పుడు రెండవది గూడ విశేషణరహితమౌతుంది. ఒకటి విశిష్టమైతే రెండవది కూడ విశిష్టమౌతుంది. ఇలా అన్నప్పుడు ఒకదాని విశేషణాన్ని తొలగించి రెండవదానికి చేర్చవచ్చునని నా అభిప్రాయం కాదు. అంటే ఆరోగ్యశాస్త్రజ్ఞానం ఆరోగ్యమని, రోగజ్ఞానం రుగ్మత అని అర్థంకాదు. 'శాస్త్రము' అన్నపదం కేవలశాస్త్రము అన్న అర్థంలో కాక ఆరోగ్యశాస్త్రము అన్నట్లుగ, ఒకనిర్దిష్టశాస్త్రము అన్న అర్థంలో వాడినప్పుడు అది నిర్దిష్టమౌతుంది. అప్పుడది కేవల శాస్త్రం కాక వైద్యశాస్త్రంవంటి ప్రత్యేకశాస్త్రమౌతుంది.

బోధపడింది. ఇప్పుడు మీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.

అయితే సాపేక్షకార్థాలలో దాహం అనేది ఒకటనీ, అది నిర్దిష్టసంబంధమనీ ఒప్పుకొంటావు కదా?

అవును. దాహమనేది పానీయాన్ని అపేక్షిస్తుంది.

విశిష్టదాహం విశిష్టపానీయాన్ని అపేక్షిస్తుంది. కేవలదాహాన్ని గ్రహించినప్పుడు అది అధికమూ కాదు, అల్పమూ కాదు; మంచిదీ కాదు, చెడ్డదీ కాదు. ప్రత్యేకపానీయాపేక్షకమూ కాదు. కేవలపానీయాన్ని మాత్రమే అది అభిలషిస్తుంది.

అవును.

దప్పిగొన్నవానిఆత్మ పానీయం మాత్రమే అపేక్షిస్తుంది. దానినే కోరి అతడు సంపాదించటానికి యత్నిస్తాడు.

అవును.

పానీయం త్రావనీయక ఒకానొకటి దప్పిగొన్నవానిని వారిస్తుందనుకో. నివారకమైన ఆ ఒకానొకటి దాహంకంటె భిన్నమైనది కావాలి. ఎందుకంటే ఒకేవస్తువు ఒకేభాగంలో, ఒకేకాలంలో విరుద్ధవృత్తి కాజాలదని మనం చెప్పుకొన్నాము.

అవును.

ఉదాహరణకు విలుకానిచేయి ఏకకాలంలో ఆకర్షణ విక్షేపణలు సాగిస్తున్నదని చెప్పము. ఒకచెయ్యి ఆకర్షిస్తుంటే రెండవది విక్షేపిస్తున్నది అని అంటాము.

నిజమంతే కదా!

ఒకడు దప్పిగొని త్రావనిచ్చగించకపోవచ్చును గదా?

అవును, అది తరుచు జరుగుతూనే ఉంటుంది.

అట్టి సందర్భాలలో ఏమనిచెప్పాలి? అతని ఆత్మలోని ఒకతత్త్వం త్రాగుమని ప్రోత్సహిస్తున్నది, మరొకతత్త్వం త్రాగవద్దని నిషేధిస్తున్నది. నిషేధకతత్త్వం విధాయకతత్త్వంకంటె బలీయమని చెప్పవా?

అలాగే చెప్పాలి.

ఆ నిషేధకతత్త్వం వివేకంవల్ల కలుగుతున్నది. విధాయకతత్త్వం రాగరోగాలవల్ల కలుగుతున్నది.

స్పష్టంగా అంతే.

కాబట్టి ఆత్మలో రెండుతత్త్వాలున్నవని చెప్పవచ్చును. ఒకటి వివేకం. దీనితో మానవుడు వివేచిస్తాడు. రెండవతత్త్వంతో అతడు ప్రేమిస్తాడు. క్షుత్పిపాసార్తుడవుతాడు. వాంఛాపరిలోలుడవుతాడు. దీనినే అవివేకం లేదా తృష్ణ అనవచ్చును. ఇది వివిధసుఖాలకు, సంతృప్తులకు సైదోడు.

అవును. వాటిని భిన్నతత్త్వాలని చెప్పవచ్చును.

సరే. పార్యంతికంగా తేల్చుకొందాము. ఆత్మలో రెండుతత్త్వాలున్నవి. మరి ఉత్సాహంసంగతి ఏమిటి? అది మూడవతత్త్వమా? లేక ఇంతకు ముందు చెప్పుకొన్నవానిలో ఒకదానివంటిదా?

నాకుమాత్రమది కామసదృశమనిపిస్తున్నది.

ఈ సందర్భంలో కథ ఒకటి జ్ఞప్తికి వస్తున్నది. దానిని ఎక్కడో విన్నట్లు గుర్తు. అందు నాకెంతో గురి. ఎగ్లియాన్ కుమారుడు లియాంటియస్ ఒకనాడు పిరీస్ నుంచి వస్తూ వెలుపలి ఉత్తరపుగోడప్రక్కనఉన్న వధ్యస్థానంలో కొన్నిశవాలు పడిఉండటే చూచాడు. వాటిని చూడాలన్నఉత్కంఠ కలిగింది. అవంటే భీతిజుగుప్సలు గూడ అంకురించాయి. కొంతసేపు మథనపడుతూ కళ్ళుమూసికొన్నాడు. తుదికి అతని ఉత్కంఠ జయించింది. బలవంతాన కళ్ళు తెరచి "దుర్మార్గములారా! ఇంతసుందర

దృశ్యం తనివార చూడండి!" అంటూ మృతదేహాభిముఖంగా పరుగెత్తాడట.

ఈ కథ నేనూ విన్నా.

ఇంతకు ఈకథ బోధించే నీతి ఏమిటి? విభిన్నపదార్థాలైనట్లు కామ. క్రోధాలు ఒండొంటితో ఢీకొంటవి.

అవును, దాని అర్థమంతే కదా!

తనలోని వివేకాన్ని ధిక్కరించి కామం నెగ్గినప్పుడు వ్యక్తి తన్నుతాను. నిందించుకొంటాడు. రాజ్యాలోని పక్షవిపక్ష సంఘర్షణవంటి సంఘర్షణ తనలో రేగినప్పుడు కుపితుడౌతాడు. అతని అంతరాత్మ వివేకాన్ని అభిమానిస్తుంది. ఇది అనుభూతార్థమే. అయితే ఒకమార్గం దుష్టమని వివేకం నిర్దేశించినతరువాత అంతరాత్మ కామం పక్షాన చేరదు. దానిని సమర్థించదు. ఇలాంటిది నీకూ, ఇతరులకూ అనుభవగోచరమే ననుకొంటాను.

అవును.

ఒకడు మరొకనికి అపకారం చేశానని అనుకొన్నాడనుకో. అతడు. ఉత్తముడైనకొలదీ అపకారం పొందినవానివల్ల క్షుత్పిపాసాదికంవంటి బాధకలిగినా అంతగా కోపతాపాలు పొందడు.

నిజమేనని అతడన్నాడు.

అలాకాక తనకు అన్యాయం జరిగిందనుకొన్నప్పుడు అతడు ఉడికి. పోతాడు. తాను న్యాయమనుకొన్నపక్షాన చేరుతాడు. క్షుత్పిపాసాదిక బాధలకు గురిఅయినప్పుడు పట్టుదలపెరిగి జయం సంపాదించాలని ప్రయత్నిస్తాడు. పరిపంథివినాశమో, ఆత్మనిధనమో. జరిగితే గాని అతని పట్టుదల శాంతించదు. లేదా అనుశాసకమైన అతని వివేకం ఉత్సా. హాన్ని మొరుగనీక దానివాకట్టు కట్టాలి. అంతవరకు అతడు ఉపశమనం. పొందడు.

చక్రనిదృష్టాంతం చెప్పారు. మనరాజ్యంలో వీరభటులు జాగిలాలవలె జాగరూకులై ఉంటూ పాలకులశాసనం శిరసావహించాలి.

కాబట్టి నాతాత్పర్యం సువ్యక్తమైనదన్నమాట. ఇంతకూ మరొక అంశం కూడ మనం చూడాలి.

ఏ అంశం?

ఉత్సాహం మనకు మొదట్లో కామవిశేషంవలె గోచరించింది. ఇప్పుడో తద్విరుద్ధమనవలసివస్తున్నది. ఎందుకంటే అంతస్సంఘర్షణలో అది వివేకంపక్షాన చేరుతున్నది.

అవును.

మరొకప్రశ్న: ఉత్సాహం వివేకంకంటె అన్యపదార్థమా? లేక వివేకవిశేషమా? వివేకవిశేషమంటే ఆత్మలో రెండేతత్త్వాలుంటవి గాని మూడుగాదు. ఒకటి వివేకం, రెండవది కామం (Concupiscent). వివేకవిశేషం కాదన్నపక్షంలో రాజ్యంలో పాలకక్షత్రియవణిజులు అన్నమూడువర్గాలున్నట్లే, ఆత్మలో గూడ కామవివేకాలతోపాటు ఉత్సాహం కూడ ఉంటుంది. దుష్టవిద్యాశిక్షణవల్ల కలుషితంకానప్పుడు ఇది వివేకానికి నమ్మినబంటుగా పనిచేస్తుంది.

అవును, మీరు చెప్పినట్లు ఆత్మలో మూడవతత్త్వం ఉండాలి.

అవును. ఉత్సాహం కామంకంటె భిన్నమని లోగడ చూచాము. అది వివేకంకంటె భిన్నమైనప్పుడు తృతీయతత్త్వం అవుతున్నది.

ఈ అంశాన్ని తేలికగా రుజువుచేయవచ్చును. చిన్నపిల్లలలో మాతృగర్భావాసం విడచివచ్చినప్పటినుంచి కూడ ఉత్సాహపూర్ణత గోచరిస్తున్నది. మరి వివేకమంటేనో అలా కనిపించటం లేదు. కొందరు వివేచనాశక్తిని ఎన్నడూ పొందలేరన్నట్లు కనిపిస్తారు. పైగా పెక్కుండ్రలో ఈశక్తి చిరకాలానికి గాని వ్యక్తంకాదు.

అవును, ఈ ఉత్సాహం పశువులలో గూడ కనిపిస్తున్నది. కాబట్టి ఇది మీవాదాన్ని బలపరుస్తున్నది. పైగా ఇంతకుముందు మనం ఉదాహరించిన ఈహోమర్‌సూక్తి గూడ ప్రమాణమౌతున్నది.

"ఱొమ్ము తాటించుకొనుచుఁ గ్రోధమ్ముతోడ
ఆత్మనిందానుసంసక్తుఁడయ్యె నతఁడు."

ఈ పద్యపాదాలలో నింద్యమానమైన క్రోధంకంటె మంచిచెడుగులను విచారించే వివేకశక్తి వేరని హోమర్ స్పష్టంగాభావిస్తున్నాడు.

అవును.

మీమాంసలోపడి ఎలాగో ఒడ్డుకు చేరుకొన్నాము. రాజ్యంలో ఉన్న తత్త్వాలే వ్యక్తిలోను ఉన్నవి. అవి మూడన్ననిర్ధారణకు వచ్చాము.

అవును.

రాజ్యం ఏ గుణంవల్ల ప్రజ్ఞావంతమౌతున్నదో ఆ గుణంవల్లనే వ్యక్తిగూడ ప్రజ్ఞావంతుడవుతున్నాడు.

నిశ్చితంగా అంతే.

రాజ్యంలో ఏ గుణం ధైర్యమవుతున్నదో వ్యక్తిలో గూడ ఆ గుణమే ధైర్యమవుతున్నది. ఇతరగుణాల విషయంలో గూడ రాజ్యానికీ, వ్యక్తికీ ఇదే సంబంధమున్నదనవచ్చును గదా?

అవును.

రాజ్యం న్యాయవంతమని ఏ గుణాన్నిబట్టి పరిగణిస్తామో, ఆ గుణాన్ని బట్టే వ్యక్తిని గూడ న్యాయవంతుడని పరిగణించవచ్చును గదా?

అవును. అంతగాక మరేమున్నది?

రాజ్యం న్యాయవంతమంటే అందున్న మూడువర్గాలూ తమతమధర్మం నిర్వహించాలి. అదేన్యాయమన్నాము.

అవును.

స్వాభావికగుణాలు తమతమ ధర్మాలను నిర్వహించగా వ్యక్తి స్వధర్మం నెరవేర్చి న్యాయవంతుడవుతున్నాడని చెప్పుకొన్నాము. దీనిని మరొక సారి జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

అవును.

మరి వివేచనాతత్త్వం ప్రజ్ఞాకలితం. ఆత్మభద్రతను అది కాపాడాలి. ఇలాంటి వివేచన పరిపాలించాలి. ఈ వివేచనకు ఉత్సాహం సహకారిగా ఉండాలి.

అవును. నిశ్చితంగా అలాగే జరగాలి.

మనం చెప్పుకొన్నట్లు సంగీతసాహిత్యవ్యాయామాల ప్రభావంవల్ల వానికి సామరస్యం ఏర్పడుతుంది. ఉదాత్తవాక్యాలు, పాఠాలు బలంచేకూర్చి వివేకాన్ని వర్ధిల్లజేస్తవి. రాగతాళాలు ఏపును ఉడిపి సాంత్వనపరిచి ఉత్సాహానికి సాధుత్వం చేకూరుస్తవి.

అవును.

ప్రతివానికి కామం మెండు. ఇది అప్రశమనీయం. పుష్టిపొంది విద్యాశిక్షణపడసి వివేకోత్సాహాలు తమవిధులను గుర్తించి ఈ కామాన్ని శాసిస్తవి. శారీరకసౌఖ్యాలు మరిగి, పెరిగి, బలిసి కామాంశకాత్మ తన అవధులలో నిలవక తనకు పాలనీయాలు కానివిషయాలపై పెత్తనం చెలాయిస్తూ జీవితాన్ని తారుమారు చేయయత్నిస్తుంది. ఈ ఆటలు సాగనీయక వివేకోత్సాహాలు కాపలా కాస్తుంటవి.

అంతేనని అతడన్నాడు.

అవిరెండు బాహ్యాదండయాత్రలనుంచి యావదాత్మనూ, యావచ్ఛరీరాన్నీ రక్షిస్తుంటవి. ఒకటి సలహా ఇస్తుంటుంది. రెండవది మొదటిదానినాయకత్వాన పోరాడుతూ, ధీరంగా దాని ఆజ్ఞలను, ఉపదేశాలను నిర్వహిస్తుం

టుంది.

అవును.

సుఖదుఃఖాలలో భేతవ్యాభేతవ్యాలలో వివేకవిహితశాసనాలను పాటించువాడేగదా ధీరుడు ?

అవును. అంతకంటె ధీరతకు అర్థమేమున్నది ?

ఎవనిలో సూక్ష్మభూతమైనవివేకం ఆత్మగుణత్రయంలోని వ్యష్టిశ్రేయస్సును, సమష్టిశ్రేయస్సును ఎరిగి ఏలుతూ పాలనీయశాసనాలు చేస్తుందో వానిని ప్రజ్ఞాశాలి అనవచ్చును గదా ?

నిశ్చితంగా.

ఈ గుణత్రయం స్నిగ్ధమై సామరస్యంకలిగి ఉండాలి. పాలకాంశమైన వివేకం, పాలనీయాలైన ఉత్సాహకామాలూ, వివేకపరిపాలనను అంగీకరించి తిరుగుబాటులేక మెలగాలి. అట్టిస్థితిపొందినవాడు నిగ్రహవంతుడే కదా ?

అవును. రాజ్యంలోనైనా, వ్యక్తిలోనైనా నిగ్రహమంటే అలాగే ఉండాలి.

మానవుడు ఏ గుణంవల్ల న్యాయవంతుడవుతాడో పెక్కుసార్లు వివరించాము.

అవును.

రాజ్యంలో మనం కనుగొన్న న్యాయంకంటె వ్యక్తిలో కనుగొన్న న్యాయం అస్పష్టంగా భిన్నంగా ఉన్నదా ? లేక ఒకటిగానే ఉన్నదా ?

తేడాలేదనే నాఅభిప్రాయమని అతడన్నాడు.

ఎందుకడుగుతున్నానో గ్రహించావా? ఇంకా సందేహం మనస్సును ఏమూలనైనా బాధిస్తుంటే తత్పరిహారణకై కొన్ని తార్కాణాలు పేర్కొందామనుకొంటున్నాను.

ఏ తార్కాణాలు?

న్యాయ్యమైన రాజ్యం కానీ, అలాంటి రాజ్యధర్మశిక్షితుడైన మానవుడు కానీ అన్యాయ్యరాజ్యంలోవలె అన్యులధనం అపహరించే అవకాశాలు తక్కువ గదా?

ఎవడూ అపహరించడు.

న్యాయవంతుడైన మానవుడేమి, పౌరుడేమి దైవద్రోహం, చౌర్యం, మిత్రద్రోహం, దేశద్రోహం ఎన్నడైనా తలపెడతాడా?

లేదు.

బాసచేసి తప్పుతాడా? ఒడంబడికను ఒప్పుకొని ఉల్లంఘిస్తాడా?

అసంభవం.

అతడు వ్యభిచారానికి పాల్పడుతాడా? పితరుల అవమానానికి సమ్మతిస్తాడా? మతవిహితకర్మలు ఉపేక్షిస్తాడా?

లేదు.

కారణమేమిటి? అతనిలోని ప్రతిభాగం నిజధర్మాన్ని నిర్వహిస్తుంది. శాసించటమో, విహితశాసనం పాలించటమో చేస్తుంది.

అవును.

మానవులనూ రాజ్యాన్ని అలా కావించేగుణాన్నే నేను న్యాయమంటాను. ఈ నిర్వచనంతో నీవు సంతృప్తి పడుతున్నావా? లేక

వేరే ఏదైనా ఉన్నదనుకొంటున్నావా?

నేను మాత్రం అనుకోవటంలేదు.

అయితే మనకల ఇప్పటికి సిద్ధించింది. రాజ్యనిర్మాణకార్యప్రారంభం లోనే మనకు అనుమానం కలిగింది. ఏదో దైవికశక్తి న్యాయంయొక్క ప్రాథమికరూపాన్ని చూపెట్టాలని అనుమానించావు. ఆ అనుమానం ఇప్పుడు బలపడింది.

నిశ్చితంగా అంతే జరిగింది.

వడ్రంగి, చర్మకారుడు, తక్కినపౌరులు ఎవనిధర్మం వాడు నిర్వర్తించాలి కాని, మరొకనిధర్మం నిర్వర్తించరాదు అన్నకర్మవిభాగమే న్యాయచ్ఛాయ. అందువల్లనే అది ప్రయోజనకారి అయింది.

అవును.

అయితే మనం వర్ణిస్తూవచ్చిన న్యాయం మానవునకు బాహ్యం కాదు. అది ఆంతరికం, ఆత్మీయం. న్యాయవంతుడైనమానవుడు తనలోని విభిన్న తత్త్వాలు పరస్పరనిరోధకాలు కానీయక, ఒకదానిధర్మం మరొకదానిచే నిర్వర్తింపనీయక, ఆంతరికజీవితాన్ని వ్యవస్థీకరించుకొని తనకుతానే పాలకుడై తనశాసనాలను తానే విధించుకొని, ఆత్మశాంతి పొందుతాడు. సంగీతవాద్యమందలి ఉచ్చమధ్యమనీచస్వరాలను పోలిఉన్న ఆత్మస్థగుణముల మాటిని భిన్నం కానీయక ఒకటిగా సంధానించి నిగ్రహవంతం కావించినపిమ్మట అతడు కార్యోన్ముఖుడవుతాడు. ఆస్తివిషయంలో కాని, శరీరచికిత్సావిషయంలో కాని, రాజకీయవ్యవహారాలలో కాని, వ్యక్తిగతవిషయాలలో కాని వ్యవహరించ వలసినప్పుడు కర్తవ్యోన్ముఖుడవుతాడు. సమరసస్థితికి తోడ్పడి కాపాడుదానిని న్యాయమనీ, సద్వర్తనమనీ, అలాంటికర్మకు మూలమైనదానిని ప్రజ్ఞఅనీ, సమరసస్థితిని భగ్నంకావించేదానిని అన్యాయ్యవర్తనమనీ, అలాంటివృత్తికి హేతువైన అజ్ఞానాన్ని అవివేకమనీ అతడంటాడు.

నిజంగా అంతే.

సరే, ఇంతకూ మనం న్యాయవంతుడైన మానవుడూ రాజ్యమూ అంటే ఏమిటో, వానిలోని న్యాయస్వరూపం ఎలాఉంటుందో కనుగొన్నాము. ఇది అసత్యం కాదు కదా?

అసత్య మెలా అవుతుంది?

సత్యం తెలిసికొన్నామని చెప్పవచ్చునంటావు.

అవును.

ఇక అన్యాయాన్ని పరీక్షించాలి.

అవును.

మనం పేర్కొన్నతత్త్వత్రయం మధ్యజరిగే సంఘర్షణ అన్యాయం కాదా? శాస్త్రీయంగా రాజైనవానికి లోబడిఉండక పాలితుడు కుట్రపన్ని తిరుగుబాటుచేసి న్యాయసమ్మతంకాని అధికారాన్ని చెలాయించినట్లే ఆత్మలోని ఒక భాగం మేరమీరి అవయవిపై తిరుగుబాటుచేసి అధికారం చెలాయించటం అన్యాయం, అనిగ్రహం, భీరుత్వం, అజ్ఞానం, అవగుణం కాక మరేమిటి?

అవును.

న్యాయాన్యాయాల స్వభావం తెలిస్తే న్యాయ్యాన్యాయ్య ప్రవర్తనలంటే ఏమిటో స్పష్టమవుతుంది కదా?

అంటే మీ తాత్పర్యం?

ఏమున్నది? దేహగత ఆరోగ్యానారోగ్యాలెట్టివో ఆత్మగతన్యాయాన్యాయాలు అట్టివి.

ఎలాగంటారు?

ఎలాగేమున్నది? ఆరోగ్యప్రదమైనది ఆరోగ్యం కలిగిస్తుంది. అనారోగ్య కరమైనది వ్యాధిని కలిగిస్తుంది.

అవును.

న్యాయ్యకర్మలవల్ల న్యాయం, అన్యాయ్యకర్మలవల్ల అన్యాయం కలుగుతవి కదా?

అవును.

శరీరావయవాలలో స్వాభావికమైనక్రమం, నియతి ఏర్పడటమే ఆరోగ్యం. స్వాభావికమైన ఈవ్యవస్థకూ నియతికీ భంగకరమైన స్థితిఏర్పడటమే వ్యాధి.

అవును.

అలాగే ఆత్మావయవాలలో స్వాభావికమైనక్రమం నియతి ఏర్పడటం న్యాయం. అలాంటి స్వాభావికక్రమానికీ నియతికీ విరుద్ధమైన స్థితిగతులేర్పడటమే అన్యాయం.

అవును, సరిగా అంతే.

కాబట్టి సద్గుణత్వమే ఆత్మకు ఆరోగ్యం, సౌందర్యం, సౌష్ఠవం. దుర్గుణత్వమే ఆత్మకు వ్యాధి, దౌర్బల్యం, వైకల్యం.

అవును.

సదభ్యాసాలు సద్గుణత్వానికీ, దురభ్యాసాలు దుర్గుణత్వానికీ దారితీస్తవి.

అంతకాక మరేమున్నది?

'న్యాయాన్యాయాలవల్ల కలిగే ప్రయోజనాప్రయోజనాలేమిటి?' అన్న మనసమస్య ఇంకా అలాగే ఉన్నది. దేవమానవులు చూచినా చూడక

పోయినా న్యాయవంతుడై న్యాయ్యంగా ప్రవర్తించటం లాభదాయకమా? లేక దండనకూ అధిక్షేపాలకూ పాల్పడనంతకాలం అన్యాయవంతుడై అన్యాయ్యంగా ప్రవర్తించటం లాభదాయకమా? అన్న ప్రశ్న అలాగే ఉన్నది కదా?

సోక్రటిస్ ! నాదృష్టిలో ఇప్పుడది అర్థంలేనిప్రశ్న. నిజంగా అది హాస్యాస్పదం. శరీరసంస్థితి భగ్నమైనవెనుక సకలసంపదలు సర్వాధికారాలు ఉన్నా, ఎన్నిరకాల మాంసాలుపెట్టి ఎన్ని ఆసవాలిచ్చి పోషించినా జీవితం ఏమాత్రం సహనీయం కాదు. ఆవిధంగానే ప్రాణభూతమైన తత్త్వమే విచ్ఛిన్నమై కలుషితమైపోయినతరువాత "ఇకముందు న్యాయసద్గుణసముపార్జనమూ, అన్యాయపాపఫలవిమోచనమూ తక్క ఇతర కార్యాలేవైనాసరే యథేచ్ఛగా చేయవచ్చు"ననుకొన్నంతమాత్రాన అట్టివానిజీవితం వాంఛనీయమౌతుందా? అందులోనూ న్యాయాన్యాయాలు తాదృశాలైనప్పుడు సంశయానికి అవకాశమేలేదు.

అవును. నీవన్నట్లు ఆప్రశ్న హాస్యాస్పదం. అయినా కనులార సత్యాన్ని దర్శించగల స్థితిలో ఉన్నాము. కాబట్టి ఇప్పుడు మనం మోహం పొందరాదు.

ఏ మాత్రం సంకోచించరాదు.

దగ్గరకు వచ్చి దర్శనయోగ్యాలైన దుర్గుణతానానారూపాలను విలోకించు.

మిమ్మే అనుసరిస్తూనే ఉన్నా. అలాగే కానీయండి.

మానవుడు ఉత్తుంగగోపురాగ్రం అధిరోహించినట్లు మనవాదం ఇప్పుడు ఉన్నతశిఖరం అందుకొన్నది. ఈ శిఖరంనుంచి చూచినప్పుడు సద్గుణత్వం ఒకటే. దుర్గుణతారూపాలుమాత్రం అసంఖ్యాకాలు. ముఖ్యంగా వానిలో గ్రహింపదగినవి నాలుగని గోచరిస్తుంది.

అంటే మీతాత్పర్యం?

ఏమీలేదు. రాజ్యరూపాలు ఎన్ని ఉన్నవో ఆత్మరూపాలు అన్ని

ఉన్నట్లు కనిపిస్తున్నవి.

ఇంతకూ ఎన్ని ఉన్నవంటారు ?

రాజ్యరూపాలు ఐదు. అలాగే ఆత్మరూపాలు ఐదు.

ఆ అయిదూ ఏవంటారు ?

మొదటిది మనంచెప్పుకొన్నదే. అయితే దానికి రాచరికం (Monarchy), అరిస్టోక్రసీ (Aristocracy) అని పేర్లుమాత్రం రెండున్నవి. ఈ నామ భేదం కూడ పరిపాలన ఏకకర్తృకమా, బహుకర్తృకమా? అన్నదానివల్ల ఏర్పడుతున్నది.

అవును.

అయితే ఒకేరూపానికి ఇవి భిన్ననామాలంటారు. ఎందుకంటే ప్రభుత్వం ఒకనిచేతిలో ఉన్నా అనేకులచేతుల్లో ఉన్నా మనం ఊహించినట్లుగా పాలకులు శిక్షితులైతే రాజ్యమూలభూతసూత్రాలు పరిరక్షితాలవుతవి.

మీరుచెప్పింది యథార్థమని అతడన్నాడు.

# ఐదవ ప్రకరణం

ఉత్తమరాజ్యం ఇలా ఉంటుంది. ఉత్తమమానవుడు కూడ ఇట్లే ఉంటాడు. ఇది యథార్థమైతే తక్కినదంతా అయథార్థమే. అనర్థకం రాజ్యవ్యవస్థనే కాక వ్యక్తిమానసికవ్యవస్థను కూడ చెరుస్తుంది. ఈకీడు నాలుగు విధాలు.

ఆ నాలుగువిధాలు ఏవంటారు?

అనర్థకరూపాలు నాలుగూ దేనితరువాత ఏది వస్తుందో నాకు గోచరించిన రీతిని చెప్ప మొదలుపెట్టాను. యాడైమాంటస్‌కు అనతిదూరానకూర్చున్న పాలిమార్కస్ అతనితో గుసగుసలు ప్రారంభించాడు. తనచేయిచాచి అతని కోటుబుజం పట్టుకొని సమీపానికి లాగి, తాను ముందుకువ్రాలి ఏదో అతనిచెవిలో చెబుతున్నాడు. "అతనిని వదలిపెడదామా? లేక మరేమి చేదాము?" అన్నమాటలు మాత్రం నాచెవిని పడ్డవి.

వీలులేదని గొంతెత్తి యాడైమాంటస్ అన్నాడు.

"ఎవరినో బంధిస్తున్నట్లున్నారు?" నేను ప్రశ్నించాను.

మిమ్మల్నే.

నన్నా? దేనికి?

దేనికా? అలసతతో కథలో అత్యంతముఖ్యఘట్టం వదలివేసి మమ్మ వంచించతలపెట్టారు. ఆకాయపోకాయగ చెబితే సరిపోతుంది, మీరు గమ నించవచ్చారా? అని అనుకొంటున్నారు. వనితాసుతుల విషయంలో ఎల్లవస్తువులు మిత్రులకు ఉమ్మడిగా ఉండాలన్నమాత్రాన అది అందరికి

స్పష్టమైపోయినట్లు భావిస్తున్నారు.

మరి నేనుచెప్పింది యథార్థం కాదంటావా, యాడైమాంటస్ ?

నిజమే. కాని, ఈ ప్రత్యేకవిషయంలో ఏది యథార్థమో విశదీకరించాలి. ఎందుకంటే సమాజం పెక్కువిధాల ఉండవచ్చును. అందువల్ల దయచేసి మీరు ఉద్దేశిస్తున్న సమాజమేదో చెప్పండి. మనపౌరుల కుటుంబజీవితాన్ని గూర్చి కొంత చెబుతారని చాల సేపటినుంచి ఎదురుచూస్తున్నాము. పిల్లలను ప్రపంచంలో ఎలా అవతరింపజేస్తారో, అవతరించినతరువాత వారిని ఎలా పెంచుతారో, ఈ వనితాసుతసమాజస్వభావం సామాన్యంగా ఎలా ఉంటుందో వివరిస్తారనుకొంటున్నాము. ఇలాంటి వ్యవహారాలు సక్రమంగా సాగించినా, అక్రమంగాసాగించినా రాజ్యాంభోగ్గులలో పెద్దమార్పులు వస్తవని మా అభిప్రాయం. ఈ ప్రశ్న అలాగే ఉండగా మీరు మరొకరాజ్యప్రస్తావన తెస్తున్నారు. అందువల్ల దీనిని ఆమూలాగ్రం చెప్పేటంతవరకు మిమ్మ పోనీయరాదని తీర్మానించుకొన్నాము.

ఆ తీర్మానానికి నేనూ అంగీకరించినట్లే భావించవచ్చునని గ్లాకన్ అన్నాడు.

ఆ శ్రమంతా దేనికి? మేమంతా దీనికి ఒప్పుకొన్నట్లేనని థ్రాసిమాకస్ అన్నాడు.

నన్నిలా ఎదుర్కొని మీరేమి చేస్తున్నారో మీకు బోధపడటంలేదు. రాజ్యాన్ని గూర్చి ఎలాంటివాదం లేవదీస్తున్నారు! ఎలాగో తెమల్చుకొని బయటపడ్డాను. ఈ ప్రశ్నను అధిగమించాను అని అనుకొంటూఉంటే మళ్ళీ మొదలెత్తుకొమ్మంటున్నారు. ఎలాంటి పలుకులతుట్టెను రేపుతున్నారో మీకు తెలియటంలేదు. ఇలాంటిచిక్కు వస్తుందని ముందే ఊహించి పరిహరించాను.

"ఇక్కడకు మేము దేనికి వచ్చామనుకొంటున్నారు? బంగారం దొరుకుతుందనా? చర్చవిందామనా?" థ్రాసిమాకస్ ప్రశ్నించాడు.

నిజమే కాని, ఏచర్చకైనా ఒక అవధి ఉండాలి.

గ్లాకన్ అందుకొన్నాడు: నిజమే సోక్రటిస్! ఇలాంటి సల్లాపశ్రవణానికి యావజ్జీవం అవధియని ప్రజ్ఞావంతులు నిర్ణయిస్తారు. మాసంగతి పట్టించు కొనక ఈ ప్రశ్నకు మీకు తోచినట్లు సమాధానం చెప్పండి. మనపాల కుల వనితాసుతసమాజం ఎలా ఉండవలసిఉంటుంది? జననవిద్యాభ్యా సాల మధ్యకాలం అత్యంతశ్రద్ధను అపేక్షిస్తుంది కదా. ఈ కాలం ఎలా గడపాలి? ఈ వ్యవహారాలన్నీ ఎలాసాగుతవి?

మిత్రమా! సమాధానం తెలియక కాదు. చెబితే వైపరీత్యం సంభవిస్తుంది. ఇతఃపూర్వనిర్ణయాలకంటె ఇప్పుడు ఎక్కువసందేహాలు రేగుతవి. చెప్పింది ఎంతవరకు ఆచరణసాధ్యమా అన్నసంశయం కలుగుతుంది. మరొక దృష్టితో చూచినప్పుడు ఇది ఒకవేళ ఆచరణీయమే అయినా ఉత్త మోత్తమం అవుతుందా అంటే సందిగ్ధమే. కాబట్టి ఈ విషయోపక్రమ ణకు సంకోచిస్తున్నాను. అసలు మన ఆశయమంతా స్వప్నసదృశం కావచ్చు.

ఏమాత్రం భయపడనక్కరలేదు. మీశ్రోతలంత కఠినచిత్తులు కారు. నిత్యశంకితులూ కారు. ప్రతిపక్షులు అంతకన్నా కారు.

మిత్రమా ఇంతకంఠశోష దేనికి, నన్ను పురికొల్పటానికేకదా?

అవునని అతడు ఒప్పుకొన్నాడు.

అయితే దానికిది కేవలం విపరీతమని చెప్పాలి. నేను మాటాడుతున్న దేమిటో నాకు తెలియునన్నవిశ్వాసం నాకుంటే మీరిచ్చేప్రోత్సాహం బాగానే ఉండేది. తన్ను ప్రేమించేప్రజ్ఞాశాలులముందు పరమార్థాలను ప్రకటించ భయపడనక్కరలేదు. సంశయించ నక్కరలేదు. కాని, తనకే నిశ్చితంగా తేలనివిషయాలు ముచ్చటించటం ప్రమాదకరం. ప్రమాద మంటే నన్ను నవ్విపోతారని కాదు కాని, సత్యం కనుగొనలేక జారి పడుతూ నాతోపాటు మిత్రులనుగూడ కూలద్రోయవలసివస్తుంది. మీదు మిక్కిలి నేను చెప్పబోయేదానికి దైవం శిక్షించక క్షమించాలని ప్రార్థిస్తు న్నాను. ఎందువల్లనంటే సత్యవంచనంతో, సౌందర్యవంచనంతో, న్యాయ

వంచనంతో పోల్చిచూచినప్పుడు, సంకల్పపూర్వకంకాని మానవహత్య అల్పదోషమే. అలాంటి తెగువను శత్రుమధ్యంలో పూనుకొంటాను కాని, మిత్రులమధ్య పూనుకోలేను. కాబట్టి మీప్రోత్సాహం తృప్తికరంగా లేదు.

గ్లాకన్ నవ్వి అన్నాడు : సోక్రటిస్! మీరు కానీ, మీవాదం కానీ మాకు అంత అపకారం కలిగిస్తే ముందుగానే మీరు నిర్దోషులని ప్రకటిస్తాము. వంచకులన్నదోషం కూడ ఆరోపించము. ధైర్యంవహించి ఇక ఉపక్రమించవచ్చును.

నిర్దోషి అని చట్టం తీర్పుచెప్పినప్పుడు మానవుడు దోషవిమోచనం పొందుతున్నాడు. న్యాయస్థానంలో వర్తించే ఈ సూత్రం ప్రకృత వాదానికి కూడ వర్తిస్తుందని నేను అన్నాను.

అయితే ఇంకా సంశయందేనికి?

సరే నేను మళ్ళీ వెనుకకుపోయి సముచితస్థానంలో చెప్పవలసినదానిని ఇప్పుడు చెబుతాను. పురుషులు తమపాత్ర నిర్వహించారు. ఇక స్త్రీలు తమపాత్రను నిర్వర్తించవలసిన సమయం వచ్చింది. వారిని గూర్చి ఇప్పుడు ప్రసంగిస్తాను. అందులో మీరు ఇంతగాఅర్థిస్తున్నప్పుడు వెనుకాడ రాదు కదా!

వనితాసుతాదికం పడసి ప్రవర్తిల్లవలసినతీరుతెన్నులలో సరియైననిర్ణయం ఏర్పడాలంటే మనపౌరులవలె జన్మవిద్యాసంస్కారాలు పొందినవారికి నామతంలో ఒకటే మార్గమున్నది. పురుషులు పాలకులై కదుపు కాపాడేజాగిలాలవలే ఉండాలని ఆదిలో చెప్పకొన్నాము. ఆమార్గమే అనుసరించాలి.

అవును.

స్త్రీల జన్మవిద్యాభ్యాసాలకు కూడ ఆ నియమాలు లేదా తత్సదృశనియమాలు వర్తించాలి. అప్పుడు ఫలితం మనం నిర్దేశించుకొన్నపద్ధతికి అనుగుణమవుతుందో లేదో చూదాము.

అంటే మీ తాత్పర్యం?

నా అభిప్రాయమేమో ప్రశ్నరూపాన వెల్లడిస్తాను. జాగిలాలలో ఆడ మగ తేడాలున్నవా? తమ జాతికి విహితమైన వేట, కాపుదల మున్నుగాగలపనులలో ఆ ఉభయము సమానభాగస్వామ్యం పొందుతున్నవా? కాక, మందకాపుదలను కేవలం మగజాగిలాలకు అప్పగించి ఆడజాగిలాలకు పిల్లలను కనిపెంచేపని సరిపోతుందనేఉద్దేశంతో వాటిని ఇంట వదలివేస్తామా?

లేదు. వాటిపనులలో అవి సమానభాగస్వామ్యం పొందుతవి. వాటిలో ఉన్న తేడా ఒక్కటే. మగవి బలీయాలు; ఆడవి దుర్బలాలు.

అయితే ఒకేపెంపకము, శిక్షణ ఉంటేతప్ప వేర్వేరుజంతువులను ఒకేపనికి ఉపయోగించగలమా?

లేదు.

పురుషులతో సమానమైనవిధులే స్త్రీలకుండవలసివస్తే వారికి గూడ ఆ ప్రకృతీ, శిక్షణా ఉండాలి కదా?

అవును.

పురుషులకు నిర్దిష్టమైన చదువుసాములుండాలన్నాము.

అవును.

అలాంటప్పుడు స్త్రీలకు చదువుసాములతోపాటు యుద్ధకళను గూడ నేర్పాలి. ఆ కళను పురుషులవలె స్త్రీలు గూడ అభ్యసించాలి.

అవును, మరి అలాగే ఊహించవలసివస్తున్నది.

మనసూచనలలో పెక్కులు అనుష్ఠితాలైనప్పుడు క్రొత్తలై హాస్యాస్పదాలుగా తోచవచ్చును.

అందు సందేహం లేదు.

వారు నగ్నదేహులై పురుషులతోపాటు వ్యాయామశాలలో వ్యాయామం చేస్తుంటే మరీ హాస్యాస్పదంగా తోచవచ్చును. సాముగరిడీలకు దిగిన ముదిమిముడుతలరూపువలెనే ఆ దృశ్యం కూడ మనోజ్ఞమేమీ కాదు.

అవును, నిజమే. ఇప్పటి అభిప్రాయాలనుబట్టి ఈ ప్రతిపాదన హాస్యాస్పదంగానే కనిపిస్తుంది.

మనమతం చెప్పబూనుకొన్నాము. కాబట్టి ఈ క్రొత్తప్రతిపాదనపై విదగ్ధులు ప్రయోగించేచతురోక్తులకు మనం భయపడరాదు. ముఖ్యంగా స్త్రీల చదువుసాముల నేర్పును గూర్చి, మైమరువులు దాల్చి గుర్రాలపై స్వారి చేసే తీరునుగూర్చి ఎన్నో ఎకసక్కెలు ఆడుతుంటారు.

నిజమేనని అతడన్నాడు.

అయినా ఉపక్రమించినతరువాత హేతువిహితగమ్యం చేరకమానుకొంటామా? ఇది నవ్వులాట కాదు, జాగ్రత్తగా ఆలోచించండని అంటాము. మానవుడు నగ్నంగా కనిపించటం హాస్యాస్పదమనీ, అసముచితమనీ నిన్నమొన్నటిదాకా మన యవనజాతివారంతా భావించేవారు. ఈనాటికీ బర్బరులు అలాగే భావిస్తున్నారు. మొదట క్రీటన్లూ తరువాత లెసిడిమోనియన్లూ ఈ ఆచారాన్ని ప్రవేశపెట్టినక్రొత్తలో నాటివిదగ్ధులు వీనిని ఇంత తీవ్రంగానే వెక్కిరించి వేళాకోళంచేసిఉంటారు.

అందు సందేహంలేదు.

అయితే వస్తువులను ఆచ్ఛాదితాలను చేయటంకంటె అనాచ్ఛాదితాలుగ ఉండనీయటమే మేలని అనుభవం రుజువుచేసినపిమ్మట చర్మచక్షువుకు గోచరించేహాస్యాస్పదత్వం వీగిపోతుంది. అవివేకదురభ్యాసాలమాట ఎత్తక, అన్యాలను వెక్కిరించేవాడు అవివేకి. శుభమునుబట్టికాక మరొక ప్రమాణంతో రామణీయకాన్ని నిర్ణయించేవాడు మూఢుడు.

అది యథార్థమని అతడన్నాడు.

చమత్కారార్థం ప్రశ్నించినా, జిజ్ఞాసతో ప్రశ్నించినా ముందు స్త్రీ స్వభావాన్ని గ్రహించటం ముఖ్యం. పురుషకార్యకలాపాలన్నిటినో కొన్నిటినో స్త్రీ నిర్వహించగలదా, లేదా? ముఖ్యంగా యుద్ధంలో ఆమె పాల్గొనగలదా, లేదా? మనం పరిశీలించి సరియైననిర్ణయం ఏర్పరచుకొనటానికి ఇదే ఉత్తమమార్గం.

అవును.

మరి పూర్వపక్షంతో మనపరిశీలనం ప్రారంభింతామా? ఇలాచేస్తే మనం ప్రతివాది దూషణలను గమనించలేదన్న నింద రాదు.

అవును. అలాగే ఎందుకు చేయరాదు?

అయితే ప్రతిపక్షులకు వలసినవాదం మనమే కల్పింతాము. వారు అంటారు: "సోక్రటిస్! గ్లాకన్! ఎవరో ప్రతివాది వచ్చి మీరు నింద్యులని పేరుపెట్టి చెప్పనక్కరలేదు. ఎందుకంటే రాజ్యస్థాపన ప్రారంభంలోనే నిజప్రకృతికి యోగ్యమైన పనినిమాత్రమే ప్రతివాడూ చేయాలని మీరన్నారు." నిజానికి మనం అన్నది కూడ అంతేగా. "అయితే స్త్రీపురుషప్రకృతులు భిన్నాలుకావా ఏమి?" అని వారంటారు. మనము "భేదం లేకేమి? ఉన్నదంటాము," "మరి స్త్రీపురుషుల కర్తవ్యాలు వారి వారిప్రకృతులకు అనుగుణమై భిన్నాలు కానక్కరలేదా?" అని వారడుగుతారు. "భిన్నంగానే ఉండాలి"అని మనమంటాము. "ఆపక్షంలో విభిన్నప్రకృతులైన స్త్రీపురుషులు ఒకేవిధమైన కర్మలను చేయాలనటం స్వవచనవ్యాఘాతమే కదా?" అని వారు ప్రశ్నిస్తారు. ఇలాంటి ఆక్షేపణలకు దొరకొనే ప్రతిపక్షులకు మనపక్షాన నీవు చెప్పేసమాధానమేమిటి?

ఆకస్మికంగా ఇలాంటి ప్రశ్న వేస్తే సమాధానం చెప్పటం తేలిక కాదు. మనం చెప్పవలసినసమాధానమేదో మీరే సన్నద్ధపరచాలని మనవి.

ఈ ఆక్షేపాలు, ఇలాంటివి ఇంకా మరికొన్ని ముందే ఎప్పుడో ఊహించాను. ఇవి నన్ను భయపెట్టి, వనితాసుతులస్వభావం నిర్ణయించటానికీ, వారిని ఉమ్మడిసొత్తుగ పరిగణించి నియమమేర్పరచటానికీ కొంతజంకును

కలిగించాయి.

నిజమే, ఈ సమస్యాపరిష్కారం సుసాధ్యం కాదు.

అవును, నిలువుకుమించిననీటిలో పడ్డప్పుడు సముద్రంలో పడినా చెరువులో పడినా ఈదక తప్పదు.

ఎలా తప్పుతుంది ?

సరే, ఎలాగో ఈది ఒడ్డుచేర ప్రయత్నింతాము. ఏ దైవమో వచ్చి ఒడ్డున వేస్తుందని ఆశింతాము.

అంతకు తప్ప మరి దారిలేదు.

తరణోపాయమేమైనా కనిపిస్తుందేమో చూదాము. భిన్నప్రవృత్తులవారు భిన్నవృత్తులు అవలంబించాలని మనం ఆమోదించాము కదా ? మరి ఇప్పుడేమంటున్నాము ? భిన్నప్రకృతులవారు ఒకేవిధమైనవృత్తి అవలంబించాలని అంటున్నాము. ఈవిరోధమే కదా మనకాపాదింపబడుతున్నది ?

అవును.

తప్పు పట్టటమెంత తేలిక !

అంటే మీ తాత్పర్యం ?

అనేకులు తమకు తెలియకుండానే ఇలాంటి అపమార్గాన పడతారు. తాము హేతుబద్ధంగా మాటాడుతున్నామనుకొంటారు. కాని నిజానికి వారుసాగిస్తున్నది జల్పం. ఎందుకంటే సునిశితంగా విభజించి పరిచ్ఛేదం కావించి తామేమి మాటాడుతున్నారో గ్రహించలేరు. చర్చించి తత్త్వం గ్రహించటానికి బదులు కాదనటమే ముఖ్యమన్న భావంతో నిరర్థకవాదన సాగిస్తారు.

తరచు అలాంటివి జరుగుతుంటవి. కాని, వాటికీ మనవాదానికీ సంబంధ మేమిటి?

లేకపోవటమేమి? చాల ఉన్నది. ఎందుకంటే తెలియకుండానే అలాంటి ప్రయోజనవిరహిత వివాదంలో పడేప్రమాదం ఉన్నది.

ఏ విధంగానంటారు?

'భిన్నప్రకృతులు భిన్నవృత్తులు అవలంబించాలి' అన్నసూత్రంలోని అక్షరాక్షరం పరమసత్యమని అన్నామే కాని ప్రకృతిలోని భిన్నత్వమంటే ఏమిటి? ఏకత్వమంటే ఏమిటి? అని విచారించలేదు. భిన్నప్రకృతులకు భిన్నవృత్తులను, ఏకప్రకృతికి ఏకవృత్తిని ఎందుకు ఏర్పరచామని కూడ మనం పరిశీలించలేదు.

నిజమే. ఆ ప్రశ్నే విచారించలేదని అతడన్నాడు.

'బట్టతలలవారికీ వెంట్రుకలున్నవారికీ ప్రకృతిలో విరోధం లేదా?' అని దృష్టాంతపూర్వకంగా ప్రశ్నిస్తామనుకో. విరోధముందని ఒప్పుకొంటాము. అంతమాత్రాన బట్టతలలవారు చర్మకారులైతే వెంట్రుకలున్నవారు చర్మకారులు కారాదని కానీ, తద్వైపరీత్యం జరగరాదని కాని నిషేధించవలసిఉంటుందా?

అది హాస్యాస్పదమని అతడన్నాడు.

అవును, హాస్యాస్పదమే. ఎందువల్ల? మనం రాజ్యం నిర్మించినప్పుడు ప్రకృతులలోనివిరోధాలు ప్రతిభేదానికి అన్వయించాలి అని మనం ఉద్దేశించలేదు. వ్యక్తి యొక్క వృత్తిగత విభేదాలకు మాత్రమే ఇవి అన్వయించాలని ఉద్దేశించాము. దృష్టాంతపూర్వకంగా చెప్పాలంటే వైద్యుడూ, మానసికంగా వైద్యుడైనవాడూ ఒకేప్రకృతికలవారని వాదించిఉండేవాళ్ళము.

అవును.

కాని, వైద్యుడూ, వడ్రంగి భిన్నప్రకృతులు గదా?

అవును.

వృత్తియోగ్యతలో స్త్రీపురుషులకు భేదముంటే, ఆ యా వృత్తులు ఆ యా జాతికి నిర్దేశించాలి. అలాకాక స్త్రీపురుషులకు జనయిత్రీ జనకత్వభేదం మాత్రమే ఉంటే విద్యాశిక్షణలో స్త్రీ పురుషులకు తేడా ఉండవలెనని అది నిరూపించజాలదు. కాబట్టి మనపాలకులకూ వారిభార్యలకూ సమానవృత్తులు ఉండాలన్నవాదాన్ని మనం త్రోసి రాజనక కొనసాగించాలి.

అవునని అతడన్నాడు.

పౌరవృత్తులకు సంబంధించినంతలో స్త్రీస్వభావం పురుషస్వభావంకంటె ఎలా భిన్నమో ప్రతివాదిని మనం ప్రశ్నించాలి.

అది సముచితమే.

అలా అడిగినప్పుడు అతడు నీవలెనే వెంటనే సమాధానం చెప్పటం తేలిక కాదు. కొంచెం ఆలోచించినపిదప చెప్పటం కష్టం కాదు అని అన వచ్చును.

అతనిని మనవాదంలో పాల్గొనవలసినదని కోరి రాజ్యపరిపాలనకు సంబంధించినంతలో స్త్రీతత్త్వంలో ప్రత్యేకత ఏమీలేదని నిరూపించవచ్చునని ఆశించవచ్చునా?

ఎందుకాశించరాదు?

అతనికి చెప్పుదాము: మిమ్మొకప్రశ్న అడుగుతాము. మీరు 'సంపన్నమైన ప్రకృతి' అని పేర్కొంటున్నారు. దాన మీతాత్పర్యమేమిటి? ఆ ప్రకృతికలవాడు ఒకదానిని తేలికగా నేర్వగలడు. అది లేనివాడు కష్టంతో గ్రహించగలడనేనా మీతాత్పర్యం? స్వల్పశిక్షణతో మొదటి వాడు స్వయంగా అధికంగా గ్రహించగలడు. రెండవవాడు పరిశ్రమించి

అభ్యసించి నేర్చినది అంతలోనే మరచిపోతాడనేనా? లేక మనస్సునకు అనుగుణమైనసేవ చేయగలిగినదేహం ఒకరికి ఉంటుంది. రెండవవానికి అది నిరోధకమాతుందనా? ప్రకృతిసిద్ధనైపుణ్యం ఉన్నవానికీ లేనివానికీ ఇలాంటి తేడాలే కదా ఉండేది?

దీనికెవరూ కాదనరు.

స్త్రీకంటె పురుషునకు ఇలాంటి నైపుణి, గుణగణం అధికంగాలేని మానవ వృత్తిని దేనినైనా ఒకదానిని నీవు పేర్కొనగలవా? నేత, వంట, పచ్చళ్ళుపట్టటం-వీటిలో స్త్రీజాతిదే పైచేయి. పురుషులు వీటిలో స్త్రీలను ఓడించటం హాస్యాస్పదమని నేను అనవచ్చును గదా?

పెక్కువిషయాలలో పెక్కురుస్త్రీలు పెక్కురుపురుషులకంటె అధికులైనా, మొత్తమ్మీద స్త్రీజాతి పురుషజాతికంటె తక్కువన్న మీవాదం యథార్థం.

మిత్రమా! ఆ పక్షంలో రాజ్యపరిపాలనలో స్త్రీత్వంవల్లనేమి, పురుషత్వంవల్లనేమి నిర్వహింపదగిన ప్రత్యేకశాఖ ఏదీ లేదు. ప్రకృతిసిద్ధగుణాలు ఉభయజాతులందు ఒకేతీరున ఉన్నవి. పురుషులకు వృత్తులైనవన్నీ స్త్రీలకు గూడ వృత్తులే. అయితే వీటి అన్నిటిలోను పురుషునకంటె స్త్రీ తక్కువని చెప్పాలి.

మీరు చెప్పింది అక్షరాల నిజం.

అలాంటప్పుడు మనశాసనాలన్నిటిని పురుషులకువిధించి స్త్రీలకు ఎందుకు నిషేధించాలి?

అది ఎన్నటికి కుదరదు.

ఒకర్తెకు వైద్యంలో నైపుణ్యముంటుంది. వేరొకర్తెకు ఉండదు. ఒకర్తె చక్కగా పాడుతుంది. మరొకర్తె పాడలేదు అంటావా?

యథార్థమంతే.

ఒకరితకు వ్యాయమన్నా సైనికశిక్షణమన్నా ఇష్టం ఉండవచ్చు. వేరొకర్తెకు యుద్ధమంటే గిట్టకపోవచ్చు. వ్యాయామాన్ని ద్వేషించవచ్చు.

నిశ్చితంగా అంతే.

ఒక స్త్రీ తత్త్వవేదిని. వేరొకర్తె తత్త్వశాస్త్రవిరోధిని. ఒకర్తె ఉత్సాహిని అవుతుంది. వేరొకర్తె ఉత్సాహశూన్య అవుతుంది.

అది కూడ నిజమే.

ఒకర్తెకు రక్షకస్వభావముంటుంది. వేరొకర్తెకు ఉండదు. ఇలాంటి భేదాలను పురస్కరించుకొనే కదా రక్షకపురుషుల ఎన్నిక జరిగింది?

అవును.

రక్షకునకు వలసినగుణాలు పురుషులకూ స్త్రీలకూ సామాన్యమే. కాని, సబలతాదుర్బలతలలోనే వారికి భేదమేర్పడుతున్నది.

స్పష్టంగా అంతే.

అలాంటి గుణగణాలున్న స్త్రీలను, సదృశగుణశీలసామర్థ్యాలున్న పురుషులకు సహచారిణులుగా, సహకారిణులుగా నియోగించాలి.

అవును.

సమానప్రకృతులకు సమానవృత్తులుండాలి కదా?

అవును.

కాబట్టి రక్షకులభార్యలకు చదువుసాములు విధించటం అస్వాభావికం ఏమాత్రం కాదు.

నిజమే.

కాబట్టి మనం అప్పుడు చేసినచట్టం ప్రకృతివిరుద్ధం కాదు. కనుక అది అసాధ్యమూ కాదు. కేవలం ఆశామాత్రమూ కాదు. పైపెచ్చు ఇప్పుడున్న ఆచారం ప్రకృతికి విరుద్ధం.

అవును, అలాగే కనిపిస్తున్నది.

అయితే మన ప్రతిపాదనలు ఆచరణసాధ్యాలు, పరమశ్రేయోదాయకాలు అవునా, కాదా? అన్న ప్రశ్నను మనం పరిశీలించాలి.

అవును.

మరి సాధ్యమన్న విషయం ఇదివరకే తేలిపోయింది.

నిజమే.

ఇక పరమశ్రేయోదాయకమన్న విషయాన్ని నిరూపించవలసిఉన్నది.

అవును.

పురుషుని ఉత్తమరక్షకుని గావించేవిద్య స్త్రీని గూడ ఉత్తమరక్షకురాలిని చేస్తుందని నీవు అంగీకరిస్తావు. ఎందుకంటే వారిమొదటిప్రకృతి ఒకటే.

అవును.

ఇక్కడ నిన్నొకటి అడగాలనుకొంటున్నాను.

ఏమిటది?

గుణాతిశయంలో పురుషులంతా సమానులా? లేక ఒకడు మరొకనికంటె అధికుడా?

రెండవదే నాకు సమ్మతం.

మనం వ్యవస్థీకరించిన రాజ్యంలో మన ఆదర్శపద్ధతిలో శిక్షితులైన సంరక్షకులు పూర్ణపురుషులంటావా? లేక చర్మకారవిద్యాశిక్షితులైనవారు పూర్ణపురుషులంటావా?

ఎంత హాస్యాస్పదమైన ప్రశ్న!

నా ప్రశ్నకు సమాధానం వచ్చింది. సరే మన సంరక్షకులే మన పౌరులలో ఉత్తములు.

సందేహమేమున్నది?

మరి వారి స్త్రీలు ఉత్తములు కారా?

అవును.

స్త్రీపురుషులు వీలైనంత ఉత్తములు కావటంకంటె రాజ్యానికి శ్రేయస్కరం మరేముంటుంది?

అవును.

మనం అభివర్ణించినరీతిగా చదువుసాములు నేర్పినప్పుడు ఈ లక్ష్యం సిద్ధిస్తుంది కదా?

అవును.

ఆ పక్షంలో మనం ఆచరణసాధ్యమైనదానినే కాదు, రాజ్యానికత్యంత శ్రేయస్కరమైనదానినే శాసనబద్ధం చేశాము.

అవును.

అలాంటప్పుడు సంరక్షకులభార్యలు వ్యాయామార్థం ముక్తవస్త్రలు కావాలి. శీలమే వస్త్రమై వారిని సంచ్ఛన్నలను చేస్తుంది. యుద్ధసంకటాలలో దేశసంరక్షణలో వారు పాల్గొనాలి. అయితే సుకరాలను మాత్రమే

వారికప్పగించాలి. అంతకుతక్క మిగిలినవిషయాలలో ఉభయజాతులకు సమానవిధులే ఉండాలి. ఇలా ఉత్తమలక్ష్యసాధనకై వ్యాయామం చేసే స్త్రీలను చూచి పరిహసించేపురుషుడు అపరిణతప్రజ్ఞాఫలభోక్త అవుతున్నాడు. దేనిని చూచి నవ్వుతున్నాడో గ్రహింపలేకపోతున్నాడు. తానేమి చేస్తున్నాడో గుర్తింపలేకపోతున్నాడు. 'ప్రయోజనకారి అంతా ఉదాత్తం, హానికరమైనదంతా నీచం.' ఈసూక్తి నిత్యసత్యం.

నిజమే.

ఇప్పటికి ఒకక్లేశతరంగం అధిగమించాము. సంరక్షకులైన స్త్రీపురుషులకు సమానవిధులుండాలని నిర్ణయించి నిరపాయంగా బయటపడ్డాము. మన ప్రతిపాదనలు ఆచరణసాధ్యాలే కాక లాభదాయకాలని గూడా నిర్బాధంగా నిరూపించాము.

అవును. ఆ మహాతరంగాన్ని అధిగమించాము.

నిజమే. కాని, వస్తున్నతరంగాన్ని చూస్తే నీవిలా అనవు.

సరే. మరిదానిని గూడ చూడనీయండి.

ఇంతకుముందు మనం చెప్పుకొన్నదానినిబట్టి మనసంరక్షకులభార్యలు ఉమ్మడిఇల్లాండ్రై, పిల్లలు వారందరిపిల్లలై ఉండాలి. పితరుల ఇద్దరిలో ఎవరికీ తమసంతానమెవరో తెలియరాదు. అలాగే సంతానానికి గూడ తమపితరులెవరో తెలియరాదు.

అవును. గతతరంగంకంటె ఇది మహత్తరమే. ఇలాంటిశాసనం యొక్క ఆచరణసాధ్యత, ప్రయోజనకారిత సందేహాస్పదాలవుతున్నవి.

ఆలుబిడ్డలు ఉమ్మడిసొత్తు అయితే మహత్తరప్రయోజనం కలుగుతుంది. ఇచట వివాదం లేదనుకొంటాను. అయితే ఇది ఎంతవరకు సాధ్యమన్నది వేరేవిషయం. అది అత్యంతవివాదగ్రస్తం.

అయితే ఈ రెండువిషయాలను గూర్చి అనేకసందేహాలు అంకురించ

వచ్చును.

అంటే ఈ రెండుప్రశ్నలను కలిపి యోజించాలనేకదా నీతాత్పర్యం? దీనిప్రయోజనాన్ని నీవు అంగీకరించాలని నాభావం. అలా జరిగితే నాకొకప్రశ్న తీరిపోతుంది. ఇక ఆచరణసాధ్యత అన్నవిషయం ఒక్కటే మిగిలిఉంటుందని అనుకొన్నాను.

అయితే మీయెత్తు బయటపడ్డది. కాబట్టి తాము అనుగ్రహించి ఉభయ విషయాలూ ఎలా సమర్థనీయాలో చెప్పాలి.

తప్పుతుందా మరి? విధికి తలఒగ్గాలి. అయినా నీవు కొంతఅనుగ్రహం చూపాలి. పగటికలలు కనేవారు ఏకాంతంగా నడుస్తున్నప్పుడు ఆనందిస్తు న్నట్లే నాస్వప్నంతోనన్ను గూడ ఆనందించనీ. వారు తమవాంఛితార్థ సాధనాలు ఆలోచించరు. ఆ చిక్కులు వారిని బాధించవు. ఆ వాంఛి తార్థాలకు ఎంతవరకు అవకాశాలున్నవా అన్నవిచారంతో సతమతం కారు. వాంఛ సిద్ధించినట్లే భావించి తమప్రణాళికను కొనసాగిస్తారు. తమ ఇష్టార్థం యథార్థమైనప్పుడు తాము చేయదలచుకొన్నదాని వివరాలను స్మరిస్తూ సంతోషిస్తారు. నావరకు నాకు గుండెనిబ్బరం జారిపోనారంభిం చింది. నీ అనుమతితో సాధ్యతా సమస్యను ప్రకృతం వదలివేయాలని ఉన్నది. అందువల్ల మన ప్రతిపాదన ఆచరణసాధ్యమని భావించి ఈ ఏర్పాట్లను మనరక్షకులు ఎలా నిర్వహిస్తారో పరిశీలిస్తాను. మన ప్రణాళికను అమలుపరిస్తే రాజ్యానికి, రక్షకులకు మహత్తరశ్రేయస్సు కలుగుతుందని నిరూపిస్తాను. నీకు అభ్యంతరం లేకపోతే ముందు ఈ ప్రతి పాదనవలని లాభాలను నీతోడ్పాటుతో పరిశీలిస్తాను. ఆ తరువాత సాధ్య తాప్రశ్నను ఆలోచిస్తాను.

నాకేమీ అభ్యంతరం లేదు. అలాగే కానివ్వండి.

పాలకులూ సైనికులూ సార్థకనాములు కావాలంటే ఒకరు ఆజ్ఞను పాలించ టానికి ఇష్టపడాలి; మరొకరికి శాసనశక్తి ఉండాలి. సంరక్షకులు స్వయంగా శాసనాలను శిరసావహించాలి. వారివివేచనకు వదలినవిష యాలలో ఆశాసనాలతాత్పర్యం పురస్కరించుకొని వ్యవహరించాలి.

అవును, అలాగే చేయాలని అతడన్నాడు.

శాసనంచేసేనీవు పురుషులను ఎన్నుకొన్నతరువాత స్త్రీలను ఎన్ని పురుషులకిస్తావు. ఆ స్త్రీలు వీలుపడినంతవరకు వారికి సదృశమైన ప్రకృతులు కలవారు కావాలి. వారు సమష్టిగృహాలలో నివసిస్తూ సమష్టిభోజనసందర్భాలలో కలవాలి. వారిలో ఎవరికీ అతనిది లేక ఆమెది అంటూ ఏదీ ఉండదు. వారు కలిసిమెలిసి ఉంటారు. ఒకచోటనే పెరుగుతారు. వ్యాయామసందర్భాలలో కలిసికొంటారు. స్వభావావశ్యకతనుబట్టి వాటికి పరస్పరసంపర్కమేర్పడుతుంది. ఇక్కడ 'ఆవశ్యకత' అన్నపదం ఆక్షేపణీయం కాదు గదా?

కాదు. కాని 'ఆవశ్యకత' అంటే శాస్త్రీయావశ్యకత (Geometrical) కాదు. ప్రణయిజనవేద్యమైన ఆవశ్యకత. ఇంతగా ప్రజానీకాన్ని విశ్వసింపజేసి బలవంతపెట్టి పనిచేయించేది మరొకటి లేదని అతడన్నాడు.

నిజమే అన్నిటికీవలెనే దీనికి క్రమం నియమం ఉండాలి. ఆదర్శమూర్తుల నగరంలో విశృంఖలత తగదు.

అవును, అలాంటిదానికి అనుమతించరాదని అతడన్నాడు.

అలాంటప్పుడు దాంపత్యం పరమపవిత్రమని భావించవలసిఉంటుంది. మరి శ్రేయోదాయకమైనది పవిత్రం కాదా?

అవును.

మరి వివాహాలను అత్యంతప్రయోజనవంతాలుగా చేయాలంటే ఎలా వీలుపడుతుంది? మీ యింట్లో వేటకుక్కలూ, అనల్పసంఖ్యాకాలైన పక్షులూ ఉన్నవి. కాబట్టి నిన్నీప్రశ్న అడుగుతున్నాను. వానిని జంటకలపటంలో పెంచటంలో నీవెన్నడైన శ్రద్ధవహించావా?

వహించకేమి? ఇంతకూ ఏ విశేషాలూ కావాలంటారు?

ఆఁ, ఏమున్నది! అవన్నీ మంచివే అయినా వానిలో కొన్ని తక్కినవాటి

కంటె మేలైనవి కదా?

అవును.

విచారరహితంగా వాటిని కలుపుతావా? లేక ఉత్తమోత్తమాలైనవాటినే కలిపి ఉత్తమజాతిసంపాదనకు ప్రయత్నిస్తావా?

మేలైనవాటినే జంటకలుపుతాను.

అయితే వేటిని కలుపుతావు? వృద్ధతమాలనా, కసుగందులనా, కాక తరుణవయస్కాలనా?

తరుణవయస్కాలనే ఏరి కలుపుతాను.

మరి ఈ విషయంలో జాగ్రతి వహించకపోతే నీజాగిలాలు, పక్షులు అధమజాతులవుతవి గదా?

అవును.

ఇదే గుర్రాలకూ సామాన్యజంతుజాతికీ వర్తిస్తుంది కదా?

నిస్సంశయంగా.

మరి ఈ సూత్రమే మానవజాతికి అన్వయించాలంటే మనరక్షకులకు ఎంత నైపుణ్యం కావాలి?

అవును, మానవజాతికి గూడ ఇదే వర్తిస్తుంది. కాని దీనికి ప్రత్యేక నైపుణ్యం ఎందుకు కావలసివస్తుందంటారు?

ఎందువల్లనంటే మనపాలకులు సంఘానికి ఔషధాలు వాడవలసిఉంటుంది. రోగులు ఔషధంతోనిమిత్తంలేక పథ్యం సేవిస్తున్నప్పుడు అంతంత మాత్రపువైద్యుడు వారికి చాలు. కాని, ఔషధం వాడాలంటే వైద్యుడు నిపుణుడైఉండాలి.

నిజమే, కాని ఇంతకూ మీ ఉద్దేశమేమిటి?

తమ ప్రజల శ్రేయస్సుకోసం పాలకులు తగినంతమోతాదులో అసత్యం, వంచన సంపాదిస్తారు. ఔషధంవలె దానిని వాడటం శ్రేయోదాయకం కావచ్చునని మనం చెబుతూవచ్చాము.

అవును.

న్యాయవిహితమైన దీనివినియోగం వివాహశిశూత్పాదనవ్యవస్థలలో తరచు ఆవశ్యకం కావచ్చును.

ఎలాగంటారు?

స్త్రీపురుషులలో ఉత్తములైనవారికి తరచుగాను, అధములైనవారికి అరుదుగాను సమాగమం సమకూర్చాలి. జాతి ఉచ్చస్థితి పరిరక్షితం కావాలంటే అధమసమాగమసంజాతసంతతిని పరిహరించి ఉత్తమసమాగమసంజాత సంతతినే పోషించాల'ని మనం ఇదివరకే ప్రతిపాదించాము. ఈ సమాగమాలు రహస్యంగా జరగాలి ఈ రహస్యం పాలకులకు మాత్రమే తెలియాలి. వారికి కూడ తెలియకపోతే సంరక్షకజాతివిషయంలో విభేదాలేర్పడుతవి.

అవును, అంతేగా.

వధూవరసందోహసమావేశాలకు అనుగుణంగా కొన్నిపర్వదినాలు ఏర్పరచి ఆహుతిపూజలకూ,మనకవులురచించిన సముచితకామదేవగీతాల ఆలాపనకూ కట్టడిచేయటం మేలు కాదా? అయితే 'ఎన్ని పెండ్లిండ్లు జరగాలి?' అన్నవిషయం మాత్రం పాలకులే నిర్ణయించుకోవాలి. వారు సగటుజన సంఖ్యను దృష్టిలో ఉంచుకొని వ్యవహరిస్తారు. యుద్ధాలు, వ్యాధులు మున్నగాగల జననాశనకారణాలను పెక్కు గమనిస్తూ సాధ్యమైనంత వరకు రాజ్యం నాతిబహళమై నాతిస్వల్పమై వర్తిల్లజేయాలి.

నిశ్చితంగా అలాగే చేయాలి.

మనం సమావేశపరిచినప్పుడు అల్పయోగ్యులైనవారికి సమాగమావకాశం పరిహరించే 'లాటరీ'పద్ధతివంటి అపూర్వపద్ధతిని కనిపెట్టవలసి ఉంటుంది. అప్పుడు వారు తమ దురదృష్టాన్ని నిందించుకొంటారే కాని పాలకులను నిందించరు.

అవును, అలాగే చేయాలి.

వీరులు ఉత్తములు అయినయువకులు గౌరవబహుమానాలే కాక తమకు ప్రదత్తలయిన స్త్రీలతోడిసమాగమానికి అధికతరావకాశాలు పొందాలి. దానికి హేతువు వీరత్వమే. అట్టివీరులు వలనుపడినంత మిక్కుటంగా సంతానం పొందాలి.

నిజమే.

మరి సముచితోద్యోగులుంటారు. వారు పురుషులు కావచ్చు, స్త్రీలూ కావచ్చు, ఉభయులూ కావచ్చు. ఎందువల్లనంటే ఉద్యోగాలు స్త్రీలు పురుషులు నిర్వర్తించాలి గదా ?

అవును.

ఈ సముచితోద్యోగులు ఉత్తమజననీజనకులసంతతిని కొనిపోయి బాలమందిరంలో కొంతమంది దాదులసంరక్షణమందు ఉంచుతారు. ఈ దాదులు ప్రత్యేకావాసాలలో నివసిస్తుంటారు. అధములసంతతినీ, వికలాంగతపొందిన ఉత్తములసంతతినీ అచింత్యాజ్ఞేయప్రదేశంలో వదలివేస్తారు.

మరి పాలకజాతిస్వచ్ఛతను రక్షించాలంటే అది తప్పదని అతడన్నాడు.

ఉద్యోగులు శిశుపోషణకు ఏర్పాట్లు చేస్తారు. పూర్ణస్తన్యలైనప్పుడు తల్లులను బాలమందిరాలకు కొనివచ్చి పాలిప్పిస్తారు. అయితే ఏతల్లీ తనబిడ్డను గుర్తించరాదు. దానికి తగిన కట్టుదిట్టాలు చేస్తారు. తల్లులపాలు పిల్లలకు చాలనప్పుడు పెరదాదులను కూడ దానికై నియోగించవచ్చును. పాలిచ్చే పని సుదీర్ఘం కానీక వలసినజాగ్రతి వహిస్తారు. నడిరేయి మేల్కొనవలసినఇబ్బంది కాని ఇలాంటి మరొకచిక్కు కాని తల్లులకు కలుగదు.

ఈ కార్యభారమంతా దాదులకూ పరిచారులకూ అప్పగింపబడుతుంది.

మన సంరక్షకులభార్యలకు సంతానోత్పత్తి సుఖతరమై ఉండాలంటు న్నారు.

అవును, అలాగే ఉండాలి. సరే ఆవిషయం అలాఉంచు. మనకథను కొనసాగిద్దాము. తలిదండ్రులు తరుణవయస్కులై ఉండాలని మనం చెప్పుకొన్నాము.

అవును.

మరి తరుణవయస్సంటే స్త్రీజీవితంలో ఇరవైసంవత్సరాలనీ, పురుషజీవితంలో ముప్పైసంవత్సరాలనీ నిర్వచించగూడదా ?

అంటే ఏసంవత్సరాలని మీఉద్దేశం ?

స్త్రీ తన ఇరువదవయేడు మొదలుకొని నలువదవయేడువరకు రాజ్యార్థం పిల్లలను కనాలి. పురుషులు ఇరువదియైదవయేడు మొదలుకొని ఏబదియైదవ యేడుదాక సంతానోత్పాదకులు కావాలి.

అవును. స్త్రీపురుషజీవితాలలో శారీరకంగా మానసికంగా పక్వావస్థ ఆవయస్సులోనే ఏర్పడుతుంది.

ఈ వయోవస్థకు పూర్వం కానీ అనంతరం కానీ సామాజికకామతంత్ర సంసక్తి పొందేవ్యక్తి అపవిత్రాధర్మకార్యం చేస్తున్నట్లు ప్రకటించాలి. ఇలాంటి నిషిద్ధసంగమంవల్ల రహస్యసంతానం కలిగితే పురోహితులు వివాహ గర్భాదాన శుభలగ్నసమయాలలో జరిపే పుణ్యక్రతువులూ, ప్రజలు సాగించేవేడుకలూ జరగవు. తలిదండ్రులకంటె సంతతి సార్థక జన్మం కావాలని జరిపేప్రార్థనాదికమేదీ జరగదు. అట్టిసంతతి పాపఫలమూ తుచ్ఛకామోచ్ఛిష్టమూ అవుతుంది.

అవును.

నిర్దిష్టవయస్కుడైనవ్యక్తి పాలకుల అనుజ్ఞ పొందక యుక్తవయస్కురాలైనస్త్రీతో చెలిమిచేసినప్పుడు అతనికి కూడ ఈ చట్టమే వర్తిస్తుంది. అట్టివానిసంతతి రాజ్యం గుర్తింపనొల్లని అపవిత్రపతితసంతతి అవుతుంది.

అంతేగా మరి.

సంతానయోగ్యవయస్కులకు మాత్రమే ఈ చట్టం వర్తిస్తుంది. ఆ వయస్సును అధిగమించినపురుషులు మాత్రం దుహితృదౌహిత్రులను మాతృమాతామహులను వర్జించి తక్కినస్త్రీలతో సంగతినెరపటానికి అనుమతిస్తారు. ఉక్తవయస్సును అధిగమించినస్త్రీలు పుత్రపౌత్రాన్నీ, పితృపితామహులను వర్జించి తక్కినపురుషులతో సంగతినెరపటానికి అనుజ్ఞయిస్తారు. అయితే సంతానం కాంచరాదన్నకఠోరనియమం విధించి ఇలాంటి అభ్యనుజ్ఞ ప్రసాదించబడుతుంది. తప్పిదారిగా సంతతికలిగితే అది పోషింపబడక పరిత్యక్తమౌతుందని పితరులు గ్రహించవలసి ఉంటుంది.

ఇది సహేతుకప్రతిపాదనమే. కాని, ఎవరు తండ్రులో, ఎవరు పుత్రికలో మున్నైనవిషయాలు ఎలా తెలుస్తవి?

వారెప్పుడూ తెలిసికోలేరు. అయితే దానికి మార్గం ఒకటిఉన్నది. కామదేవారాధనదినోత్సవం మొదలుకొని ఏడవమాసంలోనో పదవమాసంలోనో ఉద్భవించినపిల్లలలో మగవారిని కుమారులనీ, ఆడపిల్లలను కుమార్తెలనీ వరుడెంచుతాడు. ఆ పిల్లలు ఆతనిని తండ్రిగా భావిస్తారు. ఆ పిల్లల పిల్లలను అతడు మనుమలుగా, మనుమరాండ్రుగా పరిగణిస్తాడు. వారు ఆ వధూవరులను పితామహులుగా భావిస్తారు. తమతలిదండ్రుల కాన్పుకారున పుట్టినపిల్లలు ఒండొరులను సోదరులుగా భావిస్తారు. సోదరులకు పరస్పరవివాహాలు నిషిద్ధాలని ఇదివరకే చెప్పుకొన్నాము కదా? అయితే దీనినిబట్టి సోదరులవివాహం సంపూర్తిగా నిషిద్ధమని భావించరాదు. 'లాటరీ'విధి అనుకూలమై పిథియన్ దివ్యవాణి (Pythian oracle) అనుజ్ఞ ఇస్తే శాసనం అట్టివివాహాలకు సమ్మతిస్తుంది.

ఇది సముచితంగానే ఉన్నది.

మొత్తమ్మీద ఈ పద్ధతిప్రకారం మనరాజ్యసంరక్షకులకు భార్యలూ కుటుంబాలూ ఉమ్మడిగా ఉంటారు. ఇలాంటిసమాజం మనమింతకుముందు చెప్పకొన్న రాజనీతికనుగుణమే. ఇంతకంటె మరొకటి ఉత్తమం కాజాలదని అంగీకరిస్తావు గదా ?

ఆ.

శాసనక్రియలోనూ రాజ్యవ్యవస్థీకరణలోను శాసనకర్తకు ఉండవలసిన పరమలక్ష్యాన్ని పురస్కరించుకొని సామాన్యప్రాతిపదికాన్ని నిర్ణయించ యత్నిద్దామా ? ఏది అత్యంతంశ్రేయోదాయకమో, ఏది అత్యంతం అనర్థదాయకమో చూదాము. ఆ తరువాత మనమింతకుముందు అభివర్ణించినది శ్రేయస్కరమో అనర్థకమో పరిశీలింతామా ?

అలాగే.

ఏకత్వం నెలకొనవలసినచోట వైషమ్యవైముఖ్యబహుత్వాలుండటంకంటె కీడు, ఐక్యకలనకంటె మేలు ఉంటుందా ?

ఎన్నటికీ ఉండదు.

సుఖదుఃఖాలలో సమభావం ఉన్నప్పుడు ఒకేసన్నివేశానికి ప్రజలంతా సుఖమో దుఃఖమో పొందుతున్నప్పుడు ఐక్యం వర్ధిల్లుతున్నదని చెప్పవచ్చును గదా ?

నిస్సంశయంగా.

రాజ్యంలో జరిగేసమానసంఘటనలకు సగంలోకం విజయోత్సాహం పొందుతుంటే మిగతాసగంలోకం దుఃఖమగ్నమౌతున్నప్పుడు ప్రజానీకం సహవేదన లేక వైయష్టికవేదనం పొందుతున్నప్పుడు రాజ్యం వ్యవస్థారహితం అవుతుంది.

అవును.

ఇలాంటివిభేదాలు సాధారణంగా 'నాది, నాది కాదు', 'అతనిది, అతనిది కాదు' అన్న పదప్రయోగంతో వ్యక్తమవుతుంటవి.

నిశ్చితంగా అంతే.

ఒకవస్తువునకు ఒకేరీతిని 'నాది, నాది కాదు' అన్నపదాలను అత్యధిక సంఖ్యాకులైనవ్యక్తులు వాడేరాజ్యం సువ్యవస్థితరాజ్యమే కదా?

అవును.

శరీరంలోని ఏ వ్రేలివంటిభాగానికో దెబ్బతగిలినప్పుడు శరీరమంతా ఆత్మాభిముఖమై అద్దాని ఆధిపత్యాన ఏకరాజ్యమై గాయానికి బాధ పడుతూ క్షతిపొందినభాగంతో సానుభూతి చూపుతుంది. అప్పుడు మానవునివ్రేలికి బాధకలుగుతుందని అంటాము. ఇలాగే శరీరంలోని ఏ అంగానికి నొప్పికలిగినా బాధపడుతున్నదనీ, ఆ నొప్పి విరతిపొందు తున్నప్పుడు సుఖం కలుగుతున్నదనీ అంటాము. ఇలాంటివ్యక్తివంటిదే సువ్యవస్థితరాజ్యం.

నిజమే. సువ్యవస్థితరాజ్యంలో మీవర్ణించిన సహభావముంటుందని నేనూ అంగీకరిస్తాను.

ఆ పక్షంలో ఒకవ్యక్తికి మేలో కీడో కలిగినప్పుడు రాజ్యమంతా దానిని తనదని భావించి ఆ వ్యక్తితోపాటు సుఖమో, దుఃఖమో పొందుతుంది. అవునా?

ఆc, సువ్యవస్థితరాజ్యంలో అలాగే జరుగుతుంది.

ఇప్పుడు మనకు ప్రధానవిషయమైన రాజ్యానికి తిరిగివద్దాము. ప్రధాన సూత్రాలకు ఇప్పటిరాజ్యరూపం అనుగుణమో, మరొకరాజ్యగుణం అను కూలమో పరిశీలిద్దాము.

అలాగే కానివ్వండి.

ఇతరరాజ్యాలలోవలెనే మనరాజ్యంలో కూడ పాలకులూ పాలితులూ ఉన్నారు కదా ?

అవును. వారంతా ఒండొరులను 'పౌరమహాశయు'లని పిలుచుకొంటారు గదా ?

అది సహజమే.

అయితే ఇతరరాజ్యాలలో తమపాలకులను ప్రజలు మరొకపేరుతో పిలవరా ?

సాధారణంగా వారిని ప్రభువులంటారు. ప్రజాస్వామికరాజ్యాలలో వారిని పాలకులంటారు.

మరి మనరాజ్యంలో పాలకులను పౌరులన్ననామానికితోడుగ ప్రజలు మరేపేరుతో పిలుస్తారు ?

త్రాతలు, సహాయకులు అని కూడ పిలుస్తారు.

మరి పాలకులు ప్రజలను ఏమని పిలుస్తారు ?

పోషకులనీ పెంపుడుతండ్రులనీ అంటారు.

మరి ఇతరరాజ్యాలలోనో ?

బానిసలంటారు.

ఇతరరాజ్యాలలో పాలకులు ఒండొరులను ఏమని పిలుచుకొంటారు ?

సహపాలకులంటారు.

మరి మనరాజ్యంలోనో ?

సహసంరక్షకులంటారు.

పాలకుడు తనసహచరులలో ఒకనిని మిత్రునిగా, మరొకనిని అమిత్రునిగా పరిగణిస్తాడని దృష్టాంతపూర్వకంగా చెప్పటానికి నీకు తెలిసినరాజ్యమేదైనా ఉన్నదా?

లేకేమి? అలాంటిరాజ్యాలే మెండు.

ఒకవ్యక్తిలో ఆసక్తిఉంటే అతనిని మిత్రునిగా పరిగణిస్తాడు. అలాంటి ఆసక్తిలేనప్పుడు ఆ రెండవవానిని లాతివానినిగా భావిస్తాడు.

అవును.

అయితే నీసంరక్షకులలో ఎవడైనా ఇతరసంరక్షకుని లాతివానినిగా భావిస్తాడా? పోనీ అలా పేర్కొంటాడా?

ఎన్నడూ చేయడు. ఎందుకంటే తాను కలిసికొనేప్రతివానిని సోదరునిగానో, సోదరిగానో, తండ్రిగానో, తల్లిగానో, పుత్రునిగానో, పుత్రికగానో, మాతామహునిగానో, పౌత్రునిగానో భావిస్తాడు. ఎందుకంటే బాంధవ్యం ఏర్పడుతున్నది.

చక్కగా చెప్పావు. మరొకసారి అడుగుతాను: వారు నామమాత్రమైన ఏకకుటుంబంగా ఉంటారా? లేక నిజంగా ఏకకుటుంబంగా ఉంటారా? దృష్టాంతానికి ఒకరిని తండ్రి అని అన్నప్పుడు అతనిపట్ల పితృయోగ్యమైన భక్తిప్రపత్తులు వినయవిధేయతలు నెరపాలిగదా? ఈ విధులను ఉల్లంఘించినవ్యక్తి పాపిగా, ధర్మేతరుడుగా, దైవానుగ్రహవిమారుడుగ, మానవగౌరవ అభాజనుడుగ, పరిగణింపబడుతాడు గదా? తండ్రులనీ, బంధువులనీ నిర్దేశింపబడినవ్యక్తులందు ఈ ధర్మాలనే తూచాతప్పక అనుష్ఠించాలని పిల్లలకు ఎల్లపౌరులు చెవినిల్లు కట్టుకొని చెప్పాలా లేదా?

అన్యం ఎలా చెబుతారు? ఏదో నోరు ఉన్నదని బాంధవ్యం పేర్కొంటూ దానికనుగుణమైనధర్మాన్ని అనుసరించకపోతే అంతకన్న హాస్యాస్పదం మరేముంటుంది?

ఆ పక్షాన ఇతరరాజ్యాలకంటె మనరాజ్యంలో సామరస్యం, అనుకూల్యం దండిగా ఉంటవన్నమాట. నేనింతకుముందు చెప్పినట్లు ఎవనికైనా మేలు కలిగినా కీడుకలిగినా ఎల్లవాడు దానిని తనదని భావిస్తాడు.

అవును.

వారికి ఒకేవస్తువులో సమానాసక్తి కలిగినప్పుడు వారిలో ఎల్లవాడు దానిని తనదని భావిస్తాడు. ఇలాంటి సమానాసక్తి ఉన్నప్పుడు సహ సుఖదుఃఖసంవేదనలు కలుగుతవి.

అవును. ఇతరరాజ్యాలకంటె మనరాజ్యంలో ఇది అధికం.

దీనికి రాజ్యతత్త్వమే కాక సంరక్షకులకు వనితాసుతులు ఉమ్మడిగా ఉండటం కూడా కారణం.

రెండవదే ప్రధానకారణం.

ఈ సంవేదనమందలి ఐక్యమే సమాజం పొందగల ఉత్తమఫలమని మన మంగీకరించాము. రాజ్యాన్ని శరీరంతో పోల్చి అంగాల సుఖదుఃఖాలను శరీరమంతా పొందుతున్నట్లే వివిధవ్యక్తుల కష్టసుఖాలను రాజ్యం పొందాలన్నప్పుడు మన తాత్పర్యం ఇదే కదా?

అవును. అది అత్యంత యోగ్యం.

మనపౌరులకు ఉమ్మడిగ దారసుతులుండటం అత్యధికశ్రేయస్సునకు మూలం.

నిశ్చితంగా.

సంరక్షకులకు ఇళ్ళు కాని, భూములు కాని, మరేవిధమైన ఆస్తి కాని ఉండరాదన్నాము. వారికి ఇతరపౌరులు భృతిమాత్రమైన వేతనం ఇవ్వాలి. శీలాభిరక్షణకోసం వ్యక్తిగతవ్యయమేమీ వారికి ఉండరాదన్నాము. పూర్వం చెప్పిన ఈ సూత్రంతో ప్రకృతనియమం సరిగా అన్వయిస్తున్నది

కదా ?

అవును. చక్కగా అతుకుతున్నది.

ఉమ్మడిపొత్తు, ఉమ్మడికుటుంబాలు అన్నవి రెండూ వారిని యథార్థసంరక్షకులను చేస్తవి. ఎందుకంటే 'నాది, నాది కాదు' అన్నవిభేదాలతో రాజ్యాన్ని చీలికలు పేలికలు చేసి ప్రతిఒకడు తనసంపాదించినదానిని దారసుతాదికలితమై సుఖదుఃఖదాయకమైన స్వగృహానికి చేర్చ వీలుండదు. అందరూ సాధ్యమైనంతవరకు సమానసుఖదుఃఖాలకు పాల్పడుతారు. ఎందువల్లనంటే హితప్రియాలవిషయాలలో వారికి ఏకాభిప్రాయం ఉంటుంది. అందువల్ల వారికి సమానలక్ష్యం ఏర్పడ వీలవుతుంది.

అవును.

తనదని చెప్పుకోవాలంటే శరీరంతక్క మరొకటి ఉండదు. కాబట్టి వివాదాలకూ అభియోగాలకూ ఆస్కారం ఉండదు. ధనసుతబాంధవాది పూర్వక వివాదాలన్నిటికి దూరమౌతారు.

అంతే కదా మరి!

వీడు అన్యాయ్యంగా నన్నెదుర్కొన్నాడు, వీడు నన్నవమానించాడు-ఇలాంటి నిందారోపణలకూ విచారణలకూ వారిలో చాలవరకు అవకాశం ఉండదు. ఎందుకంటే సమానుడు సమానునినుంచి రక్షించుకొనటం గౌరవప్రదమూ ధర్మ్యమూ అని చెబుతున్నాము. పైగా ఆత్మరక్షణ అవశ్యకర్తవ్యమంటున్నాము.

అదెప్పుడూ మంచిదే.

ఇలాంటి చట్టంవల్ల మరొకలాభం కూడ ఉన్నది. ఒకనికి మరొకనితో తగాదావచ్చినప్పుడు అప్పటికప్పుడే అతడు తనపగ తెగటార్చుకొంటాడు కాని, సుదీర్ఘం సాగనీయడు.

అవును.

పరిపాలనమూ, యువదండనమూ పెద్దల కర్తవ్యమని నిర్దేశించాలి.

అవును.

న్యాయాధికారులు శాసిస్తేతప్ప పిన్నలు పెద్దలను కొట్టరు; వారిపై దౌర్జన్యం నెరపరు; అవమానించరు. ఎందువల్లనంటే అలాంటి దుష్కృతి నుంచి వారిని నిరోధించేశక్తులు రెండు ఉన్నవి. ఒకటి లజ్జ, రెండవది భీతి. వరుసకు తండ్రులైనవారిపై చేయిచేసికొననీక సిగ్గు నివారిస్తుంది. క్షతగాత్రునిసోదరులు, కుమారులు, తండ్రులు క్షతునకు తోడ్పడుతారన్న భీతి జనిస్తుంది.

అది యథార్థం.

ఒండొరులతో పొరపొచ్చాలుడిగి పొత్తుగలిగి బ్రతకటానికి శాసనాలు ఎల్లవిధాల తోడ్పడుతవి.

అవును, శాంతికి కొదవ కలుగదు.

సంరక్షకులు అంతఃకలహాలకు ఎన్నడూ పాల్పడరు. కాబట్టి ప్రజలూ వారిపై తిరుగుబాటు కావించరు. తమలోతాము పోరాడుకొనే అవకాశం గూడ ఉండదు.

అవును.

అవాచ్యనైచ్యం వారికి తప్పిపోతుంది. ఉదాహరణకు నిరుపేదలు భాగ్యవంతులముందు చదివేస్తోత్రపాఠాలు అంతరిస్తవి. దినవెచ్చానికై అప్పులు పొడిచి ఎగవేయనక్కరలేదు. పడరానిపాట్లుపడి దాసీదాసజనపోషణకై ప్రజలు డబ్బు సంపాదించటం మున్నైన అవాచ్యక్లేశాలకు లోనై ప్రజలు నానావస్థలు పడుతుంటారు. ఈ నైచ్యం వారికి దాపరించదు.

అవును, గ్రుడ్డివారికైనా ఇది కనిపిస్తూనే ఉన్నది.

ఇలాంటి అనర్థకాలేవీ వారిని బాధించవు. ఒలింపిక్ క్రీడావిజేతకంటె

వారు సుఖతరజీవనం చేస్తారు.

ఎలాగంటారు ?

మహోజ్జ్వలవిజయం సాధించి మనపౌరులు ప్రజాధనంతో సమగ్రపోషణం పొందుతారు. వారిసౌఖ్యంలో ఒకపాలుమాత్రమే ఒలింపిక్ క్రీడావిజేతలు పొందుతారు. ఎందుకంటే మనపౌరులు సాధించినవిజయం సామాన్యం కాదు, యావద్రాజ్యసముద్ధరణం. వారూ వారిసంతతీ సముపార్జించేమకుటం జీవనసమగ్రార్థప్రదాయకం. బ్రతికిఉన్నంతకాలం వారికి దేశం బహూకృతులు సమర్పిస్తుంది. మరణించినప్పుడు గౌరవప్రదాలైన అంత్యకర్మలు నిర్వర్తిస్తుంది.

అవును, అవి నిజంగా మహోజ్జ్వలసత్కారాలు.

క్రిందటిచర్చలో మనం సంరక్షకులకు ఎలాంటిసుఖం లేకుండా చేస్తున్నామని ఒకరన్నారు. వారికి అన్నీ ఉండటానికి అవకాశం ఉండగా ఏమీ లేకుండా చేస్తున్నామని అతడు ఆక్షేపించాడు. అవసరంవచ్చినప్పుడు దానికి సమాధానం చెప్పుదాము. ప్రకృతానికి వారిని యథార్థసంరక్షకులను చేస్తాము. ఏ ప్రత్యేకవర్గానికీ కాక మొత్తంసమాజానికి అంతకు అత్యధిక సౌఖ్యం సంపాదించటానికై రాజ్యాన్ని నిర్మిస్తున్నామని మనమప్పుడు ప్రత్యుత్తరమిచ్చాము. గుర్తున్నదా ?

ఆం. జ్ఞప్తికి వచ్చింది.

మరి మనమిప్పుడు ఒలింపిక్ క్రీడావిజేతల జీవితంకంటె మనసంరక్షకుల జీవితాన్ని ఎంతో ఉదాత్తంచేశాము. వారిజీవితానికి చర్మకారులజీవితం కానీ, కర్షకుల జీవితం కానీ ఇతరవృత్తిపరుల జీవితం కానీ సాటివస్తుందంటావా ?

ముమ్మాటికి రాదు.

ప్రకృతసందర్భాన లోగడ చెప్పినదానినే మరొకసారి చెప్పవలసిఉన్నది. మనసంరక్షకులలో ఎవడైనా నిజధర్మభంజకుడై సామరస్యవిశిష్టమగు

జీవితాలన్నిటిలో ఉత్తమోత్తమమని సంభావితమైన ఈజీవితంతో తృప్తి పొందక యువప్రలోభనీయసుఖవంచితుడై రాజ్యమంతా ఆత్మసుఖంకోసం భుక్తపరుచుకొన యత్నిస్తే అతడు కడుంకంటె ముక్కు మేలని హెచ్చరించిన హెసియడ్‌సూక్తిని జ్ఞప్తికితెచ్చుకోవటం మేలు.

అతడు నాసలహానే అడిగితే అట్టిజీవితం లభిస్తున్నప్పుడు ఉన్నదానితో సంతృప్తిపొందటం మేలని చెప్పివేస్తానని అతడన్నాడు.

అయితే మనం పేర్కొన్నరీతిని సమష్టిజీవనపద్ధతి—అంటే సమష్టివిద్య ఉమ్మడిపిల్లలు—ఉండాలి. నగరంలో ఉన్నా యుద్ధానికిపోతున్నా సమష్టి పౌరులను పర్యవేక్షిస్తుండాలి. కలిసికట్టుగా కనిపెట్టిఉండాలి. జాగిలాలవలె కలిసివేటాడాలి. ఎల్లవిషయాలలో ఎల్లవేళల పురుషులతోపాటు స్త్రీలు గూడ యథాశక్తిని భాగస్వాములు కావాలి. ఇలా చేస్తున్నప్పుడు ఉత్తమకార్యం నిర్వహిస్తూ స్వాభావికమైన స్త్రీపురుషసంబంధాన్ని రక్షించుకోవాలి కాని, ఉల్లంఘించరాదు ఈ అభిప్రాయంతో నీవు ఏకీభవిస్తున్నావు కదా?

పూర్తిగా.

అయితే ఇలాంటి సమాజవ్యవస్థాపన జంతువులలోవలె మానవులలో సాధ్యమాతుందా? సాధ్యమైతే ఏ విధంగా అవుతుందో ఆలోచించవలసిఉన్నది.

నేను అడగదలచినప్రశ్నే మీరు ప్రస్తావించారు.

వారు యుద్ధం ఎలా కొనసాగిస్తారో ఊహించటం కష్టం కాదు.

ఎలా సాగిస్తారు?

ఏమున్నది? కలిసికట్టుగా దండయాత్ర సాగిస్తారు. పెరిగి పెద్దవారైన తరువాత తాము అనుసరించవలసిన వృత్తికార్యాలను స్వయంగా చూచి నేర్చుకొనేనిమిత్తం ఇతరవృత్తిపరులు తమపిల్లలనువలెనే వారు గూడ యుక్తవయస్కులైన తమపిల్లలను దండువెడలుతున్నప్పుడు వెంటగొని

పోతారు. వారు కేవలం చూస్తూఉండటమే కాక యుద్ధంలో తమతల్లి దండ్రులకు తోడుగా నిలిచి సహాయం చేస్తూ ఉపయోగపడాలి. కుంభ కారులపిల్లలు చక్రాన్ని తాకకపూర్వమే తమతండ్రుల పజ్జజేరి చూస్తూ కావలసినవి అందిస్తూ తోడ్పడుతుండగా నీవెన్నడూ చూడలేదా?

చూడకేమీ? చూచాను.

మనసంరక్షకులకంటె కుంభకారులు తమపిల్లలశిక్షణలోనూ, స్వధర్మ నిర్వాహకవృత్తివిద్యాబోధనలోనూ ఎక్కువజాగ్రుతి వహిస్తారా?

అది హాస్యాస్పదం.

జంతువులకువలెనే తలిదండ్రులకును తమపిల్లలు వెంట ఉన్నప్పుడు వీరత్వం ప్రదర్శించాలన్న పరమోత్సాహం కలుగుతుంది.

నిజమే సోక్రటీస్! అయినా వారు పరాజితులైతేనో? యుద్ధంలో అది తరచు సంభవమే కదా! అప్పుడు ఘోరప్రమాదం ఏర్పడదా? తలి దండ్రులే కాదు, పిల్లలు కూడ అంతరిస్తారు; రాజ్యం తిరిగి కోలుకోదు.

నిజమే. అయితే వారిని ఎన్నడూ ఎలాంటిప్రమాదానికి పాల్పడకుండా చేస్తావా?

నేను అలా చెప్పటం లేదు.

సరే. ప్రమాదానికి పాలుపడటం అవసరమైతే వినాశం తప్పించుకొని పారిపోవ వీలైనప్రమాదానికి గురిచేయటం మేలు. దానివల్ల వారు విశే షానుభవం గడిస్తారు.

అవును.

భావిసైనికులు తమబాల్యదశలో యుద్ధాన్ని చూచారా, లేదా? అన్నది అత్యంతముఖ్యం. దీనికైవారిని ప్రమాదగ్రస్తులనుచేయటం మేలు.

నిజమే.

ఆ పక్షంలో మనపిల్లలకు యుద్ధంచూపటం అవసరం. అయితే వారికి ఉపద్రవం కలుగనిపద్ధతి ఏర్పాటు చేయాలి. అప్పుడంతా సవ్యంగానే ఉంటుంది.

అవును. ఇలా చేయటమే మేలు.

తలిదండ్రులు యుద్ధప్రమాదాలు గుర్తింపజాలని అంధులు కారు కదా? మానవులు గ్రహింపగలిగినంతలో ఏ యుద్ధయాత్రలు ప్రమాదకరాలో, ఏవి కావో తెలిసికొనగలరు.

ఆ మాత్రపుజ్ఞానం ఉంటుంది.

ప్రమాదరహితాలైన జైత్రయాత్రలలో వారు పిల్లలను వెంటగొని పోతారు. ప్రమాదకరమనుకొన్నప్పుడు మానివేస్తారు.

అది బాగానే ఉన్నది.

వారిని కాకలుతీరిన యోధులనాయకత్వాన ఉంచుతారు. ఆ యోధులే వారికి నాయకులు, గురువులు.

అది యుక్తమే.

అయినా యుద్ధప్రమాదాలను సర్వదా ముందే ఊహించలేము. ఏ సమయాన ఏమి జరుగుతుందో?

నిజమే.

అట్టి సమయాలలో వారికి రెక్కలు కల్పిస్తే ఎగిరిపోయి ప్రమాదంనుంచి తప్పించుకొంటారు.

అంటే మీ తాత్పర్యం?

ఏమీలేదు. పిన్నతనంలోనే వారికి అశ్వారోహణం నేర్పాలి. దానిని నేర్చుకొన్నపిమ్మటనే యుద్ధదర్శనార్థం వారిని గుర్రాలమీద కొని పోవాలి. అయితే ఈ గుర్రాలు మలపలు కాక పరమసాధువులై అతిజవ నాలుగ ఉండాలి. ఈ విధంగా భావిజీవితంలో తాము నిర్వర్తించవల సినవిధులను వారు చక్కగా వీక్షిస్తారు. ప్రమాదం ఏర్పడితే తమనాయ కులననుసరించి తప్పించుకొనిపోవలసిఉంటుంది.

మీరు చెప్పింది యథార్థం.

ఇక యుద్ధంసంగతి ఆలోచించాలి. మనసైనికుల పరస్పరసంబంధం ఎలా ఉండాలి? శత్రువులతోడి సంబంధమెలాఉండాలి? సైనికుడు తన శ్రేణిని కాని, ఆయుధాలను కాని పరిత్యజించినా మరొక భీరుతాద్యోతక కార్యానికి పాల్పడినా అతనిని కర్షకవర్గానికో మరొక వృత్తిపరునివర్గా నికో దిగజార్చాలని నాప్రతిపాదన. నీవు ఏమంటావు?

తప్పక అలాగే చేయాలి.

బందిగా తనకుతానై శత్రువులకు లొంగిపోయినవానిని శత్రువులకే బహూకరించటం మంచిది. అతడు వారికి న్యాయప్రాప్తశరవ్యుడు. అత నిని శత్రువులు తమ ఇచ్ఛవచ్చినట్లు చేసికొనవచ్చును.

నిశ్చితంగా అలాగే జరగాలి.

అయితే అనన్యపరాక్రమ ప్రదర్శనవిశిష్టుడైన వీరుని ఏమిచేయాలి? సైన్యంలోని సహచరులు అతనికి గౌరవసత్కారాలు అర్పించాలి. క్రమంగా ఒక్కొక్కడే వచ్చి అతనిని మకుటాలంకృతుని చేయాలి. మరి నీయభిప్రాయమేమిటి?

నేనూ మీప్రతిపాదనకు అంగీకరిస్తాను.

పైగా మైత్రీసూచకంగా కరచాలనంతో అభినందించాలంటాను.

అదీ నాకు సమ్మతమే.

అయితే ఇప్పుడు చెప్పబోయేదానికి అంగీకరించవనుకొంటాను.

ఏమి చెప్పదలచుకొన్నారేమిటి?

అతడు ఇతరులను చుంబించాలి. ఇతరులచే చుంబితుడు కావాలి.

నిశ్చితంగా అలాగే జరగాలి. అంతే కాదు, యుద్ధంప్రవర్తిల్లుతున్నంతకాలం అతడు చుంబించదలచుకొన్నవ్యక్తి అతనికి చుంబనదానం నిరాకరించరాదంటాను. సైన్యంలో ప్రణయి ఉంటే అతడు తానుప్రేమిస్తున్న యువకుని గాని యువతిని గాని చుంబించటం కోసం వీరాన్ని ప్రదర్శించగలడు.

చక్కగా చెప్పావు. అన్యులకంటె వీరునకు ఎక్కువమంది భార్యలు ఉండాలన్న నియమం నిశ్చితమైపోయింది. ఇలాంటి విషయాలలో సాధ్యమైనంత అధికసంతానం పొందటంకోసం ఇతరులకంటె అతనికే మెండుగా ప్రథమావకాశాలు ఉండాలి.

అవును.

వీరయువకులను సత్కరించేమార్గం మరొకటి ఉన్నది. యుద్ధంలో వీరం నెరపి ప్రఖ్యాతిగాంచినప్పుడు ఎజాక్సుకు సుదీర్ఘాలైన వెన్నెముకలను బహూకరించినట్లు హోమర్ పేర్కొన్నాడు. నవయౌవనంలో ఉన్న వీరునకు అది అత్యంతసముచితసత్కారంగా గోచరిస్తున్నది. కేవల సత్కారమే కాదు, అది తనబలాన్ని కాపాడుకొనటానికి కూడ తోడ్పడుతుందని తోస్తున్నది.

అవును, మీరు చెప్పింది యథార్థం.

కాబట్టి ఈ విషయంలో హోమర్ మనకు ఆచార్యుడు కావాలి. మనం కూడ బలిసమర్పణాదిశుభకాలాలలో వారివారి పరాక్రమానుసారంగా మంత్రాలతోను, ఇంతకుముందు చెప్పుకొన్న గౌరవాలతోను సత్కరించాలి. అంతే కాదు—

"అగ్రపీఠాలతోడ మాంసాళితోడ

సుమధురాసవాపూర్ణకుంభములతోడ''
సత్కరించాలి. ఈ సత్కారంతో వారికి శిక్షణ ఇవ్వటం కూడ జరుగుతుంది.

అది ఉత్తమం.

మరి యుద్ధంలో వీరమరణం పొందినవారిని మనం సువర్ణజాతిసంభూతులని పేర్కొననక్కరలేదా ?

తప్పక పేర్కొనాలి.

''వారలు వసుధాగతబ్బం
దారకులు సుకృతివిధావిధాతలు పాపా
చారవిదారులు వాణీ
కారుణ్యాంచితమనుష్యగణసంత్రాతల్.''

అని హెసియడ్‌తోపాటు మనం భావించవచ్చును గదా ?

అవును, అతడు మనకు ప్రమాణమే.

మృతులైన వీరపురుషులకు ఎలాంటిసమాధులు నిర్మించాలో ఎట్టి విలక్షణత ఆ సమాధులకు ఉండాలో డెల్ఫీదివ్యవాణిని సంప్రదించి తదనుగుణంగా ఆచరించవద్దా ?

తప్పక అలాగే చేయాలి.

అనంతరకాలంలో గౌరవపురస్సరంగా వారి సమాధులకు ప్రణామం కావించాలి. వారికే కాదు, జరాక్రాంతిచే గాని, ఇతరకారణంచే గాని మరణించినప్పుడు పరమసత్పురుషులకు గూడ ఇలాంటి గౌరవమే కల్పించాలి

అది సముచితం.

మనసైనికులు తమశత్రువులను ఏవిధంగా చూడాలి ?

ఏ విషయంలోనంటారు?

ముఖ్యంగా బానిసతనమే తీసికో. యవనులు తోడియవనులను బానిసలను చేయవచ్చునా? లేక తాము నివారించగలిగిఉండికూడా, ఇతరులు యవనులను బానిసలను చేస్తుంటే ఉపేక్షించవచ్చునా? ఒక నాటికి యవనజాతి అంతా బర్బరాక్రాంతం కావచ్చునన్న భీతితో వారిని రక్షించటం ధర్మం కాదా?

అవును, రక్షించటమే మేలు.

కాబట్టి మనసైనికులెవరూ యవనుని బానిసగా స్వీకరించరాదు. ఈ నియమాన్ని వారు పాటిస్తూ ఇతరులకు కూడ అలాగే సలహా ఇవ్వాలి.

అవును. ఈవిధంగా అనాగరకజాతులపై వారంతా ఏకీభవిస్తూ అంతః కలహాలు మానివేస్తారు.

ఆ తరువాత నిహతులసంగతి చూదాము. విజేతలు మృతుల ఆయుధాలు, కవచాలు తక్క అన్యం స్వీకరించవచ్చునా? శత్రువుల కొల్లగొట్టేఆచారం యుద్ధక్రియావిరమణకూ వైముఖ్యానికీ, శాత్రవ ధనాపహరణకూ సాకు గాదా? వారిని వెన్నంటి తరమటానికి బదులు ధర్మం నిర్వహిస్తున్నామన్న మిషతో మృతులను శస్త్రాలతో కుమ్ముతుంటారు. దోపిడికి అలవాటు పడి పూర్వం ఎన్నో సైన్యాలు అంతరించాయి.

నిజమే.

మృతకళేబరాన్ని దోచుకొనటంలో సంకుచితత్వం ప్రలోభం కనిపించటం లేదా? అసలు శత్రువీరుని ఆత్మ వెడలిపోయి, యుద్ధపరికరాలను మాత్రం విడిచినప్పుడు ఆ మృతదేహంతో శత్రుత్వం వహించటంలో నైచ్యం స్త్రీత్వం గోచరించటంలేదా? ఇలా చేయటమంటే తన్నెదురొడ్డుతున్నవానిని విడిచి తనపైబడేరాళ్ళతో పోరుకాడే కుక్కవలె ప్రవర్తించటమే కదా.

అవును, అంతగాక మరేమిటి?

మృతదేహాలదోపిడి, వాని అంతిమసంస్కారనిరోధం మనం మానాలి.

విధిగా.

ఇతరయవనులతోడిసౌహార్దం కాపాడుకోవాలంటే దేవాలయాలవద్ద శత్రువుల ఆయుధాలను—ముఖ్యంగా యవనుల ఆయుధాలను—కానుకగా సమర్పించరాదు. జ్ఞాతులవద్ద దొర్కగొన్నవాటిని అపోలో ఆదేశిస్తేతప్ప సమర్పించటం దేవాలయాలను అపవిత్రం చేయటం కాదా ?

నిజంగా అంతే.

యవనదేశవిధ్వంసన, గృహదాహం మున్నైనవానిలో ఏ ఆచారం పాటించాలి ?

మీ అభిప్రాయమేమో సెలవిస్తారా ?

ఈ ఉభయనిషేధం నాకు సమ్మతం. నేను సాలుపంట పుచ్చుకొంటాగాని అంతకంటె మరేమి తీసికోను. ఎందుకో చెప్పనా ?

అవశ్యం.

వైషమ్యం, యుద్ధం అన్న రెండుమాటలకు తేడా ఉన్నది. వాటిస్వభావాలలో గూడ భేదమున్నది. ఒకటి ఆంతరికం, కౌటుంబికం; వేరొకటి బాహ్యం, వైదేశికం. ఈ రెంటిలో మొదటిది వైషమ్యమనబడుతున్నది. రెండవది యుద్ధమనబడుతున్నది.

చక్కని తేడా చూపించారు.

రక్తస్పర్శనుబట్టి స్నేహాన్నిబట్టి యవనజాతి అంతా ఏకీకృతమై బర్బరులకు విజాతీయమూ విలక్షణమూ అవుతున్నది.

అవును.

కాబట్టి యవనులు బర్బరులతోను, బర్బరులు యవనులతోను పోరాడు తున్నప్పుడు వారికి 'యుద్ధం' ప్రవర్తిల్లుతున్నదనీ, స్వభావంచేత వారు శత్రువులనీ మనం వర్ణిస్తాము. ఇలాంటి ప్రాతికూల్యాన్ని యుద్ధమనాలి. యవనులు ఒండొరులతో పోరాడుతున్నప్పుడు యవనదేశం వ్యవస్థాశూన్య మైఉన్నదని కానీ, వైషమికావస్థలో ఉన్నదని కానీ అంటాము. ఎందు కంటే స్వాభావికంగా ఉభయులూ మిత్రులు. అలాంటిశత్రుత్వాన్ని వైషమ్యమనవలసి ఉంటుంది.

దీనికి నేనూ ఒప్పుకొంటాను.

మనం నిర్వచించుకొన్నవైషమ్యమేర్పడి, రాజ్యంలో విభేదాలు బయలు దేరి, ఉభయపక్షాలు ఒండొరులభూములను కొల్లగొట్టి, ఇళ్ళను దగ్ధంచేసి కొంటున్నప్పుడు ఆ పోరాటం ఎంత ఘోరంగా కనిపిస్తుందో చూడు. దేశాభిమానియైనవాడు ఎవడూ తనమాతృదేవతను చీల్చి చిందరవందర చేయటానికి సమ్మతించడు. విజేత పరాజితులధాన్యం అపహరించటానికి కారణం ఉండవచ్చును. అయినా వారిహృదయంలో శాంతి బీజం మెదలుతూనేఉంటుంది. యుద్ధం శాశ్వతంగా సాగించాలన్నతలపు ఉండదు.

అవును, ఆ స్వభావం ఇతరంకంటె మేలు.

అది అలాఉంచి నీవు వ్యవస్థాపిస్తున్నది యవనరాజ్యం కాదా?

అవును.

మరి మనపౌరులు ఉత్తములూ, నాగరులూ కారా?

అవును.

మరి వారు యవనదేశమందు భక్తిగలిగి దానిని మాతృభూమియని భావిస్తూ దేవాలయాలలో సమానభక్తితాత్పర్యాలతో ప్రవర్తిస్తారు గదా?

అవును.

వారిలో పొరపొచ్చాలు వచ్చినప్పుడు అది వైషమ్యమవుతుంది, మిత్రాంతర్గతవైమనస్యమని భావించబడుతుంది. అంతే కాని అది యుద్ధంకాదు.

అవును.

అలాంటప్పుడు ఏనో ఒకనాటికి సఖ్యపడతలపున్నవారివలె వారు పోరాడుకొంటారు.

నిశ్చితంగా అంతే.

వారు స్నేహాత్మకదండనం ప్రయోగిస్తారు. శత్రువులనువలె బానిసీలనుగా పట్టుకొనటం గాని, నాశనం చేయటం గాని సంభవించదు. వారు దోష పరిష్కర్తలే కాని, శత్రువులు కారు.

అవును.

తాము యవనులు కాబట్టి యవనదేశాన్ని ధ్వంసంచేయరు. ఇండ్లు తగల బెట్టరు. రాజ్యంలోని ఆబాలవృద్ధం తమకు శత్రువులని భావించరు. ఎందుకంటే యుద్ధానికి కారణభూతులైనవారు కొలదిమందే కాని, తక్కిన అధికసంఖ్యాకులు తమకు మిత్రులని వారికి తెలుసు. ఈ హేతువులన్నిటిచే వారిభూములను నాశనం చేయటానికి ఒప్పుకోరు. గృహాలు కూల్చి వేయటానికి సమ్మతించరు. వారిపైగలశత్రుత్వం కూడ ఎంతోకాలం సాగదు. అల్పసంఖ్యాకులైన అపరాధులను న్యాయవిహితదండనకు లోబరచేటంతవరకే అది సాగుతుంది.

మనరాజ్యవాసులు తోడియవనశత్రువులతో ఇలాగే వ్యవహరించాలి. కాని బర్బరులతో పోరాడుతున్నప్పుడు మాత్రం యవనులిప్పుడు పరస్పర యుద్ధంలో వ్యవహరించినట్లే వ్యవహరించాలి.

కాబట్టి యవనులభూములు కొల్లగొట్టరాదు. వారి గృహాలు దగ్ధంచేయ రాదని మనసంరక్షకులకోసం శాసించాలి.

ఒప్పుకొన్నాను. పూర్వం చేసినశాసనంవలె ఇది కూడ శ్రేయస్కరమే.

సోక్రటిస్! మీకిక్కడ ఒకటి చెప్పాలి. మీ ప్రసంగాన్ని ఇలాగే సాగనిస్తే ఈ ప్రస్తావనకు మూలమైన ప్రశ్న అలాగే ఉండిపోతుంది. మొదలు ఇలాంటివ్యవస్థ సాధ్యమా? సాధ్యమైతే దానికి మార్గమేమిటి? ఈ విషయం ముఖ్యం. ఎందుకంటే మీరు ప్రతిపాదిస్తున్న ప్రణాళిక ఆచరణసాధ్యమైతే రాజ్యానికి శ్రేయస్సు చేకూరుస్తుంది. మీరు వదలి వేసినది కూడ చెబుతాను. మనపౌరులు మహావీరులవుతారు. తమశ్రేణు లను వారు ఎన్నడూ పరిత్యజించరు. ఎందుకంటే ఒండొరులకు సన్నిహిత సంబంధాలున్నవి. తండ్రిఅనీ, సోదరుడనీ, పుత్రుడనీ, అన్యోన్యం సంభావించుకొంటూ ఉంటారు. స్త్రీలు కూడ సైన్యంలో ఒకభాగంగా చేరినా, దాని పశ్చాద్గతశ్రేణిలో చేరినా శత్రుభయంకరులౌతారు. తమ సైన్యానికి అండదండగా ఉంటారు. అప్పుడది అజేయంగా ఉంటుంది. అంతే కాక ఆంతరికంగా కలిగేప్రయోజనాలు ఎన్నైనా పేర్కొన వచ్చును. వాటినన్నిటిని పూర్తిగా గుర్తిస్తాను. ఈ ప్రయోజనాలే కాదు. మీరు చెప్పబోయే ఇతరప్రయోజనాలు కూడ ఎన్నో కలుగుతవని ఒప్పుకొం టాను. అయితే ఇంతకూ మీప్రతిపాదించే రాజ్యం ఏర్పడాలి కదా? కనుక ఈ వివరాలతో మనకు అక్కరలేదు. మొదలు అలాంటిరాజ్యం సాధ్యమా? సాధించటానికి మార్గాలేమిటి? ఈవిషయాలను పరిశీలిం తాము. తక్కినది మనం వదలివేయచ్చును.

రక్వంత త్రచ్చిళ్ళాడితే చాలు నామీద దాడిచేస్తావు. నీకు నాయందు కనికరం లేదు. ఇంతవరకు మొదటికెరటాన్ని, రెండవదాన్ని తప్పు కొన్నానో లేదో, నన్ను నీవు మూడవకెరటంలోపలికి నెడుతున్న సంగతి గుర్తించినట్లు కనిపించదు. ఇది మహోత్తుంగతరంగం. ఈ తరంగాన్ని చూచినపిమ్మట నాయందుకొంత దయచూపుతావనుకొంటాను. నేనిప్పుడు నిర్వచించి పరిశీలించవలసిన అపూర్వప్రతిపాదనావిషయంలో భయసం కోచాలుండటం సహజమేనని అంగీకరిస్తావనుకొంటాను.

ఇలాంటి విజ్ఞప్తులు నీవు చేస్తున్నకొలదీ కౌతుకం పెరుగుతున్నది. అలాంటి రాజ్యం ఎలా సంభవమో వినాలన్నతహతహపాటు ప్రబలుతున్నది. కాబట్టి వెంటనే చెప్పండని అతడన్నాడు.

న్యాయాన్యాయాలను అన్వేషిస్తూ మనం ఇక్కడికి చేరుకొన్నాము. ఈసంగతి మీకు ముందు గుర్తుచేయాలి.

నిజమే, ఇప్పుడు ఆ సంగతి దేనికి ?

మనం వాటిని కనుగొనిఉంటే న్యాయవంతులు పరమన్యాయమూర్తులై ఉండాలా ? లేక ఆ పరమన్యాయానికి దరిదాపుగా ఉంటే చాలునా ? ఇతరమానవులకంటె అతడు న్యాయ్యతరుడుగా ఉంటే మనం సంతృప్తి పడవచ్చునా ?

దరిదాపుగా ఉంటే చాలు.

మనం పరమన్యాయాన్యాయస్వభావాలనూ తద్విశిష్టులప్రకృతులనూ పరిశీలిస్తున్నాము. వీటిని ఎందుకు అన్వేషిస్తున్నాము ? వానిప్రమాణాన్ని బట్టి సుఖదుఃఖాలను న్యాయాన్యాయపరిమాణాలను గ్రహించటానికి. అంతేకాని వాస్తవంగా ఉంటవని నిరూపించాలని కాదు.

నిజమేనని అతడన్నాడు.

పరమరమణీయపురుషుని రూపం సంపూర్ణకళానైపుణ్యంతో చిత్రకారుడు చిత్రించాడనుకో. అలాంటిమానవుని అతడు లోకంలో చూపించలేడు. అంతమాత్రాన అతడు కొరమాలినవాడవుతాడా ?

ఏమాత్రం కాదు.

సరే. మరి మనంమాత్రం ఏమిచేస్తున్నాము ? పరమరాజ్యరూపాన్ని సృష్టించటంలేదా ?

నిజమే.

వర్ణితపద్ధతిని రాజ్యాన్ని వ్యవస్థాపించటం సాధ్యమని నిరూపించలేమనుకో. అంతమాత్రాన మనవాదం దుష్టమౌతుందా ?

కాదు.

ఉన్నవాస్తవం అంతే. నీకోర్కెను మన్నించగోరి ఏ యే స్థితిగతులలో

ఎలా మన పరమలక్ష్యానికి సన్నిహితంగా చేరుకోగలమో నిరూపించవలసి వస్తే ఈ సూత్రాలే అక్కడా వర్తిస్తవని అంగీకరించాలి.

ఏ సూత్రాలంటారు ?

ఆదర్శాలను భాష ఎన్నడైన పూర్ణంగా వ్యక్తంచేయగలదా ? వాస్తవం కంటె శబ్దం అధికాభివ్యంజకం కాదా ? మరి వాస్తవం ఆదర్శంకంటె న్యూనం కాదా ? నీ అభిప్రాయం ఏమిటి ?

నేను అంగీకరిస్తాను.

అలాంటప్పుడు వాస్తవిక రాజ్యం ప్రతివిషయంలోనూ ఆదర్శానికి ఏమాత్రమూ తగ్గకుండా ఉంటుందని రుజువుచేయమని నీవు పట్టుపట్టరాదు. మనం సూచించిన సూత్రాలకు సన్నిహితంగా పాలితమయ్యేరాజ్యాన్ని కనుగొనగలిగితే చాలు. నీవు అభిలషించే సాధ్యతను కనుగొన్నట్లే అవుతుంది. నాకు సంతృప్తి కలుగుతుంది. మరి నీవు సంతృప్తిపడవా ?

ఎందుకు పడను ?

ప్రకృతం రాజ్యాలలో దుష్టపరిపాలన ఏర్పడటానికి కారణమేమో నిరూపించయత్నిస్తాను. ఏ అలతిమార్పు చేస్తే రాజ్యం ఆదర్శప్రాయమవుతుందో పరిశీలిస్తాను. అయితే సాధ్యమైనంతవరకు ఈ మార్పులు ఒకటో రెండో కావాలి. కాదో వీలైనంత తక్కువగా ఉండాలి.

అవును.

ఒకమార్పు చేస్తే రాజ్యంలో సరియైన సంస్కరణం ఏర్పడుతుందనుకొంటాను. ఈమార్పు సాధ్యమే కావచ్చును. కాని ఇది స్వల్పం కాదేమో ?

ఇంతకూ ఆమార్పు ఏదంటారు ?

ఇక తప్పదు. ఆ ఉత్తుంగతరంగాన్ని ఎదుర్కొంటాను. అది నన్ను పరిహా

సావమానాలలో మంచితే మంచనీ. చెప్పవలసినదేదో చెబుతాను.

అలాగే కానీయండి.

తత్త్వవేత్తలు రాజులు కావాలి. లేదా రాజులకు, రాజకుమారులకు తత్త్వ సారమూ, శక్తీ అలవడాలి. రాజకీయమహోదాత్తత, ప్రజ్ఞ ఏకీకృతం కావాలి. ఈ రెంటిలో ఒకదానిని విడిచి మరొకదానిని అనుసరించే సామాన్యప్రకృతులు అధికారంనుంచి వైదొలగాలి. అది జరగనంతవరకు రాజ్యాలు అనర్థాలనుంచి బయటపడవు. అసలు మానవజాతికి కూడ ముక్తికలుగదు. మనం చెప్పుకొన్నట్లు జరిగితేనే మనరాజ్యం సజీవమై వెలుగును పొందవీలవుతుంది. ఈ భావం విపరీతంగా కనిపించకపోతే, ఉత్సాహంతో చెప్పిఉండేవాణ్ణి. ఎందువల్లనంటే మనరాజ్యంలో తప్ప మరేరాజ్యంలోను సామాజికసౌఖ్యం కాని, వ్యక్తిగతసౌఖ్యం కాని ఉండడమంటే విశ్వాసపాత్రంగా కనిపించదుగదా!

సోక్రటీస్! మీ తాత్పర్యమేమిటి? మీరన్నమాట వింటే మానమర్యాద లున్నవారెవరైనా అవరోధాలను అవలకునెట్టి చేతికందిన ఆయుధం లంకించుకొని ఒక్కమారు మీమీదికి లంఘించి మీస్థితిగతులు మీకు బోధపడకముందే అంతు తేలుస్తారు. తగినసమాధానంతో ఆయత్తమై ఉంటేతక్క స్వకీయయుక్తులతో వారు మిమ్ము మీవాదాన్ని చీల్చి చెండాడుతారు

ఈ స్థితి అంతా నీవు తెచ్చిపెట్టిందేగా!

మంచిపని చేశాను. సరే. మీవిమోచనకు శక్తివంచనలేక తోడ్పడు తాను. అయితే నేను చేయగలిగింది ఒకటే. మీరంటే సదభి ప్రాయముంది. నాకు తోచినమంచిసూచనలు ఇవ్వగలను. మీరు వేసే ప్రశ్నలకు ఇతరులకంటె కొంతమేలైనసమాధానం చెప్పగలను. మొత్త మ్మీద నాచేయగలిగింది ఇది. ఇలాంటి సహాయకారితో నమ్మకంలేని వారిని నమ్మించటానికి చేతనైనంతకృషి చెయ్యండి.

ఇంత అమూల్యసహాయం నీవు చేస్తున్నప్పుడు ప్రయత్నం చేయాలి కదా? తప్పించుకొనే మార్గం లభించాలి. అందుకై రాజ్యాన్ని 'తత్త్వవేత్తలు'

పాలించాలన్నప్పుడు తత్త్వవేత్తలంటే ఎవరో వివరించాలనుకొంటాను. అలా చేస్తే ఆత్మరక్షణ కావించుకోవచ్చు. కొన్ని ప్రకృతులున్న వారు మాత్రమే తత్త్వశాస్త్రాభ్యాసానికి అర్హులు; రాజ్యనాయకులు కావటానికి యోగ్యులు. ఇతరులు అయోగ్యులు. అట్టివారు అనుయాయులే అవుతారు కాని నాయకత్వానికి అర్హులుకారు. కొంచెమాలోచిస్తే ఇది నీకే బోధపడుతుంది.

సరే, అనిర్వచనమేదో తేల్చండి.

అయితే శ్రద్ధగా విను. ఏదో ఒకవిధాన నీకు సంతృప్తికరంగా వివరించ గలనని ఆశిస్తున్నాను.

ప్రారంభించండి.

సార్థకనాముడైనప్రణయి తాను ప్రేమిస్తున్నవస్తువును అంతా ప్రేమి స్తాడు కాని ఒకభాగాన్ని మాత్రమే ప్రేమించడు. ఈ సంగతి జ్ఞప్తి లోనే ఉండిఉంటుంది. కాబట్టి నేను మళ్ళీ గుర్తుచేయవలసినపని లేదుగా.

నాకేమీ అంతుచిక్కటంలేదు. మరొకసారి గుర్తుచేయాలని మనవి.

ఇలాంటిసమాధానం మరొకడు చెప్పిఉండవలసింది కాని, నీవు కాదు. యౌవనపుపొంగులుమిసేవారు ప్రణయిహృదయంలో ఎలాంటి బాధ కలి గిస్తారో, వారెంత అనురాగపాత్రులో నీవంటి సౌందర్యపిపాసికి తెలిసి ఉండాలి. చట్టిముక్కుమొగము అందంగా ఉన్నదనీ, కోటేరులాంటి ముక్కుగలమొగం రాచఠీవి ఒలకబోస్తున్నదనీ, అటుచట్టిముక్కు ఇటుకోటేరుముక్కు కాక తిన్ననైన ముక్కుగలముఖం దిద్దితీర్చినట్టుగా ఉన్నదనీ వర్ణిస్తుంటారు గదా? ముదురువన్నెముఖం పురుషత్వం ఒలికిస్తు న్నదనీ, లేతమొగం దైవత్వం చిలుకుతున్నదనీ అంటూఉంటారు. యువ ముఖంలో కనిపించేకాంతిని లేతగోజ్జంగివన్నె అని ప్రణయి కాకపోతే మరెవరు వర్ణించారు? యౌవనవసంతంలో పూచినప్రతిపూవును స్మరించ టానికి కల్పించనిసాకు, వాడని విశేషణం లేదు.

వాదంకోసమై ప్రణయవ్యవహారాలలో నన్ను ప్రమాణీకరిస్తామంటే

కాదనను.

మరి ఆసవప్రియుల వ్యవహారమేమంటావు? వారు ఇలా ప్రవర్తించగా నీవు చూడలేదా? ఏ ఆసవం సేవించటానికైనా ఏదో ఒకసాకు కల్పిస్తూనే ఉంటారు

అవును.

కీర్తికాములకు కూడ ఇదే అన్వయిస్తుంది. పెద్దసైన్యాన్ని నడపటానికి అవకాశం లేకపోతే ఒకచిన్నదళాన్ని నడపటానికి ఇష్టపడతారు. గొప్పవారివల్ల, ప్రముఖులవల్ల గౌరవం పొందటానికి అవకాశం లేకపోతే అల్పులవల్ల, నీచులవల్ల గౌరవం పొందటానికి ఉబలాటపడతారు. వారికి కావలసింది ఒకటే—ఏదో ఒకగౌరవం.

అవును, అంతే.

అయితే మరొకసారి అడుగుతాను చెబుతావా? ఒకజాతివస్తువులను అభిలషిస్తున్నవాడు ఆ జాతినంతా అభిలషిస్తున్నాడా? లేక ఒకకొంత భాగాన్నే అభిలషిస్తున్నాడా?

జాతినంతా అభిలషిస్తున్నాడు.

మరి తత్త్వవేత్త అయినవాడు పూర్ణప్రజ్ఞను అభిలషిస్తున్నాడు కాని, ఒకకొంతభాగాన్ని అభిలషించటంలేదని చెప్పవచ్చును గదా?

అవును, పూర్ణమైనదానినే అభిలషిస్తున్నాడు.

తిండి తిననొల్లనివానికి ఆకలి లేదంటాము. అతని జఠరాగ్ని మందగించిందంటాము. అలాగే పిన్నతనంలో ఏది బాగో ఏది ఓగో తెలియనికాలంలో జ్ఞానమంటే పెడమొగంపెట్టేవానిని 'తత్త్వవేత్త' అని కానీ, 'జ్ఞానప్రణయి' అని కానీ అనము.

నిజమే.

అలాకాక ప్రతిదీ తెలిసికోవాలన్న ఆసక్తి కలిగి తత్త్వకుతూహలిఅయి 'ఇంత తెలిసికొన్నాను, ఇంకా దేని'కన్న సంతృప్తి పొందక నిరంతరాన్వేషణ సాగించేవానిని తత్త్వవేత్త అనవచ్చును గదా !

వెంటనే గ్లాకన్ అడ్డుకొన్నాడు: కుతూహలంవల్లనే తత్త్వవేత్త అయ్యే పక్షాన ఎందరో విచిత్రజీవులు ఆ పేరుకు అర్హులవుతారు. రూపకప్రియులకు గ్రహణాసక్తి ఎంతో ఉంటుంది. వారినందరిని తత్త్వవేత్తలలో చేర్చవలసివస్తుంది. విద్యావినోదులు తత్త్వవేత్తలలో ఇముడనివిచిత్ర జీవులు కదా? ఎందుకంటే తాత్త్వికచర్చలేవైనా జరుగుతుంటే పూర్తిగా పరిహరించేవారు వారే. అదే నాటకప్రదర్శనమైతే పట్టణాల్లో జరగనీ, మారుమూల పల్లెల్లో జరగనీ, వారచ్చటికి పరుగెత్తవలసిందే. ప్రతిపాట వినవలసిందే. వీరూ, ఇలాంటి అభిరుచులున్నవారూ, ఇతర వృత్తివిద్యాపరులూ తత్త్వవేత్తలంటామా ?

నిశ్చితంగా కారు. కాని, వారిలో తత్త్వసదృశ్యలేశంమాత్రమే ఉన్నది. ''అయితే నిజమైన తత్త్వవేత్తలెవరు ?'' అతడు ప్రశ్నించాడు.

సత్యసందర్శనోత్కంఠగలవారు.

బాగానే ఉన్నది. కాని, ఇంతకూ మీ తాత్పర్యమేమిటి ?

మరొకనికి చెప్పవలసివస్తే కష్టమే. అయితే నాచెప్పబోయేప్రతిపాదనకు. నీవు అంగీకరిస్తావనుకొంటాను.

ఇంతకూ ఆప్రతిపాదన ఏమిటి ?

సౌందర్యవికారాలు ద్వంద్వాలు కాబట్టి అవి రెండర్థాలు గదా ?

అవును.

అవి రెండు కాబట్టి వానిలో ప్రతిదీ ఒకటే కదా ?

నిజమే.

న్యాయాన్యాయాలకూ మంచిచెడుగులకూ ఇతరద్వంద్వాలకూ ఇదే వర్తిస్తుంది కదా? ఒక్కొక్కదానినే తీసికొన్నప్పుడు ప్రతిదీ ఒకటే అవుతుంది. కాని, వస్తుక్రియలతోను, ఒండొంటితోను నానాసమ్మేళనాలు పొంది అవి పెక్కులుగా గోచరిస్తవి.

అవును.

మరి ఈ సూత్రాన్ని పురస్కరించుకొని రూపకప్రియులనూ, విద్యావినోదులనూ, వ్యవహారదక్షులనూ అన్వర్థనామధేయులైన తత్త్వవేత్తల నుండి వేరుపరుస్తున్నాను.

ఎలా వేరుచేస్తున్నారు?

శబ్దరూపప్రియులంతా రుచిరధ్వనులందు, వర్ణాలందు, ఆకృతులందు, వానివల్ల ఏర్పడుతున్న కృత్రిమార్థాలందు ఆసక్తికొంటున్నారే కాని, వారి మనస్సు మాత్రం సౌందర్యతత్త్వాన్ని దర్శించలేకపోతున్నది. దానిని ప్రేమించలేకపోతున్నది.

నిజమే.

ఏ కొలదిమంది మాత్రమో ఈదర్శనం పొందగలుగుతారు.

అవును.

సుందరవస్తువులను గ్రహించగలిగి సౌందర్యతత్త్వమెరుగజాలనివానిని గానీ, సౌందర్యతత్త్వం బోధిస్తుంటే గ్రహింపజాలనివానిని గానీ తీసికో. అలాంటివాడు జాగరూకుడంటావా? స్వప్నలోకసంచారి అంటావా? నీవే ఆలోచించు. విసదృశార్థాలను సదృశార్థాలుగ గ్రహించేవాడు, యథార్థవస్తువులస్థానంలో ప్రతీకాలను నిలిపేవాడు మేలుకొనిఉన్నా నిద్రపోతున్నా స్వాపియే.

అలాంటివాడు నిశ్చితంగా స్వాపి.

మరి తద్విపరీతునే తీసికో. సౌందర్యతత్త్వసత్తను అతడు గుర్తిస్తాడు. భావాన్ని (Idea), దానినిభజించే (participate in) విషయాలను వేరు పరచగలిగి, భావమే విషయాలనికానీ, విషయాలే భావమనికానీ భ్రాంతి పడడు. అలాంటివాడు జాగరూకుడంటావా? స్వాపి అంటావా?

జాగరూకుడంటాను.

ఎరుకగలవానిమనస్సు జ్ఞానవంతమనీ, అభిప్రాయ (Opin'on) పడువాని మనస్సు అభిప్రాయవంతమనీ చెప్పవచ్చును గదా?

నిశ్చితంగా.

అయితే రెండవవాడు మనం చెప్పినది కాదని వివాదానికి దిగితే, శోచనీయమైన అతనివివేకరాహిత్యాన్ని వెల్లడించకుండానే అతనికి ప్రియంకరంగా సమాధానం చెప్పగలమా?

నిశ్చితంగా ఏదో మంచి సమాధానం చెప్పాలి.

అయితే ఆసమాధానమేదో ఆలోచిద్దాము. "జ్ఞానమేదైనా మంచిదే. నీవు జ్ఞానవంతుడవు. మహాసంతోషం," అని ప్రసంగం ప్రారంభింతామా? అయితే మనం అతనిని ఒకప్రశ్న అడగాలి. జ్ఞానవంతుడైనవాడు ఏదో ఒకటి ఎరుగును గదా? (అతనిపక్షాన నీవు సమాధానం చెప్పాలి.).

అతడేదో ఒకటి ఎరుగునని నేను సమాధానం చెబుతాను.

ఆ యేదో ఒకటి ఉన్నదా, లేనిదా?

ఉన్నదే అవుతుంది. ఎందుకంటే లేనిదానిని తెలిసికొనటం అసంభవం.

విభిన్నదృక్పథాలను పరిశీలించినపిమ్మట పరమసత్పదార్థం పరమవేద్యం, పరమ అసత్పదార్థం పరమ అవేద్యమని నిశ్చితంగా చెప్పవచ్చును గదా?

అవును.

సరే. మరి సదసత్స్వభావంకలది ఒకటి ఉంటే అది కేవల సత్పదార్థానికీ, కేవల అసత్పదార్థానికీ మధ్యస్థమే కదా?

అవును.

జ్ఞానానికి విషయం సత్పదార్థం. అజ్ఞానానికి విషయం అసత్పదార్థం. కాబట్టి సదసత్పదార్థవిషయకమైనది ఒకటి ఉండాలి కదా?

అవును.

అభిప్రాయ సత్తను అంగీకరిస్తున్నామా?

నిస్సందేహంగా.

ఇది జ్ఞానంవంటిదే అవుతుందా? లేక మరొకశక్తి అవుతుందా?

మరొకశక్తే అవుతుంది.

ఆ పక్షంలో అభిప్రాయజ్ఞానాలు తమశక్తులకనుగుణమైన విభిన్నవిషయాలు కలవి కావాలి.

అవును.

జ్ఞానం సదపేక్షకమై సత్పదార్థాన్ని తెలిసికొంటుంది. అయితే ముందుకు సాగిపోకముందు ఒకటి నిర్వచించాలి.

ఏమిటది?

మనలోనూ ఇతరులలోనూ ఉండి మన వివిధవ్యాపారాలను నిర్వహించే శక్తులను ఒకజాతి అంటాను. ఉదాహరణకు దర్శనశ్రవణాలను తీసికో. వీటిని శక్తులంటాను. నేను చెబుతున్నజాతి యేదో ఇప్పుడు బోధపడ్డదా?

ఆఁ.

వానిని గూర్చి నాకున్నతలంపు వివరిస్తాను. అవి నాకు గోచరించవు. వస్తువిభేదసూచకాలైన ఆకృతిరూపాదులవంటి లక్షణాలు వాటికి వర్తించవు. ఒకశక్తిని గూర్చి చెప్పవలసివచ్చినప్పుడు దానివిషయం, వ్యాపారం మాత్రమే గోచరిస్తుంది. సమానవిషయకమూ, సమానవ్యాపారమూ అయినది ఒకేశక్తి అవుతున్నది. భిన్నవిషయకమూ భిన్నవ్యాపారమూ అయినది భిన్నశక్తి అనిచెబుతాను. నీవు దీనికి అంగీకరిస్తావా ?

ఆс.

సరే. మరొకప్రశ్నకు సమాధానం కావాలి. జ్ఞానమనేది ఒకశక్తి అంటావా ? కాదనేపక్షంలో దానిని ఏ జాతిలో చేరుస్తావు ?

నిశ్చితంగా జ్ఞానం ఒకశక్తి. శక్తులన్నిటిలో అది బలిష్ఠం.

అభిప్రాయం కూడ ఒకశక్తి అంటావా ?

అవును. ఈ శక్తివలన మనకు అభిప్రాయం కలుగుతున్నది.

ఇంతకుముందు జ్ఞానమూ అభిప్రాయమూ ఒకటికాదని అంగీకరించావు కదా ?

అవును. అబాధ్యమూ ప్రమద్వరమూ ఒకటేనని వివేకవంతుడెవడంటాడు?

మంచిసమాధానం చెప్పావు. వాటిభేదం స్పష్టంగా ఎరుగుదుమన్నమాట.

అవును.

అభిప్రాయజ్ఞానాలు భిన్నశక్తులు కాబట్టి వానివిషయాలు కూడ భిన్నాలే.

నిశ్చితంగా అంతే.

సత్పదార్థం జ్ఞానానికి విషయం. జ్ఞానం సత్పదార్థస్వభావాన్ని తెలిసి

కొంటుంది. అంతేగా?

అవును.

అభిప్రాయమంటే అభిప్రాయపడటమే కదా?

అవును.

మరి దేనినిగూర్చి అభిప్రాయపడుతున్నామో తెలుసా? పోనీ అభిప్రాయవిషయమూ జ్ఞానవిషయమూ ఒకటేనా?

ఒకటి కాదని ఇదివరకే నిర్ధరించాము. శక్తిభేదంతో విషయచ్ఛేదమేర్పడుతున్నప్పుడు, అభిప్రాయజ్ఞానాలు భిన్నశక్తులంటున్నప్పుడు అభిప్రాయజ్ఞానాలకు విషయం ఒకటి కాజాలదు.

మరి జ్ఞానానికి సత్పదార్థం విషయమౌతున్నప్పుడు అభిప్రాయానికి వేరొకటి విషయం కావాలి కదా?

అవును.

అయితే అసత్పదార్థం అభిప్రాయానికి విషయమౌతుందా? అసలు అసత్పదార్థాన్ని గూర్చి అభిప్రాయమేర్పడటానికి ఎలా వీలుపడుతుంది? ఆలోచించు. ఒకనికి ఒకానొక అభిప్రాయమున్నప్పుడు అది దేనినో ఒకదానిని గూర్చిన అభిప్రాయమే కదా? లేక నిర్విషయకమైన అభిప్రాయం కలుగ వీలున్నదా?

అది అసంభవం.

కాబట్టి అభిప్రాయవంతునకు ఏదో ఒకవస్తువును గూర్చిన అభిప్రాయం ఉంటున్నదన్నమాట.

అవును.

మరి అసత్తు ఒకవస్తువు కాదు. సరిగా చెప్పాలంటే అది అభావం అవుతుంది కదా?

నిజమే.

అయితే అసదపేక్షకం అజ్ఞానమనీ, సదపేక్షకం జ్ఞానమనీ చెప్పుకొన్నాము.

అవును.

అలాంటప్పుడు అభిప్రాయం సదపేక్షకం కాజాలదు. అటు అసదపేక్షకమూ కాజాలదు.

అవును.

కాబట్టి అది అజ్ఞానమూ కాదు, జ్ఞానమూ కాదు.

అలాగే కనిపిస్తున్నది.

అయితే అభిప్రాయం ఆ రెంటికన్న అన్యమై జ్ఞానంకంటె స్పష్టతరంగాను, అజ్ఞానంకంటె అంధతరంగాను ఉంటుందా?

ఉండదు.

ఆ పక్షంలో అభిప్రాయం నీమతంలో జ్ఞానంకంటె అస్పష్టతరమై అజ్ఞానంకంటె స్పష్టతరంగా ఉంటుందా?

అవును.

మరి అది రెంటికి మధ్యస్థమై ఉంటుందా?

అంతే.

కాబట్టి అభిప్రాయం మాధ్యమికమే కదా?

ఇంకా సంశయం దేనికి?

అయితే అటు సత్తూ ఇటు అసత్తూ అయినది కేవలసత్పదార్థానికి ఇటు అసత్పదార్థానికి మధ్యస్థమై ఉంటుంది అని మనమింతకుముందు చెప్పుకొన్నాము కదా? తదపేక్షకమైనశక్తి జ్ఞానమూ కాక, అజ్ఞానమూ కాక, ఆ రెంటికి మధ్యస్థమై ఉంటుంది కదా?

నిజమే.

ఆ నడిమిపట్టున అభిప్రాయమనేది ఉన్నట్లు కనుగొన్నట్లే గదా?

అవును.

ఇక కనుగొనవలసినది ఒకటే. అటు సత్పదార్థస్వభావమూ ఇటు అసత్పదార్థస్వభావమూ కలిగినవిషయం. ఇది కేవలమైనది కాదు. ఈ అజ్ఞాత పదార్థాన్ని కనుగొంటే ఇది అభిప్రాయానికి విషయమని చెప్పవచ్చును. ఈ విధంగా ప్రతిశక్తికి విషయాన్ని నియతం కావించినవారమౌతాము. అంటే ఉభయాంతాలకూ ఉభయశక్తులూ, మధ్యస్థానికి మధ్యస్థశక్తీ వ్యవస్థితాలవుతవి.

అవును.

ఈ సూత్రాలను వ్యవస్థితాలను కావించినపిదప, పరమసౌందర్యం, మారని సౌందర్యభావం లేదని అభిప్రాయపడుతూ, రమణీయార్థాలు అనేకాలని తలపోస్తూ రమణీయదృశ్యాలను ప్రేమిస్తూ, రామణీయకం మాత్రం ఏకమంటే సహింపనివ్యక్తిని ఇలా ప్రశ్నిస్తాను:— ఈ రమణీయవస్తువులలో వికారవంతంకాని వస్తువున్నదా? న్యాయవంతాలలో అన్యాయవంతం కానిదీ, పవిత్రవస్తువులలో అపవిత్రంకానిదీ ఉన్నదేమో తామనుగ్రహించి చెబుతారా?

లేదు. రమణీయమైనవస్తువు ఏదో ఒకదృక్పథంలో వికారవంతంగా

గోచరిస్తుంది. ఇదే తతిమ్మావాటికి గూడ అన్వయిస్తుందని గ్లాకన్ సమాధానం చెప్పాడు.

రెట్టింపుగా ఉన్నవి సగాలుకావా? అంటే ఒకదానిరెట్టింపు మరొక దానిలో సగము కాదా?

ఎందుకు కాదు?

అలాగే మహత్తరాలు స్వల్పతరాలు, గురుతరాలు లఘుతరాలు అయిన వస్తువులను వేరొకదృక్పథంనుంచి తద్విపరీతాలుగా పేర్కొనవచ్చును గదా?

అవును. ఈ ఉభయమూ వాటి అన్నిటికీ వర్తిస్తుంది. విశిష్టశబ్దాభిధేయాలవుతున్న వాటిలో ఇది ఇదేకాని మరొకటికాదని చెప్పవచ్చునా?

ఇవి విందులు వినోదాల సందర్భాలలో వేసే పొడుపుకథలవలె పిల్లలడిగే సమస్యలవలె ఉన్నవి. పురుషుడుగానిపురుషుడు పక్షిగానిపక్షి కొమ్మగానికొమ్మమీద కూర్చుంటే రాయిగానిరాతితో కొట్టాడన్నట్లుగా (కొజ్జా గబ్బిలాన్ని తీగమీదకూర్చుంటే రాతితో కొట్టాడు). వైయష్టిక వస్తువులు సమస్యలై ద్వంద్వార్థాలుగా కనిపిస్తున్నవి. అవి సత్పదార్థాలని కానీ, అసత్పదార్థాలని కానీ, సదసత్పదార్థాలని కానీ, అనుభయపదార్థాలని కానీ నిశ్చయించలేము.

మరి వాటిని ఏమి చేస్తాము? సదసత్పదార్థమధ్యస్థతకంటె వానికి ఉన్నత స్థానం కల్పించవీలుపడుతుందా? అసత్తకంటె అయథార్థాలందామా, అవి అంత అస్పష్టాలు కావు. సత్తకంటె యథార్థాలందామా, అంత స్పష్టాలూ కావు.

అవును.

కాబట్టి రమణీయార్థాలను గూర్చి, ఇతరాలైన సర్వార్థాలనుగూర్చి బహుళ సంఖ్యాకులు పొందేభావాలు కేవలసత్పదార్థానికీ, కేవల అసత్పదార్థానికీ నడుమ ఎక్కడో ఊగిసలాడుతున్నవని కనుగొన్నట్లు కనిపిస్తున్నది.

అవును.

మనం ఇలాంటిదానిని నెమకి పట్టుకోగలిగితే అది అభిప్రాయానికి విషయమాతుంది కాని, జ్ఞానానికి విషయం కాదు. ఆ మధ్యస్థపరిణామిప్రపంచం మధ్యస్థశక్తిచే గ్రహింపబడుతుందని అంగీకరించాము.

అవును.

అలాంటప్పుడు అనేకరమణీయార్థాలను చూస్తూ, పరమరామణీయకాన్ని కాంచలేక సౌందర్యతత్త్వమార్గోపదేశాన్ని అవగతం చేసికోలేనివారికీ, బహున్యాయవంతాలనే కాని, పరమన్యాయం కాంచలేనివారికీ, తత్సజాతీయులకూ అభిప్రాయమున్నదే కాని, జ్ఞానం లేదని చెప్పవచ్చును గదా?

నిశ్చితంగా.

మరి పరమమూ, నిత్యమూ, అవినాశమూ అయినతత్త్వాన్ని కాంచేవారు పొందునది జ్ఞానమే కాని, అభిప్రాయం కాదని చెప్పవచ్చును గదా?

అవును.

ఒకడు జ్ఞానానికి విషయాలైనవాటిని ప్రేమించి ఆలింగనం చేస్తుంటే, రెండవవాడు అభిప్రాయానికి విషయాలైనవాటిని వలచి కౌగిలిస్తున్నాడు. ఈ రెండవజాతివారూ, మధురనాదాలాలకించి మనోజ్ఞవర్ణాలు దర్శిస్తూ పరమసౌందర్యసత్తను సహించలేనివారూ ఒకటే.

అవును.

అలాంటప్పుడు వారు అభిప్రాయప్రియులే కాని, ప్రజ్ఞాప్రణయులు కారని అంటే అనుచితమాచరించినవారమవుతామా? అలా వర్ణించినందుకు మనపై వారికి కినుక కలుగుతుందా?

యథార్థానికి ఎవరూ కోపించరాదు. మీరు కోపపడకండని వారికి చెబుతాను.

ప్రతివస్తువులోని సత్యాన్ని ప్రేమించేవారు ప్రజ్ఞాప్రణయులు. అంతే కాని, అభిప్రాయప్రియులు కారని చెప్పవచ్చును గదా?

నిశ్చితంగా.

# ఆరవ ప్రకరణం

గ్లాకన్, సుదీర్ఘచర్చామార్గాన పయనించి ఎట్టకేలకు యథార్థాయథార్థ తత్త్వవేత్తలను దర్శించాము.

ఇంతకంటె దగ్గరదారి ఉన్నదనుకోనని అతడన్నాడు.

నా అభిప్రాయమూ అంతే. కాని, ఇది ఒకటే ముఖ్యమై న్యాయ్యా న్యాయ్యజీవితభేదగ్రహణార్థం ఇతరప్రశ్నలను ఆలోచించవలసిన అవసరంలేకపోతే ఆ ఉభయులను ఇంతకంటె తేలికగా సందర్శించిఉండేవాళ్ళము.

“సరే, తరువాతిప్రశ్న ఏమిటి?” అతడు ప్రశ్నించాడు.

నిత్యము, నిర్వికారము అయినతత్త్వాన్ని గ్రహించగలిగినవారు తత్త్వవేత్తలనీ, వైవిధ్యవికారవిద్ధప్రపంచసంచారులు తత్త్వవేత్తలు కారనీ తేల్చుకొన్నాము. ఇంతకూ ఈ యిరువురిలో ఎవరు మనరాజ్యపాలకులు కావాలి?

సముచితసమాధానం ఎలా చెప్పగలము?

మనరాజ్యసంస్థలనూ, చట్టాలనూ కాపాడసమర్థులైనవారు మనకు సంరక్షకులుగా ఉండాలంటేనో?

ఇది సముచితంగానే ఉన్నది.

కనిపెట్టిఉండవలసినసంరక్షకునకు కనులుండాలి కదా?

17)

అవును.

అయితే కొందరుంటారు. ప్రతివస్తువుయొక్క యథార్థస్వరూపజ్ఞానం వారికి ఉండదు. వారిమనస్సులో విస్పష్టప్రమాణాలుండవు. చిత్రకారుడు తనహృదయఫలకంలో గోచరించే ఆదర్శమూర్తియందు దృష్టిని లగ్నం చేసి తాను వ్రాసేబొమ్మను చిత్రిస్తాడు. అలాగే లోకంలో అవ్యవస్థితాలుగాఉన్న భద్రతనూ న్యాయసౌందర్యాలనూ వ్యవస్థీకరించాలన్నా, ఉన్నవాటిని కాపాడాలన్నా పరమసత్యం తెలిసిఉండాలి. దానియందు వారిదృష్టి లగ్నంకావాలి. కాకపోతే అలాంటి సత్యసందర్శనం వారు పొందలేరు. అట్టివారిని నీవు నిశ్చితంగా అంధులంటావు గదా?

ఆఁ.

అనుభవంలో, గుణసంపత్తిలో వారికి తీసిపోక ఎల్లసత్యం తెలిసిన వారున్నప్పుడు వారు మనరక్షకులుగా ఉండాలా?

ఉత్తమోత్తమగుణవంతుల నిరాకరణకు కారణం కనిపించదు. మరొక విషయంలో కొరత యేర్పడితేతక్క ఎల్లప్పుడు ఆ విశిష్టులకే అగ్రస్థానం ఇవ్వాలి.

అయితే తత్త్వవేత్తలలో జ్ఞానానికీ ఇతరగుణాలకూ పొత్తు కుదురుతుందో లేదో పరిశీలించనక్కరలేదా?

అవును, పరిశీలించాలి.

ముందు తత్త్వవేత్త స్వభావం తేల్చుకోవాలి. అది తేల్చుకొన్న వెనుక వారిలో ఇతరగుణాలు కూడ ఉండవచ్చునని అంగీకరించవచ్చును. అలాంటిగుణవంతులే రాజ్యపాలకులు కావాలని మనం ఆమోదించాలి.

అంటే మీ అభిప్రాయం?

తత్త్వవేత్తలు జననమరణవికారశూన్యమైన నిత్యతత్త్వాన్ని చూపే జ్ఞానాన్ని ఎల్లప్పుడు ప్రేమిస్తారనుకొందాము.

సరే.

మహత్తులోనూ, గౌరవంలోనూ ఎచ్చులొచ్చులున్నా, అజ్ఞానంలోని ఏ అంశాన్నీ వారు ప్రణయిజనులవలె కీర్తికాములట్లు విడువనొల్లరందాము.

దానిని గూడ మనం ఆమోదించవచ్చును.

మనమభివర్ణించినట్లే వారుంటే వారిలో మరొకగుణం ఉండనక్కరలేదా?

ఏ గుణమంటారు ?

సత్యసంధానం. పరమద్వేష్యమైనఅసత్యానికి వారు తావివ్వరు. సత్యం ఎంతగానో ప్రేమిస్తారు.

అవును. అలాగే చెప్పవచ్చును.

మిత్రమా, చెప్పవచ్చునని సంశయిస్తావు దేనికి? చెప్పాలను. ప్రణయశీలుడు తన అనురాగానికి మూలమైనవస్తువును ఆమూలాగ్రం ప్రేమించక మానడు. అంతే కాదు. తత్సదృశవస్తువును గూడ ప్రేమిస్తాడు.

నిజమే.

సత్యంకంటె ప్రజ్ఞకు సన్నిహితమైనవస్తువు మరొకటి ఉన్నదా?

ఎలా ఉంటుంది?

ఒకేప్రకృతి ఇటు ప్రజ్ఞనూ, అటు అసత్యాన్నీ ప్రేమించగలదా?

అసంభవం.

నిజంగా జ్ఞానప్రియుడైనవాడు చిన్నతనంనుంచి ఎల్లసత్యాన్ని అత్యంత గాఢంగా ప్రేమిస్తాడు.

అవును.

ఒకనికి ఒకరంగంలో ప్రబలంగా ఉన్న వాంఛలు మార్గాంతరపరివర్తితవాహినులువలె మరొకరంగంలో దుర్బలంగా ఉంటవని చెప్పవచ్చును గదా?

అవును.

తనవాంఛలు జ్ఞానాకృష్టాలైనప్పుడు ఆవ్యక్తి ఆధ్యాత్మికసుఖవిలీనుడై శారీరకసుఖాలను లేశమైనా సరకుసేయడు. నేను చెబుతున్నది యథార్థ తత్త్వవేత్తసంగతే కాని, బూటకపుతత్త్వవేత్త సంగతి కాదు.

వాస్తవం.

అలాంటివాడు నిశ్చితంగా నిగ్రహశాలిగా, ప్రలోభరహితుడుగా ఉంటాడు. ఇతరునిలో కనిపించే ఆదాయవ్యయకాంక్షలకు అతనిశీలంలో ఎక్కడా తావుండదు.

నిజమే.

తాత్త్వికస్వభావంలో గోచరించే మరొకలక్షణం గూడ మనం పరిశీలించాలి.

అదేమంటారు?

అనుదారతకు అతనిలో తావుండదు. దివ్యమర్త్యవస్తుసామగ్రిని నిరంతరమభిలషించేఆత్మకు లోభంకంటె విరుద్ధగుణం మరొకటి ఉండదు.

అవును.

పరమోదారబుద్ధియై సర్వకాలాలనూ, సర్వసత్తనూ సందర్శిస్తూఉండే వ్యక్తి మానవజీవితాన్ని గూర్చి అంతగా ఎలా ఆలోచిస్తాడు?

ఆలోచించలేడు.

అట్టివానికి మృత్యువు భయంకరమౌతుందా?

కాదు.

కాబట్టి భీరుతానీచత్వాలకు యథార్థతత్త్వంలో స్థానం లేదు.

నిశ్చితంగా అంతే.

దురాశాపరుడు, నీచుడు, వికత్థనుడు, భీరువు కాక సమభావుడైనవాడు కఠినుడు కాగలడా?

అసంభవం.

చూడగానే వీడు న్యాయవంతుడు, మృదుస్వభావుడు; వీడు అనాగరుడు, మైత్రీవిరహితుడు అని వెంటనే గ్రహించగలవు. ఈ లక్షణాలే బాల్యదశయందు గూడ తాత్త్వికప్రవృత్తిని అన్యులనుంచి వేరుచేసి చూపుతవి.

అవును.

ఇక్కడ మరొక అంశం పేర్కొనవలసి ఉన్నది.

ఏ అంశం?

అతనికి గ్రహణశక్తి ఉన్నదో లేదో పరిశీలించాలి. ఎందుకంటే దుష్కరమై, దుఃఖప్రదమై, ఎంత శ్రమచేసినా ఫలంకనిపించనిదానిని ఎవడూ ప్రేమించలేడు.

అవును.

మతిమరపుగలిగి నేర్చినదానిని ధారణచేయలేనివాడు ఓటికుండయే కదా?

అవును.

వృథాశ్రమచేస్తూ తుదకతడు తన్నూ ఫలశూన్యమైన తనవృత్తిని ద్వేషిస్తాడు.

అవును.

ధారణారహితుని తత్త్వప్రకృతిగా లెక్కించరాదు. కాబట్టి తత్త్వవేత్త అయినవానికి సునిశితస్మృతి ఉండవలెనని చెప్పవచ్చును గదా?

నిశ్చితంగా.

సమరసభావంలేనివాడు అనౌచిత్యంవైపే మొగ్గుతాడు గదా?

అవును.

మరి సత్యం ఔచిత్యానికి సన్నిహితమా? అనౌచిత్యానికి సన్నిహితమా?

మొదటిదానికే.

అలాంటప్పుడు ఇతరగుణాలతోపాటు స్వాభావికంగా ఔచితీప్రసాద కలితమైన మనస్సు కూడ ఉండాలి. ఇలాంటిబుద్ధి అప్రయత్నంగా ప్రతి వస్తువుయొక్క యథార్థస్వభావానికి అభిముఖంగా ప్రసరిస్తుంది.

అవును.

మనం పేర్కొన్నగుణాలన్నీ అన్యోన్యసన్నిహితాలు కావా? ఆత్మ సత్తను పూర్ణంగా భజించాలంటే ఇవి ఆవశ్యకాలు కావా?

పూర్తిగా.

మానవుడు గ్రహణశక్తి, ధారణాపటిమ కలిగి ఉదారుడు, ప్రసన్న చిత్తుడు, సత్యన్యాయకలితుడు, నిగ్రహవంతుడూ అయి సాగించేకృషి దోషరహితం గాదా?

ఈర్ష్యాధిదేవత కూడ అందు దోషం చూపలేదు.

అట్టివారికే వయోవిద్యాపరిష్కృతులైనప్పుడు నీవు రాజ్యాన్ని అప్పగిస్తావు.

ఈ సందర్భంలో యాడైమాంటస్ అందుకొని ప్రారంభించాడు: సోక్రటిస్! ఈ మాటలకు ఎవరూ సమాధానం చెప్పలేరు. కాని, మీరిలా మాటాడుతున్నంతసేపు శ్రోతలమనస్సులో విచిత్రభావం అంకురిస్తున్నది. తాము సముచితంగా ప్రశ్నించలేక సరియైనసమాధానం చెప్పలేక అడుగడుగుకు ఇంచించుకగా పెడదారి పట్టింపబడుతున్నామని వారను కొంటున్నారు. ఈ స్వల్పప్రమాదాలన్నీ చేరి చర్చాంతానికి తమ్ము పూర్తిగా బోల్తాపడగొట్టినవని భావిస్తున్నారు. తమ పూర్వభావాలన్నీ ఒకసారి తలక్రిందులైపోయినట్లు కనిపిస్తున్నవి. చతురంగక్రీడానిపుణులతో అందు నేర్పులేనివారు ఆటకుదిగినప్పుడు ఆట కదుతుంది. ఒకపావు కూడ కదల్పవీలుపడదు. అలాగే వీరు కూడ మారుమాటాడ వీలుండదు. ఆ ఆటలో పావులవంటివే ఈ చర్చలోనిమాటలు. ఇక్కడ జరుగుతున్న దానిని చూస్తుంటే నాకీదృష్టాంతం తోచింది. వాదనలో మీప్రతియుక్తిని మాటలతో నిరోధించజాలకపోయినా మరొకటి వాస్తవమని పిస్తున్నది. తత్త్వోపాసకులు విద్యార్థిదశలోనేకాక పక్వదశలో కూడ తత్త్వానుశీలనం సాగించినప్పుడు వారిలో అధికసంఖ్యాకులు కేవలవంచకులు కాకపోయినా విచిత్రజీవులవుతారు. మీరింతగా శ్లాఘిస్తున్న ఆ ఉత్తములు తత్త్వానుశీలనంవల్ల ప్రపంచానికి ఎందుకూ కొరగాకపోతారని మాలో ఎవరైనా అనవచ్చును.

అలాభావించేవారు అపమార్గాన పడుతున్నారంటావా?

నేనేమీ చెప్పలేను. కాని, మీ అభిప్రాయమేమిటి?

అయితే విను. వారు చెప్పేది సముచితమేనని నా అభిప్రాయం.

అయితే తత్త్వవేత్తలు రాజ్యపాలకులు కానంతవరకు అనర్థకాలు నివర్తిల్లవని అంటున్నారు గదా? అది ఎలా సమర్థనీయమాతుంది?

దృష్టాంతసమాధేయమైనప్రశ్న నన్నడుగుతున్నావు.

పాపం! తమకు అట్టిసమాధానంచెప్పేఅలవాటు లేనేలేదు!

ఇంతకూ నన్ను అంతుచిక్కనివాదంలో నుంచి మీరంతా వినోదిస్తున్నట్లున్నది. అయితే ఈ దృష్టాంతం కూడ విని నాభావనాతుద్రతను చూచి ఇతోధికంగా ఆనందించండి. ఉత్తమపురుషులు వారివారిరాజ్యాలలో పొందుతున్నఅవమానసరణికి తగిన ఉపమానమేలేదు. కాబట్టి వారిని నేను సమర్థించాలంటే కల్పనకంటె మరొకశరణ్యం లేదు బొమ్మలలో మేకలను, దుప్పులను కలగాపులగంచేసి చిత్రిస్తున్నట్లుగా బహువస్తువిషయసమ్మిశ్రితమైనబొమ్మను సృష్టించాలి. నౌకాదళాన్నో, నౌకనో ఒకదానిని ఊహించుకో. అందలి సరంగులందరికన్నా ఆ నౌకాధిపతి పొడగరి, బలశాలి. కాని, అతనికి కొంచెం చెవుడు. చూపు కూడ తక్కువ. అతని నౌకాచోదనజ్ఞానం కూడ అంతంతమాత్రమే. నౌకను నేనునడపాలంటే నేనునడపాలని నావికులు ఒండొరులతో పోరాడుకొంటున్నారు. తానెన్నడూ కర్ణధారివిద్య నేర్వకపోయినా, ఆ విద్యను తనకెవరు బోధించారో, ఎప్పుడు బోధించారో చెప్పలేకపోయినా, ఆ విద్య అబోధ్యమంటూనే ప్రతివాడూ నౌకను నడపటానికి తనకే అధికారం ఉందని భావిస్తాడు. కాదన్నవారిని కండతుండాలుగా నరకటానికి సిద్ధపడుతాడు. అట్టివారు నౌకాధిపతిచుట్టూమూగి తమకు కర్ణను అప్పగించవలసినదని యాచిస్తారు. ప్రార్థిస్తారు. ఆ అవకాశం తమకుగాక ఇతరులకు లభిస్తే ఆ ప్రాపించినవారిని హతమారుస్తారు. లేదా సముద్రంలో త్రోసివేస్తారు. మదిరాపానంతోనో, మరొకమాదకద్రవ్యంతోనో నౌకాధిపతిజ్ఞానాన్ని విలుప్తంచేసి తిరుగుబాటుసాగించి నౌకను ఆక్రమిస్తారు. బండారం యథేచ్ఛగా అనుభవిస్తారు. తింటూత్రాగుతూ, త్రాగుతూతింటూ యథామతిని యానంసాగిస్తారు. తమపక్షమై కుతంత్రంలో తమకుతోడ్పడి, నయానవో భయానవో అధిపతినుంచి నౌకను తమకు అప్పగించినవానిని నావికదక్షుడనీ నౌకాయానశిఖామణియనీ సత్కరిస్తారు ప్రతిఘటించినవారిని ఎందుకూ కొఱగానని నిందిస్తారు. అయితే యథార్థకర్ణధారి సంవత్సరము, ఋతువులు, ఆకాశనక్షత్రాలు, పవనాలు, ఆవృత్తికావశ్యకమైన ఇతరవిషయాలు అత్యంతజాగరూకతతో పరిశీలిస్తుండాలి. ఇతరులు సమ్మతించినా సమ్మతించకపోయినా అలాంటివాడే కర్ణధారికావాలి. అవుతాడు గూడ. కర్ణధారివిద్యతోపాటు అధికారం కూడ కలిసిఉండేఅవకాశం వారిభావాలలో ప్రవేశించలేదు. వారివృత్తిలో అదొకభాగం కాలేదు. విప్లవగ్రస్తనౌకలో తిరుగుబాటు

కావించే నావికులు సార్థకనామధేయుడైనకర్ణధారిని ఎలా చూస్తారు? అతనిని నావికఖసూచిఅనీ, వాచాలుడనీ, నిష్ప్రయోజకుడనీ నిందించరా?

అవును, అలాగే జరుగుతుందని యాడైమాంటస్ ఒప్పుకొన్నాడు.

యథార్థతత్త్వవేత్తకూ రాజ్యానికీ ఉన్నసంబంధాన్ని తెలుపుతున్న ఈ దృష్టాంతం నేను వివరించనక్కరలేదు. ఇదివరకే నీకిది బోధపడిఉండాలి.

ఆc.

తత్త్వవేత్తలకు తమరాజ్యాలలో గౌరవం లేదని తెలిసికొని ఆశ్చర్య చకితులౌతున్న మహాశయులకు ఈ దృష్టాంతం వినిపించు. ఇందలి అర్థాన్ని విశదంగా బోధించి నిజంగా వారికి సత్కారం జరిగితే విడ్డూర పడవలసినవిషయమని నచ్చజెప్పు.

అలాగే.

ఉత్తమోత్తములైన తత్త్వోపాసకులు ప్రపంచానికి నిష్ప్రయోజకులని తానుభావించటం సముచితమేనని అతనికి చెప్పు. కాని, ఆదోషం వారిది కాదు. వారిని ఉపయోగించుకోలేనివారిదేనని వివరించు. "నా శాసనానికి కట్టుబడి ఉండండి" అని నావికులను కర్ణధారి ప్రాధేయపడరాదు. అది ప్రకృతిసిద్ధపరిపాటి కాదు. ప్రజ్ఞావంతులు ధనికులగేహాలు వెదకుకొంటూ వెళ్ళాలని ఒకానొకడు అన్నాడు. అది యుక్తం కాదు. అతడు అసత్యం వచించాడు. సత్యం అది కాదు. మానవుడు భాగ్యవంతుడైనా అకించను డైనా రోగగ్రస్తుడైనప్పుడు వైద్యునివద్దకు పోవాలి. అలాగే పరిపాలి తత్వం అభిలషించేవాడు పాలనాదక్షునివద్దకు పోవాలి. ఏ కొంతయోగ్యత ఉన్నపాలకుడైనా తనపాలనకు అంగీకరించండని ప్రజలను యాచించ రాదు. ఇప్పటిపాలకులు దీనికి విపరీతంగా ఉండవచ్చును. అది వేరే సంగతి. ఇట్టివారిని తిరుగుబాటుచేస్తున్న నావికులతో పోల్చవచ్చును. నిష్ప్రయోజకులనీ నావికఖసూచులని నిందింపబడుతున్న వారితో నిజమైన కర్ణధారులను ఉపమించవచ్చును.

నిజానికి అంతేగా!

ఈ కారణాలవల్ల విద్యలన్నిటికి మేల్బంతియైన తత్త్వశాస్త్రం తాదృశు లచే అంతగా మన్ననపొందేఅవకాశం లేదు. నిజానికి తత్త్వశాస్త్రం ప్రత్యర్థులవల్ల ఘోరతరశాశ్వతాపకారం పొందటంలేదు. తత్త్వశాస్త్రో పాసకబ్రువులవల్లనే ఇది జరుగుతున్నది. ప్రత్యర్థులు నిందిస్తున్నట్లు వీరిలో అధికసంఖ్యాకులు పరమధూర్తులు; ఉత్తములు నిష్ప్రయోజకులు. ఈ భ్రష్టతావిషయంలోనే నేను ఏకీభవించినది. జ్ఞప్తికి వచ్చిందా?

అవునవును.

వారిలో ఉత్తములు ఎలా నిష్ప్రయోజకులవుతున్నారో వివరించినట్లే కదా?

ఆఁ.

వారిలో అధికసంఖ్యాకులభ్రష్టత అనివార్యం. ఈదోషం మరొకదానికి ఆపాదించ వీలులేదు. తత్త్వశాస్త్రానికి కూడ ఆపాదించ వీలులేదని నిరూపింతామా?

అలాగే.

వెనుక పేర్కొన్న ఉత్తమప్రకృతిలక్షణాలను జ్ఞప్తికి తెచ్చుకొని ప్రశ్నలు వేసికొని వరుసగా సమాధానాలు చెప్పుకొందాము. సత్యమే అతనికి నాయకం. ఎల్లవిషయాలలో ఎల్లకాలాలలో దానినే అతడు అనుసరిస్తాడని చెప్పుకొన్నాము. అలాచేయడో అతడువంచకుడు. యథార్థతత్త్వశాస్త్రంతో అతనికి ఎలాంటిప్రమేయం ఉండదన్నాము.

అవును.

తతిమ్మాగుణాలసంగతి అలాఉంచు. ఈ ఒక్కగుణం ఈ నాటితాత్త్విక గుణానికి విపరీతంగా కనిపించటంలేదా?

నిశ్చితంగా అలాగే కనిపిస్తున్నది.

అతనిని సమర్థించటంకోసం ఇలా చెప్పేఅధికారం మనకు లేదా? నిజమైన జ్ఞానప్రణయి నిరంతరం సత్తకోసం తీవ్రకృషి చేస్తుంటాడు. అలా కృషి చేయటమే అతని స్వభావం. కేవలం ఆభాసమైన వైయష్టికబహుత్వంలో విరతిపొందక పరిక్రమిస్తాడు. ఆ నిశితధార కుంఠితంకాదు. తన ఆత్మలోని సహానుభావాత్మకసజాతీయశక్తిచే ప్రతితత్త్వంయొక్క యథార్థస్వభావజ్ఞానం పొందేటంతవరకు అతనిఉత్కంఠాబలం ఉపశమిల్లదు. ఆ ఆత్మశక్తిచే సత్తను సమీపించి దానితోమిళితమై ఐక్యమొంది, సత్త్వసత్యాలు (Mind and truth) పడసి జ్ఞానం పొందుతాడు. యథార్థంగా జీవనవృద్ధులు పొందుతాడు. ఇది సిద్ధించేటంతవరకు తనతపస్సు మానడు.

ఇంతకంటె సముచితవర్ణన మరొకటి ఉండదు.

తత్త్వవేత్త ప్రవృత్తిలో ఏకోశమందైన అసత్యాసక్తి కనిపిస్తుందా? అతనికది పరమద్వేష్యం కాదా?

ఘోరంగా ద్వేషిస్తాడు.

సత్యం నాయకత్వం వహించినప్పుడు తదనుయాయివర్గం అనర్థకమని శంకించలేము గదా?

లేదు.

న్యాయం, సౌమనస్యం సహచారులవుతవి. నిగ్రహం వాటిని అనుసరిస్తుంది.

అవును.

తత్త్వవేత్తకు ధైర్యం, ఉదాత్తత, గ్రహణశక్తి, ధారణాపాటవం ప్రకృతిసిద్ధగుణాలని ఇదివరకే చెప్పాను. గుర్తున్నది కదా? ఆ గుణశ్రేణినంతా బారులుతీర్పించి నేను తిరిగి ప్రదర్శించవలసినఅవసరం లేదనుకొంటాను. నేనిప్పుడు చెప్పినదానిని ఎవరూ నిరాకరించలేకపోయినప్పటికీ ఇంతగా అభివర్ణితులైన వ్యక్తులలో కొందరు నిష్ప్రయోజకులు, అధికసంఖ్యాకులు ధూర్తులు అని నీవు ఆక్షేపించావు. దానిమీదట ఈ ఆరోపణలకు గల

కారణాలను మనం పరిశీలించవలసివచ్చింది. దానితో అధికసంఖ్యాకులు ఎందుకు ధూర్తులవుతున్నారన్న ప్రశ్న బయలుదేరింది. అప్పుడు యథార్థ తత్త్వవేత్తలంటే ఎవరో తిరిగి పరిశీలించి నిర్వచించవలసివచ్చింది.

అవును.

ఆ తరువాత తాత్త్విక ప్రకృతిలోని కాలుష్యాలను పరిశీలించాలి. ఎందుకు అంతమంది చెడిపోతున్నారో, కొలదిమందిమాత్రమే (అంటే దుర్మార్గులు కాక నిష్ప్రయోజకులని చెప్పబడుతున్నవారు) ఎందుకు కలుషితులుకాక బయటపడుతున్నారో విచారించాలి. ఆ విషయం ముగించినపిమ్మట తత్త్వశాస్త్రం అనుసరించేవారిని గూర్చిముచ్చటిద్దాము. నిజయోగ్యతకు అతీతమై అప్రాప్యమైన ఆ వృత్తికి ఎలాంటిమనుజులు అర్రులు చాస్తుంటారో చెప్పుకొందాము. ఆ తరువాత, తమ ఆంతరికవిరోధా లతో వారు తత్త్వశాస్త్రానికీ తత్త్వవేత్తలకూ ఎలా అపకీర్తి కల్పిస్తారో వివరించుకొందాము.

ఇంతకూ మీరు పేర్కొన్న ఆ కాలుష్యాలేవంటారు?

వివరించిచెప్పగలనేమో ప్రయత్నిస్తాను. తత్త్వవేత్తలకు అవశ్యం ఉండ వలెనని పేర్కొన్నగుణాలన్నీ సమగ్రంగా ఉన్నవ్యక్తి అపూర్వకల్ప వల్లిక.

అవును. అసాధారణమే.

ఈ అసాధారణప్రకృతులను అసంఖ్యాకప్రబలకారణాలు నాశనంచేయ టానికి ప్రయత్నిస్తవి.

ఏ కారణాలంటారు?

మొట్టమొదటివి ధైర్యం, నిగ్రహం మున్నుగాగల స్వకీయగుణాలే. వారి లోనిప్రతిగుణం స్వాశ్రయమైన ఆత్మను భంగపరిచి తత్త్వ పరాఙ్ముఖం కావిస్తుంది.

అతివిచిత్రంగాఉంది!

వీనికితోడు సామాన్యలౌకికార్థాలైన సౌందర్యం, సంపద, బలము, పదవి, రాజ్యంలోని పెద్దవారితో పొత్తు మున్నైనవి నీకు పరిచితాలేకదా? ఇవి ఆత్మను కలుషితంచేసి తత్త్వంనుంచి అపకర్షిస్తవి.

నిర్దిష్టంగా ఏమిజరుగుతుందంటారు?

సక్రమంగా సత్యసామగ్రిని గ్రహించయత్నిస్తే నామాట అర్థంచేసి కొనటం కష్టంకాదు. అర్థంచేసికొంటే వైచిత్ర్యం లేదు.

ఇంతకూ ఎలా అర్థం చేసికోవాలంటారు?

ఉద్భిజ్జలోకమైనా, జంతులోకమైనా తగినపోషణనూ, శీతోష్ణస్థితినీ, అర్హక్షేత్రాన్నీ అభిలషిస్తుంది. అందలిజీవశక్తి ఎంత ప్రబలంగాఉంటే అద్దాని పోషణాదికన్యూనత అంతగా పీడిస్తుంది. ఎందుకంటే అధమ ప్రకృతి కంటె ఉత్తమప్రకృతికి అనర్థకం ప్రబలశత్రువు.

అవును.

నీచప్రకృతులకంటె ఉత్తమప్రకృతులు విపరీతస్థితిగతులు దాపరించి నప్పుడు ప్రబలతరహానికి పాల్పడుతవి. వైషమ్యాధిక్యమే దీనికి కారణం.

నిజమే.

నిశితబుద్ధులు సముచితవిద్యాసంస్కారం పొందనప్పుడు దుష్టప్రకృతులుగా తయారుకారా, యాడైమాంటస్? ఉజ్జ్వలప్రకృతులు దుష్టశిక్షణ పొందినప్పుడు ఘోరాపరాధాలు, తీవ్రానర్థాలు బయలుదేరుతవి. దుర్బల ప్రకృతులు ఎలాంటిసంస్కారాలకు పాల్పడినా మేలుగాని కీడుగాని అంతగా కలుగదు.

అవును. గ్రుడ్డికన్ను తెరచినా మూసినా ఒకటే.

మనతత్త్వవేత్త విషయంలో కూడ ఈ దృష్టాంతమే అన్వయిస్తుంది. అతను ప్రరోహంవంటివాడు. సముచిత పోషణం ఉంటే వర్ధిల్లి పరిణతి పొంది సద్గుణపుంజం గా మూర్తీభవిస్తాడు. విపరీతక్షేత్రవిక్షిప్తుడైనప్పుడు, దైవం అడ్డుపడి కాపాడితేతక్క, అత్యంతప్రమాదకరమైన విషవృక్ష మవుతాడు. ప్రజలంటున్నట్లు మనయువలోకం జల్పాకుల (Sophists) వల్ల చెడిపోతున్నదంటావా? లేక వితండవాదం బోధించే అధ్యాపకుల వల్ల చెడిపోతున్నదంటావా? ఇలా అంటున్నప్రజలే జల్పాకశేఖరులు కారా? బాలకులను, వృద్ధులను, స్త్రీలను, పురుషులను తమువిద్యలో ఉత్తీర్ణులను కావించి వీరు తమ చిత్తమువచ్చినతీరున దిద్దితీర్చటంలేదా?

ఎప్పుడు?

వారు సమావేశమైనప్పుడు. సభలలోనో, న్యాయస్థానాలలోనో, నాటకశాలల్లోనో, పాఠశాలలలోనో మరొకప్రదేశంలోనో ప్రజలు మూగుతున్నారు. మహత్తరకలకలం చెలరేగుతున్నది. చెప్పినమాటలను, చేసినచేతలను కొన్నిటిని శ్లాఘిస్తున్నారు; కొన్నిటిని నిందిస్తున్నారు ఆ రెంటినీ గోరంతలు కొండంతలు చేస్తున్నారు. అరుస్తున్నారు. చప్పట్లు చరుస్తున్నారు. పరిసరపర్వత ప్రాంతాలు నిందాశ్లాఘలతో బొమ్మని ప్రతిధ్వను లీనుతున్నవి. అలాంటి సమయంలో యువకునిహృదయం పరవళ్ళు త్రొక్కదా? వ్యక్తిగతంగా ఎంత సునిశితశిక్షణ పొందిఉన్నా అతడు ఆ ప్రబలప్రజాభిప్రాయధాటికి ఆగి నిలద్రొక్కుకొంటాడా? లేక ఆ మహాప్రవాహంలోబడి కొట్టుకుపోతాడా? ప్రజలకు సామాన్యంగా ఉండే మంచిచెడుగులభావాలే అతనికీ కలుగవా? వారు ప్రవర్తించి నట్లే అతడు ప్రవర్తిస్తాడు. వారున్నట్లే అతడూ ఉంటాడు.

అవును, సోక్రటిస్. ఆవశ్యకత అతన్ని అలా చేస్తుంది.

అయితే ఇంతవరకు పేర్కొని ప్రబలతరావశ్యకత మరొకటి ఉన్నది.

ఏమిటది?

ఈ నవ్యజల్పాకులు, విద్యాబోధకులు అయినప్రజలు తమమాటలు నిష్ఫలాలైనప్పుడు ధనాపహరణం, మరణదండన వంటిశిక్షలు విధిస్తారు.

అవును, వారు అలాగే చేస్తారు.

ఇంతటినిర్బంధం ఉన్నప్పుడు ఏ ఇతరజల్పాకుని అభిప్రాయమైనా ఏ వైయష్టికమానవుని భావమైనా నెగ్గుతుందా?

ఎన్నడూ నెగ్గజాలదు.

అసలు అట్టిదానికి ప్రయత్నించటమే మూర్ఖత్వం. ప్రజాభిప్రాయం ప్రసాదించినదానికంటె మరొకశిక్షణ లేనప్పుడు తద్భిన్నశీలం ఇదివరకు ఏర్పడలేదు. ఇప్పుడేర్పడుతున్నదీ లేదు. ఇకముందేర్పడేదీ లేదు. నేను పేర్కొంటున్నది మానవమాత్రులశీలమే కాని లోకోత్తరులశీలం కాదు. ప్రకృతప్రభుత్వాల దుఃస్థితిలో ఏదైనా రక్షితమై భద్రం ప్రాపిస్తున్నదంటే అది దైవమాహాత్మ్యం.

నేను గూడ మీతో ఏకీభవిస్తున్నాను.

అయితే దీనికి గూడ నీ అంగీకారం అభ్యర్థిస్తున్నాను.

ఏమి చెప్పబూనుకొన్నారు?

జల్పాకులనీ, తమకువిరోధులనీ బహుసంఖ్యాకులు పేర్కొంటున్న ధనదాసులే నిజానికి బహుళసంఖ్యాకుల అభిమతాన్ని బోధిస్తున్నారు. అంటే ప్రజాపరిషత్తుల అభిప్రాయాలను కరపుతున్నారు. అదే వారిప్రజ్ఞ. బలిష్ఠవన్యజంతువుయొక్క ఇష్టానిష్టాలను, రాగద్వేషాలను జాగ్రత్తగా పరిశీలిస్తూ పాలించేవ్యక్తితో వారిని పోల్చవచ్చును. ఆ జంతువును ఎలా సమీపించాలో, ఎలా పట్టుకరావాలో అతడు నేర్చుకొంటాడు. ఏ యే కాలాలలో ఏ యే కారణాలవల్ల అది సాపాయమో, ఎప్పుడెప్పుడది అనపాయమో గ్రహిస్తాడు. దానివిభిన్నధ్వనుల అర్థమేమో, ఇతరులేధ్వని చేస్తే దానికి హితమో, ఏ ధ్వనులు చేస్తే అహితమో కనుగొంటాడు. దానిని నిరంతరం కనిపెట్టుకొని ఉండటంవల్ల ఈ విషయాలన్నీ సమగ్రంగా గ్రహిస్తాడు. తాను సంపాదించిన జ్ఞానాన్ని అతడు ప్రజ్ఞ అంటాడు. దానిని ఒకవిద్యను చేసి ఇతరులకు బోధించనారంభిస్తాడు. దీని అర్థమేమొ అతనికి తెలియదు. అయినా ఇది మాన్యం, ఇది అవ

మాన్యం, ఇది మేలు, ఇది కీడు, ఇది న్యాయ్యం, ఇది అన్యాయ్యం అంటూ ఆ మృగాభిరుచులనుబట్టి చెబుతుంటాడు. ఆ మృగం ఆనందించే దాన్ని మేలంటాడు. దానికనిష్టమైనదానిని కీడంటాడు. న్యాయ్యా ఉదాత్తార్థాలు ఆవశ్యకాలని అంటాడేతక్క, వానిని సక్రమంగా వివరించలేడు. ఆ న్యాయాన్ని కాని, ఉదాత్తతను కాని స్వయంగా ఎరిగినవాడు కాడు. వానిలో దేనిస్వభావమూ, ఏవిభేదమూ బోధించగలశక్తి అతనికి లేదు. అలాంటివ్యక్తి అపూర్వవిద్యాబోధకుడు కాడా?

అవును.

చిత్రలేఖనంలోనైనా, సంగీతంలోనైనా, తుదికి రాజకీయాలలోనైనా భిన్నరుచియైన లోకంయొక్క రాగద్వేషాభిరుచులను పాటించటమే ప్రజ్ఞ యనిభావించేవాడు నేనింతకుముందు పేర్కొన్నవానికంటె ఎలా భిన్నుడవుతాడు? ఎలా విశిష్టత పొందుతాడు? బహుళసంఖ్యాకుల ననుసరిస్తూ వారికి తనకావ్యమో, కళాఖండమో, రాజ్యానికి తానొనర్చిన సేవలో ప్రదర్శిస్తూ, తనకు అవసరంకాకపోయినా వారిని తీర్పరులను చేస్తున్నప్పుడు వారు శ్లాఘించేదానినే అతడు విధిగా సృష్టించవలసివస్తుంది. ఇక మాన్యతాభద్రతలపై వారివ్యాఖ్యలు పరమహాస్యాస్పదాలు. అలాహాస్యాస్పదాలుకానివాటిని నీవెన్నడైన విన్నావా?

లేదు. వినగలనని కూడ అనుకోను.

నేను చెబుతున్నసత్యాన్ని గుర్తించావు కదా? ఇట్టిస్థితిలో వివిధరమణీయార్థాలుకాక పరమరామణీయకం ఉన్నదనీ, అలాగే ప్రతిజాతిలోను బహుత్వంకాక పరమార్థం ఉన్నదనీ ప్రపంచాన్ని నమ్మించసాధ్యమేమో ఆలోచించు.

అది అసాధ్యం.

కాబట్టి లోకమెన్నడూ తత్త్వవేత్త కాజాలదు.

అవును.

అందువల్ల తత్త్వవేత్తలు అనివార్యంగా లోకనిందాభాజనులు కావలసిందే.

నిజమే.

ప్రజలను అనుసరిస్తూ వారిసంతృప్తికి ప్రయత్నించేవ్యక్తులో?

లోకానికి వంతపలుకుతారు.

తనవృత్తిలో తత్త్వవేత్త తుదివరకు నిలబడే మార్గమేమైనా నీకు కనిపిస్తున్నదా? అతనికి ఉండవలసినగుణగణాలను చెప్పుకొన్నాము. జ్ఞప్తికి తెచ్చుకో. గ్రహణం, ధారణ, ధైర్యం, ఉదారత తత్త్వవేత్తకుండాలన్నాము.

అలాంటివాడు తన మానసికశక్తుల కనుగుణాలైన శక్తులనుకూడ పొందితే బాల్యదశనుంచి ఎల్లవిషయాలలో అగ్రేసరుడు కాడా?

విధిగా అవుతాడు.

అతడు పెరిగి పెద్దవాడైనప్పుడు అతనిమిత్రులు, తోడిపౌరులు తమ ప్రయోజనాలకోసం అతన్ని వినియోగించుకోవాలని కోరుతారుగదా?

అవును.

ఒకానొకనాటికి అతనికి సంక్రమించగలశక్తిని కైవసం చేసికోవాలని అతని పాదాలమీద వ్రాలి ప్రార్థిస్తారు, గౌరవిస్తారు, శ్లాఘిస్తారు.

అది తరచుగా జరుగుతూనే ఉంటుంది.

అట్టి స్థితిగతులలో అలాంటివ్యక్తి మహారాజ్యపౌరుడైఉండి, శ్రీమంతుడు, ఉదారుడు, ఉత్తుంగయువకుడుఅయిఉంటే ఏమి చేయవచ్చునంటావు? అతని అహంకారానికి అవధులుంటవా? యవనబర్బరజాతుల వ్యవహారాలన్నిటినీ తానే చక్కబెట్టగలనన్న అహంభావమేర్పడదా? అలాంటి భావాలు అంకురించినప్పుడు అర్థంలేనిగర్వంతో కుదురునిండినపటాటోపంతో మరొకపిడికెడు పెరగడా?

నిశ్చితంగా అలాగే తయారవుతాడు.

అతడు ఇలా ఉన్నప్పుడు బుద్ధిమంతుడొకడు దగ్గరజేరి, "నీవు పరమ మూర్ఖుడవు. జ్ఞానం సంపాదించు. ఎంతో తపస్సు చేస్తేనేకాని అది లభించదు" అని చెబుతాడనుకో. అట్టి విపరీతస్థితిగతులలో ఆ మాటలతనిచేత వినిపించగలడా?

అసాధ్యం.

ఒకవేళ స్వతస్సిద్ధమైన సద్గుణంవల్ల గాని, స్వాభావికమైన వివేకంవల్ల గాని కన్ను తెరచి గర్వముడిగి తత్త్వశాస్త్రానికి దాసుడయ్యేవాడు ఎవడైనా ఒకడున్నాడేపో. అతనిసాహచర్యంవల్ల లాభం పొందుదామని కొండంత ఆసపెట్టుకొని ఉన్న అతనిమిత్రులు ఎలా ప్రవర్తిస్తారు? అతనిని స్వాభావికసౌజన్యాధీనునికానీక నివారించి అతనిగురువుల హితోపదేశం నిష్ఫలంచేయబూని ఏ చెడుగరపులు కరపవలసివచ్చినా, ఏ చేతలు చేయవలసివచ్చినా వెనుకాడుతారా? తమలక్ష్యసిద్ధికై కుతంత్రాలు పన్నరా? అభియోగాలారోపించరా?

ఇంకా సందేహమా?

ఇట్టిస్థితిగతులలో చిక్కుకొన్నవాడు ఎప్పుడైన తత్త్వవేత్త అవుతాడా?

అసంభవం.

తత్త్వవేత్తను గావిస్తున్న గుణాలే సముచితశిక్షణ పొందనప్పుడు అతనిని తత్త్వశాస్త్రవిముఖునిచేస్తవి. ఈకృత్యంలో సిరిసంపదలకూ భోగభాగ్యలకూ ఇతర లౌకికార్థాలకూ ఈ గుణాలేమాత్రం తీసిపోవు.

యథార్థం.

ఉత్తమోత్తమవృత్తికి అత్యంతయోగ్యాలైనప్రకృతులు ఈ విధంగా ఇంత వినాశం వైఫల్యం పొందుతవి. ఏకాలమందైనా ఇలాంటి ఉత్తమప్రకృతులు అరుదు. ఈ వర్గంవల్లనే రాజ్యాలకు, వ్యక్తులకు అతిఘోరానర్థ

దాయకులైన మానవులుద్భవిస్తున్నారు. ప్రవాహం సముచితమార్గాన నడిచినప్పుడు పరమశ్రేయోదాయకులైనవారుకూడ ఈ వర్గంవల్లనే అవతరిస్తున్నారు. అంతేకాని క్షుద్రమానవులెన్నడూ మహాశ్రేయస్సును వ్యక్తులకు గానీ రాజ్యాలకు గానీ చేకూర్చలేరు.

ఇది యథార్థమని అతడన్నాడు.

ఈ విధంగా తత్త్వశాస్త్రవధూటి పరిత్యక్తయై ప్రణయిజనసమాగమ విహీన అవుతుంది. హృదయాధినాథులు ఆమెను వదలివేస్తారు. వారు అయథార్థమైన అనుచితజీవయాత్రసాగిస్తూఉంటే, అయోగ్యులైనఇతరులు ఆ నిస్సహాయతను గమనించి అలుచుగొని ఆమెను అవమానిస్తారు. ఆమెను అధిక్షేపించేవారు నీవు పేర్కొన్న అభాండాలు వేస్తారు. ఆమెనుపాసించేవారిలో కొందరు నిష్ప్రయోజకులనిఅంటారు. బహుళసంఖ్యాకులు కఠోరదండనార్హులని గర్హిస్తారు.

అవును, ప్రజలు అలాగే అంటున్నారు.

పవిత్రనామాలతో ఆకర్షకబిరుదాలతో ధనధాన్యసమృద్ధదేశంవలె ఈ దేశం కూడ సుగమంగా కనిపిస్తుంది. కారాగారాలనుంచి పరుగిడిపోయి పవిత్రాలయంలో చొరబడేచోరులవలె ఈ కుత్సితజీవులు స్వకీయవృత్తుల నుంచి తత్త్వశాస్త్రంలో ఒకసారిగా దుమికినప్పుడు ఇంతకంటె మరేమి జరుగుతుంది? ఇలా చేసేవారు బహుళః స్వకీయవృత్తులలో అత్యంత నిపుణులై యుండవచ్చును. తత్త్వశాస్త్రం ఇట్టి దుఃస్థితిలోఉన్నా, ఇతర విద్యలలో గోచరించనట్టిదేవి దీనికున్నది. అందువల్ల స్వవృత్తులచే దేహములట్లు ఆత్మలు కూడ పరమవికృతిపొందిన ఈ అసమగ్రప్రకృతులు తత్త్వవిద్యాకృష్టులవుతారు. ఇది అనివార్యం.

అవును.

అప్పుడే బందెనుంచి బయటపడి అదృష్టంవల్ల అందలమెక్కిన బట్టతల కంచరిని జ్ఞప్తికితెచ్చుకో. అతడు స్నానంచేస్తాడు. కోటు వేస్తాడు. నిరుపేద, ఏకాకిని అయిన తనయజమానునికుమార్తెను చెట్టపట్టబోతున్న పెండ్లికొడుకులాగా ముస్తాబవుతాడు. అలాగే వీరుకూడా.

చక్కని దృష్టాంతం చెప్పారు!

ఇట్టి వివాహాలవల్ల ఎలాంటి సంతానం కలుగుతుంది? ఆ సంతతి నీచమూ భ్రష్టమూ కాదా?

ఇంకా సందేహమా?

విద్యకు అనర్హులైనవ్యక్తులు తమకంటె ఎంతో కులీనమైనతత్త్వవిద్యను చేపట్టినప్పుడు ఎలాంటిభావాలు, అభిప్రాయాలు ఉద్భవిస్తవి? అశ్రావ్యాలు, ఉపజ్ఞాశూన్యాలు, ప్రజ్ఞావిదూరాలు అయినజల్పాలు ఉద్భవించవా?

అవును.

అలాంటప్పుడు యోగ్యులైనతత్త్వవిద్యానుయాయులు అత్యల్పసంఖ్యాకులవుతారు ఉదాత్తుడు సుశిక్షితుడుఅయినవ్యక్తి ఒకానొకడు గత్యంతరశూన్యుడై విద్యాసేవయందు నిర్బంధితుడై దుష్టసంస్కారవిముక్తుడై తత్త్వవిద్యానురక్తుడై ఉండవచ్చును. లేదా కొండొకఉదారాత్ముడు అల్పరాజ్యంలో జన్మించి ఆరాజ్యరాజకీయాలంటు బద్ధద్వేషియై ఔదాసీన్యం వహించిఉండవచ్చును. లేదా ప్రకృతిసిద్ధప్రజ్ఞకలిగి అన్యవృత్తులను ద్వేషించి, పరిత్యజించి, తత్త్వవిద్యను ఆశ్రయించవచ్చును. లేదా కొందరు అస్వస్థతానివారితులు ఉండవచ్చును. ఎందుకంటే జీవితంలోని ప్రతివిషయం మానవుని తత్త్వవిద్యావిముఖుని చేయయత్నిస్తుంది. అయితే ఈ అనారోగ్యం ఆతనిని రాజకీయాలలో గూడ పాల్గొనకుండా చేస్తుంది. నాస్వవిషయంలో ఆంతరికప్రబోధం అంతగా చెప్పదగినది కాదు. ఎందువల్లనంటే ఇలాంటి అంతరాత్మ ఉద్బోధము చాలఅరుదు. స్వల్పసంఖ్యాకమైన ఈ వర్గానికిచెందినవారు తత్త్వార్థకలిమి ఎంతమధురమో ఎంత ఆనందదాయకమో ఆస్వాదించి తెలిసికొనిఉంటారు. ప్రజానీకమహోన్మాదాన్ని కూడ చవిచూచి ఉంటారు. ఏ రాజకీయుడు ఋజువర్తనుడు కాడు. చేతులుకలుపుదామంటే న్యాయంకోసం పోరాడేవ్యక్తిదొరకడని వారికి తెలుసు. అలాంటివానిని క్రూరజంతువులకు చిక్కినపురుషునితో పోల్చవచ్చును. తానొక్కడే ఆ క్రూరమృగాలను ఎదుర్కోలేడు. రాజ్యానికి గాని తనమిత్రులకు గాని ఉపయోగపడనని గ్రహించి, తనకు

గాని ఇతరులకు గాని మేలుచేయకయే తనజీవితాన్ని పరిత్యజించక తప్పదని గుర్తించి శాంతుడై తనమార్గాన తాను పోతాడు. గాలిదుమారంలో బయలుదేరి ఎలాగో గోడమాటునకు చేరుకొన్నవ్యక్తివలె అతడుంటాడు. తక్కినమానవజాతిక్రూరతను గమనించి, తానుమాత్రం అనర్థకానికి గాని, అప్రగుణత్వానికి గాని పాల్పడక ప్రశాంతంగా తన జీవితాన్ని తాను కొనసాగించగలిగితే సంతృప్తి పొందుతాడు.

అవును. అలా చేస్తేమహాప్రస్థానానికిముందు మహత్తరకార్యం సాధించినవాడవుతాడు.

మహత్తరకార్యమే. కాని, తనకర్హమైనరాజ్యాన్ని పొందితేతక్క అది మహత్తరకార్యం కాదు. ఎందుకంటే తనకు యోగ్యమైనరాజ్యంలోనే అతడు మహత్తరవృద్ధి పొందుతాడు. తనదేశాన్నీ తన్నూ కాపాడుకోగలుగుతాడు.

తత్త్వశాస్త్రం అపఖ్యాతిపొందటానికి గలకారణాలను యథోచితంగా వివరించాను. ఆ దూషణలయందలి అన్యాయాన్ని వెల్లడించాను. ఇంకా చెప్పవలసినదేమైనా ఉన్నదా ?

లేదు. కాని ఇప్పుడున్నప్రభుత్వాలలో మీమతంప్రకారం ఏది తత్త్వశాస్త్రానుగుణంగా ఉన్నది ?

ఏదీ లేదు. వాటిపై నాకున్నఆక్షేపణమంతా ఇదే కదా! ఒకటి కూడా తాత్త్వికప్రకృతికి యోగ్యంగా లేదు. అందువల్లనే అది అపవ్యాఖ్యాతమై విపరీతంగా కనిపిస్తున్నది. విజాతిబీజం అన్యభూమియందు నిక్షిప్తమైనప్పుడు స్వభావం కోల్పోయి కుంఠితవీర్యమై ఆక్రొత్తనేలలో అంతర్ధానమౌతుంది. అలాగే తత్త్వశాస్త్రం క్షీణించి మరొకలక్షణం పొందుతుంది. అయితే ఆ శాస్త్రం స్వాభావికపరిపూర్ణతను ఎన్నడైనా పొందటం సంభవిస్తే అప్పుడు నిజంగా అది దివ్యమని తక్కినమానవప్రకృతులు కాని, సంస్థాప్రకృతులు కాని కేవలం మర్త్యాలని స్పష్టమవుతుంది. ఇప్పుడిక నీవు అడుగబోయేప్రశ్న యేదో తెలుసు. ఆ రాజ్యమేదో చెప్పమంటావు.

లేదు. పొరపడ్డారు. అది కాదు. మనం కనుగొని స్థాపిస్తున్నదేనా ఆ రాజ్యం, కాక మరొకటా ?

చాలవరకు మనం స్థాపిస్తున్న రాజ్యమే. శాసనసభ్యుడవై విశిష్టరాజ్యాంగ సిద్ధికై నీవు శాసనాలు చేశావు. ఆలక్ష్యమే కలిగినసజీవప్రభుత్వం రాజ్యంలో ఉండాలని లోగడ చెప్పాను. ఆ సంగతి మరచిపోవద్దు.

అవును, చెప్పారు.

అయితే అప్పుడు ఆ విషయం సంతృప్తికరంగా చెప్పలేదు. ఆక్షేపణలతో అడ్డుతగిలి భయపెట్టావు. చర్చ సుదీర్ఘమై సిద్ధాంతం కష్టసాధ్యమాత్రం దని అనిపించింది. ఇంక మిగిలినది సుకరం కాదు.

ఇంకా మిగిలినది ఏదంటారు ?

రాజ్యవినాశకారిని కానీక తత్త్వానుశీలనాన్ని ఎలా సాగించాలన్నదే ప్రశ్న. మహాప్రయత్నాలన్నీ ప్రమాదభూయిష్ఠాలు. సత్కార్యమెప్పుడూ కష్టసాధ్యమని కదా బుద్ధిమంతులంటారు ?

అయినా ఈ అంశం తేల్చుకోవాలి. అప్పుడే పరిశీలనం పరిసమాప్తి పొందుతుంది.

అయితే సంకల్పబలం చాలక నేను ఆగను. ఆగటమనేది కలిగితే శక్తి చాలమిచే కలుగవచ్చును. నాకున్న ఉత్సాహం మీకు వ్యక్తమే. రాజ్యాలు తత్త్వశాస్త్రాన్ని అనుసరించాలి. ఇప్పుడు చేస్తున్నట్లుకాక విభిన్నదృక్పథంతో సాగించాలి.

ఏవిధంగా నంటారు ?

ప్రకృతం తత్త్వాధ్యేతలు పసిపిల్లలు, బాల్యం గడిచీగడవనిదశలో గృహస్థులై ధనార్జనకుపక్రమించనికాలంలో తత్త్వశాస్త్రాధ్యయనం ప్రారంభిస్తున్నారు. వీరిలో తాత్త్వికజిజ్ఞాసావిశిష్టులని ఖ్యాతికెక్కినవారు కూడ శాస్త్రంలో గడ్డుచిక్కు వచ్చినప్పుడు— అంటే తర్కంవచ్చి

నప్పుడు (Dialectic)—ఆ చదువు మాని వేస్తారు. తరువాతిజీవితంలో ఎవరైనా పిలిస్తే పోయి తాత్త్వికోపన్యాసం వినవచ్చును. దీనికే వారు ఎంతో శ్రమపడతారు. ఎందుకంటే తత్త్వశాస్త్రార్థగ్రహణం తమవృత్తి కాదనుకొంటారు. తుదికి వార్ధకం పైబడ్డప్పుడు వారిలో చాలమంది హిరాక్లిటస్ సూర్యుని♦వలె నిర్వాణం పొందుతారే కాని అతనివలె తిరిగి ఉదయించరు.

ఇంతకూ వారనుసరించవలసిన మార్గమేదంటారు?

తద్విరుద్ధమార్గం. బాల్యంలో వారు అభ్యసించే తత్త్వశాస్త్రార్థం వయస్సునకనుగుణంగా ఉండాలి. యౌవనం అంకురిస్తున్న కాలంలో వారి శరీర పాటవాభివృద్ధియందు ప్రత్యేకశ్రద్ధ వహించాలి. జీవితం కొనలుసాగి బుద్ధి వికసించి పరిణతిపొందనారంభించినప్పుడు మానసికవ్యాయామం అధికంకావాలి. అయితే బలముడిగి ప్రజాసేవను, సైనికవిధులను నిర్వర్తించవలసినకాలమతిక్రమించినపుడు యథేచ్ఛగా తత్త్వానుశీలనం సాగించాలి. మరొకముఖ్యవ్యాపారం వారికి ఉండరాదు. ఇలా చేస్తే ఐహిక జీవితంవలెనే ఆముష్మికజీవితం కూడ ఆనందమయమౌతుంది.

సోక్రటిస్, ఎంత చిత్తశుద్ధితో చెబుతున్నారు! అయితే మీశ్రోతలలో ఎక్కువమంది అంతకంటె ఎక్కువచిత్తశుద్ధితో మిమ్ము ప్రతిఘటిస్తారు. వారేమాత్రం మీప్రతిపాదనను విశ్వసించరు. ముఖ్యంగా థ్రాసిమాకస్ బొత్తిగా ఒప్పుకోడు.

ఇంతకుముందే మిత్రులమయ్యాము. నాకూ థ్రాసిమాకస్‌కు పోట్లాట పెట్టకు. ఇలా అనగానే మాకొకప్పుడు శత్రుత్వం ఉండేదని భావించకు మాకలాంటిది లేదు. అతనినీ ఇతరులనూ నమ్మించటానికి యథాశక్తిని ప్రయత్నిస్తాను. లేదా పునర్జన్మమొంది ఇట్టిచర్చలనుసాగిస్తున్నప్పుడు వారికి లాభం కలిగించేమేలేదైనా చేస్తాను.

మీరు అనద్యతనవిషయం త్రవ్వుతున్నారు.

---

♦అనుదినం క్రొత్తసూర్యుడుదయిస్తాడని హిరాక్లిటస్ సిద్ధాంతం.

శాశ్వతత్వంముందు ఈ కాలం ఒకలెక్క కాదు. అయినా పెక్కురు దీనిని విశ్వసించరు. ఇందు నాకాశ్చర్యం లేదు. మనమిప్పుడు మాటాడు తున్న ఆదర్శసిద్ధిని ఎవరూ చూడలేదు. కృత్రిమశబ్దాన్వితమైన తత్త్వ శాస్త్రానుకరణం మాత్రమే వారెరుగుదురు. కాని, మన మాటలవంటి మాటలు ఎరుగరు. మాటల్లో చేతల్లో మూర్తీభవించినసద్గుణరాశియై ఆత్మసదృశమైనరాజ్యాన్ని పాలించినవ్యక్తి ఒకనిని గాని, అనేకులను గాని ఇంతవరకెన్నడూ వారు చూడలేదు. చూచారనుకొంటావా?

లేదు.

లేదు, మిత్రమా! లేదు. స్వచ్ఛందములగు ఉదాత్తభావాలు కూడ వారు ఎన్నడూ వినలేదు. సత్యాన్వేషకులై జ్ఞానసముపార్జనార్థం చిత్తశుద్ధితో శక్తివంచనలేక సాగించేచర్చలు వారెన్నడూ వినలేదు. న్యాయస్థానాల్లో కాని, సమాజంలో కాని వారు సాగించేచర్చలు కేవలంరంధ్రాన్వేషణా లుగా ఉంటవి.

అవును, మీరు చెప్పినఉదాత్తచర్చలు వారెన్నడూ వినిఉండరు.

దీనిని ముందుగానే ఊహించాము. ఈ కారణంవల్లనే నిష్ప్రయోజకులైనా భ్రష్టులు మాత్రం కారు. మనం పేర్కొన్న తాత్త్వికుల స్వల్పసంఖ్యాక వర్గం ఇష్టమున్నా లేకపోయినా విధివిహితంగా రాజ్యరక్షణకు పూను కోవాలి. ఆ వర్గశాసనాలను రాజ్యం శిరసావహించాలి. లేదా రాజులు కాని, రాజకుమారులు కాని దివ్యప్రబోధంవల్ల యథార్థతత్త్వశాస్త్రాభి నివిష్టులు కావాలి. ఇంతకు వినా రాజ్యాలు కాని, వ్యక్తులు కాని పరి పూర్ణతను పొందలేరని జంకుగొంకులతో చెప్పాను. ఈ మార్గాలరెంటిలో ఒకటికాని, ఉభయంకాని అసంభవంగా నాకు కనిపించటం లేదు. అసంభవమే అయితే, మనం కలలు కంటున్నామనీ కల్పనాసౌధాలు కడుతున్నామనీ ఇతరులు మనలను పరిహసించవచ్చును. నేను చెప్పింది యథార్థమేనంటావా?

పూర్తిగా.

అయితే, గడచిన అసంఖ్యాకయుగాలలో కాని, మనదృష్టికి అందని

దూరదేశంలో గాని ఈ గడియయందే పరిపూర్ణుడైనతత్త్వవేత్త విధివిధానం అతిక్రమించలేక రాజ్యభారం వహించియుండవచ్చును. లేదా ఇక మీదవహించవచ్చును. తత్త్వవిద్యాదేవత ఉన్నంతవరకు ఈ మన రాజ్యాంగవిధానం పూర్వం ఉన్నది. ఇప్పుడు ఉంటున్నది. ఇకముందుం టుందని మనం మృత్యువుపై చేయిసాచి శపథంచేయ సంసిద్ధులమే. ఇది అసంభవం కాదు. అయితే ఇందు క్లేశం ఉన్నదని మనమే ఒప్పు కొంటున్నాము.

నేనూ మీఅభిప్రాయంతో ఏకీభవిస్తున్నానని అతడన్నాడు.

అంటే ఇది ప్రజానీకాభిప్రాయం కాదని నీతాత్పర్యమా ?

"కాదనే నాఉద్దేశం." అతడు సమాధానం చెప్పాడు.

మిత్రమా ! నేను ప్రజానీకాన్ని ఎదుర్కొనటం లేదు. దాడిసాగిస్తున్నట్లు కాక మృదువుగా బుజ్జగించి వారికున్న విద్యాద్వేషాన్ని పరిహరించి తాత్త్వికుల యథార్థరూపం చూపి ఇప్పుడుచేస్తున్నట్టే నీవు వారిశీలాన్ని, వృత్తిని వర్ణిస్తే ప్రజానీకం తనఅభిప్రాయాన్ని మార్చుకొంటుంది. మానవజాతి ఈ నూతనదృష్టితో చూచినప్పుడు తత్త్వవేత్తను అపార్థంచేసికొన్నానని గ్రహించి తన అభిప్రాయం మార్చుకొంటుంది. తన్నుప్రేమించేవారిని ఎవరు ద్వేషించగలుగుతారు? స్వయంగా మృదుస్వభావుడైన అనీర్ష్యాళువు ఈర్ష్యలేనివానిపై ఎలా ఈర్ష్యపడగలుగుతాడు? లేదు. నీపక్షం కూడ నన్నే చెప్పనీ. ఏ కొలదిమందికో ఈ కఠినస్వభావం ఉండవచ్చును. అంతే కాని, మానవజాతిలో అత్యధికసంఖ్యాకులకు ఉండదు.

మీతో నేను ఏకీభవిస్తున్నాను.

తత్త్వశాస్త్రంపట్ల అధికసంఖ్యాకుల తీవ్రవైముఖ్యానికి కారణం ఉన్నది. పిలవని పేరంటానికి వచ్చి నిరంతరం ఒండొరులను దూషించుకొంటూ తప్పులు నెమకుతూ, విషయపరాఙ్ముఖంకాక వ్యక్తినిందకావించే కుహనా తత్త్వవేత్తలే దీనికి కారణం. ఈ కృత్యాలు తత్త్వవేత్తకు అనుచితాలు కావా ?

అవును.

సత్పదార్థలగ్న చిత్తునకు లౌకికవ్యవహారపరిశీలనకు గాని, స్పర్థకు గాని, ఈర్ష్యాసూయలకు గాని వ్యవధి ఉండదు. అతనిచక్షువు నిరంతరం అచంచలాలు, అనశ్వరాలు, అనాహతాలు, వివేకవిహితసంచారములూ అయినవస్తువులకభిముఖమై ఉంటుంది. వీనినతడనుకరిస్తాడు. తనకు సాధ్యమైనంతమేర వీనిసాయుజ్యం (Conform) పొందుతాడు. తాను భక్తి పూర్వక సంసర్గం నెరపుతూ శ్లాఘిస్తున్నదానిని అనుకరించక ఎలా ఉండగలుగుతాడు?

అది అసంభవమే.

దివ్యవ్యవస్థతో సంసర్గం నెరపుతున్న తత్త్వవేత్త మానవప్రకృతికి సాధ్యమైనంతవరకు సమత్వం దివ్యత్వం పొందుతున్నాడు. అయితే ఇతరులవలెనే అతడు కూడ ఏకాగ్రతాభంగం పొందుతాడు.

సహజమే కదా!

తాను అన్యత్ర సందర్శిస్తున్న వ్యవస్థకనుగుణంగా తన్ను మాత్రమే కాక రాజ్యాలను, వ్యక్తులను, మానవస్వభావాన్ని దిద్దితీర్చవలసినవిధి ఏర్పడినప్పుడు అతడు న్యాయం, నిగ్రహం, పౌరగుణం చక్కగా మలచలేడా?

ఎందుకు మలచలేడు?

అతన్ని గూర్చి మనంచెబుతున్నది యథార్థమని గ్రహిస్తే లోకం తత్త్వశాస్త్రంపై కినుకవహిస్తుందా? దివ్యస్వరూపాన్ని అనుకరించే చిత్రకారులచే చిత్రితింకాని ఏ రాజ్యం కూడ సుఖవంతం కాదని చెబితే లోకులు మనలను విశ్వసించరా?

అర్థంచేసికొంటే వారు కినుకవహించరు. కాని, మీరుచెబుతున్న ఆలేఖ్యాన్ని ఎలాచిత్రిస్తారు?

శిల్పి శిలాఫలకాన్ని స్వీకరించి దానిమీదఉన్నబొమ్మను తుడిచివేసి

శుభ్రపరుస్తాడు. అలాగే వారుకూడ రాజ్యాన్ని, మానవులఅలవాట్లను గ్రహించి వాటిని పూర్తిగా తుడిచివేస్తారు. ఆపని అంత తేలిక కాదు. తేలిక అయినా కాకపోయినా వారు ప్రారంభిస్తారు. అయితే వారికీ ఇతరశాసనకర్తకూ ఇక్కడ భేదమేర్పడుతున్నది. వ్యక్తితో గాని, రాజ్యంతో గాని వారికి నిమిత్తంలేదు. ఉపరిభాగం స్వచ్ఛంగా తయారు కావించేటంతవరకు వారు దానిమీద ఏ చట్టాలూ చెక్కరు.

మంచిపని చేస్తున్నారు.

ఈపని చేసినతరువాత రాజ్యాంగవిధానస్థూలరూపం చెక్కటానికి ఉపక్రమిస్తారా?

సందేహమేమున్నది?

తమపనిని పూర్తిచేస్తున్నప్పుడు వారు దృష్టిని మీదికి, క్రిందికి ప్రసరింప జేసారు. అంటే పరమన్యాయసౌందర్యనిగ్రహాలవంక ముందుచూచి తిరిగి మానవప్రతీకంవంక చూస్తారు. వివిధజీవితాంశాలను మానవునిబింబంలో మిళితంచేస్తారు. ఈ విధంగా వారు ఆ బింబానికనుగుణంగా భావిస్తారు. మానవులలో ఆ బింబం వర్తిల్లుతున్నప్పుడు దానిని హోమర్ ఈశ్వరాకారమనీ భగవత్సదృశమనీ పేర్కొన్నాడు.

యథార్థం.

సాధ్యమైనంతవరకు మానవమార్గాలు ఈశ్వరమార్గాలకు సమ్మతాలయ్యేటంతవరకు ఒకలక్షణాన్ని తుడిచివేసి వారు మరొకలక్షణం కల్పిస్తుంటారు.

అవును. సుందరచిత్రం మరొకవిధంగా చిత్రించలేరు.

రాజ్యాంగవిధానచిత్రకారునకు రాజ్యం అప్పగించినందుకు ప్రతిపక్షులు మనలను కోపించారు. ద్వేషించారు. కాని అతడు ఇంతశ్లాఘ్యుడని, చెబుతున్నమనమాటలందు ఆ వ్యక్తులకు విశ్వాసం కలుగుతుందా? విన్నదానితో వారిఉద్వేగం చల్లారుతుందా?

వివేకం ఉంటే చల్లారాలి.

ఆక్షేపణకు ఇంకా ఆస్కారం ఎక్కడ ఉన్నది? తత్త్వవేత్త సత్పదార్థ ప్రణయి అంటే వారింకా సందేహిస్తారా?

అంత వివేకవిహీనులు కారు.

కాక మనమభివర్ణించిన ప్రకృతి ఉత్తమోత్తమభద్రతకు సదృశమన్నది. సంశయాస్పదమా?

లేదు.

అయితే మరి అలాంటి అనుకూలస్థితిగతులను కల్పించినప్పుడు అది పరమ శివంగా ప్రజ్ఞావంతంగా ఉండదంటారా? లేక, మనం తిరస్కరించిన వారినే వారు అభిమానిస్తారా?

అలా ఎన్నటికీ జరుగదు.

తత్త్వవేత్తలు రాజ్యభారం వహిస్తేతక్క రాజ్యాలు, వ్యక్తులు అనర్థవిమోచనం పొందరన్న మాటకు వారు కోపిస్తారా? లేక, మనకాల్పనికరాజ్యం ఎన్నడూ సిద్ధించేది కాదంటారా?

వారంతగా కోపించరనుకొంటాను.

కోపముడిగి సౌమ్యులై మనవాదం ఒప్పుకొనకపోతే సిగ్గుపడవలసివస్తుంది. కాబట్టి వారు అంగీకరిస్తారని భావించవచ్చునా?

నిరభ్యంతరంగా

అయితే రాజీకుదిరిందనుకొందాము. రాజకుమారులు కాని, యువరాజులు కాని తాత్త్వికులు కావచ్చునని అన్నాము. దీనిసెవరైనా నిరాకరిస్తారా?

మానవుడెవడూ నిరాకరించడు.

అలాంటివారు అవతరిస్తే వారు భ్రష్టులు కాకతప్పదని ఎవరైనా అంటారా? భ్రష్టులను కానీక వారినికాపాడటం కష్టమని మనమూ అంగీకరించాము. కాని అసంఖ్యాకయుగాలలో భ్రష్టుడుకానివాడు ఒక్కడూ ఉండడని ఎవడు సాహసించి చెప్పగలడు?

చెప్పలేడు.

అయితే అట్టివాడు ఒకడున్నా చాలు. తనసంకల్పాన్ని శిరసావహించే రాజ్యమున్నవాడు ఒకడున్నాడేపో. అతడే లోకులకు అసంభావ్యమైన ఈ ఆదర్శరాజ్యవిధానం వాస్తవంగా నెలకొల్పవచ్చును.

అవును, ఒకడుంటే చాలును

ఆ పరిపాలకుడు మనవర్ణించినచట్టాలను, సంస్థలను విధించవచ్చును. పౌరులు అతని ఆజ్ఞాపాలనకు సమ్మతించవచ్చును.

అవును.

అలాంటప్పుడు మనము ఆమోదించినదానిని ఇతరులు ఆమోదించటం విచిత్రం కాదు; అసంభవమూ కాదు.

అవును.

ఇదంతా సాధ్యమైతే నిశ్చితంగా పరమశ్రేయోదాయకమని ఇంతకు ముందు నిరూపించాము.

నిజమే.

మనచట్టాలను విధించగలిగితే పరమశ్రేయస్సు కలుగుతుందని మాత్రమే కాక వాని ఆచరణం కష్టసాధ్యమైనా అసాధ్యంమాత్రం కాదని చెబుతున్నాము.

అవును.

ఇంతకూ అష్టకష్టాలుపడి ఒకవిషయంలో ఒడ్డుచేరుకొన్నాము. కాని, చర్చించవలసినది ఇంకాచాల ఉన్నది. రాజ్యాంగవిధానసంరక్షకులు ఏ విధంగా ఏ విద్యలవల్ల ఏ వృత్తులవల్ల తయారవుతారో, ఏ వయస్సులో విభిన్నశాస్త్రాధ్యయనం సాగించవలసిఉంటుందో నిర్ణయించవలసి ఉన్నది.

అవును.

స్త్రీజనప్రాప్తి, శిశూదయం, పాలకనియామకం — ఇవి క్లిష్టసమస్యలు. వీటిని ప్రథమంలో వదలివేశాను. ఎందుకంటే పరిపూర్ణరాజ్యం అనగానే ఈర్ష్య బయలుదేరుతుంది. ఆసమస్యల పరిష్కారం దుష్కరమని నాకు తెలుసు. అయినా నేను వాటిని చర్చించవలసి వచ్చింది. దారసుతాదులసమస్యను తేల్చివేశాము. పాలకులసమస్యను మాత్రం మొదటినుంచి పరిశీలించాలి. వారు దేశభక్తులు కావాలి. సుఖదుఃఖాలు కల్పించి వారిని పరీక్షించాలి. ఎలాంటికష్టాలలో, విపత్తులలో వారిదేశభక్తి కుంఠితం కారాదు. ఈపరీక్షకు ఆగలేనివారిని నిరాకరించాలి. అగ్నిసంతప్తమైనస్వర్ణఖండములవలె సంతప్తులై విశుద్ధిని ప్రకటించిన వారిని పాలకులను చేయాలి. వారికి ఆమరణమూ, మరణానంతరమూ గౌరవసత్కారాలు జరగాలన్నాము. ఆ తరువాత ఇప్పుడుబయలుదేరిన ప్రశ్నను రేకెత్తించుట కిష్టపడక వాదం మరొకమార్గంపట్టింది.

అవును. చక్కగా గుర్తుకువచ్చింది.

ఆ తరువాత సాహసించి ఈమాటచెప్ప లేకపోయాను. అయితే ఇప్పుడు తెగించి చెబుతాను. పరిపూర్ణుడైనసంరక్షకుడు తాత్త్వికుడు కావాలి.

సరే, అలాగే.

ఇంతకూ అలాంటివారు పెక్కురుంటారని భ్రాంతిపడవద్దు. వారికి అవశ్యంఉండాలని మనం ఏకరువుపెట్టినగుణాలన్నీ ఒకచోట వర్ధిల్లటం అరుదు. వానిలో ఒకకొన్ని కొలదిగ లభిస్తవి.

అంటే మీతాత్పర్యం ?

ఘుటితిగ్రహణం, ప్రబలధారణ, కార్యనైపుణ్యం, బుద్ధిచాతుర్యం మున్నగాగలగుణాలు తరచుగా ఒకచోట వర్ధిల్లవు. ఈ గుణాలుగలిగి ఉత్సాహౌదార్యాలున్నవ్యక్తులు స్వభావసిద్ధంగా క్రమబద్ధజీవనులు, శాంతియుతులు, దృఢాచారులు కారు. ఉద్వేగాలకులోనై ఏ మార్గమైనా పట్టవచ్చును. అలా జరిగినప్పుడు స్థితప్రజ్ఞత్వమే వారియందు లోపిస్తుంది.

యథార్థం.

అలాకాక దృఢప్రకృతులు, సదావిశ్వసనీయులు, యుద్ధభీతిరహితులు విషయగ్రహణంలో మందమతులు కావచ్చును. అలాంటప్పుడు వారు జడావస్థయందుండి మానసికశ్రమ చేయవలసివస్తే ఆవులించి నిద్ర పోవచ్చును.

నిజమే.

అయితే ఉత్తమవిద్యాగ్రహణయోగ్యులకు ఈ ఉభయగుణాలు ఆవశ్యకమని చెబుతున్నాము.

అవును.

అలాంటివారు అరుదు కాదా ?

నిజమే.

అభ్యర్థికి పూర్వం పేర్కొన్న సుఖదుఃఖప్రమాదశ్రమలుకల్పించి పరీక్షించాలి. అంతేకాదు. వివిధరీతులైన జ్ఞానములందు పరీక్షపెట్టి అన్నిటికంటె ఉత్తమపరీక్షలో ఆత్మ నెగ్గుతుందో మూర్ఛిల్లుతుందో చూడాలి.

పరీక్షించటం మంచిదే. అయితే ఉత్తమపరీక్ష అంటే మీతాత్పర్యం ?

నీకు గుర్తుండవచ్చును. మనం ఆత్మను మూడుభాగాలుగ విభజించి న్యాయ-నిగ్రహ ధైర్యప్రజ్ఞల స్వరూపంగా గుర్తించాము.

అవును. ఈ మాత్రం జ్ఞప్తి లేకపోతే నాకింక వినేయోగ్యతే లేదనాలి.

ఈ చర్చాప్రారంభానికిముందు మనమనుకొన్నమాట గుర్తున్నదా?

ఏమాట?

వాని పరమసౌందర్యం వీక్షించాలంటే చుట్టుత్రోవను పోవలసి ఉంటుంది. కాని, అంతకుముందు సాగించినవాదసరణిని అనుసరించినా వానిస్థూలరూపం చూడవచ్చునని అన్నాను. ఆ స్థూలరూపసందర్శన నిరూపణం చాలునని నీవన్నావు. అందువల్ల మనపరిశీలనం నాదృష్టిలో అనిష్కృష్టకంగా నడిచింది. మరి అది సంతృప్తికరంగా ఉన్నదో లేదో నీవే చెప్పాలి.

సంతృప్తికరంగానే ఉన్నదనుకొన్నాను. ఇతరులూ అలాగే భావించారు.

ఇలాంటివిషయాలలో సమగ్రసత్యం కావాలి. దీనికి ఏమాత్రం భిన్నమైనా అది ప్రమాణం కాదు. ఎందువల్లనంటే అసమగ్రమైనది ఏదీ దేనికీ ప్రమాణం కాదు. అయితే వ్యక్తులు అసమగ్రమైనదానితోనే సంతృప్తి పొంది అన్యప్రమాణంకోసం వెదకనక్కరలేదనుకోవచ్చును. అది వేరే సంగతి.

అవును. అలసులకిది క్రొత్త కాదు.

నిజమే కాని, రాజ్యాన్నీ చట్టాలనూ సంరక్షించేవానిలో ఇంతకంటె ఘోరదోషం మరొకటి ఉండదు.

నిజమే.

సంరక్షకుడు సుదూరమార్గమనుసరించి వ్యాయామవిషయంలో శ్రమపడుతున్నట్లే జ్ఞానసముపార్జనంలో కూడ శ్రమపడాలి. లేకున్న తనవృత్తి కర్తవ్యమైన ఉత్తమోత్తమజ్ఞానం సంపాదించలేడు.

న్యాయాదిగుణజ్ఞానాన్ని మించిన ఉత్తమజ్ఞానమేమున్నది?

లేకేమి? ఉన్నది. గుణాలవిషయంలో కూడ కేవలం సంగ్రహరూపమే కాదు, సమగ్రరూపం లభించేటంతవరకు సంతృప్తి పొందరాదు. స్వల్ప విషయాలను వానిసమగ్రసౌందర్యదర్శనంకోసం అత్యంతవిస్పష్టతకోసం ఎంతో శ్రమపడి విశదీకరిస్తున్నాము. మరి, పరమసత్యస్వరూపాన్ని యథాతథంగా గ్రహించాలన్నవిషయం మరచిపోవటం ఎంత హాస్యాస్పదం!

ఇది ఉత్తమభావమే. కాని, ఇంతకూ ఉత్తమోత్తమజ్ఞానమేదో అడగక మానుకొంటామనుకొంటున్నారా?

లేదు. ఇష్టమైతే అలాగే అడగండి. కాని, ఈ ప్రశ్నకు సమాధానం మీరెన్నోపర్యాయాలు విన్నారు. వన్ను మీరర్థం చేసికొనకపోవాలి. లేదా నాకు క్లేశం కల్పింతామని అనుకొని ఉండాలి. ఎందుకంటే శివభావమే (The idea of good) ఉత్తమోత్తమజ్ఞానమని తరుచు చెబుతూ వచ్చాను. దీనికి ఉపయోగపడితేనే తక్కినవిషయాలు ప్రయోజనకారులు, లాభకారులు అవుతున్నవి. నేను చెప్పబోతున్నఅర్థం మీరెరుగనిదికాదు. లోగడ ఎన్నోసార్లు చెప్పగ వినిఉంటారు. దీనిని గూర్చి మనకు తెలిసినది స్వల్పం. ఈ జ్ఞానం తక్క మరి ఏ జ్ఞానం ఉన్నా, ఏ కలిమి ఉన్నా ప్రయోజనం లేదు. శివత్వంవినా ఇతరార్థాలెన్ని ఉన్నా మనకు ప్రయోజనమున్నదంటారా? సౌందర్యశివత్వజ్ఞానంలేకపోయినా తక్కినసమస్త పదార్థజ్ఞానం ఉపయోగపడుతుందంటారా?

లేదు.

అత్యధికసంఖ్యాకులు సుఖమే మేలంటారు. బుద్ధిమంతులు జ్ఞానం మేలంటారని మీకు తెలుసుగదా?

అవును.

అయితే ఈ బుద్ధిమంతులు జ్ఞానమంటే మీతాత్పర్యమేమని ప్రశ్నిస్తే వివరించలేరు. కాని, తుదికి శివత్వజ్ఞానమని వారు ఒప్పుకోవలసివస్తుందని తెలుసుగదా?

ఎంత హాస్యాస్పదం!

అవును. మనకే శివత్వజ్ఞానం లేదని ముందు ఉపాలంభిస్తారు తరువాత 'శివము' అంటే శివజ్ఞానమని నిర్వచిస్తారు.

అది యథార్థం.

సుఖమే శివమని చెప్పేవారు ఇంత తికమకలకులోనవుతున్నారు. ఎందువల్లనంటే సత్సుఖాలతోపాటు దుష్టసుఖాలు కూడ ఉన్నవని ఆమోదించవలసివస్తున్నది.

అంతేగా.

అలా అంగీకరించటమంటే మంచిచెడుగులు ఒకటేనని ఒప్పుకోనటమే కదా?

అవును.

ఈ ప్రశ్న అతిక్లిష్టం. ఇందు సందేహం లేదు.

అవును.

యథార్థంగా న్యాయవంతం, గౌరవప్రదం కాకపోయినా న్యాయవంతం వలె గౌరవప్రదంవలె కనిపించేదానిని ప్రచారించటానికీ ఆర్జించటానికీ పెక్కురు ప్రయత్నిస్తున్నారు. అయితే వారిలో ఎవరూ శివాభాసంతో సంతృప్తిపడరు. యాథార్థ్యమే వారు అన్వేషిస్తున్నారు; కాంక్షిస్తున్నారు. అద్దానిఆభాసం ఎల్లవాడు ద్వేషిస్తున్నాడు.

నిజమే.

ప్రతివాని అన్వేషణకూ కర్మకలాపానికీ ఇదే లక్ష్యం. ఇలాంటిలక్ష్యం ఒకటిఉన్నదని ప్రతివాడు గుర్తిస్తున్నాడు. కాని, ఇతరవస్తువులస్వభావం గ్రహించినట్లు దీనిస్వభావం గుర్తింపలేకపోతున్నాడు. అన్యజ్ఞానమం

దున్న నిశ్చితత్వం ఈ జ్ఞానమందు పొందలేకపోతున్నాడు. అందువల్ల సంశయగ్రస్తుడై ఇతరవస్తువులయందలి మేలును కోలుపోతున్నాడు. ఇంత ముఖ్యమైన ఈవిషయంలో రాజన్యశ్రేష్ఠులై సర్వవిషయాలకు అధినేతృత్వంవహిస్తున్నవ్యక్తులు అజ్ఞానాంధులుగా ఉండవచ్చునా?

నిశ్చితంగా ఉండరాదు.

రమణీయార్థాలు, న్యాయ్యాలు ఎలా శివంకరాలో తెలియనివాడు వానికి శోచనీయసంరక్షకుడవుతాడు. శివమంటే తెలియనివానికెవనికీ వాని యథార్థజ్ఞానం ఉండదని నా అనుమానం.

మీ అనుమానం వివేకప్రతిపన్నం.

ఇలాంటి జ్ఞానసమన్వితుడైనసంరక్షకుడుంటే మనరాజ్యం సమగ్రవ్యవస్థ పొందుతుంది కదా?

అవును. అయితే శివమన్న ఈ ఉత్తమోత్తమమాత్రం జ్ఞానమా, సుఖమా? ఈ రెంటికంటె భిన్నమా?

ఆలా అడుగు. తనివియెరుగని నీవంటి పెద్దమనిషి ఈ విషయాలలో ఇతరుల అభిప్రాయంతో సంతృప్తిపొందడని మొదటనుంచి నాకు తెలుసు.

సోక్రటిస్! జీవితమంతా తత్త్వార్థానుశీలనంతో గడపిన మీవంటివ్యక్తి నిరంతరం ఇతరుల అభిప్రాయాలను పునశ్చరణం చేస్తూ తన అభిప్రాయం మాత్రం ఎన్నడూ చెప్పకపోవటం తగదు.

మరి తనకు తెలియనిదానిని చెప్పటానికి ఎవరికైనా అధికారం ఉన్నదంటావా?

లేదు. నిశ్చితంగా ఇంతేనని చెప్పరాదు. ఆ అధికారం అతనికి లేదు. కాని, అభిప్రాయమాత్రంగా తనకు తెలిసినదానిని చెప్పవచ్చును.

కేవల అభిప్రాయమాత్రాలు దుష్టాలనీ అందులో ఉత్తమాలు కూడా

అంధాలనీ మీకు తెలియదా? జ్ఞానశూన్యఅభిప్రాయులు అంధతుల్యులు. కాదని దీనిని నీవు నిరాకరించలేవు.

నిజమే.

ఇతరుడు ఏది వెలుగో ఏది సొగసో చెబుతున్నప్పుడు నీవు దానిని వదలి నీచాంధకుటిలార్థం సందర్శించగోరుతావా?

గ్లాకన్ లంకించుకొన్నాడు:— సోక్రటిస్! మిమ్మ ప్రార్థిస్తున్నాను. గమ్యం చేరుకోబోతున్న సమయంలో వెనుకకు మరలకండి. న్యాయం, నిగ్రహం మున్నగాగలిగినగుణాలను వివరించినంతమాత్రంగా శివాన్ని గూడ మీరు వివరిస్తే సంతృప్తిపొందుతాను.

నిజమే, మిత్రమా! నాకు గూడ కనీసం ఆమాత్రపుసంతృప్తి కలుగుతుంది. కాని, నేను విఫలుడనవుతాను, వివేకరహితమైన నా ఉత్సాహం నన్ను పరిహాసభాజనుని చేస్తుందన్నభయం విడిచిపెట్టకున్నది. దయచేసి ప్రకృతానికి 'శివస్వభావమేమిటి?' అని ప్రశ్నించవద్దు. ఎందుకంటే నాభావం అందుకోవాలంటే శక్తికిమించినయత్నం కావలసివస్తుంది. అయితే శివసదృశమైన శివసంతతిని గూర్చి మీకు వినాలనిఉంటే మహారాజులాగా చెబుతాను. లేకపోతే లేదు.

అయితే ఆ బిడ్డను గూర్చే చెప్పండి. కాని తజ్జనక వృత్తాంతకథనం మాకు ఋణపడి ఉంటారని మాత్రం మరచిపోవద్దు.

కర్తవ్యమైతే ఆ ఋణం తీర్చుకోవాలనే ఉన్నది. ఇప్పటికి మాత్రం బిడ్డను గూర్చి చెబుతాను. అసలుకు వడ్డీగ దీనిని స్వీకరించండి. మిమ్మ వంచించాలన్నఅభిప్రాయం నాకు లేదు. అయినా నేను తప్పుడువృత్తాంతం చెప్పకుండా చూడవలసినబాధ్యత మీదే.

అలాగే. సాధ్యమైనంతజాగ్రతి వహిస్తాము. ప్రారంభించండి.

ముందు మీతో ఒకఒడంబడిక ఏర్పరుచుకోవలసి ఉంది. ఈ చర్చాసందర్భంలోను తదితరసందర్భాలలోను నేను లోగడచెప్పినదానిని మరొక

సారి గుర్తుకు తెచ్చుకోండి.

ఏదంటారు ?

ఏమున్నది ? ప్రాతకథే! రమణీయార్థాలు అనేకాలు. శివములూ అనేకాలు. ఇలాగే మనం అభివర్ణించి నిర్వచించిన ఇతరార్థాలు. వాటన్నిటికీ అనేకత్వం అన్నవిశేషణం ప్రయోగింపబడుతున్నది.

అవును.

పరమరామణీయకం, పరమశివత్వం—ఇలాగే అనేకమని చెప్పబడే ప్రతి అర్థానికి పరమరూపం ఒకటి ఉంటున్నది. ఎందువల్లనంటే వాటినన్నిటిని ఒకేభావంక్రింద వర్గీకరించవచ్చును. దీనినే తత్త్వం (Essence) అంటాము.

అవును.

అనేకాలు దృష్టాలే కాని, జ్ఞాతాలు కావు. భావాలు జ్ఞాతాలే కాని, దృష్టాలు కావు.

సరిగా అంతే.

మరి దృశ్యవస్తువులను ఏ ఇంద్రియంతో చూస్తున్నాము ?

దృష్టితో.

శ్రవణంతో శ్రవ్యమూ, ఇతరఇంద్రియాలతో ఇతరవిషయాలు పొందుతున్నాము.

అవును.

ఇంద్రియస్రష్ట కావించినసృష్టిలో దృష్టి అత్యంతం అమూల్యమూ చిత్రము. ఇది నీకెన్నడూ స్ఫురించలేదా ?

లేదు.

అయితే ఒకసారి ఆలోచించు. చెవి వినాలన్నా, శబ్దం వినబడాలన్నా మరొక ప్రకృతిసాయం అపేక్షిస్తుందా?

లేదు.

నిజంగా అపేక్షించదు. ఇదే ఇతరఇంద్రియాలలో పెక్కింటికి అన్వయిస్తుంది. అంటే వానిలో ఏదీ అన్యసహాయం అపేక్షించదంటావు.

నిశ్చితంగా అంతే.

కాని, మరొకప్రకృతిసాయంలేక దృష్టీ లేదు, దృశ్యతా లేదు.

అంటే మీతాత్పర్యం?

చూపు కన్నులలో ఉంటుంది. వర్ణం వస్తువులలో ఉంటుంది. మరొక ప్రకృతిసాయం లభిస్తేతప్ప చక్షుష్మంతునికేదీ కన్పించదు. వర్ణాలు దృగ్గోచరాలు కావు.

మీరు ఏ ప్రకృతిని గూర్చి చెబుతున్నారు?

వెలుగు అని మీరు పేర్కొంటున్నారే దానిని గూర్చే ముచ్చటిస్తున్నాను.

అవునవును.

దృష్టినీ దృశ్యతనూ వియ్యమందిస్తున్న ఈఅనుబంధం ఉదాత్తం. తక్కిన అనుబంధాలకంటె ఇది గొప్పది. దృగ్దృశ్యసంధాత తేజస్సు. ఈ తేజస్సు క్షుద్రం కాదు గదా?

నిస్సంశయంగా అక్షుద్రమే కాదు, ఉదాత్తం.

ఏ దైవం ఈ ద్రవ్యానికి అధినేత? చక్షుస్సునకు దర్శనశక్తినీ, దృశ్యార్థానికి దృశ్యతనూ ప్రసాదిస్తున్న ఈ తేజస్సంతుదెవరు?

ఎవరేనున్నది? సూర్యుడు. మీరూ మానవలోకం అలాగే చెబుతున్నారు కదా!

దృష్టికీ సూర్యభగవానునకూ ఉన్నసంబంధం ఈ విధంగా అభివర్ణించవచ్చునా?

ఏ విధంగా?

దృష్టి కాని, తదధివాసమైన చక్షువు కాని సూర్యుడు కాదు.

అవును.

ఇంద్రియాలన్నిటిలో చక్షువే సూర్యసదృశం.

అవును.

చక్షుశ్శక్తియైనదృష్టి సూర్యప్రసాదితమైన విశిష్టనిష్యందమే కదా?

అవును.

అలాంటప్పుడు సూర్యుడు దృష్టి కాదు. దృష్టిచే గ్రహింపబడుతున్న దృష్టికర్త.

అవును.

ఇతనినే నేను శివత్వం కన్నకాన్పు అంటున్నాను. శివతత్త్వం ఆత్మాకృతి గల ఇతనిని దృశ్యప్రపంచంలో నిల్పటంకోసం కన్నది. జ్ఞానలోకంలో మనస్సునకూ, మానసికవిషయాలకూ శివతత్త్వమెట్టిదో దృశ్యప్రపంచంలో దృగ్దృశ్యాలకు సూర్యుడట్టివాడు.

మీ తాత్పర్యం మరికొంత విశదపరుస్తారా?

తారకలకాంతి మాత్రమే పడుతున్న వస్తువులపై ఏ వ్యక్తి అయినా తనదృష్టిని సారించినపుడు అవి మసకమసకగా కనిపిస్తవి. ఆ కన్నులకు దృష్టివిస్పష్టత లేనట్లు గోచరిస్తుంది.

అవును.

ఆ కన్నులే సూర్యరశ్మి పడుతున్నవస్తువులకభిముఖాలైనప్పుడు విస్పష్టంగా చూస్తవి. వాటికి దృష్టి ఏర్పడుతున్నది.

అవును.

ఆత్మ కూడ ఆ చక్షువువంటిది. సత్యం, సత్త దేనిపై ప్రసరిస్తున్నవో అద్దానిపై ఆధారపడినప్పుడు ఆత్మ దర్శిస్తుంది, గ్రహిస్తుంది. జ్ఞానంతో భాసిస్తుంది. వికారివిశ్వమనే మునిమాపుచీకటికి అభిముఖమైనప్పుడు ఆత్మకు అభిప్రాయం మాత్రమే కలుగుతుంది. అప్పుడది చీకరిస్తుంది. మొదట ఒకఅభిప్రాయం, తరువాత వేరొకఅభిప్రాయం పొందుతూ జ్ఞానవిరహితం వలె కనిపిస్తుంది.

అవును, అంతే.

జ్ఞానానికి సత్యత్వం, జ్ఞాతకు జ్ఞానశక్తి ఒసగునది శివభావమే. శాస్త్ర జ్ఞానాలకు విషయమైనసత్యానికి ఇదే కారణం. సత్యమూ జ్ఞానమూ రమణీయాలు. కాని, ఈ రెంటికంటె శివభావం రమణీయతరం. ఇంతకుముందు తేజస్సు, దృష్టి సూర్యునివంటివన్నాము. అయితే అవి సూర్యుడు కాదన్నాము. అలాగే ప్రకృతవిషయంలో కూడ జ్ఞానమూ సత్యమూ శివతత్త్వమువంటివని భావించవచ్చును. అయితే అవి శివతత్త్వం కాదు. శివతత్త్వం వానికంటె ఉత్తమం.

జ్ఞానానికీ సత్యానికీ కారణభూతమై వానికంటె రమణీయతరమైనది ఎంతటి అద్భుతరామణీయకం కావాలి! అయితే సుఖమే శివతత్త్వమని మీ తాత్పర్యం కాజాలదు కదా?

శాంతం పాపం! ఈ బింబాన్ని మరొకదృక్పథంనుంచి పరిశీలించండని కోరవచ్చునా ?

ఏ దృక్పథంనుంచి ?

సమ్యజ్ఞాతవస్తువుల దృశ్యతకు మాత్రమేకాదు వాని సత్తాతత్త్వాలకూ ఉత్పాదనపోషణాభివృద్ధులకూ సూర్యుడు కారణమాతున్నాడు. అయితే అతడు ఉత్పాద్యుడు కాడు.

అవును.

అట్లే సర్వజ్ఞాతవస్తువుల జ్ఞానానికే కాక వానిసత్తాతత్త్వాలకు గూడ శివతత్త్వం కారణమాతున్నది. అయితే శివం కేవలతత్త్వం (Essence) కాదు. ఉదాత్తతాశక్తులందు ఆ తత్త్వాన్ని శివం ఎంతో అతిశయిస్తున్నది.

"ఎంతవిచిత్రం!" గ్లాకన్ పరిహాసకాసక్తితో అన్నాడు.

అయితే ఈ అతిశయోక్తికి బాధ్యత అంతా నీదే. ఎందువల్లనంటే నా ఊహలను చెప్పించింది నీవే.

దయచేసి ఆపకండి. మీ ఊహలు చెప్పండి. సూర్యునిసాదృశ్యాన్ని గూర్చి ఇంకా చెప్పవలసినదేమైనాఉంటే వినిపించండి.

అప్పుడే ఎక్కడ ముగిసింది? చెప్పవలసినది ఇంకా ఎంతో ఉన్నది.

అయితే ఏ కొంచెమున్నా వదలిపెట్టకండి.

శక్తివంచనలేక యత్నిస్తాను. ఇంతకూ చాలభాగం వదలివేయవలసి ఉంటుందనుకొంటాను. మీరు పాలకశక్తులను రెంటిని ఊహించాలి. ఒకటి జ్ఞానలోకంలోను (Intellectual world), రెండవది దృశ్యప్రపంచంలోను ఉంటవి. మొదటిదానిని దివ్యమనిపేర్కొనను. ఎందువల్లనంటే ఆపదాన్ని నేను శ్లేషిస్తున్నానని మీరు అపోహపడవచ్చును.

ఇంతకూ దృశ్యజ్ఞానప్రపంచాల భేదం నీమనస్సులో నాటుకొన్నది కదా?

ఆఁ.

ఒకరేఖను గ్రహించి రెండు అసమానభాగాలుగా విభజించు. ఆ ఒక్కొక్కభాగాన్ని తిరిగి అలాగే విభజించు. ప్రధానభాగద్వితయంలో ఒకటి దృశ్యప్రపంచానికీ రెండవది జ్ఞేయప్రపంచానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నవనుకో. ఇప్పుడు ఉపభాగాల స్పష్టాస్పష్టతలతారతమ్యం పరిశీలించిచూడు. దృశ్యప్రపంచంలోని మొదటి ఉపభాగం ప్రతీకమయం. ప్రతీకాలంటే ప్రథమంగా ఛాయలనీ, ద్వితీయంగా జలస్ఫటికాదికంలో కనిపించే ప్రతిబింబాలనీ నాతాత్పర్యం. బోధపడిందా?

ఆఁ.

మొదటి ఉపభాగం రెండవ ఉపభాగానికి ప్రతీకం. ఈ రెండవ ఉపభాగంలో మనం చూచే జంతువులు, ఎల్లప్రవర్ధమానవస్తువులు, లేదా సృష్టవస్తువులు చేరుతవి.

సరే.

ఈ విభాగానికి చెందిన రెండు ఉపభాగాలకు సత్యతాతారతమ్యం ఉన్నది. జ్ఞానంతో అభిప్రాయానికి ఉన్నసంబంధమే మూలంతో పుత్రికకు ఉన్నది. దీనిని అంగీకరిస్తున్నావా?

నిస్సంశయంగా.

జ్ఞేయక్షేత్రవిభాగం ఎలాకావించాలో పరిశీలించు.

ఏ విధంగా విభజించాలంటారు?

ఎలాగంటావా? జ్ఞేయక్షేత్రం రెండు ఉపభాగాలవుతున్నది గదా! ఈ రెంటిలో అధోగతమైన ఉపభాగం మొదటిభాగంలోని రెండవ ఉపభాగం

చేత సంప్రాప్తాలైన ఆకృతులను ఆత్మప్రతీకాలుగా వాడుకొంటుంది. ఈ విచారం సోపాధికం (Hypothetical). పైకిపోయి మూలతత్త్వం అన్వేషించటానికి బదులు ఆత్మ క్రిందికి (మొదటివిభాగంలోని రెండవ ఉపభాగానికి, అంటే ఛాయలకు మూలమైనజంత్వాదిలోకానికి) దిగుతుంది. ఈ ద్వితీయభాగంలోని ఉన్నతతరమైన ఉపభాగంలో ఆత్మ ఉపాధులనధిగమించి నిరుపాధికమైన మూలతత్త్వాలకు పోతుంది. క్రింది ఉపభాగమందువలె ఇందు ఆత్మ ప్రతీకాలను ఆశ్రయించక భావాల ద్వారా మూలతత్త్వానికి పోతుంది.

మీ తాత్పర్యం సరిగా బోధపడలేదు.

మరొకసారి విశదీకరణకు ప్రయత్నిస్తాను. ఉపక్రమణికగా కొన్నివిషయాలు చెబితే నా తాత్పర్యం సుబోధమవుతుంది. రేఖాగణితం, అంకగణితం—ఇలాంటి శాస్త్రార్థాలు అభ్యసించేవారు సమత్వవిషమత్వాలు, అంకెలు, త్రివిధకోణములు మున్నైనవాటిని గ్రహిస్తారు. ఇవి వారి విచారానికి ఉపాధులు (Hypotheses). ఇవి ఎల్లవారికి తెలిసిన అర్థాలని వారు భావిస్తున్నారు. అందువల్ల వాటిని తమకోసం కాని, ఇతరులకోసం కాని వివరించరు. అయితే వాటితోనే ప్రారంభించి వారు బాధావిరహితంగా నిగమనసిద్ధిపర్యంతం చర్చసాగిస్తారు.

అవును. అలాగే చేస్తారు.

వారు దృశ్యాకృతులను ఉపయోగించుకొని చర్చిస్తున్నప్పటికీ వాటిని గూర్చి ఆలోచించరు. ఏ భావాలకివి సదృశాలో వాటినే ఆలోచిస్తున్నారు. వారు గీసే ఆకృతులను గాక పరమచతురస్రం, పరమవ్యాసం మున్నైనవాటిని గూర్చి ఆలోచిస్తారు. తాము గీసే ఆకృతులను ఛాయావంతములు జలగతస్వప్రతిబింబనములు అయిన ఆకృతులను వారు ప్రతీకాలుగా మార్చుకొంటున్నారు. అయితే జ్ఞానచక్షువుచే మాత్రమే చూడశక్యమైనవస్తువులను వారు నిజంగా చూడయత్నిస్తున్నారు.

అవును.

ఈ ఉపభాగంలో ఆత్మ ఉపాధులను మాత్రమే ఉపయోగిస్తున్నది కాని,

మూలతత్త్వానికి చేరుకోవటంలేదు. ఎందువల్లనంటే ఆత్మ ఉపాధిలోకాన్ని అధిగమించి పోలేకపోతున్నది. ఈ ఉపాధులకు క్రిందిలోకంలోనివస్తువులు ఛాయలు. ఏతల్లోకవస్తువులకు ఆ క్రిందిలోకంలోనివస్తువులు ఛాయలు. వస్తుచ్ఛాయలలో వస్తువులు స్పష్టతరాలు. కాబట్టి అధికార్థవంతాలు. ఇలాంటి ఉపాధులతో గూడినదానిని నేను జ్ఞేయమంటున్నాను.

అవును. అర్థమయింది. రేఖాగణితాన్ని గూర్చి తత్సోదరశాస్త్రాలను గూర్చి చెబుతున్నారు.

జ్ఞేయప్రపంచంలోని పరభాగాన్ని గూర్చి చెబుతున్నప్పుడు మరొకరకమైన జ్ఞానాన్ని గూర్చి చెబుతున్నానన్నమాట. ఇచట వివేకం తర్కశక్తిచే జ్ఞానం పొందుతుంది. ఇక్కడ ఉపాధులు ఉపాధులుగా మాత్రమే వినియోగింపబడుతవి కాని, మూలతత్త్వాలుగా వినియోగింపబడవు. ఉపాధిప్రపంచాన్ని అధిగమించిఉన్నలోకానికి ఈ ఉపాధులు సోపానాలు వీటిని అధిరోహించి సర్వస్వమూలతత్త్వంలో వివేకం (Reason) విహరిస్తుంది. దీనినుంచి దీనిపై ఆధారపడిన మరొకదానికి, ఆ మరొకదానినుంచి ఆమరొకదానిపై ఆధారపడినవేరొకదానికి, ఇట్లు క్రమికంగాఉన్న మెట్లననుసరించి దృశ్యవస్తుసహాయం లేకుండా భావాలనుంచి భావాలద్వారా భావాలయందు అది విరతిపొందుతుంది.

మీరు చెప్పింది బోధపడింది. అయితే సమగ్రంగామాత్రం కాదు. ఎందువల్లనంటే మీరు మహత్తరార్థం వర్ణిస్తూవచ్చినట్లు కనిపించారు. ఏది ఎలా ఉన్నా మీరు ఇలా చెప్పారనుకొంటున్నాను : తర్కశాస్త్రం గ్రహిస్తున్నజ్ఞానసత్తలు వృత్తివిద్యాప్రత్యయాలకంటె (the notions of the arts) స్పష్టతరాలు. ఈ ప్రత్యయాలు ఉపాధులనుండి మాత్రమే ఏర్పడుతున్నవి. ఇవి కూడ బుద్ధిచేతనే గ్రహింపబడుతున్నవి కాని, ఇంద్రియాలచే కాదు. అయినా ఇవి ఉపాధులనుంచి బయలుదేరుతున్న వే కాని, మూలతత్త్వాన్ని చేరుకొనటంలేదు. అందువల్ల వాటిని గ్రహిస్తున్నవారు మీమతంలో ఉన్నతతరమైనవివేకాన్ని వాటిపై ప్రయోగించటంలేదు. అయితే మూలతత్త్వం వానికి చేరిస్తే అవి ఉన్నతతరవివేకంచే గ్రాహ్యాలే అవుతవి. రేఖాగణితానికి తత్సోదరశాస్త్రాలకు సంబంధించినఆచారాన్ని మీరు బుద్ధి అని పేర్కొంటున్నారే కాని, వివేకమని చెప్పటంలేదను

కొంటాను. ఈ బుద్ధి మీమతంలో అటు అభిప్రాయానికీ ఇటు వివేకానికీ మధ్యస్థంగా ఉంటుంది. అంతేనా ?

అవును. నా తాత్పర్యాన్ని సరిగా గ్రహించావు. ఈ నాలుగువిభాగాలకు అనుగుణమైన నాల్గుశక్తులు ఆత్మకు ఉన్నవనుకో. ఉన్నతతమమైనదానికి అనుగుణమైనది వివేకం, రెండవదానికి బుద్ధి (understanding), మూడవ దానికి శ్రద్ధ, నాల్గవదానికి ప్రత్యక్షం అనుగుణాలైనశక్తులు. వీటితో కొలబద్ద ఏర్పాటుచేదాము. వివిధశక్తులకు వానివానివిషయాలయాథార్థ్యానికి అనుగుణమైనవిస్పష్టత ఉంటుంది.

మీ తాత్పర్యం బోధపడింది. మీవాదమంగీకరించి మీ ఏర్పాటు ఒప్పుకొంటున్నాను.

# ఏడవ ప్రకరణం

మనప్రకృతి ఎంతవరకు జ్ఞాతమో, లేదా ఎంతవరకు అజ్ఞాతమో దృష్టాంతం ద్వారా ఇప్పుడు ప్రదర్శిస్తాను. భూగర్భమందలి ఒకగుహలో మానవులు వసిస్తున్నారనుకో. ఈ గుహాముఖం వెలుగునకు అభిముఖమై నిడివిగా ఉన్నది. శైశవావస్థనుంచి వారిక్కడే ఉన్నారు. కాళ్ళకు మెడలకు సంకెళ్ళు ఉన్నవి. వాటివల్ల కదలలేరు. ముందుకే చూడగలరు గాని, తలలు వెనుకకుత్రిప్పి చూడలేరు. ఎగువన వారికి వెనుక కొంతదూరంలో పెద్దమంట మండుతున్నది. మంటకూ బందీలకూ నడుమ ఎత్తైన మార్గమున్నది. దానికెదురుగా తోలుబొమ్మలాటవారు తమకూ ప్రేక్షకులకూ నడుమ ఆట చూపటానికి కట్టే తెరవంటి ఎత్తులేని అడ్డుగోడ ఉన్నది.

ఉంటే?

నానావిధపాత్రలు, విగ్రహాలు, శిలాదారుమయాలైన జంతువులబొమ్మలు పట్టుకొని తెరవంటి గోడవెనుక నడుస్తున్నారనుకో. కొందరు మాటాడుతున్నారు. కొందరు మౌనం వహించారు.

విచిత్రదృష్టాంతం చూపించారు. నిజంగా వారు వింతబందీలు.

అవును మనలాగానే. మంటవెలుగువల్ల గుహఅడ్డుగోడమీదపడినతమ నీడలూ, పొరుగులనీడలూ మాత్రమే వారు చూస్తారు గదా?

అవును. తలలు త్రిప్పి చూడవీలులేనప్పుడు నీడలు తప్ప వారికి మరేమి కనిపిస్తవి?

మోయబడుతున్నవస్తువుల నీడలను మాత్రమే చూడగలుగుతారు.

అవును.

ఆ నీడలు ఒండొంటితో మాటాడుకోగలిగితే వాటిని నిజమైనవ్యక్తులను కోరా?

అవును.

కారాగారం రెండవదిశనుంచి ప్రతిధ్వని వస్తుందనుకో. ఆ మార్గాన పోతున్నవారు మాటాడినప్పుడు ఆ ధ్వని తమముందు నడుస్తున్ననీడనుంచి వచ్చిందనుకోరా?

అందు సందేహమేముంది?

అలాంటివారికి ప్రతీకచ్ఛాయలు తక్క మరొక యాథార్థ్యం కలుగదు గదా?

అవును.

మరి ఈ విషయంకూడ ఆలోచించు. బందీలను వదలిపెట్టి వారి మోహం తొలగిస్తే ఏమి జరుగుతుంది? వారిలో ఎవరినన్న విడుదలచేసి నిలబెట్టి మెడలు త్రిప్పి 'వెలుతురుదిక్కుగా నడవాలి, చూడాలి' అని నిర్బంధిస్తే వారు సూదులు గ్రుచ్చినట్లు బాధపడతారు. ఆ వెలుగు వారిని బాధిస్తుంది. తాము మున్ను చూచిన ఛాయలకు మాతృకలైన యథార్థవస్తువులను చూడలేరు. ఆ సమయంలో ఎవడైనా "నీవిదివరకు చూచినవి ఛాయలు మాత్రమే. ఇప్పుడు మూలవస్తువులకభిముఖంగా నడుస్తున్నావు. యథార్థసత్త కంటబడుతున్నది. ఇప్పుడు నీ చూపు స్పష్టతరం" అని అంటే అతడు ఏమని సమాధానం చెబుతాడు? విముక్తునితోపాటు ముందుకు నడుస్తూ ఉపదేష్ట తమ్ము గడచిపోతున్నవస్తువులను చూపి వాటిపేర్లను చెప్పమంటాడనుకో. విముక్తుడు దిగ్భ్రాంతుడు గాడా? తాను మున్ను చూచిన నీడలే తనకిప్పుడు ప్రదర్శింపబడుతున్నవాటికంటె యథార్థతరాలని భావించడా?

అవును.

'నీవు వెలుగువంక నేరుగా చూడాలి' అని అతనిని బలవంతపెడితే అతనికి కన్నులలో సూదులుగ్రుచ్చుకొన్నట్లై మొగం త్రిప్పుకొని తాను చూడ గలవిషయాలందే ఆసక్తివహిస్తూ తనకిప్పుడు చూపబడుతున్నవాటికంటె అవే స్పష్టంగా ఉన్నవనుకోడా ?

అవును.

ఇది గూడ ఊహించు. అతనిని బలవంతంగా ఏటవాలున ఎత్తుగాఉన్న మార్గాన ఎలాగో సూర్యుని వెలుగులోపలికి లాగుకొనివచ్చినప్పుడు బాధ, చికాకు పొందడా ? వెలుగు సమీపించినప్పుడు అతనికన్నులు మిరుమిట్లు గొంటవి. వస్తువులు ఏవీ అతనికప్పుడు కనిపించవు.

వెంటనే మాత్రం కనిపించవని అతడన్నాడు.

ఊర్ధ్వప్రపంచమందలి వెలుగునకు అతడు అలవాటుపడాలి. మొదట అతనికి ఛాయాప్రతిబింబవస్తువులలో పూర్వాపూర్వం స్పష్టతరంగా కనిపిస్తుంది. పగటివేళయందలి సూర్యసూర్యప్రభలకంటె రాత్రివేళయందలి చంద్రచంద్రికలు అతడు స్పష్టంగా చూడగలుగుతాడు.

అవును.

తుట్టతుదకు నీళ్ళలోని సూర్యునిప్రతిబింబమేకాక నేరుగా సూర్యునే అతడు చూడగలుగుతాడు.

అవును.

ఆ మీదటనే అతడు సూర్యునివలననే సంవత్సరాలు, ఋతువులు ఏర్పడుతున్నవంటాడు. అతడే దృశ్యమానప్రపంచానికి సంరక్షకుడని చెబుతాడు. తానూ తన అనుచరులూ దర్శించటానికలవాటుపడ్డ సర్వవస్తువులకు ఒకవిధంగా అతడే కారణమని వాదిస్తాడు.

అవును. ముందు సూర్యుని చూస్తాడు. తరువాత ఆ వాదానికి ఉపక్రమిస్తాడు.

అతడు తన పూర్వనివాసస్థానాన్నీ, తనకూ తన అనుచరులకూ కలిగిన గుహాంతరానుభవాన్నీ స్మరించినప్పుడు అతనిభావాలు ఎలాఉంటవి? తన అదృష్టానికి సంతోషిస్తూ తన పూర్వసహచరులపై జాలిపడడా?

నిశ్చితంగా అలాగే జరుగుతుంది.

గుహానివాసులలో తమ కన్నులముందు కదలిపోయేనీడలలో ఏవి ముందు పోయినవో, ఏవి తరువాత వచ్చినవో, ఏవి కలిసి ఉన్నవో ముందుగా గ్రహించగలిగి భవిష్యన్నిర్ణయాలు చేయగలిగినవారిని సత్కరించే ఆచారం ఉన్నదనుకో. ఇలాంటి గౌరవప్రతిష్ఠలకోసం అతడు ప్రాకులాడుతాడా? వాటిని పొందినవారిని చూచి ఈర్ష్యపడుతాడా? హోమర్ చెప్పినట్లు—

"చేత కాసుగల్గని దొరచెంతఁ జేరి
పేదబంటుగానైన సేవించుటొప్పు"

అని అతడనుకోడా? వారు ఆలోచిస్తున్నట్లు ఆలోచించటంకంటె వారి ఆచారాలను పాటించటంకంటె మరి ఎలాంటిదైనా మేలేనని భావించడా?

అవును. అతడేబాధలైనా పడటానికి ఒప్పుకొంటాడు కాని, ఇలాంటి అసత్యభావాలకు (notions), ఈ శోచనీయజీవనానికి ఏమాత్రం అంగీకరించలేడు.

ఈ వక్ష్యమాణస్థితి గూడ ఊహించు:— వెలుపలికి వచ్చి సూర్యదర్శనం చేసిన ఈ వ్యక్తి తన పూర్వస్థితిలో తిరిగి ప్రతిష్ఠాపితుడవుతాడనుకో.
అతనికన్నులు ఒక్కసారిగా చిమ్మచీకట్లుక్రమ్మవా? అంధకారబంధురాలు కావా?

అవును.

ఎన్నడూ గుహనుంచి కదలియెరుగనివారితో అతడు నీడలకొలతలలో పోటీపడవలసి వస్తుందనుకో. అతనిదృష్టి ఇంకా దుర్బలంగానే ఉన్నది. యథాపూర్వస్థితి ఏర్పడలేదు (ఆ స్థితి ఏర్పడాలంటే కొంతకాలం పడుతుంది కదా?). అలాంటప్పుడు ఆ పోటీలో అతనిస్థితి శోచనీయమే. ఇతరులేమంటారు? పైకి వెళ్ళివచ్చాడు. చూపు పోయింది.

కాబట్టి పైకెక్కిపోదామన్నతలపే మహాపాపమనుకొంటారు. మరెవ డన్నా ఇంకొకరిని విడిపించి పైకి కొనిపోతున్నట్లు కనిపించాడేపో. అతనిని వెంటనే చంపివేస్తారు.

సందేహమా ?

గ్లాకన్! పూర్వచర్చకు ఇది పూర్ణదృష్టాంతం. ఇంద్రియగోచర ప్రపంచమే ఆ గుహ. సూర్యుడే ఆ మంట. నీకోర్కెను త్రోసివేయ లేక నాకున్నవిశ్వాసాన్ని వ్యక్తంచేస్తూ ఆత్మ కావించే జ్ఞేయప్రపంచాభి ముఖయాత్రే (ఇందలి సత్యాసత్యాలు ఆ ఈశ్వరునికే తెలియాలి) ఊర్ధ్వాభిముఖాభిగమనం. జ్ఞానప్రపంచంలో శివభావం కట్టకడపట కని పిస్తుందని నా అభిప్రాయం. అది దృష్టమైనప్పుడు రమణీయాలు యథా ర్థాలు అయిన సర్వవస్తువులకు అదే కారణం. ఈ దృశ్యప్రపంచంలోని తేజస్సునకు అదే జనకం. అదే అధినాథం. జ్ఞేయప్రపంచంలోని వివేక సత్యాలకు అదే ప్రత్యక్షహేతువు. సామాజికజీవితంలో కాని, వ్యక్తిగత జీవితంలో కాని వివేకియై ప్రవర్తించేవాడు ఈ శక్తియందే తనదృష్టిని లగ్నం చేయవలసి ఉంటుందని భావిస్తున్నాను.

నాకర్థమైనంతవరకు మీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.

ఈ శివసందర్శనం (Beatific vision) పొందినవారు లౌకికవ్యవహారణకు సమ్మతించరంటే నీవు ఆశ్చర్యపడనక్కరలేదు. ఊర్ధ్వలోకానికి పోయి అందే విరతిపొందాలని తహతహపడుతుంటారు. మనం ఇంతకుముందు చెప్పుకొన్నదృష్టాంతం యథార్థమైతే వారికి అలాంటికోరిక కలగటం సహజమే.

అవును.

ఆ దివ్యధ్యానం ఆకస్మికంగా వదలి శోచనీయమానవలోకానికి తిరిగివచ్చి నప్పుడు లౌకికవ్యవహారాలలో తికమకలు పడతారు. ఇందు ఆశ్చర్య మున్నదా? దివ్యదర్శనానికి అలవాటుపడ్డ అతనికన్నులు మానవలోకాం ధ్యానికి చీకరిస్తవి. ఆ అంధ్యానికి అలవాటుపడేలోపున న్యాయప్రతీక ఛ్ఛాయలనిమిత్తం న్యాయస్థానాలలో గాని, ఇతర పరిషత్తులలో గాని

అతడు విధిగా వాదించవలసివస్తుంది. పరమన్యాయాన్ని ఇంకా చూడని వారితలపులను అతడు ఎదుర్కొన ప్రయత్నిస్తుంటాడు. ఇందు ఆశ్చర్య పడవలసినది లేదుకదా ?

ఆశ్చర్యమేమున్నది ?

నేత్రభ్రాంతి రెండువిధాలు. అది రెండు కారణాలవల్ల సంభవిస్తుంది. వెలుగునుంచి బయటికివచ్చినా లేక వెలుగులోపలికివచ్చినా కలుగుతుంది. చర్మచక్షువునకువలె ఇది జ్ఞానచక్షువునకు గూడ అన్వయిస్తుంది. ఇది తెలిసినవాడు విభ్రాంతదృష్టిని చూచి అంత తేలికగా నవ్వలేడు. "అతని ఆత్మ తీవ్రతేజస్వజీవితంలోనుంచి రావటంవల్ల చీకటికి అలవాటుపడక చూడలేకపోతున్నదా ? కాక చీకటినుంచి తీవ్రతేజస్సులోపలికి రావటం వల్ల మిరుమిట్లుగొంటున్నదా ?" అని అతడు మొదట విచారిస్తాడు. మొదటిదే కారణమైనపక్షంలో అతడు అదృష్టశాలి అనీ, రెండవదే కారణమైనపక్షంలో దయనీయుడనీ భావిస్తాడు. ఒకవేళ నవ్వటమనేది సంభవిస్తే తేజోలోకంనుంచి అంధలోకానికి వచ్చినవానిని చూచినవ్వటం కంటె అంధలోకంనుంచి తేజోలోకానికి వచ్చినవానిని చూచి నవ్వటానికే ప్రబలకారణమేర్పడుతుంది.

అవును, మీరు చెప్పింది సముచితం.

ఇక్కడ ఒకవిషయం గమనించాలి. తొల్లి లేనిజ్ఞానాన్ని ఆత్మకిప్పుడు క్రొత్తగా కలిగిస్తామని కొంతమంది ఆచార్యులు చెబుతున్నారు. నేను చెబుతున్నది నిజమే అయితే గ్రుడ్డికంటికి చూపువలెనే తెలివిలేనివానికి తెలివికలిగించటం అశక్యం. అందువల్ల అది అసత్యం.

అవును. ఆ ఆచార్యులు అలాగే చెబుతున్నారు.

మరి నావాదం అలా కాక ఇలా ప్రతిపాదిస్తున్నది : గ్రహణశక్తిసామర్థ్యాలు అంతకుముందే ఆత్మకుఉన్నవి. యావచ్ఛరీరం సహకరిస్తేనే నేత్రం అంధకారంనుంచి వెలుగువైపునకు మళ్ళుతుంది. ఈ నేత్రంవంటిదే జ్ఞానసాధన. యావదాత్మను వికృతిప్రపంచంనుంచి సత్ప్రపంచంవైపు మరల్చాలి. అలా మరల్చి ఉంచినప్పుడే అది క్రమక్రమంగా సత్పదార్థ

సందర్శనం—అంటే శివసందర్శనం—సహించగలుగుతుంది.

అవును.

దర్శనశక్తి ఉత్పాద్యంకాదు. అది స్వతస్సిద్ధం. అయితే అపమార్గం అనుసరించి అది సత్యవిముఖమవుతున్నది. ఇలా అపమార్గం పట్టినదృష్టిని తేలికగా త్వరితంగా సన్మార్గానికి మరల్చజాలినవిద్య ఉండదా ?

ఉండకపోదు.

ఇతరగుణాలు శారీరకగుణాలవంటివి. ఎందువల్లనంటే స్వతస్సిద్ధంగా లేకపోయినా అలవాట్లవలన, అభ్యాసాలవలన వాటిని ఉత్పాదించవచ్చును. ప్రజ్ఞ అట్టిది కాదు. అది దివ్యం, ఎల్లప్పుడు ఉంటుంది. దానిని సత్పథానికి మరలిస్తే ప్రయోజనకారి, లాభకారి అవుతుంది. అలా చేయని పక్షంలో నిరుపయోగమూ అశుభంకరమూ అవుతుంది. తెలివితేటలుగల ధూర్తుని నిశితనేత్రాలలో సంకుచితబుద్ధి మెరుస్తూఉంటే నీవెన్నడూ గమనించలేదా ? దుశ్చేష్టకై ఎంత తహతహపడుతుంటాడు ! తన గమ్యాన్ని ఆ సంకుచితమనస్సు ఎంత స్పష్టంగాచూస్తుందో నీవు చూడలేదా ? అతడు అంధునికంటె విపరీతుడు. అయితే అతని నిశితదృష్టి అనర్థకరణానికుపయోగపడుతుంది. అతని తెలివితేటలవలెనే వానివల్ల కలిగే అనర్థంకూడ మెండు.

నిజంగా అంతే.

శైశవావస్థలోనే ఇలాంటిప్రకృతులకు అదుపు ఏర్పడి ఉంటే భోజనప్రియత్వం మదిరాపానంవంటి తుచ్ఛలాలసత్వాలనుంచి విమోచనంకలిగించి దుర్మార్గాలనుంచి తప్పించి సన్మార్గాలకు మరల్చిఉంటే వారిలో ఉన్నశక్తి దుష్టార్థాలను ఎంత ఆసక్తితో ఎంత నిశితంగా చూస్తున్నదో అంత అసక్తితో అంత నిశితంగా సత్యాన్ని సందర్శించి ఉండేది.

అవును.

మనమింతకుముందు చెప్పుకొన్నదానినిబట్టి మరొకవిషయం కూడ ఉప.

పన్నమౌతున్నది. సత్యబోధకవిద్యానుభవశూన్యులు కానీ అసమాప్తనిత్య విద్యావ్యాసంగులు కానీ సమర్థులైనమంత్రులు కాజాలరు. మొదటివారి అసమర్థతకు కారణం ఒకటే ఉంది. వ్యక్తిగతంగా కానీ, సామాజికంగా కానీ వారు నిర్వర్తించే సర్వకార్యకలాపాలలోను వారికుండవలసిన ఏకైకకర్తవ్యదృష్టి ఏర్పడజాలదు. రెండవవారి అసమర్థతకు కారణం ఒకటే. నిర్బంధం ఏర్పడితే తప్ప వారు నేరుగా ఆనందమయజగత్తులో వసిస్తున్నామని భావిస్తూ కర్మప్రవృత్తులు కానేకారు.

మీరు చెప్పింది యథార్థం.

అట్టిస్థితిలో రాజ్యనిర్మాతలమైన మనకు కర్తవ్యమొకటే. ఇంతకుముందు ఉత్తమోత్తమజ్ఞానమని మనం నిరూపించినదానిని సంపాదించాలని ఉత్తమబుద్ధులను నిర్బంధించాలి. శివం సందర్శించేటంతవరకు వారు అధిరోహణం సాగించాలి. అలా అధిరోహించి సముచితసందర్శనం పొందిన పిమ్మట వారిప్పుడు ప్రవర్తిస్తున్నట్లుగా ప్రవర్తించనీయరాదు.

అంటే మీ తాత్పర్యం?

ఏమీ లేదు. వారు ఆ ఉన్నతలోకంలోనే నిలిచిపోవాలంటారు. కాని, ఆకాపురం సాగనీయరాదు. గుహలోనిబందీలవద్దకు రప్పించి యోగ్యమైనా కాకపోయినా ఆ బందీలకష్టసుఖాలలో వారిని పాల్గొనజేయాలి.

ఇది అన్యాయ్యం కాదా? ఉత్తమజీవనయాత్రకవకాశం ఉండగా, కాదు మీరు హీనజీవితమే అనుభవించాలని మనం వారిని శాసించవచ్చునా?

శాసనకారుని తాత్పర్యమే మరచిపోతున్నావు. రాజ్యంలో ఏ ప్రత్యేక వర్గాన్నీ అధికంగా సుఖపెట్టటం అతని తాత్పర్యం కాదు. సుఖం రాజ్య సర్వకంలో ఉండాలి. అతడు పౌరులను బలవంతపెట్టి ఒప్పించి ఒకటిగా కూర్చి రాజ్యశ్రేయోదాయకులై పరస్పరభద్రాపాదకులై వర్తిల్ల జేశాడు. ఈ లక్ష్యసిద్ధికే అతడు వారిని సృష్టించాడు. అంతే కాని, తమకుతాము సంతృప్తిపొంది మిన్నకుండుటకు కాదు. రాజ్యసమేకీకరణకు సాధనాలై ఉపయోగపడేనిమిత్తం వారినతడు సృష్టించాడు.

నిజమే ఆసంగతి మరచిపోయాను.

గ్లాకన్! ఇతరులకు రక్షకులుకండని మనతత్త్వవేత్తలను శాసించటం అన్యాయ్యం కాదు. వారికి విషయమంతా వివరించి చెబుతాము. ఇతర రాజ్యాలలో వారివర్గానికి రాజకీయభాగస్వామ్యం వహించవలసిన బాధ్యత లేదు. ఇది సమంజసమే. ఎందుకంటే వారు స్వయంకృషివల్ల వర్ధిలుతున్నారు. పైగా వారిసహాయం అపేక్షించకపోవటమే ప్రభుత్వానికి సమ్మతం. స్వోపజ్ఞులు కాబట్టి తామెన్నడు ఇతరులవల్ల పొందని సంస్కృతికై వారు కృతజ్ఞత చూపనక్కరలేదు. మనరాజ్యంలోనో అలా కాదు. "రాజ్యపాలకులుగ, రాజులుగ, ఆత్మపాలకులుగ, ఇతర ప్రజాపాలకులుగ నియోగించటానికై మిమ్మ ఈ లోకానికి కొనివచ్చాము. ఇతరరాజ్యాలలోని తత్త్వవేత్తలకంటె మీకు మిన్నగా విద్యాబుద్ధులు చెప్పించాము. ఉభయవిధకర్తవ్యనిర్వహణలో మీరు సమర్థులు. కాబట్టి తరుణం వచ్చినప్పుడు మీలో ప్రతిఒకడు భూగర్భనివాసానికి పోయి చీకట్లో చూడగలశక్తిని అలవరచుకోవాలి. ఆ అలవాటు సంపాదించిన తరువాత గుహానివాసులకంటె మీరే వేయిరెట్లు బాగా చూడగలుగుతారు. వివిధప్రతీకాలేమిటో, అవి వేనికిప్రాతినిధ్యం వహిస్తున్నవో మీరు తెలిసికొంటారు. ఎందుకంటే శివసుందరన్యాయ్యాల సత్యస్వరూపాలు మీరు చూచారు" అని మనతత్త్వవేత్తలకు చెబుతాము. ఈ విధంగా మనరాజ్యం యథార్థమాతుంది కాని, స్వప్నం కాదు. ఇతర రాజ్యాలలో మానవులు ఛాయలకోసం పరస్పరం కలహిస్తుంటారు. వారి దృష్టిలో అధికారం మహాశ్రేయస్కరం. ఆ అధికారంకోసం పోరాడుకొంటారు. మనరాజ్యం దీనికి కేవలం విరుద్ధం. వాస్తవానికి పాలకులు నిరీహులై పాలించేరాజ్యం ఉత్తమం. అది సమ్యక్పాలితం. పాలకులకు పాలనోత్కంఠ కలిగించే రాజ్యం అధమాధమం.

మీరు చెప్పింది అక్షరాల నిజం.

ఇదంతా విన్నప్పుడు మనశిష్యులు తరుణంవచ్చినప్పుడు రాజ్యభారం వహింపనిరాకరిస్తారా? అందులో తమజీవితంలో ఎక్కువభాగం దివ్య జ్యోతిలో గడపటానికి అవకాశం కల్పించినప్పుడు తిరస్కరిస్తారా?

అసంభవం. వారు న్యాయవంతులు. మనవిధిస్తున్న శాసనాలు న్యాయ్యాలు.

రాజ్యభారవహనం అనుల్లంఘనీయవిధి యని ఎంచి వారు పదవీస్వీకారం చేస్తారు. ఇందు సంశయించవలసినపని లేదు. అయితే ఇప్పటిరాజ్యపాలకులు చేస్తున్నఘోరాలు చేయరు.

ఇక్కడ ముఖ్యాంశం ఒకటి ఉన్నది. ఇప్పటి పాలకునిజీవితంకంటె ఉత్తమజీవితం మన భావిపాలకులకు ఏర్పాటు చేస్తే సమ్యగ్వ్యవస్థిత రాజ్యం ఏర్పడ వీలవుతుంది. ఇలాంటి అవకాశం కల్పింపబడినరాజ్యంలోనే ధనసంపన్నులైన వారు కాక సద్గుణసంపన్నులైనవారు పరిపాలన సాగిస్తారు. నిరుపేదలై స్వలాభోత్కంఠులై ప్రధానశ్రేయస్సును అపహరించాలన్నదృష్టితో ప్రజావ్యవహారపరిపాలనకు పూనుకొంటే సువ్యవస్థ ఎన్నటికీ ఏర్పడజాలదు. ఎందువల్లనంటే వారు పదవులకోసం పోరాడుకొంటారు. ఈ విధంగా ఆంతరికకలహాలు, సామాజికసంఘర్షణలు బయలుదేరితే అవి పరిపాలకులకూ రాజ్యానికీ వినాశం కల్పిస్తవి.

అవును.

ఇలాంటి రాజకీయాధికారమహాతృష్ణను తృణప్రాయంగా తిరస్కరించగల జీవితం యథార్థతాత్త్వికజీవితమే. అలా కాక మీకు తెలిసినది మరొకటి ఉన్నదా ?

లేదు.

పాలకులు పాలనాప్రణయులు కారాదు. ఆ ప్రణయమేర్పడింతో అధికారప్రణయులు బయలుదేరి కత్తులు దూస్తారు.

అది నిస్సందేహం.

నిర్బంధించి మనం ఎవరిని పాలకులను చేయాలి ? రాజకీయవ్యవహారకోవిదులై రాజ్యానికి సత్పరిపాలన అనుగ్రహించగలిగి అదేసమయంలో రాజకీయాలకంటె ఉత్తమమైన అన్యజీవితమూ గౌరవమూ కలిగినవారిని చేయాలి గదా ?

వారే యోగ్యులు. అందుకు వారినే ఎన్నుకొంటాను.

అలాంటి సంరక్షకులు ఎలా ఏర్పడుతారో, అంధకారంనుంచి వెలుగునకు వారిని ఎలా తీసుకురావాలో ఆలోచింతామా ? ఎందుకంటే అధోలోకం నుంచి దేవలోకానికి కొందరు చేరుకొన్నారని చెప్పగా విన్నావు కదా ?

అవును.

శుక్తిఖండం ఎగురవేసి♦ తగవు నిర్ణయించినట్లు ఈ సమస్యను నిర్ణయించ వీలులేదు. నిశాసదృశమైన వికృతినుంచి మరల్చి ఆత్మను సత్పదార్థమనే అహస్సునకు అభిముఖం చేయాలి. అంటే క్రిందినుంచి బయలుదేరి ఆత్మ ఉన్నతలోకం అధిరోహించాలి. దీనినే మనం తత్త్వానుశీలనమంటు న్నాము.

అవును.

ఏ జ్ఞానానికి అలా మార్చగలశక్తి ఉన్నదో పరిశీలించాలి.

అవును.

ఏ జ్ఞానం వికృతిపదార్థాలనుంచి సత్పదార్థంవైపు మరలిస్తుంది ? ఈ సందర్భంలో మరొక ఆలోచన స్ఫురిస్తున్నది. మన యువకులు వీరమల్లులై ఉండాలన్నాము. గుర్తున్నదా ?

లేకేమి ? ఉన్నది.

ఈ నూతనజ్ఞానానికి మరొక అదనపుగుణం ఉండాలి.

ఏ గుణమంటారు ?

---

♦ఇందు నాటి యవనబాలకుల క్రీడావిశేషం పేర్కొనబడ్డది. రెండు పక్షాలుగ ఏర్పడి శుక్తిఖండాన్ని ఎగురవేస్తారు. ఈ ఖండం ఒకవైపున నల్లగ, మరొకవైపున తెల్లగ ఉంటుంది. ఎగురవేసేవాడు రేయా పగలా అని ప్రశ్నిస్తాడు. ఒకపక్షం రేయంటే మరొకపక్షం పగలంటుంది. ఏవైపు పైగాబడితే ఆ పక్షం వెంటబడాలి. రెండవపక్షం పారిపోవాలి.

యుద్ధప్రయోజనకారిత్వం.

అవును. వీరైతే అలాగే ఉండాలి.

మనం వెనుకచెప్పుకొన్న విద్యావిధానంలో రెండు భాగాలున్నవి. అవునా?

ఆఁ.

శారీరకవృద్ధివినాశాధిదైవమైన వ్యాయామం ఒకభాగం. దీనిని ఉత్పాద భంగాలకు హేతువుగ పరిగణించవచ్చును గదా?

అవును.

మన అన్వేషణం దానికై కాదు గదా?

కాదు.

మనపూర్వప్రణాలికలో సంగీతసాహిత్యాలకు కొంతస్థానం ఉన్నది కదా? మరి దానివిషయమేమిటి?

వ్యాయామానికనుగుణమైన రెండవభాగం సంగీతసాహిత్యాలు. అవి సంరక్షకులకు సదభ్యాసాలేర్పరచి సంస్కరిస్తవి. రాగంద్వారా సామరస్యం (Harmony), తాళంద్వారా (Rhythm) రీతి (Rhythmical) నేర్పుతవి. అంతే కాని అవి జ్ఞానాన్ని ప్రసాదించవు. మాటలు భావనా ప్రధానాలైనా వాస్తవికతాప్రధానాలైనా తత్సదృశరీతిసమతలు కలిగి ఉంటవి. అందువల్ల సంగీతసాహిత్యాలలో మీరు అన్వేషిస్తున్న శివత్వాన్ని పెంపొందించేగుణమేదీ లేదు.

నీ ధారణ నిర్దుష్టం. సంగీత సాహిత్యాలకు అలాంటి గుణమేమీ లేదు. మనం కోరుతున్నగుణం ఏ జ్ఞానానికి ఉన్నది, గ్లాకన్? వృత్తివిద్యలన్నీ మనం నీచాలన్నాము.

అవును. చదువుసాములు, వృత్తివిద్యలు పరిహరిస్తే మిగిలినదేమున్నది?

వాటికి అన్యంగా మరొకప్రత్యేకవిద్య లేకపోవచ్చును. కాని, ప్రత్యేక విద్య కాక విద్యలన్నిటికి సర్వసామాన్యమైనవిద్యను మనం స్వీకరించ వలసి ఉంటుంది.

ఏ విద్య?

ఎల్ల వృత్తివిద్యలు, శాస్త్రాలు, విచారణలు సర్వసామాన్యంగా దేనిని వాడుకొంటవో విద్యాప్రధానాంశాలను నేర్చుకొనేటప్పుడు ఎల్లవాడు దేనిని నేర్చుకోవలసి ఉంటుందో అది

ఇంతకూ అదేమంటారు?

ఒకటి, రెండు, మూడు— వీటిని వేరుపరచటం నేర్పేది. ఒకమాటలో చెప్పాలంటే సంఖ్య, గణనం. ఎల్ల వృత్తివిద్యలు అవశ్యం దీనిని భజిస్తవి కదా?

అవును.

యుద్ధవిద్యకు గూడ ఇది సేవ్యమే కదా?

అవును.

విషాదాంతరూపకంలో పాలామీడీస్♦ ఎక్కడ ప్రత్యక్షమైనా అగమెమ్నన్ సేనాపతిత్వానికి అయోగ్యుడని నిరూపిస్తాడు. 'నేనే సంఖ్యను కనుగొన్నాను; నౌకలను లెక్కించాను; సైనికులను ట్రాయ్‌వద్ద వ్యూహంగా పన్నాను, అని అతడు ప్రకటిస్తూ ఉంటే నీవు వినలేదా? దీనినిబట్టి అంతకుముందువారికి లెక్కలు లేవనీ అగమెమ్నన్ తననౌక

---

♦పాలామీడీస్ ట్రాయ్‌నగరంపై దండెత్తివెళ్ళిన యవనవీరులలో ఒకడు. సముద్రదీపస్తంభాలు, తూకాలు, ప్రమాణాలు, చక్రం, పాచికలు ఈ ఋషే కనిపెట్టాడని తరువాతిరచయితలు పేర్కొన్నారు.

లను లెక్కపెట్టలేనంతఅజ్ఞాని అనీ స్పష్టపడటం లేదా? సంఖ్యలు తెలియనప్పుడు ఎలా లెక్కపెట్టగలుగుతాడు? అదంతా నిజమైతే అత డెలాంటి సేనాపతి?

మీరు చెప్పింది నిజమైతే అతడు విచిత్రసేనాపతే కావాలి.

యుద్ధవీరునకు గణితశాస్త్రజ్ఞానం ఉండాలి. అక్కరలేదని నిరాకరించ గలమా?

యుద్ధతంత్రం ఏమాత్రం తెలియాలన్నా అసలు మానవమాత్రుడు కావా లన్నా ఆ జ్ఞానం అవసరం.

ఈ విద్యనుగూర్చి నాకున్న అభిప్రాయమే నీకూ ఉన్నదేమో తెలిసికొన గోరుతున్నాను.

మీ అభిప్రాయమేమిటి?

మనం అన్వేషిస్తున్న ఈ విద్య పరామర్శను ప్రోత్సహిస్తుంది. అయితే ఇది సముచితరీతిని ఉపయోగింపబడటంలేదు. దీనిని సద్వినియోగపరచట మంటే ఆత్మను సత్పదార్థాభిముఖం చేయటమే.

అనుగ్రహించి మీ అభిప్రాయం వివరించాలి.

ప్రయత్నిస్తాను. ఈ పరిశీలనంలో నాతోపాటు భాగస్వామ్యంవహించి ఏ జ్ఞానశాఖలకు ఈ ఆకర్షకశక్తి ఉన్నదో చూపయత్నించినప్పుడు నీవు అవుననో కాదనో సమాధానం చెప్పాలి. ఇలాంటి జ్ఞానశాఖలలో సంఖ్యాగణితం ఒకటనుకొంటాను.

ఎలాగంటారు?

ఇంద్రియార్థాలు రెండువిధాలు. కొన్ని అర్థాలు ఆలోచనను అపేక్షించవు. వాటిని ఇంద్రియమే నిర్ణయిస్తుంది. ఇతరార్థాలట్టివి కావు. వీటివిష యంలో ఇంద్రియం విశ్వాసపాత్రం కాదు. అధికపరిశీలనం అవసర

మాతుంది.

ఇంతకూ మీరు దూరత్వసమీపాత్వాలవల్లనూ, వెలుగునీడలను చిత్రించే చిత్ర లేఖనంవల్లనూ, ఇంద్రియాలుపొందే భ్రమనుగూర్చి మాటాడుతున్నారని స్పష్టమవుతున్నది

నా తాత్పర్యమదికాదు.

అయితే మరేది?

ఆలోచన అపేక్షించని అర్థాలు అంటే విపరీతమైనఐంద్రియకపరిణామం పొందని అర్థాలని నా తాత్పర్యం. ఆలోచనను అపేక్షించే అర్థాలు అంటే అలా మారేవి. ఈ రెండవజాతి అర్థాలవిషయంలో వస్తువు సమీపమందున్నా దూరమందున్నా ఇంద్రియం దాని సన్నికర్షం పొంది విస్పష్ట భావం కలిగించక విపరీతభావం కలిగిస్తుంది. దృష్టాంతమిస్తే నా తాత్పర్యం తేలికగా బోధపడుతుంది. ఇవిగో మూడువ్రేళ్ళు—కనిష్ఠ, అనామిక, మధ్యమ. ఇవి దగ్గరగా కనిపిస్తున్నవి కదా? ఇప్పుడు మనకు కావలసిన అంశం చెబుతాను.

అదేమిటి?

నడిమిపట్టునుంచి చూచినా, ఏ కొసనుంచి చూచినా, వ్రేళ్ళు నల్లగా ఉన్నా తెల్లగా ఉన్నా, సన్నగా ఉన్నా లావుగా ఉన్నా, ప్రతిఒకటి వ్రేలుగానే కనిపిస్తుంది. ఈ సందర్భంలో 'వ్రేలు అంటే ఏమిటి?' అన్న ప్రశ్నకు సమాధానం ఆలోచించాలని తోచదు. ఎందువల్లనంటే ఇంద్రియం వ్రేలిని వ్రేలుగానే మనస్సుకు గోచరింపజేస్తుంది గాని మరొక తీరుగా గోచరింపజేయదు.

అవును.

కాబట్టి ఇక్కడ బుద్ధిని పర్యుత్సుకంచేసేది ఏదీ లేదు.

అవును.

మరి అంగుళిపరిమాణం సంగతి ఏమిటి? వాటిపరిమాణభేదాన్ని దృష్టి గుర్తించగలదా? మరి స్పర్శేంద్రియం స్థూలత్వాస్థూలత్వభేదం కాని, మృదుత్వామృదుత్వభేదం కాని గుర్తించగలుగుతుందా? ఇలాంటి గుణ గ్రహణంలో ఇంద్రియాలు దోషకలితాలు కావా? అవి ఈ తీరున పని చేయటం లేదా? ఉదాహరణకు కాఠిన్యగ్రాహి అయినస్పర్శము మృదుత్వాన్ని గూడ గ్రహించి ఒకేఅర్థం మృదువు, కఠినము అని మనస్సునకు గోచరింపజేయటంలేదా?

మీరు చెప్పింది యథార్థం.

ఒకే అర్థం మృదువు కఠినము అన్న ఇంద్రియగోచరార్థం పొంది మనస్సు తికమకపాలు కాదా? మరి గౌరవలాఘవాల ప్రశ్నయేమిటి? గురు పదార్థం లఘువైతే, లఘుపదార్థం గురువౌతుందా?

అవును. మనస్సు పొందుతున్న ఈ ప్రత్యక్షజ్ఞానాలు అతివిచిత్రాలు. వివరణాపేక్షకాలు.

అవును. ఇలాంటితికమకలు బయలుదేరినప్పుడు తనకు ప్రత్యక్షీకృతాలైన ఈ అర్థాలు ఒకటా రెండా అని తెలిసికొనటంకోసం ఆత్మ గణకబుద్ధిని ఆశ్రయిస్తుంది.

అవును.

అవి రెండైతే వానిలో ప్రతిఒకటి ఏకమూ భిన్నమూ కాదా?

నిశ్చయంగా.

ప్రతిదీ ఒకటై, ఉభయమూ రెండయితే, రెండు అనేది విభజనవల్ల ఏర్పడుతుంది అని ఆత్మ గ్రహిస్తుంది. ఎందువల్లనంటే అవి అవిభక్తాలైతే ఒకటిగానే భావింపబడుతవి.

అవును.

కన్ను అణుమహత్తులను రెంటిని చూచింది. కాని తికమకపడ్డది. వాటిని వేరుపరచి చూడలేదు.

అవును.

విచారశీలమైనబుద్ధి తికమకల పరిహరణకై గ్రహణవిధానాన్ని మార్చి వేయవలసివచ్చింది. అణువునూ, మహత్తునూ భిన్నాలుగ చూచి భ్రాంతికి పాల్పడలేదు.

నిజమే.

'ఏది మహత్తు? ఏది అణువు?' అన్నది పరిశీలనకు నాంది.

అవును.

ఈ విధంగా దృశ్యమూ జ్ఞేయమూ అన్న విభేదమేర్పడింది.

అవును.

మన ఇంద్రియాలు ఏకకాలంలో విరుద్ధప్రత్యక్షజ్ఞానాలను కలిగించినప్పుడు మనం ఆలోచించవలసివస్తుంది. లేనప్పుడు ఆలోచన అవ్యక్తమై ఉంటుందని చెప్పినప్పుడు నాతాత్పర్యమిదే.

ఇప్పుడు బోధపడింది. మీ అభిప్రాయంతో నేనేకీభవిస్తున్నాను.

ఇంతకూ ఏకత్వమూ, సంఖ్యా ఏ వర్గంక్రిందికి వస్తాయి ?

నాకు తెలియదు.

కొంచెం ఆలోచించు. ఇంతకు ముందు చెప్పుకొన్న దానివల్లనే సమాధానం లభిస్తుంది. ఎందువల్లనంటే కన్ను కాని, మరొక ఇంద్రియం కాని కేవలం ఏకత్వాన్ని గ్రహించగలిగి ఉంటే సత్పదార్థంవైపు ఆత్మను ఆకర్షించ గలిగినది ఏదీ ఉండేది కాదు. కాని ఏదో ఒక విరోధం బాధ ఏర్పడు

తున్నప్పుడు ఒకటి అనేది ఒకటికంటె అన్యమై బహుత్వబుద్ధిని అపేక్షిస్తుంది. అప్పుడు మనలో ఆలోచన బయలుదేరుతుంది. బికమకలకులోనై నిశ్చితబుద్ధినభిలషించి 'పరమఏకత్వమంటే ఏమిటి?' అని ఆత్మ ప్రశ్నిస్తుంది. ఈ విధంగా ఏకత్వపరిశీలనం మనస్సును ఆకర్షించి సత్పదార్థ ధ్యానమందు లగ్నంచేయటానికి శక్తమవుతుంది.

అవును. ఒకటివిషయంలో ఇది స్పష్టంగా సంభవిస్తున్నది. ఎందువల్లనంటే ఒకేవస్తువును ఇటు ఏకంగాను అటు అనంతసంఖ్యాకంగాను చూస్తున్నాము.

నిజమే. ఏకత్వంలో ఇది యథార్థమైనప్పుడు ఎల్లసంఖ్యలవిషయంలోను ఇది యథార్థం కావాలి.

నిశ్చితంగా.

మరి గణితశాస్త్రం గణనకు, సంఖ్యకు సంబంధించినదే కదా?

అవును.

అది మనస్సును సత్యాభిముఖంగా కొనిపోయేటట్లు కనిపిస్తున్నది కదా?

అవును.

మనం ఇలాంటి జ్ఞానంకోసమే అన్వేషిస్తున్నాము. అటు సైనికంగా, ఇటు తాత్త్వికంగా ఉపయోగపడేదానికోసం వెదకుతున్నాము. ఎందువల్లనంటే యోధునకు గణితశాస్త్రాభ్యాసం అవసరం. ఆ విద్య తెలియకపోతే తనదళాలను ఎలా పన్నాలో అతడు తెలిసికోలేడు. తత్త్వవేత్తకు గూడ ఇది ఆవశ్యకం. ఎందువల్లనంటే వికారిసముద్రసముత్థితుడై సత్పదార్థావలంబనంపొందాలి. కాబట్టి అతడు గణితశాస్త్రజ్ఞుడు కావాలి.

అది యథార్థం.

మన సంరక్షకుడు అటు యోధుడు, ఇటు తత్త్వవేత్త కదా?

అవును.

కాబట్టి ఇలాంటిజ్ఞానం సంపాదించాలని శాసించటం యోగ్యం. మన రాజ్యంలో ప్రధానపురుషులు కావలసినవారిని సంఖ్యాశాస్త్రం నేర్చు కొన ప్రోత్సహించాలి. వినోదార్థమై కాక సంఖ్యాస్వభావాన్ని చక్కగా గ్రహించగలిగినంతశక్తి అలవడేదాక వారు ఈ విద్యను అభ్య సించాలి. అయితే వారు దీనిని క్రయవిక్రయాలకోసం వణిజులు నేర్చి నట్లు గాక సైనికోపయోగార్థం, ఆత్మోపయోగార్థం నేర్చుకోవాలి. ఎందుకంటే వికృతినుంచి సత్యాన్ని సత్పదార్థాన్ని ఆత్మ చేరుకొనటానికి ఈమార్గం సుగమం.

బాగున్నది.

ఈ శాస్త్రం ఎంత మనోజ్ఞం! వణిగ్దృష్టితో కాక తాత్త్వికదృష్టితో అభ్యసించినప్పుడు మనలక్ష్యసిద్ధికి ఎన్నివిధాల తోడ్పడుతున్నది!

అంటేమీ తాత్పర్యం?

గణితశాస్త్రం ఆత్మనుత్ప్రధాన నడిపి కేవలసంఖ్యనుగూర్చి ఆలోచింప జేస్తుంది. దృశ్యార్థాలను గాని, స్పర్శనీయార్థాలను గాని చర్చకు రానీక తిరస్కరింపజేస్తుంది. లెక్కకట్టేటప్పుడు ఎవడైన పరమఏకత్వాన్ని విభజించటానికి ప్రయత్నిస్తే గణితశాస్త్రవిశారదులు అతనిని పరిహ సిస్తారు. నీవు విభజిస్తే ఆ విభాగాలలో ఒకటి అదృశ్యంకాకుండా ఒక టిగా ఉండేటట్లు వారు హెచ్చవేస్తారు.

అది వాస్తవం.

ఎవరైనా వారినిలా ప్రశ్నిస్తారనుకో: "మీరు చర్చిస్తున్న ఆ విచిత్రా లేమిటి? వాటిలో ఏకత్వమున్నది. ప్రతిప్రమాణం (Unit) సమానంగా అవ్యయంగా అవిభాజ్యంగా ఉంటుంది అంటున్నారేమిటి?" ఇట్లు ప్రశ్నిస్తే వారేమి సమాధానం చెబుతారు?

మేము చెబుతున్న సంఖ్యలు బుద్ధిచేతనే గ్రహింపదగినవని వారంటారను

కొంటాను.

అలాంటప్పుడు ఈ జ్ఞానం నిజంగా ఆవశ్యకమని చెప్పవచ్చును. ఎందువల్ల నంటే కేవలసత్యగ్రహణకై ఇది నిర్మలబుద్ధిని ప్రోత్సహిస్తుంది.

అవును. అది దాని విశిష్టలక్షణం.

లెక్కలలో స్వాభావికనైపుణ్యం కలవారు ఇతరవిధజ్ఞానాన్ని ప్రతి దానిని అతిత్వరితంగా గ్రహిస్తారు. దీనిని నీవు గమనించావా? గణిత శాస్త్రంలో శిక్షణ పొందిఉంటే దానివల్ల మరొకప్రయోజనం పొందక పోయినా మందబుద్ధులకు గూడ అన్యథాకలుగని త్వరితగ్రహణశక్తి కలుగుతుంది.

యథార్థం.

ఇంతకంటె కష్టతరవిద్య ఉండదు. ఇంతకష్టమైన విద్యలు గూడ పెక్కు లుండవు.

అవును.

కాబట్టి ఇది ఉత్తమప్రకృతులు అవశ్యం నేర్వవలసినవిద్యయే కాని పరిత్య జించదగినది కాదు.

నేనూ ఒప్పుకొంటాను.

నేర్వవలసినవిద్యలలో ఇది ఒకటి కావాలి. దీనికి సజాతీయమైనశాస్త్రం కూడ మనకు ముఖ్యమవుతుందేమో పరిశీలింతామా?

రేఖాగణితశాస్త్రమనేనా మీ ఉద్దేశం?

అవును.

యుద్ధానికి సంబంధించినరేఖాగణితశాస్త్రభాగంతో స్పష్టంగా మనకు

అక్కర ఉన్నది. ఎందుకంటే స్కంధావారం ఏర్పరచాలన్నా ఒక స్థానాన్ని రక్షించాలన్నా సైనికశ్రేణులను కదియజేయాలన్నా విస్తరిల్ల జేయాలన్నా యుద్ధరంగంలో కాని, ప్రస్థానకాలంలో కాని సైనిక విన్యాసం జరపాలన్నా సేనాదిపతి రేఖాగణితశాస్త్రజ్ఞుడు కావాలి.

ఆ ప్రయోజనంకోసమే అయితే కొలదిమాత్రపు రేఖాగణితశాస్త్రజ్ఞానం కాని, గణితశాస్త్రజ్ఞానం కాని చాలు. అయితే మనప్రశ్న గణితశాస్త్రంలోని అధికభాగానికి, ఉన్నతకక్ష్యకు సంబంధించినది. శివభావసందర్శనాన్ని ఏమాత్రమైనా అది సుగమం చేస్తుందా? పూర్ణ సత్పదార్థసందర్శనానికీ ఆత్మను ప్రోత్సహించే ప్రతిదానికీ అదే లక్షణ మని చెబుతున్నాము.

అవును.

రేఖాగణితశాస్త్రం సత్పదార్థదర్శి అయితే అది మనకు ముఖ్యం. కాక, వికారదర్శి అయితే దానితో మనకు నిమిత్తం లేదు.

అవును.

అయితే ఇది సత్పదార్థసందర్శి అని రేఖాగణితశాస్త్రజ్ఞులొప్పుకోరు. వారి మతానికి ఇది విరుద్ధం. ఆశాస్త్రంతో ఏమాత్రం పరిచయమున్నవాడైనా దీనిని కాదనడు.

ఎలాగంటారు?

కార్యాచరణను మాత్రమే దృష్టిలో పెట్టుకొని వారు చతురస్రీకరణాన్ని గూర్చి, విస్తృతీకరణాన్ని గూర్చి, అన్వయీకరణాన్ని గూర్చి ఎల్లప్పుడు సంకుచితంగా హాస్యాస్పదంగా మాటాడుతుంటారు. రేఖాగణితసూత్రాలు దైనందినజీవితసూత్రాలన్నట్లుగా వారు తికమకలు కలిగిస్తారు. ఆ శాస్త్రానికి నిజమైనలక్ష్యం జ్ఞానమే కాని, అన్యంకాదు.

నిశ్చితంగా అంతే.

అప్పుడు మరొకవిషయం గూడ అంగీకరించాలి.

ఏదంటారు?

రేఖాగణితశాస్త్రజ్ఞానానికి పరమలక్ష్యం నిత్యపదార్థజ్ఞానమే కాని, వినశ్వరక్షణికపదార్థజ్ఞానం కాదు.

దీనికి ఒప్పుకోవచ్చు. ఇది సత్యం.

కాబట్టి మిత్రమా! రేఖాగణితం ఆత్మను సత్యాభిముఖంగా ఆకర్షిస్తుంది. తాత్త్వికదృష్టి కలిగిస్తుంది. ఇప్పుడు శోచనీయంగా ఉపేక్షితమైన దానిని ఉద్ధరిస్తుంది.

అట్టిప్రభావం మరొకదానికి లేదు.

కాబట్టి మీరాజ్యవాసులు రేఖాగణితం నేర్చుకతీరాలని చండశాసనం చేయాలి. పైగా ఆ శాస్త్రంవల్ల పరోక్షప్రయోజనాలు అనేకాలున్నవి.

ఎలాంటివంటారు?

మనం చెప్పుకొన్న సైనికప్రయోజనాలు కలుగుతవి. రేఖాగణితమభ్యసించినవాడు జ్ఞానశాఖలన్నిటిలోను ఆ శాస్త్రంచదువనివానికంటె శీఘ్రగ్రాహి అవుతాడని అనుభవం చాటుతున్నది.

అవును. అది నేర్చినవానికి నేర్వనివానికి ఎంతో వ్యత్యాసమున్నది.

మన యువకులు అభ్యసించవలసినవిద్యలలో దానికి ద్వితీయస్థానం కల్పింతామా?

అలాగే.

మరి ఖగోళశాస్త్రానికి తృతీయస్థానమిస్తే ఎలా ఉంటుంది?

నేను దీనికి అనుకూలుణ్ణే. మాసబుతువత్సరపరిశీలనం హాలికనావికులకు వలెనే సేనాపతికి గూడ ముఖ్యం.

నిరర్థకశాస్త్రాభ్యసనప్రతికూలునివలె కనిపించటానికి నీవు తీసికొంటున్న జాగ్రత్తను చూస్తే ప్రపంచానికెంత భయపడుతున్నావో స్పష్టమై నవ్వు కలిగిస్తున్నది. ప్రతివానికి జ్ఞానచక్షువు ఉన్నది. అన్యవ్యాపారాలవల్ల ఇది పొరలుగ్రమ్మి అంధప్రాయంగా ఉన్నది. ఈ శాస్త్రాభ్యాసంవల్ల ఆ పొరలు తొలగి స్వచ్ఛమై పునర్దృష్టమౌతుంది. ఈ జ్ఞానచక్షువు పదివేల చర్మచక్షువులకంటె మేలు. ఎందువల్లనంటే సత్యం దానిచేతనే ప్రాప్యం. అయితే ఈ నమ్మిక చిక్కుట కష్టమేనని నేనూ ఒప్పుకొంటాను. రెండు రకాల మానవులున్నారు. ఒకరకంవారు నీవుచెప్పినదానితో ఏకీభవించి నీమాటలు వేదాలుగా భావిస్తారు. రెండవరకంవారికి అవి అర్థశూన్యాలు వలె కట్టుకథలువలె కనిపిస్తవి. వాటివల్ల పొందదగినలాభమేదీ వారికి కనిపించదు. ఈ రెండుతెగలవారిలో ఎవరితో నీవు వాదించదలచు కొన్నావో వెంటనే తేల్చివేయాలి. అయితే నేనేపక్షంతోనూ వాదించ దలచుకోలేదు. ఈ వాదమంతా ఆత్మప్రత్యయం కోసమే కాని ఇతరుల కోసం కాదని నీవు చెప్పవచ్చును. అయితే నీవు పొందినమేలు ఇతరులకు కూడ అనుగ్రహింప సంకోచించవుగదా?

ప్రధానంగా నా ఆత్మసంతృప్తికోసమే చర్చసాగించవలసి ఉంటుందను కొంటాను.

ఆ పక్షంలో మనం ఒకఅడుగు వెనుకకు వేయాలి. ఎందుకంటే శాస్త్రాల క్రమంలో మనం పొరపడ్డాము.

పొరపాటేమిటి?

సమతలరేఖాగణితం (Plane Geometry) తరువాత ఘనాలు గ్రహించ టానికి బదులుగ భ్రమిఘనాలను (Solids in revolution) గ్రహించాము. వాస్తవానికి ద్విపరిమాణాత్మకం తరువాత త్రిపరిమాణాత్మక మైనఘనం వస్తుంది కదా?

నిజమే సోక్రటిస్! కాని, ఇప్పటివరకు వీటిని గూర్చి మనకు తెలిసినది

చాల స్వల్పమనిపిస్తున్నది.

నిజమే. దీనికి రెండు కారణాలున్నవి. మొదటిది ఏ ప్రభుత్వమూ వీటిని ప్రోత్సహించటం లేదు. దీనివల్ల ఈ పరిశోధనలో ఉత్సాహలోపం ఏర్పడుతున్నది. పైగా ఇవి కష్టసాధ్యాలు. రెండవది గురువు సహాయం లేక విద్యార్థులు దానిని అభ్యసించలేరు. అలాంటి గురువు కూడ దుర్లభుడు. ఒకవేళ లభించినా ఇప్పుడున్న స్థితిగతులలో దుర్విదగ్ధులైన విద్యార్థులు అతనిబోధనం వినరు. రాజ్యమే ఈ విద్యాగురువులకు గౌరవం కల్పిస్తే స్థితిగతులు మారిపోతవి. చదువుకొనగోరే శిష్యులు బయలుదేరుతారు. నిరంతరతీవ్రాన్వేషణం కొనసాగుతుంది. క్రొత్తవిషయాలు కనుగొంటారు. ఆ శాస్త్రాలు లోకోపేక్షితాలైనా, తత్సముచితభాగాలు విలుప్తాలైనా, ఆశాస్త్రారాధకులు వాటిప్రయోజనాన్ని వివరించలేక పోయినా స్వాభావికంగా తమకున్న ఆకర్షకశక్తివల్ల అవి వృద్ధిపొందుతవి. అయితే రాజ్యసహాయం కావాలి. అలాంటిది ఉంటే ఒకానొక నాటికి అవి వ్యాప్తి పొందుతవి.

నిజమే. విశిష్ట ఆకర్షకశక్తి వాటికున్నది. అయితే క్రమంలో మార్పు దేనికో అర్థం కావటం లేదు. మీరు మొదట సమతలరేఖాగణితంతో ప్రారంభించారు.

అవును.

ఆ తరువాతిస్థానం ఖగోళశాస్త్రానికిచ్చారు. ఆ తరువాత క్రమం అది కాదన్నారు, అంతేగా?

అవును. నాతొందరలో నీకాలస్యం కలిగించాను. మొదటిదానితరువాత రావలసినది ఘనరేఖాగణితం (Solid Geometry). అయితే దానిహాస్యాస్పదస్థితినిబట్టి నీవు ఆ క్రమాన్ని పరిత్యజించి దానిస్థానం ఖగోళశాస్త్రానికి లేదా ఘనగతికి (Motion of solids) ఇచ్చావు.

నిజమే.

రాజ్యప్రోత్సాహం ఉంటే ఇప్పుడు మనం వదలిపెట్టిన ఆ శాస్త్రం

ఆవిర్భవిస్తుందని అంగీకరించి తరువాత ఖగోళశాస్త్రానికి వెళ్ళుదాము. అప్పుడిది నాల్గవదవుతుంది.

అది సక్రమమే. ఇంతకుముందు ఖగోళశాస్త్రాన్ని సంకుచితదృష్టితో శ్లాఘించినందుకు మందలించారు. ఇప్పుడు మీదృష్టితోనే దానిని శ్లాఘిస్తాను. ఊర్ధ్వాభిముఖవీక్షణకు పురికొల్పి, ఆత్మను ఈ లోకంనుంచి మరొకలోకం పోవటానికి ఖగోళశాస్త్రం ప్రోత్సహిస్తుందని ప్రతివానికి స్పష్టమే.

నాకుదక్క-.

అంటే?

ఖగోళశాస్త్రానికి తత్త్వశాస్త్రస్థాయి ఆపాదిస్తున్నవారు మనలను అధో దృష్టులను చేస్తున్నట్లు కనిపిస్తున్నారే కాని, ఊర్ధ్వదృష్టులను కావించటం లేదని తోస్తున్నది.

అంటే మీ అభిప్రాయం?

ఊర్ధ్వదేశవస్తువుల జ్ఞానాన్నిగూర్చి నీకు నిజంగా ఉదాత్తాభిప్రాయం ఉన్నది. ఒకవ్యక్తి తలను వెనుకకు వాల్చి తారకితాకాశం పరిశీలిస్తుంటే అతనిమనస్సే కాని, అతనికన్నులు చూడటంలేదని నీ అభిప్రాయం. నీ అభిప్రాయమే యథార్థమైతే నేను అజ్ఞానినికావచ్చును. కాని, నామతంలో కేవలసత్పదార్థజ్ఞానమంటే అగోచరార్థజ్ఞానం. అది మాత్రమే ఆత్మకు ఊర్ధ్వదృష్టిని కల్పిస్తుంది. మానవుడు ఆకసంవంక కన్నార్పక చూడవచ్చును. భూమిమీద అతనికన్ను చీకరించినా తన ప్రయత్నం మానకపోవచ్చును. కాని, ఇంద్రియార్థవిశేషగ్రహణకు మాత్రమే ప్రయత్నిస్తున్నప్పుడు అతడు జ్ఞానం పొందగలడని నేను నమ్మను. ఎందువల్లనంటే ఆ అర్థం శాస్త్రానికి విషయం కాదు. వెలికిలగ భూమిపై పండుకొనిచూచినా జలంపై పండుకొనిచూచినా అతని ఆత్మ క్రిందికి చూస్తున్నది కాని, ఊర్ధ్వముఖంగా చూడటం లేదు.

మీనింద సమంజసమని నేనూ అంగీకరిసాను. అయినా మనం చెప్ప

కొంటున్న జ్ఞానసముపార్జనానికి అనుగుణంగా ఖగోళశాస్త్రాన్ని ఎలా నేర్చుకోవాలో చెప్పండి.

మనం చూస్తున్న తారామండితగగనం దృశ్యపేరఖచితం. అందువల్ల దృశ్యవస్తువులలో అది అత్యంతరమణీయమైనా సమగ్రంగా ఉన్నా, పరమ వేగంకంటె పరమమాంద్యంకంటె ఎంతో హీనమని చెప్పాలి. పరస్పరా పేక్షాలై గర్భితార్థావహాలై ఆ యథార్థగతులు యథార్థసంఖ్యలో యథా ర్థాకృతిలో ఉంటవి. ఇవి జ్ఞానంచేతను బుద్ధిచేతను గ్రహింపదగినవే కాని, దృష్టిచే గాదు.

అవును.

నక్షత్రాలంకృతగగనాన్ని ఉత్తమజ్ఞానసముపార్జనకోసం ఆదర్శంగా (Pattern) వాడుకోవాలి. వానిసొగసు డీడాలస్ నిర్మించిన శిల్పచిత్రాల సొగసువంటిది. లేదా మరొక మహాశిల్పి కల్పించిన విగ్రహరామణీయకం వంటిది. వానిని చూచి ఏ రేఖాగణితశాస్త్రజ్ఞుడైనా వానిశిల్పసౌంద ర్యాన్ని శ్లాఘిస్తాడు కాని, వానిలో యథార్థమైన సమానత, ద్విగుణత, మరొకయథార్థనిష్పత్తి తనకు లభిస్తుందని కలలుగనడు.

అవును. అలా లభిస్తుందనుకోవటం హాస్యాస్పదం.

తారాగమనం పరిశీలించినప్పుడు ఖగోళశాస్త్రజ్ఞునకు గూడ అలాంటి భావమే కలుగదా? సృష్టికర్త ఆకాశాన్ని, నక్షత్రకోటిని సమగ్ర నైపుణ్యంతో చిత్రించాడని భావించడా? అహస్సునకూ రాత్రికి, అహో రాత్రాలకూ మాసాలకు, మాసాలకూ సంవత్సరానికి, నక్షత్రాలకూ సంవ త్సరానికి, నక్షత్రాలకూ నక్షత్రాలకు ఉన్న నిష్పత్తినికానీ, భౌతికాలయిన మరేవస్తువుల నిష్పత్తిని కానీ నిత్యమై నిర్వికారమగునని ఎన్నడూ భావిం చడు. అది అర్థరహితం. వాని యాథార్థ్యగ్రహణకై అంతప్రయాసపాటు కూడ వ్యర్థం.

ఈ సంగతి నేనిదివరకాలోచించలేదు. అయినా ఒప్పుకొంటున్నాను.

రేఖాగణితంలోవలెనే ఖగోళశాస్త్రంలో కూడ పరిష్కారార్థం సమస్యలను

మనం కల్పించాలి. ఈ శాస్త్రాన్ని చక్కగా అభ్యసించి ఆత్మకు సహజంగా ఉన్నజ్ఞానాన్ని సద్వినియోగం చేయాలంటే దృశ్యమానాకాశాన్ని విస్మరించాలి.

ఆ పని ఇప్పటిఖగోళశాస్త్రజ్ఞులకు నిశ్చితంగా అతీతం.

శాసనకర్తలమై మనము ఏమాత్రమైనా ఉపయోగపడాలంటే ఇలాంటి మరికొన్ని విధులు కల్పించకతప్పదు. సరే గాని అభ్యసించదగిన మరొక శాస్త్రమేదైనా చెప్పగలవా ?

లేదు. ఆలోచింపక నేనేమీ చెప్పలేను.

గతి అనేకరూపం కాని, ఏకరూపం కాదు. నిపుణుడు వాటినన్నిటిని పేర్కొనగలడు. నావరకు నేను రెండురూపాలు గుర్తించగలను.

అవి ఏవంటారు ?

ఇంతకుముందు చెప్పుకొన్నది ఒకటి. రెండవది తదనుబంధి (counterpart).

ఆ రెండవది ఏమిటి ?

మొదటిది కంటికెలాంటిదో రెండవది చెవికలాంటిది. తారకాలోకనానికి నేత్రంవలెనే రాగసంచార (Harmonious motions) శ్రవణానికి చెవి ఉద్దిష్టం. పైథాగరస్ అనుయాయులు పేర్కొంటున్నట్లు ఇవి సోదర శాస్త్రాలు. గ్లాకన్, మనం వారిమతం అంగీకరిస్తున్నామా ?

అవును.

ఇది కష్టమైనశాస్త్రం కాబట్టి వారివద్దకు వెళ్ళి (పైథాగరస్ అనుయాయులవద్దకు) నేర్చుకోవాలి. ఈ శాస్త్రాలవల్ల ఇతరప్రయోజనాలు కూడ ఉంటే వారు చెబుతారు. కాని, మనం మాత్రం మన ఉన్నతలక్ష్యం విస్మరించరాదు.

ఆ ఉన్నతలక్ష్యమేమిటి ?

సమస్తజ్ఞానం పొందవలసిన పరిపూర్ణత ఒకటి ఉన్నది. మనశిష్యులు ఖగోళశాస్త్రంలోవలెనే ఇక్కడ గూడ ఈ పరిపూర్ణతను పొందాలి. ఎందువల్లనంటే సంగీతశాస్త్రంలో కూడ (Science of Harmony) ఇదే జరుగుతున్నది. ఈ శాస్త్రాధ్యాపకులు (పైథాగరస్ అనుయాయులు) శ్రుతధ్వనులనూ అనురణనాలనూ (Consonances) ఖగోళశాస్త్రజ్ఞుల వలెనే పోల్చిచూస్తున్నారు. ఈ శ్రమంతా నిరర్థకం.

నిజమే. వారు తమ సారభూతస్వరాలను (Condensed notes) గూర్చి చేసేప్రసంగం వింటూ ఉంటే రసవత్తరమైన నాటకం చూస్తున్నట్లు ఉంటుంది. పొరుగువానిమాటలు వినటానికి గోడప్రక్కన చెవులు రిక్క బెట్టుకొని వింటున్నట్లుగా వారు తంత్రులప్రక్కన చెవులుమోపి వింటూ ఉంటారు. వారిలో ఒకపక్షం మధ్యస్థమైనస్వరం విన్నాము. కనిష్ఠ వ్యవధానం కనుగొన్నాము. ఇదే ప్రమాణం (The Unit of Measurement కావాలంటే, అన్యపక్షం ఆ రెండుధ్వనులు ఒకటిగానే పర్యవసిస్తున్నవని వాదిస్తారు. ఈ విధంగా ఇరువాగులవారును బుద్ధికంటె చెవులకే ఎక్కువ ప్రాముఖ్యమిస్తున్నారు.

అంటే తమవాద్యముల చెవులు ఎక్కుద్రిప్పి తీగలను హింసించే పెద్దలను గూర్చే కదా నీవు ముచ్చటిస్తున్నది? ఈ దృష్టాంతాన్ని మరికొంతదూర మన్వయిస్తాను. వారుప్రఘాణకముచే (Plectrum) మోది తంత్రులపై ఆరోపణచేస్తూ ధ్వనికి అగ్రగామిత్వాన్ని, పశ్చాద్గామిత్వాన్ని ఆపాదిస్తారు. ఇదంతా విసుగునకుమూలం. అందువల్ల నేను పేర్కొంటున్నది వీరిని గాదు. పైథాగరస్ అనుయాయులను మాత్రమే. అయితే వారు కూడ ఖగోళశాస్త్రజ్ఞులవలెనే ప్రమాదగ్రస్తులవుతారు. శ్రుతరాగ స్వరాలను (Numbers of harmonies which are heard) వారు పరిశీలిస్తున్నారే కాని, మూలసమస్యలను ఆలోచించటం లేదు. స్వాభావికాలైన సంఖ్యాసామరస్యాలను (The natural harmonies of number) అందుకొనటంలేదు. కొన్నిసంఖ్యలు సమరసంగా (Harmonious) ఎందుకుంటున్నవి? ఇతరాలు ఎందుకుండటం లేదు ? అని విచారించటం లేదు.

అది మర్త్యజ్ఞానాతీతం.

అయినా ప్రయోజనకారి అంటాను. రమణీయశివార్థాలకై దానిని కొన సాగించాలి. మరొకదానికై సాగిస్తే మాత్రం నిరర్థకం.

అవును.

అయితే ఈ శాస్త్రాలు పరస్పరసంబంధం ఏర్పరచుకోగలిగినస్థాయికి వచ్చి వీని పరస్పరాపేక్షకత్వం సమాలోచనీయస్థితి పొందితేతప్ప వీని అధ్యయనం మనలక్ష్యాలకు ఉపయోగించదు.

నేనూ అలాగే అనుమానిస్తున్నాను. అయితే ఇది మహత్తరకార్యం కాని, సామాన్యం కాదు, సోక్రటిస్ !

అంటే నీ ఉద్దేశమేమిటి? ఇది భూమిక అనా, లేక మరొకటనా?

ఇదంతా మనం ప్రయాసపడి నేర్చుకొనవలసినదానికి భూమికమాత్రమే నని నీకు తెలియదా? ఎందువల్లనంటే గణితశాస్త్రనిపుణుని తార్కికునిగా (Dialectician) పరిగణించవు గదా?

లేదు. తర్కించగల గణితశాస్త్రవిశారదుడు ఇంతవరకు నాకు తగుల లేదు.

అయితే హేతుకథనగ్రహణాశక్తులైనవారు మనం కావలెనంటున్నజ్ఞానం పొందగలరా?

లేదు.

చిట్టచివరకు తర్కమంత్రంవద్దకు చేరుకొన్నామన్నమాట. ఈ శాస్త్రం బుద్ధికి మాత్రమే (Intellect) సంబంధించినది. అయితే ఈ బుద్ధిని దర్శనశక్తి అనుకరిస్తుంది. ఎందువల్లనంటే లోగడ చెప్పుకొన్నట్లు దృష్టి ముందు ఛాయలను, యథార్థజంతువులను, తారలను, కట్టకడపట సూర్యుని సందర్శిస్తుంది. అలాగే తర్కంకూడ. ఒకవ్యక్తి ఇంద్రియసహాయమపే

క్షించక కేవలజ్ఞానంద్వారా పరమార్థం కనుగొనప్రారంభించి, శ్రమించి స్వచ్ఛజ్ఞానంద్వారానే పరమశివభావసందర్శనం పొందినప్పుడు అతడు దృశ్యప్రపంచశిఖరం పొందినమాపువలెనే జ్ఞేయప్రపంచశిఖరం పొందుతున్నాడు.

అవును.

మనం పురోగతినే (Progress) కదా తర్కమంటున్నది?

అవును.

కారాగారనివాసి శృంఖలావిమోచనంపొంది నీడలనుంచి తేజఃప్రతీకాలవైపు మరలి భూగర్భంనుంచి సూర్యాభిముఖుడై ఊర్ధ్వగమనం సాగించాడు. ఆ స్థితిలో జీవద్వస్తువులను, ఉద్భిజ్జాలను, సూర్య తేజస్సును చూచే శక్తి అతనికి లేదు. కాని, ఈశ్వరసదృశాలైన జలగతప్రతిబింబాలను వస్తువులఛాయలను మాత్రమే చూడగలుగుతున్నాడు. అయితే ఇవి యథార్థసత్పదార్థచ్ఛాయలే కాని, గుహాంతర అగ్నిప్రభాపాదితప్రతీకచ్ఛాయలు కావు. ఆ అగ్ని సూర్యునితో పోల్చిచూచినప్పుడు కేవలం ప్రతీకం మాత్రమే. మనం చర్చిస్తూవచ్చిన శాస్త్రాధ్యయనానికి సూర్యసదృశమైన శక్తి ఉన్నది. ఇది ఆత్మలోని ఉత్తమోత్తమతత్వాన్ని మథించి, వెలార్చి, యథార్థసద్వస్తువులలోని ఉత్తమత్వాన్ని పరిశీలింపజేస్తుంది. గుహాదృష్టాంతంలోని వెలుగు చక్షువుచే దృశ్యభౌతికప్రపంచంలోని ఉజ్జ్వలవస్తువులను విలోకింపజేసినట్లే ఈ శాస్త్రమూ చేస్తుంది.

మీరు చెబుతున్నదానితో నేను ఏకీభవిస్తాను. అయితే దానిని నమ్మటం కష్టం. కాని, మరొకదృష్టితో చూచినప్పుడు కాదని నిరాకరించటం మరీ కష్టం. ఇది కేవలం ప్రాసంగికంగా ఏదో ఒకముక్క చెప్పి దాటవేయవలసినవిషయం కాదు. సావకాశంగా చర్చించవలసినవిషయం. కాబట్టి మననిర్ణయం యథార్థమైనా కాకపోయినా, యథార్థమేనని భావించి వెంటనే భూమికనుండి ప్రధానవిషయానికి పోయి దానిని గూడ సాకల్యంగా పరిశీలింతాము. మరి తర్కస్వభావమేమిటి? దాని విభాగాలు, మార్గాలు ఏమిటి? ఇవి మన పరమలక్ష్యానికి కూడ చేరవేస్తవి.

గ్లాకన్ ! నేను నాశక్తికొలది తోడ్పడినా ఇక్కడ నీవు నన్ను అర్థం చేసికోలేవు. నీవు సందర్శించవలసినది ప్రతీకం కాదు. నేనుభావిస్తున్న పరమసత్యాన్ని సందర్శించాలి. నేను నీకు చెప్పినది యథార్థమో కాదో చెప్పలేను. కాని యాథార్థ్యంవంటిదానిని దేనినో చూచి ఉంటావు. అంతమేర నాకు నమ్మకమే.

నిస్సంశయంగా అంతే.

తర్కశక్తి ఒక్కటే ఇంతకుమున్ను పేర్కొన్న శాస్త్రాలభ్యసించిన వారికి మాత్రం దీనిని వ్యక్తం కావిస్తుంది.

**అవును.**

సర్వయథార్థసత్తను క్రమపద్ధతిలో గ్రహించటానికి గానీ, ప్రతివస్తువు యొక్క స్వభావం నిశ్చయించటానికి గానీ మరొకపద్ధతి ఏదైనా ఉన్నదని ఎవరూ వాదించరు. ఎందువల్లనంటే సామాన్యంగా వృత్తివిద్యలు మానవుల కామాలకో అభిప్రాయాలకో సంబంధించినవి. లేదా ఉత్పాదననిర్మాణదృష్టితో అభ్యసించబడుతున్నవి. లేదా ఆ ఉత్పాదననిర్మాణ రక్షణకోసం అధీతాలవుతున్నవి. మనం చెప్పుకొన్నట్లుగా రేఖాగణితం వంటి గణకశాస్త్రాలు యథార్థసత్పదార్థాన్ని కొంతగ్రహిస్తవి. ఆ గ్రహణం స్వప్నమాత్రం. అపరామర్శితంగా ఉపాధులను ఉపయోగిస్తూ వాటిని వివరించలేనంతకాలం గణకశాస్త్రాలు జాగ్రత్సత్యాన్ని సందర్శించలేవు. ఎందువల్లనంటే మానవుడు తన ప్రాథమికసూత్రాన్నే ఎరుగనప్పుడు తననిగమనమూ తత్పూర్వన్యస్తసోపానాలూ దేనినుంచి నిష్పన్నాలవుతున్నవో ఎరుగనప్పుడు అలాంటి సంప్రదాయసిద్ధకల్పన ఎప్పుడైనా శాస్త్రమౌతుందని అతడు ఎలా ఊహించగలుగుతాడు ?

అది అసంభవం.

ఒక్కతర్కం మాత్రమే ప్రాథమికసూత్రాన్ని పరిశీలించి నిర్ణయిస్తుంది. ఈ ఒక్కశాస్త్రమే తన మార్గసుస్థిరతకై ఉపాధులను పరిహరిస్తుంది. పొరలక్రింద మాటువడిన ఆత్మచక్షువు దీనిసహాయంతో మెల్లగా ఉన్మీలితమౌతుంది. ఈ ఉన్మీలనక్రియలో తర్కం మనం చెప్పుకొన్నశాస్త్రా

లను అండదండగా వాడుకొంటుంది. ఆచారం వాటిని శాస్త్రాలంటున్నది. కాని, వాస్తవానికి అభిప్రాయంకంటె స్పష్టతరమూ, శాస్త్రంకంటె అస్పష్టమూ అని చెప్పేపేరు వాటికి ఉండాలి. మనం ఇంతకుముందు చెప్పుకొన్నప్పుడు దీనిని బుద్ధి అన్నాము. అయితే అత్యంత ముఖ్యాలైన యాథార్థ్యాలను పరిశీలించవలసి ఉండగా మనం పేర్లను గూర్చి వివదించటం దేనికి?

మనోగతభావాన్ని స్పష్టంగా చెబుతున్నప్పుడు పేరు ఏదైతేనేమి?

ఏది ఎట్లున్నా పూర్వంలాగానే నాల్గు విభాగాలుంటే మనకు చాలు. రెండు బుద్ధికి, రెండు అభిప్రాయానికి ఉండాలి. మొదటివిభాగాన్ని శాస్త్రమందాము. రెండవ దానిని గ్రహణము (Understanding), మూడవదానిని శ్రద్ధ (Belief), నాల్గవదానిని ప్రత్యక్షము (Perception of shadows) అని అందాము. అభిప్రాయానికి విషయం పరిణామి (Becoming). బుద్ధికి విషయం సత్పదార్థం. పరిణామికీ సత్పదార్థానికీ ఉన్నసంబంధమే అభిప్రాయనికీ బుద్ధికీ ఉన్నది. అభిప్రాయానికీ బుద్ధికీ ఉన్నసంబంధమే శ్రద్ధకూ శాస్త్రానికీ ఉన్నది. ప్రత్యక్షానికీ బుద్ధికీ అలాంటిసంబంధమే ఉన్నది. అయితే అభిప్రాయబుద్ధుల విషయపరస్పరాపేక్ష, ఉపవిభజన వివరించాలంటే ప్రకృతచర్చకంటె దీర్ఘతరచర్చ సాగించాలి. కాబట్టి వాటిని తరువాత చూదాము.

నాకర్థమైనంతవరకు దీనిని అంగీకరిస్తున్నాను.

ప్రతివస్తువుయొక్క తత్త్వోపలబ్ధిని (Conception of the Essence) పొందే వానిని తాత్త్వికుడని వర్ణిస్తే నీవు అంగీకరిస్తావా? ఈ ఉపలబ్ధిని ఎంత మేర తానుపొందలేక ఇతరులకు బోధింపజాలక విఫలుడవుతున్నాడో అంత మేర గ్రహణవైఫల్యం పొందుతున్నాడు. ఇంతవరకు ఒప్పుకొంటావా?

ఔc. దీనిని కాదని అతడు ఎలా నిరాకరిస్తాడు?

మరి శివభావోపలబ్ధివిషయంలో కూడ (Conception of the Good) ఇదే వర్తిస్తుందంటావా? శివభావాన్ని గ్రహించి సహేతుకంగా ఒకవ్యక్తి

నిర్వచించలేనంతవరకూ వచ్చే ఆక్షేపణలను సప్రమాణంగా దూరాపాస్తం చేయనంతవరకూ అతనికి శివభావం కాని, శివార్థం కాని తెలియదని నీవు చెబుతావు. అలాంటివాడు దేనినైనా గ్రహించి ఉంటే అది అభిప్రాయ ప్రసాదితమైన ఛాయ అవుతుంది కాని, శాస్త్రప్రసాదితమైన సత్పదార్థం కాదు. అతడు జీవితంలో నిద్రాళువై స్వప్నాలుకంటూ అధోలోకం చేరుకొని అంతిమవిమోచనం పొందుతాడు.

ఈ విషయంలో నిశ్చితంగా మీతో ఏకీభవిస్తాను.

నీ ఆదర్శరాజ్యంలో విద్యాబుద్ధులు కరపి పెంచి పెద్దవారిని చేస్తున్న పిల్లలను, భావిపాలకులను జ్ఞానంలేని స్తంభప్రాయులనుగావించి ఉత్తమోత్తమవిషయాలకు అధికారులను చేయవు గదా?

చేయను.

పరిపృచ్ఛాప్రత్యుత్తరాలలో అత్యంతనైపుణ్యాన్ని ప్రసాదించేవిద్యను వారు నేర్చుకోవాలని నీవు శాసిస్తావు కదా?

అవును. మనమిద్దరమూ అలా శాసిస్తాము.

అప్పుడు తర్కం శాస్త్రాలకు శిఖరం అవుతుంది. తర్కశిఖరంపై మరేమీ ఉండదు. జ్ఞానస్వభావం అంతకుమించి ఉండదు. అంతేనా?

అవును.

అయితే ఈ అధ్యయనం ఎవరికి విధించాలి? ఏ విధంగా విధించాలి? అన్న ప్రశ్నలను విచారించవలసి ఉన్నది.

అవును.

అయితే పాలకులను మనం ఎలా ఎన్నుకొన్నామో గుర్తున్నది కదా?

ఆఁ.

ఆ ప్రకృతులు కలవారినే ఎన్నుకోవాలి. అయితే నిశ్చలధీరతములను, (వీలైతే) ఈ గుణములుగలిగిన సుందరతములను అభిమానించాలి. ఉదార స్వభావాలతో పాటు వారికి విద్యాసముపార్జనకు ఆవశ్యకాలైన స్వాభావికగుణాలు ఉండాలి.

ఆ గుణాలేవంటారు ?

బుద్ధినైశిత్యం, గ్రహణశక్తి మున్నైనవి. వ్యాయామతీవ్రతకంటె అధ్యయన తీవ్రతవల్ల మనస్సు తరచుగా మూర్ఛపొందుతుంటుంది. ఈ అధ్యయనక్లేశం కేవలం మానసికమే కాని, శారీరకం కాదు.

నిజమే.

మనం అన్వేషిస్తున్నవానికి సమ్యగ్ధారణాశక్తి ఉండాలి. ఏ శాఖ యందైనా పరిశ్రమించటానికి ఇష్టపడుతూ అలసటపొందని దృఢవ్యక్తి కావాలి. లేనిపక్షంలో అధికశారీరకపరిశ్రమను సహించలేడు. విహిత మైన వివిధశాస్త్రాధ్యయనమూ మానసికశిక్షణమూ ఓర్వలేడు.

నిశ్చితంగా అంతే. తగిన స్వభావసిద్ధగుణాలుండాలి.

నేడు జరుగుతున్న పొరపాటు ఒకటే. తత్త్వశాస్త్రం అభ్యసించేవారికి వృత్తి లేదు. ఈ కారణంవల్లనే ఇంతకుముందు నేను చెప్పినట్లు అది అప ఖ్యాతిపాలైనది. నిజమైనధర్మసంతతే తత్త్వశాస్త్రానికి హస్తావలంబనం ఇవ్వాలి కాని, ధర్మేతరసంతానం కాదు.

అంటే మీతాత్పర్యం?

తత్త్వశాస్త్రారాధకుడు కుంఠితపరిశ్రముడు కారాదు. కించిదలసుడు, కించి చ్ఛ్రమి కారాదు. ఆటవేటలలో ఆసక్తిఉన్నవాడు ఆ శ్రమను సహి స్తాడు కాని, విద్యాశ్రవణగ్రహణానుశీలనాలను ద్వేషిస్తాడు. అలా కాక విద్యాసంసక్తుడైతే వ్యాయామాదికాన్ని ద్వేషించి మరొకవిధమైన వైకల్యం పొందుతాడు.

నిజమే.

వాస్తవానికి ఈ వైకల్యం విచిత్రం. సంకల్పపూర్వకమైన అనృతాన్ని ఇతడు ద్వేషిస్తాడు. తాను బొంకినా ఇతరులు బొంకినా కినుక వహిస్తాడు. కాని, అప్రయత్నసిద్ధమైన అసత్యాన్ని సహిస్తాడు. అజ్ఞానపంకంలో పందివలె పొర్లాడుతాడు గాని, సంకోచించడు. దానిని ఇతరులు కనుగొన్నా సిగ్గిలడు. ఇట్టివాడు వికలుడు కాడా?

నిశ్చితంగా వికలుడే.

నిగ్రహం, ధైర్యం, విశాలదృష్టి మున్నైనసద్గుణాలలో గూడ ఏది యథార్థసద్గుణమో ఏది ఆభాసమో వేరుపరచవలసిన అవసరం లేదా? ఈ వివేచన లేనప్పుడు రాజ్యాలూ వ్యక్తులూ తమకు తెలియకుండానే ప్రమాదగ్రస్తులవుతారు. దీనివల్ల రాజ్యం గుణహీనుని పాలకుని చేస్తుంది. వ్యక్తి అలాంటి గుణవికలునితో మైత్రి నెరపుతాడు.

అది యథార్థం.

మనం ఈ విషయాలన్నీ జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ విస్తృతవిద్యాగ్రహణనియుక్తులు శారీరకంగా మానసికంగా సుస్థితిలో ఉంటే న్యాయం మనలను అధిక్షేపించదు. రాజ్యాంగవిధానానికీ రాజ్యానికీ మనం పరిత్రాతలమవుతాము. మనశిష్యులు తదన్యులైతే వైపరీత్యం సంభవిస్తుంది. ఇప్పుడు పొందుతున్న అవమానంకంటె ఘోరతరమైన అవమానం తత్త్వశాస్త్రానికి మనం ఆపాదించినవారమవుతాము.

అవును, అది ఏమాత్రం గౌరవప్రదం కాదు.

నిజమే. అయినా వినోదనీయార్థం నిజమనితలచి నేను హాస్యాస్పదుణ్ణి అవుతున్నాను.

ఎలాగంటారు?

వినోదార్థం ప్రసంగిస్తున్నానన్నమాట మరచి నిజమని ఉద్వేగంతో

మాటాడాను. తత్త్వశాస్త్రం ఇంత అనుచితంగా పాదతాడితమైనప్పుడు ఈ అవమానకారులపై నాకు కలిగినయేవగింపును ఆపుకోలేకపోయాను. క్రోధంతో ఏదో అన్నాను.

వింటూనే ఉన్నానుగా. నేనలా అనుకోలేదు.

మాటాడిననేను మాత్రం అలాగే అనుకొన్నాను. సరే, అది అలా ఉంచు. మనం వృద్ధులను ఎన్నుకొన్నాము. కాని, ఈ విషయంలో అలా చేయరాదని స్పష్టమౌతున్నది. మానవుడు వృద్ధుడై ఎన్నోవిషయాలు నేర్చుకొంటాడని సొలోన్♦ ప్రమాదగ్రస్తుడై చెప్పాడు. వృద్ధుడు పరుగిడలేడు. అలాగే విద్యాగ్రహణం కూడ చేయలేడు. నిజానికి అసాధారణపరిశ్రమకు యోగ్యమైనకాలం యౌవనమే.

అవును.

తర్కశాస్త్రాభ్యాసానికి ముందుగా నేర్పవలసినగణితం, రేఖాగణితం మున్నైనశాస్త్రాలపరిచయం బాల్యమందే కల్పించాలి. అయితే మన విద్యావిధానం బలవంతాన విధించరాదు.

ఎందుకని?

స్వతంత్రుడైనవాడు ఏ జ్ఞానసంగ్రహణమందైనా దాసుడు కారాదు. నిర్బంధమైన శారీరకవ్యాయామం శరీరానికి కీడు చేయదు. కాని, నిర్బంధించి నేర్పినవిద్య మనస్సునకంటదు.

నిజమే.

కాబట్టి నిర్బంధం కూడదు. ప్రారంభవిద్య వినోదప్రాయంగా ఉండనీ. అపుడే ప్రకృతిసిద్ధమైన అభిరుచి ఎలా ఉన్నదో నీవు తేలికగా గ్రహిస్తావు.

---

♦ఇతడు సూక్తికవి. యవనసప్తఋషులలో ఒకడన్నప్రసిద్ధి పొందాడు.

అది యుక్తమే.

యుద్ధసందర్శనార్థం పిల్లలను గుర్రాలమీద కొనిపోవాలని చెప్పు కొన్నాము. గుర్తున్నదా? ప్రమాదం లేనప్పుడే యుద్ధరంగానికి తీసుకు వెళ్ళి జాగిలాలవలెనే వారికి రక్తపరిచయం కలిగించాలన్నాము కదా?

అవును, గుర్తున్నది.

పరిశ్రమ, పాఠాలు, ప్రమాదాలు—వీటన్నిటిలో ఆ పరిపాటిని పాటించ వచ్చును. ఇందు అదరుబెదరు లేక మెలగేవానిని ప్రత్యేకవర్గంలో చేర్చాలి.

ఏ వయస్సులోనంటావు?

అవశ్యకమైన వ్యాయామం ముగిసినకాలంలో. ఇలాంటి శిక్షణపొందు తున్నకాలం రెండు సంవత్సరాలైనా మూడు సంవత్సరాలైనా మరొక దానికి దేనికీ ఉపయోగపడదు. ఎందువల్లనంటే నిద్రావ్యాయామాలు విద్యాభ్యాసానికి శ్రేయస్కరాలు కావు. వ్యాయామక్రీడలలో ఎవరు ప్రథమగణ్యులన్నపరీక్ష బాలకుల పరీక్షలన్నిటిలో అత్యంతప్రధానం.

అవును.

ఆతరువాత ఇరువదేండ్ల ప్రాయంవారినుంచి ఎన్నుకోబడినవారికి అధికతర గౌరవం కల్పించాలి. ఇతఃపూర్వం విద్యాభ్యాసకాలంలో క్రమవిరహి తంగా వారభ్యసించినశాస్త్రాలిప్పుడు సంపృతాలౌతవి. వాని పరస్పర సంబంధాన్ని యథార్థసత్పదార్థంతో వానికున్నబాంధవ్యాన్ని వారు గ్రహించగలుగుతారు.

అవును. అలాంటివిద్య ఒకటే చిరకాలం నిలుస్తుంది.

అలాంటి జ్ఞానమే తార్కికనైపుణ్యానికి మహత్తరప్రమాణం. సంగ్ర హాత్మకబుద్ధి సదా తార్కికమే.

మీతో నేనూ ఏకీభవిస్తున్నాను.

ఈ అంశాలను నీవు పరిశీలించాలి. సంగ్రహణశక్తి మెండుగాగలిగి చదువులలో, సైనికకార్యకలాపాలలో, ఇతరనియమితవిధులలో మిన్నగా ఉన్నవారిని ముప్పదవయేట ఎన్నుకొని వారికి అధికతరగౌరవం కల్పించాలి. వారిలో ఎవరు చక్షురాది ఇంద్రియవ్యాపారం విసర్జించి సత్పదార్థం చేరసమర్థులో తేల్చుకొనటానికి వారితార్కికశక్తిని పరీక్షించు. అయితే ఇక్కడ ఎంతో కనుగలిగి మెలగాలి.

ఎందుకంటారు?

తర్కప్రయోగం ఎంత ప్రమాదకరమో నీవు గుర్తించ లేదా?

ప్రమాదమేమిటి?

తర్కవిద్యార్థులు నియమశూన్యులు.

నిజమే.

ఇందు ఆశ్చర్యమేమైన ఉన్నదంటావా? కాక అది క్షంతవ్యమే నంటావా?

క్షంతవ్యమా? ఎలా?

దృష్టాంతపూర్వకంగా వివరిస్తాను. భోగభాగ్యాలమధ్య పెరిగినకృతకపుత్రుడు ఒకడున్నాడనుకో. పెద్దకుటుంబంలో అతడొకడు. అతనిని మెరమెచ్చేవారు తండోపతండాలు. అతడు పెరిగి పెద్దవాడైనప్పుడు తలిదండ్రులని చెప్పబడుతూవచ్చినవారు నిజంగా తలిదండ్రులు కారని తెలిసికొంటాడు. వాస్తవజననీజనకులెవ్వరో అతనికి తెలియదు. మెరమెప్పుగాండ్రతో కృతకపితరులతో తనకున్న వాస్తవికసంబంధం తెలియనప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో, అది తెలిసినతరువాత ఎలాప్రవర్తిస్తాడో ఊహించగలవా? లేక నన్నే ఊహించి చెప్పమంటావా?

మీరే చెప్పండి.

తెలియనికాలంలో అతడు తలిదండ్రులను, బంధువులను మెరమెప్పు గాండ్రకంటె మిక్కిలిగా గౌరవిస్తాడు. కష్టస్థితి వచ్చినప్పుడు వారిని ఉపేక్షించడు. వారికి ప్రతికూలంగా చెప్పడు. ఆపనులకు అంతగా అవకాశం ఉండదు. ముఖ్యవిషయాలలో వారిని ధిక్కరించటానికి సమ్మతించడు.

అవును.

కాని, వాస్తవసంబంధం తెలిసికొన్నతరువాత వారియందు అతనికున్న భక్తిగౌరవాలు తగ్గిపోతవి. మెరమెప్పుగాండ్రయందు భక్తిశ్రద్ధలు మెండవుతవి. వారి ప్రభావం మినుమిక్కిలిగా పెరుగుతుంది. అతడు వారి పద్ధతులనే అనుసరిస్తాడు. వారితో బాహాటంగా సాహచర్యం సాగిసాడు. అసామాన్యసద్గుణసంపన్నుడైతేతప్ప తన కృతకజననీజనకులందుగాని, ఇతరబంధువులందు గాని ఉపేక్షవహిస్తాడు. వారికోసం బాధపడడు.

అది సంభావ్యమే. కాని, ఇది తర్కశాస్త్ర విద్యార్థులకు ఎలా అన్వయిస్తుందంటారు?

ఎలాగంటావా? విను. మనకు చిన్నతనంలో న్యాయాన్ని గూర్చి, గౌరవాన్ని గూర్చి కొన్నిసూత్రాలు బోధించారు. ఆ సూత్రగురువుల అధీనంలో మనం పెరుగుతూ వాటిని శిరసావహిస్తూ గౌరవిస్తూ పెరిగి పెద్దవాళ్ళమయ్యాము.

నిజమే.

వానికి విరుద్ధాలైన సుఖసూత్రాలు, అభ్యాసాలు ఉన్నవి. అవి ఆత్మను ఉబ్బించి అపకర్షిస్తవి. అయితే కర్తవ్యజ్ఞానమున్నమనలో ఎవరినీ అవి మార్చలేవు. అట్టివారు తమతండ్రులసూత్రాలను యథాపూర్వంగానే పాలించి గౌరవిస్తారు.

అవును.

మానవుడు ఇలాంటిస్థితిలో ఉండగా పృచ్ఛకబుద్ధి "ఏది న్యాయం? ఏది గౌరవం?" అని ప్రశ్నించినప్పుడు అతడు శాసకుడు బోధించిన తీరున సమాధానం చెబుతాడు. తరువాత అనేకవిభిన్నవాదాలు అతని మాటలను ప్రత్యాఖ్యానిస్తవి. దానితో 'ఏదీ మాననీయం కాదు అవమాననీయం కాదు, ఏదీ న్యాయ్యం కాదు అన్యాయ్యమూ కాదు, ఏదీ శివమూ కాదు అశివమూ కాదు' అని అతడు భావిస్తాడు. అర్థవంతాలని పూర్వంనమ్మినవాటన్నిటిలో ఆతనికి ప్రత్యయబుద్ధి నశిస్తుంది. అలాంటప్పుడు వాటిని అతడు గౌరవించి పాలిస్తాడంటావా?

అసంభవం.

అవి మాననీయాలని పూర్వంవలె తలపనప్పుడు యాథార్థ్యాన్ని ఎరుగనప్పుడు అతడు కామోద్వేజితజీవితం కాక మరొకజీవితం సాగిస్తాడా?

లేదు.

నియమబద్ధుడై వర్తిల్లుటకు బదులు అతడే ఆ నియమాన్ని విచ్ఛిన్నం చేయడా?

అది నిస్సంశయం.

నేను వర్ణించిన తత్త్వశాస్త్రవిద్యార్థులకిది స్వాభావికమే కాక అత్యంత క్షంతవ్యం.

నిజమే. కాని, శోచనీయమని కూడ చెప్పండి.

కాబట్టి ఇప్పటికి ముప్పదేండ్లవయస్సువారైన మనపౌరులవిషయమై శోచనీయతకు తావివ్వక తర్కశాస్త్రపరిచయం కల్పించేటప్పుడు జాగరూకత వహించాలి.

అవును.

వారు స్వైరవివాదసుఖం చవిచూచే ప్రమాదమున్నది. ఎందుకంటే ఒక

సారి అలవాటుపడ్డతరువాత యువకులు వినోదార్థం వాదిస్తారు. తమ్ము ప్రత్యాఖ్యానించేవారిని అనుకరిస్తూ ఇతరులవాదాన్ని కాదని నిరాకరిసారు. ఈ భాగవతమంతా నీవు చూచేఉంటావు. వేటకుక్కలవలె వారు తమ్ము సమీపించినవారినందరిని చీల్చిచెండాడ మక్కువపడతారు.

అవును. అంతకంటె వారికి సంతోషకరం మరొకటి లేదు.

వారు ఎన్నో విజయాలు సాధించి పెక్కురవల్ల అనేకపరాజయాలు పొందినప్పుడు వారంతకుముందు నమ్మినదేదీ నమ్మనిస్థితి త్వరితంగా ఏర్పడుతుంది. దానివల్ల వారే కాదు తత్త్వశాస్త్రమూ, తత్త్వశాస్త్రానికి సంబంధించిన సర్వమూ తక్కినప్రపంచంలో అపఖ్యాతిపాలయ్యే దుఃస్థితి ఏర్పడుతుంది.

యథార్థం.

అయితే వయస్సు పైబడుతున్నకొలది మానవుడు ఇలాంటి ఉన్మాదానికి పాల్పడడు. సత్యాన్ని అన్వేషిస్తున్నతార్కికుని అతడు అనుకరిస్తాడు కాని, వినోదార్థం ప్రత్యాఖ్యానించేవిమర్శకుని అనుకరించడు. అతనిశీలం ఎంత నిగ్రహవంతమైతే తత్త్వశాస్త్రగౌరవం అంతగా పెరుగుతుంది.

అవును.

మరి దీనికై మనం ప్రత్యేకంగా ఏర్పాట్లు చేశాము కదా! తత్త్వశాస్త్రాధ్యయనపరులు క్రమబద్ధులై దృఢవ్రతులై ఉండవలెనే కాని ఈనాటి యాదృచ్ఛికాగంతుకులవలె ప్రవర్తించరాదన్నాము కదా?

అవును.

వ్యాయామానికి మారుగా తత్త్వశాస్త్రాధ్యయనానికి పూనుకొని వారు వ్యాయామానికి వినియోగించినదానికంటె రెట్టింపుకాలం నిరంతర దీక్షతో దానిని కొనసాగిస్తారనుకో. ఆ అధ్యయనానికి ఆ కాలం సరిపోతుందా?

'ఆరుసంవత్సరాలా? నాలుగుసంవత్సరాలా?' అతడు ప్రశ్నించాడు.

ఐదు సంవత్సరాలే అను. ఆ కాలం సమాప్తం కాగానే వారిని తిరిగి గుహకు పంపించి యువకులకు యోగ్యమైన యుద్ధకార్యాలయపదవినో మరొకపదవినో విధిగా స్వీకరింపజేయాలి. ఈ విధంగా వారు అనుభవం సంపాదిస్తారు. విభిన్నాకర్షణలకు ఆగి నిలబడతారో, కాగి జారిపోతారో పరీక్షించటానికి కూడ అవకాశమేర్పడుతుంది.

వారి జీవితంలో ఈ దశ ఎంతవరకు సాగాలి?

పదిహేనుసంవత్సరాలు. వారికి యాభైసంవత్సరాలు నిండగానే ఈ విధమైన శిక్షణనుండి (అప్పటికి సజీవులై ఉన్నవారిని) విముక్తులను కావించాలి. అప్పటికి వారు తమజీవితంలోని ప్రతికర్మయందు విశిష్టత గడించి జ్ఞానమందలి ప్రతిశాఖలోను పరిణతిని పొందిఉంటారు. జ్ఞానచక్షువును సర్వవస్తువులను భాసింపజేసేవైశ్వానరతేజంవైపు మరల్చి పరమశివాన్ని సందర్శించేసమయం ఇప్పుడాసన్నమౌతుంది. ఎందువల్లనంటే దానిని ఆదర్శంగా చేసికొని రాజ్యాన్నీ వ్యక్తులజీవితాలనూ అవశిష్టాలైన తమ జీవితాలనూ వారు వ్యవస్థీకరించాలి. తత్త్వాన్వేషణం ప్రధానవ్యాసంగంగా చేసికొని తమ తరుణం వచ్చినప్పుడు రాజకీయాలలో కూడ పరిశ్రమిస్తూ ఏదో ఘనమైనవీరకృత్యమాచరిస్తున్నామన్న దర్పంతో గాక తమ కర్తవ్యం నిర్వహిస్తున్నట్లు ప్రజాశ్రేయస్సుకోసం పరిపాలించాలి. ప్రతి తరంలోను తమవంటివారిని ఉత్పాదించి రాజ్యపాలక పదవిలో నిలిపి, అనంతరం శుభప్రదాలైన స్వర్గద్వీపాలందు వసిస్తారు. రాజ్యం వారికి స్మారకసంస్థలను నిర్మించి బలులను సమర్పించి గౌరవిస్తుంది. పిథియన్ దివ్యవాణి సమ్మతిస్తే అవతారపురుషులనీ, లేనిపక్షంలో మహోదారులైన దివ్యపురుషులనీ వారిని సమ్మానిస్తుంది.

సోక్రటిస్! మీరు శిల్పులు. మనపాలకులను పొరపొచ్చంలేని గండారపు బొమ్మలవలె దిద్దితీర్చారు.

గ్లాకన్! అవును. పాలకులను గూడ అలాగే తీర్చాను. ఎందువల్లనంటే నేను చెబుతూవచ్చింది పురుషులకు మాత్రమే వర్తిస్తుంది కాని, స్త్రీలకు వర్తించదని నీవు అపోహపడరాదు.

మీరు చెప్పినది యథార్థం. పురుషులవలెనే ఎల్లవిషయాలలో స్త్రీలు

గూడ భాగస్వాములు కావాలని చెప్పుకొన్నాము.

సరే, రాజ్యాన్ని గూర్చి ప్రభుత్వాన్ని గూర్చి చెప్పినది కేవలం స్వప్నం కాదు. కష్టసాధ్యమే అయినా అది అసంభవం మాత్రంకాదు. అయితే మనం ఊహించినపద్ధతిలోనే అది సాధ్యం. అంటే యథార్థతత్త్వవేత్తలైనరాజులు ఒకరు కాని, అనేకులు కాని రాజ్యంలో ఉద్భవించి వర్తమానప్రపంచసత్కారాలు నీచాలు నిరర్థకాలు అని ఏవగించి అన్నిటికంటె ధర్మంవల్ల కలుగుతున్నమేలునూ గౌరవాన్నీ అధికమని భావించాలి. ఎల్లవస్తువులలో న్యాయం పరమావశ్యకమని గుర్తించాలి. తాము న్యాయానికి సచివులమని భావించి తమరాజ్యంలో వారు వ్యవస్థ నెలకొల్పాలి. న్యాయసూత్రాలు పరమపవిత్రాలని భావించాలి. అప్పుడే మనరాజ్యం సాధ్యం. దీనికి నీవు ఒప్పుకొంటావా ?

వ్యవస్థీకరణకు వారెలా ఉపక్రమిస్తారు ?

పదేండ్లకు పైబడిననాగరులనందరిని దేశంలోపలికి పంపివేసి తలిదండ్రుల అలవాట్లకు గురికాకఉన్ననగరవాసులపిల్లలను వారు స్వాధీనపరచుకొంటారు. ఈ పిల్లలకు మనమిచ్చిన చట్టాలప్రకారం శిక్షణ యిస్తారు. ఈ విధంగా మనం ముచ్చటిస్తున్నరాజ్యమూ రాజ్యాంగవిధానమూ శీఘ్రతమకాలంలోనే నెలకొంటవి. అలాంటిరాజ్యాంగవిధానసముపేతమైన రాజ్యం మిక్కిలిగా మేలు పొందుతుంది.

అవును, అదే ఉత్తమోత్తమమార్గం. అట్టిరాజ్యాంగవిధానం ఎలా అవతరించవచ్చునో మీరు చక్కగా అభివర్ణించారు.

పరిపూర్ణరాజ్యాన్ని గూర్చీ తత్సదృశవ్యక్తినిగూర్చీ ఇకచాలును. అతనిని వర్ణించి చెప్పటం కష్టం కాదు.

నిజమే. ఇంక చెప్పవలసినది లేదు. ఇందు మీతో నేనూ ఏకీభవిస్తున్నాను.

# ఎనిమిదవ ప్రకరణం

గ్లాకన్, ఉత్తమోత్తమరాజ్యంలో ఆలుబిడ్డలు ఉమ్మడిగా ఉంటారు. విద్యాభ్యాసం, యుద్ధక్రియలు, శాంతి కార్యకలాపాలు ఎల్లరకు సామాన్యమే. ఉత్తమతత్త్వవేత్తలు యోధులై రాచరికం నెరపుతుంటారని నిర్ణయించాము కదా?

అవును. ఆ నిర్ణయానికే వచ్చాము.

పాలకులు నియుక్తులై తమసైనికులకు ఉమ్మడిఇండ్లలో ఆవాసాలు కల్పిస్తారు. వాటిలో వ్యక్తిగతమైనది ఏదీ ఉండదు. వారి ఆస్తిపాస్తులను గూర్చి చెప్పుకొన్నది గుర్తున్నది కదా?

అవును. సామాన్యంగా మానవజాతికుండే ఆస్తిపాస్తులేవీ వారికెవరికీ ఉండవు. యోధులైనవ్యాయామక్రీడాపరులు పాలకులై వార్షికవేతనానికి బదులుగా తమపోషణకు వలసినదానినిమాత్రం పౌరులనుంచి పొందుతూ తమభద్రతనూ రాజ్యభద్రతనూ కాపాడుతుంటారని చెప్పుకొన్నాము.

నిజమే. కర్తవ్యవిభాగం సమాప్తిపొందింది. కాబట్టి ఎక్కడ శాఖాచంక్రమణం జరిగిందో చూస్తే తిరిగి మొదటిచోటు చేరవీలుపడుతుంది.

పునరాగమనం కష్టం కాదని ఇప్పటిలాగానే అప్పుడు చెప్పారు. రాజ్యవర్ణన పూర్తిచేశారు. ఆ రాజ్యమూ తత్సదృశుడైన మానవుడూ ఉత్తములన్నారు. అయితే రాజ్యానికీ మానవులకూ సంబంధించిన ఉత్తమవిషయాలు ఇంకా ఎన్నో మీరు చెప్పవలసి ఉన్నది. ఆ పిమ్మట ఈ అభివర్ణిత రాజ్యం సత్యరూపి అయితే తక్కినవి అసత్యాలన్నారు. సత్యరూపులలో ప్రధానంగా నాలుగు ఉన్నవన్నారు. వాటి దోషాలు, తత్సదృశవ్యక్తుల దోషాలు పరిశీలనయోగ్యాలు. వ్యక్తులను అందరిని పరిశీలించి

వారిలో ఎవడు ఉత్తముడో ఎవడు అధముడో తేల్చుకొన్నతరువాత 'ఉత్తమోత్తముడు సుఖి, అధమాధముడు దుఃఖి కాకపోతారా?' అన్న విషయం పరిశీలించవలసి ఉన్నది. మీరు పేర్కొన్న నాల్గువిధాల రాజ్యాలు ఏవని మిమ్మ ప్రశ్నించాను. అప్పుడు పాలిమార్కస్, యాడైమాంటస్ తాము చెప్పదలచుకొన్నది చెప్పారు. తరువాత మీరు మళ్ళీ ప్రారంభించి ఇప్పుడున్న చోటికి వచ్చారు.

నీ స్మృతి నిర్దుష్టం.

సరే. మీరిప్పుడు మల్లులవలె స్వస్థానంలో సిద్ధపడండి. కొన్ని ప్రశ్నలడుగుతాను. అప్పుడు చెప్పదలచుకొన్న సమాధానమే ఇప్పుడు చెప్పండి.

సాధ్యమైతే అలాగేనని అన్నాను.

''మీరప్పుడు చెబుతూవచ్చిన నాలుగురాజ్యాంగవిధానాలేవో?'' అతడు కుతూహలియై అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానం సుకరమే. నేను పేర్కొన్న నాలుగు ప్రభుత్వాలలో క్రీటాస్పార్టాలప్రభుత్వం ఒకటి. దీనిని సర్వసామాన్యంగా ఎంతో శ్లాఘిస్తున్నారు. ఆ తరువాతిది ధనికవర్గీయప్రభుత్వం (Oligarchy). ఇది అంతగా కీర్తితం కాదు. ఈ ప్రభుత్వవిధానం అనర్థక భూయిష్ఠం. మూడవది ప్రజాస్వామ్యం (Democracy). స్వల్పసంఖ్యాకరాజ్యం తరువాత ఇదే పరిగణ్యం. కడపటిది నిరంకుశప్రభుత్వం (Tyranny). ఇది తక్కిన వాటన్నికంటె విలక్షణమై ప్రఖ్యాతికెక్కింది. ఈ రాజ్యం ఘోరతమ అవ్యవస్థాకలితం. వీటికంటె వేరుగా విస్పష్టలక్షణలక్షితమైన రాజ్యం మరొకటి నాకు తెలియదు. నీకేమైనా తెలుసా? రాజులచేత అధినేతలచేత పాలింపబడుతూ క్రయవిక్రయాలకులోనై చేతులుమారే రాజ్యాలూ, మరికొన్ని మధ్యస్థప్రభుత్వవిధానాలు ఉంటవి. ఇలాంటి అనిర్దిష్టనామకాలు యవనులలోను, బర్బరులలోను గోచరించవచ్చు.

అవును. అనేక విచిత్రప్రభుత్వపద్ధతులు వారికున్నట్లు వింటాము.

అయితే మానవస్వభావంలోవలెనే రాజ్యాలలో గూడ అత్యంతవైచిత్ర్యం

ఉన్నదని గుర్తించావా? ఎందుకంటే రాజ్యాలు దారుశిలామయాలు కావు. అందలి మానవులస్వభావాలనుబట్టి అవి ఏర్పడుతవి. ఏ స్వభావాలు ఎటు మొగ్గుచూపితే అటువైపు తక్కినస్వభావాలు మొగ్గుతవి.

అవును. మానవులవంటివే రాజ్యాలు. అవి మానవస్వభావాలనుంచి ఉత్పన్నాలవుతవి.

రాజ్యాలు అయిదై రాజ్యాంగవిధానాలు ఐదు అయినప్పుడు వైయష్టిక మానవస్వభావాలు కూడ ఐదే కదా?

అవును.

అల్పసంఖ్యాక ప్రభుత్వానికి సదృశుడైన న్యాయవంతుడు ఉత్తముడని మనం పేర్కొన్నాము. అతనిని ఇదివరకే అభివర్ణించాము.

అవును.

తరువాత న్యూనప్రకృతులను పరిశీలింతామా? స్పర్ధాళువై తృష్ణగలవాడు స్పార్టారాజ్యంవంటివాడు. ధనికవర్గీయ ప్రజాస్వామిక నిరంకుశప్రకృతులను పరిశీలింతాము. అత్యంత న్యాయవంతునిప్రక్క అత్యంత అన్యాయవంతుని నిల్పిచూస్తే, న్యాయవంతమైనజీవితం సాగించేవానిసుఖం అన్యాయవంతమైనజీవితం సాగించేవానిదుఃఖంతో పోల్చిచూస్తే వాని తారతమ్యం స్పష్టంగా బోధపడుతుంది. మనపరిశీలనమప్పుడు సఫలమవుతుంది. థ్రాసిమాకస్ సలహాయిచ్చినట్లు మనం అన్యాయాన్ని అనుసరించాలో, లేక హేతుపురస్సరంగా న్యాయాన్ని అనుసరించాలో తేలిపోతుంది.

నిశ్చితంగా మీరు చెప్పినట్లే చేదాము.

లోగడ విస్పష్టతకై ముందు రాజ్యాన్నీ తరువాత వ్యక్తినీ పరిశీలించాము. ఆ పద్ధతినే ఇప్పుడూ అనుసరించి గౌరవప్రణయి అయిన రాజ్యాంగ విధానం పరిశీలింతామా? ప్రభుత్వానికి ♦చాయురాజ్యమను పేరుతప్ప

---

♦ గ్రీకుపదం 'టిమోక్రాటియ'. టిమో అంటే విలువ, మూల్యము, నైతికపు

(Timocracy) మరొకపేరున్నట్టు నాకు తెలియదు. దీనితో ఏతత్పౌర స్వభావాన్ని పోల్చిచూదాము. ఆ తరువాత ధనికవర్గీయ రాజ్యాన్నీ, తత్పౌరునీ పరిశీలింతాము. ఆ మీద ప్రజాస్వామ్యంపైనీ ప్రజాస్వామిక మానవునిపైనీ మనదృష్టి ప్రసరింతాము. కడపట నిరంకుశరాజ్యమూ, నిరంకుశమానవుని మనస్తత్త్వమూ సమాలోచించి సంతృప్తికరమైన నిర్ణయానికి వద్దాము.

అవును, అదేమేలు.

అయితే అరిస్టోక్రసీనుంచి చాయురాజ్యం ఎలా ఉద్భవిస్తుందో ముందు పరిశీలిద్దాము. రాజకీయపుమార్పులు ప్రభుత్వాధికారవిభాగాలవల్ల ఉద్భవిస్తవి. ఎంత చిన్నదైనా ఏకీకృతంగా ఉన్నప్రభుత్వాన్ని కదిలింప వీలుపడదు.

అవును.

అయితే మనరాజ్యం ఎలా ప్రచ్యుతి పొందుతుంది ? ఏ విధంగా పాలకులకూ వారిసహాయకులకూ పరస్పరకలహాలు, పొరపొచ్చాలు వస్తవి ? "వారిలోన కలంత లెట్లు వచ్చెనో కో ?" అని హోమర్‌వలె మనం గూడ విద్యాధిదేవతలను ప్రార్థింతామా ? మనలను పిల్లలనువలె పరిగణించి లీలావినోదార్థులై ఆ దేవతలు ఉదాత్తవిషాదాంతనాటకీయశైలిలో సంభాషిస్తున్నట్లు ఊహింతాము.

వారు ఎలా మాటాడుతారంటారు ?

ఏతాదృశరాజ్యాంగవిధానబద్ధమైవరాజ్యం కంపితం కాజాలదు. కాని, మొదలున్నదానికి తుది ఉండకతప్పదు. ఈ రాజ్యాంగవిధానం ఇట్టిదైనా చిరకాలం మనదు. కాలగర్భంలో కలిసితీరుతుంది. ఆ విలయం ఇలా సంభవిస్తుంది : భూమియందు పెరిగేఉద్భిజ్జాలలోను, భూమిపై చరించే జంతువులలోను శారీరకమానసికవీర్యవంధ్యతలు వానివాని చక్రపరిధుల

---

విలువ. క్రాట్ అంటే ప్రభుత్వం. కాగా, టిమోక్రసీ అంటే కీర్తిగౌరవప్రణయ సూత్రకమైనరాజ్యం.

పరిపూర్తిమీద ఆధారపడుతుంటవి. అల్పకాలజీవులచక్రాలు తక్కువ దూరం, దీర్ఘకాలజీవులచక్రాలు ఎక్కువదూరం పయనించవలసి ఉంటుంది. అయితే పాలకుల విద్యాప్రజ్ఞలెంతవైనా మానవవీర్యవంధ్యతలజ్ఞానం సాధించలేవు. వాటిని నడిపేసూత్రాలను ఐంద్రియకతాకలుషితమైనబుద్ధి కనిపెట్టలేదు. అవి వారి విద్యాప్రజ్ఞలకు అందవు. లోకంలో అవతరింపజేయరానివిషమకాలంలో పిల్లలను అవతరింపజేస్తారు. ఎందుకంటే దివ్యయోని ఆయుఃప్రమాణం పూర్ణాంక (Perfect number) నిర్దిష్టం. సదృశాసదృశాలు, వృద్ధిక్షయాలు పొందిస్తూ గణనీయపదాలు (Commensurate terms) ఉత్పాదించేమూలాంకాల (Basic numbers) వర్గవర్గమూల (Square, Square root) గుణకారాలతో గూడిన ఆద్యసంఖ్యచే మానవశిశూత్పత్తి నియతమౌతుంది. ఈ మూలాంకాలలో మూడు నాలుగు ఐదు సంఖ్యలను నాలుగుఘాతం (Power) చే పెంచినప్పుడు రెండురాశులు (Harmonies) ఏర్పడుతవి. ఈ రెంటిలో ఒకటి శతగుణకభుజమైనచతురస్రం. రెండవది దీర్ఘచతురస్రం. దీనిభుజమొకటి పంచసంఖ్యాకచతురస్రవ్యాసములయొక్క శతవర్గం. ఈ వ్యాసాలు కరణీయాలైతే (irrational) ఒకటిచే తగ్గుతవి. అకరణీయాలైతే (rational) రెంటిచే తగ్గుతవి. రెండవభుజం మూడవసంఖ్యయొక్క మూడవఘాతమునకు వందరెట్లుంటుంది. భూమిని కొలిచి అదుపులో ఉంచే ఈ సంఖ్య జన్మాలగుణావగుణాలకు మూలం. జన్మసంఖ్యాజ్ఞానశూన్యులైన సంరక్షకులు వధూవరులసమాగమం దుర్ముహూర్తమందు సంఘటించటంవల్ల జన్మించేసంతతి సద్గుణోపేతం కాదు. అదృష్టవంతమూ కాదు. ఆ సంతతిలోనిఉత్తములే పెద్దలచే పదవీనియుక్తులైనా వారు తమపెద్దలపదవులకు యోగ్యులు కారు. అట్టివారు సంరక్షకుల అధికారం చేపట్టినప్పుడు విద్యాధిదేవతలను రక్షించలేరు. మొదట సంగీతసాహిత్యాలను ఉపేక్షిస్తారు. ఈ ఉపేక్ష క్రమంగా వ్యాయామానికి కూడా ప్రాకుతుంది. దీనిమూలాన యువమండలి న్యూనసంస్కారం పొందుతుంది. ఆ మీదితరంలో విభిన్నజాతితత్వగ్రహణమూ రక్షాపాటవమూ లేనివారు రక్షకులవుతారు. హెసియడ్ పేర్కొన్నట్లు నాలుగుజాతులు సువర్ణరజతారకూటలోహమయాలు. అలాంటి సంరక్షకులకాలంలో జాతిసాంకర్యం అంకురిస్తుంది. ఇనుము వెండితో, ఇత్తడి పుత్తడితో మిళితమగుటవల్ల వైషమ్యం, అసమానత్వం, అక్రమత్వం బయలుదేరుతవి. ఇవే ద్వేషానికీ, యుద్ధానికీ కారణాలవుతవి. ఏ పొరపొచ్చెం బయలుదేరినా ఇట్టి సంకరజాతినుంచే బయలుదేరిందని విద్యాధిదేవతలు చెబుతున్నారు.

ఇదే వారు మనకిస్తున్న సమాధానం.

అవును, వారు మనకు సత్యమే చెబుతున్నారనుకోవచ్చు.

నిజమే. విద్యాధిదేవతలు అసత్యమెలా చెబుతారు?

ఆ తరువాత వారేమంటారు?

వైషమ్యం బయలుదేరినప్పుడు రెండుజాతులు రెండువిభిన్నమార్గాలు అనుసరించాయి. ఆరకూటలోహతత్త్వసమ్మిశ్రితజాతులు ధనలుబ్ధాలై వెండిబంగారాలు, ఇండ్లువాకిళ్ళు, పొలంపుట్ర గడించనారంభించాయి. సువర్ణరజతమయజాతులు ధనలోభవిముఖాలై యథార్థసంపదలు తమ స్వభావమందే ఉన్నవని యెరిగి సద్గుణసంపత్తియందూ ప్రాచీనవ్యవస్థ యందూ ఆసక్తమయ్యాయి. ఈ విధంగా ఏర్పడిన ఉభయపక్షాలకు యుద్ధం బయలుదేరింది. తుదికి వారు తమ ఉమ్మడిభూములు, ఇండ్లు వ్యక్తులకు పంచియిచ్చుటకు ఒప్పుకొన్నారు. తొల్లి తాము స్వాతంత్ర్య మిచ్చి కాపాడినమిత్రులనూ పోషకులనూ స్వాతంత్ర్యవిదూరులను చేశారు. వారిని పాలితులనుగా సేవకులనుగా మార్చివేశారు. వీరివల్ల ముప్పురాదా? కనుక ఒకప్రక్కన వీరిని కనిపెట్టి ఉంటూ, మరొకప్రక్కన ఆ పాలకులు యుద్ధం సాగిస్తూవచ్చారు.

పరిణామమూలకారణాన్ని మీరు చక్కగా గ్రహించినట్లున్నది.

ఈ విధంగా బయలుదేరినప్రభుత్వం అటు అరిస్టోక్రసీకి, ఇటు ధనికవర్గీయ రాజ్యానికి (Oligarchy) మధ్యస్థమైనప్రభుత్వమవుతుంది.

అవును.

ఇలాంటిమార్పు వస్తుంది. ఇది వచ్చినమీదట వారు ఏమి చేస్తారు? ఈ నూతనరాజ్యం అటు అరిస్టోక్రసీకి, ఇటు ధనికవర్గీయరాజ్యానికి మధ్యస్థమై కొంతమేర మొదటి రాజ్యాన్ని, మరికొంతమేర రెండవరాజ్యాన్ని అనుసరిస్తూ కొన్నిప్రత్యేకలక్షణాలను పొందుతుంది.

నిజమే.

పాలకులకు ఇచ్చేగౌరవంలోనేమి, క్షత్రియజాతి కృషివాణిజ్యాలను పరిహరించటంలోనేమి, ఉమ్మడిభోజనాలలోనేమి, వ్యాయామసైనిక శిక్షణశ్రద్ధలోనేమి ఈ రాజ్యం అరిస్టోక్రసీని పోలుతుంది.

అవును.

కాని, ఈ రాజ్యం తత్త్వవేత్తలకు అధికారమివ్వాలంటే భయపడుతుంది. ఎందుకంటే కేవలసద్గుణోపేతులై చిత్తశుద్ధిగలిగిన తత్త్వవేత్తలు లభించరు. ఉన్నవారిలో విభిన్నతత్త్వాలు సమ్మిశ్రితాలై ఉంటవి. తత్త్వవేత్తలనుంచి విముఖమై యీ రాజ్యం ఉత్కటరాగులు, అగంభీరులు యోధనక్రియైకయోగ్యులు అయినవారినే అభిమానిస్తుంది. సైనికవ్యూహాలకూ తంత్రాలకూ నిరంతరయుద్ధనిర్వహణకూ ప్రాముఖ్యం ఇస్తుంది. ఈ పేర్కొన్నవిషయాలతో ఈ రాజ్యం చాలవరకు విలక్షణంగా ఉంటుంది.

అవును.

ఇలాంటి స్వభావం కలిగినమానవులు ధనికవర్గీయరాజ్యంలోనివారివలెనే ధనప్రలోభులు. వెండిబంగారాలంటే ఎక్కడలేని నిగూఢకాంక్ష. అందువల్ల వాటిని అతిగోప్యప్రదేశాలలో దాస్తారు. వీటిగోపనకై స్వకీయ భాండాగారాలు, ఆయుధాగారాలు, దుర్గాలు ఉంటవి. ఈ దుర్గాలలో తమభార్యలకోసం కాని, ఇష్టులకోసం కాని పెద్దపెద్దమొత్తాలు వెచ్చిస్తుంటారు.

వాస్తవం.

తాము అభిలషించేధనం బాహాటంగా సంపాదించేమార్గాలుండవు. కాబట్టి వారు లోభులై ఉంటారు. తమకోర్కెలను ఇతరులడబ్బుతో తీర్చుకొంటారు. ఈ విధంగా సుఖాలు రహస్యంగా పొందుతూ పితృసదృశమైన న్యాయదండనంనుంచి పసిపిల్లలవలె పారిపోతారు. సాత్త్వికంగా కాక నిర్బంధంతో వారు శిక్షణ పొందుతారు. ఎందువల్లనంటే జ్ఞానానికి తత్త్వశాస్త్రానికి సహచారులైన సంగీతసాహిత్యాలనూ విద్యాధిదేవతలనూ

వారు ఉపాసించక ఉపేక్షించారు. వ్యాయామాన్ని ఎక్కువగా గౌర వించారు.

మీరు వర్ణిస్తున్న ప్రభుత్వరూపం నిస్సంశయంగా భద్రాభద్రసమ్మిశ్రితం.

మిశ్రణమే. ఇక్కడ ఒకటి అత్యంతప్రధానంగా కనిపిస్తున్నది. స్పర్ధా తృష్ణల ప్రాబల్యం ఇందు మెండు. ఈ స్పర్ధాతృష్ణలు ఉత్సాహంవల్ల ఏర్పడుతున్నవి.

అవును.

సంగ్రహంగా ఈ రాజ్యంయొక్క ఉత్పత్తిస్వభావాలు ఇవి. ఇంతకంటె సమగ్రవిచారణ అనావశ్యకం. పరిపూర్ణన్యాయ్యాన్యాయ్యరాజ్యప్రదర్శ నకు ఈ సంగ్రహచిత్రణం చాలు. అన్నిరాజ్యాలనూ, తన్మానవులతత్త్వా లనూ సంపూర్ణంగా చెప్పాలంటే ఎంతో శ్రమపడాలి.

అవును.

ఈ ప్రభుత్వానికి ఏమనుజుడు అనుగుణంగా ఉంటాడు? అతడు ఎలా అవతరిస్తాడు? ఏ విధంగా ఉంటాడు?

ప్రధానలక్షణమైన స్పర్ధాళుతలో మనమిత్రుడు గ్లాకన్‌కంటె అతడు భిన్నంగా ఉండడనుకొంటాను.

ఆ ఒకగుణంలో అతడు అలాగే ఉండవచ్చును. కాని, ఇతరగుణాలలో అతడు భిన్నుడు.

ఏ గుణాలలోనంటారు?.

అతనికి అహంవాదిత్వం మెండు. సంస్కారంతక్కువ; కాని, సంస్కృతి బంధువు. చక్కగా వింటాడు కాని, మాటాడడు. అలాంటివాడు విద్యావంతునికంటె భిన్నుడై బానిసలతో మొరటుగా ప్రవర్తిస్తాడు. అతడు స్వతంత్రులపట్ల వినమ్రుడు. శాసనాన్ని శిరసావహిస్తాడు. అధి

కారగౌరవాలలో బద్ధప్రణయి. పరిపాలించేఅధికారం తనకు ఉన్నదంటాడు. అయితే ప్రసంగసామర్థ్యమో, అలాంటి మరొకయోగ్యతయో తనకున్నదని కాదు. అతడు వీరభటుడు. ఆయుధనైపుణి, మృగయావ్యాయామాలు అతనికెంతో ఇష్టం.

అవును. ఇలాంటిప్రకృతి చాయురాజ్యానికి (Timocracy) యోగ్యం.

అలాంటివాడు పిన్నతనమందు మాత్రమే సంపదలు ద్వేషిస్తాడు. పెద్దవాడు అవుతున్నకొలది వానివైపు మొగ్గుతాడు. దీనికి కారణమైనధనతృష్ణ అతని కున్నది. కాబట్టి అతడు సద్గుణైకనిష్ఠుడు కాడు. అతనినుంచి రక్షకశీలం నిర్గమించింది.

రక్షకశీలమంటే?

సంగీతసాహిత్యసంపన్నమైనతత్త్వశాస్త్రం. మానవునిలో స్థిరావాసం ఏర్పరచుకొన్నప్పుడు అది ఒక్కటిమాత్రమే అతనిగుణసంపత్తిని వజ్రకవచమై యావజ్జీవం కాపాడుతుంది.

అవును.

ఇంతకూ చాయురాజ్యయువకుడు అలాంటివాడు. అతడు గూడ చాయురాజ్యంవలెనే ఉంటాడు.

అవును.

అతని పుట్టుపూర్వోత్తరాలు ఇవి. అస్తవ్యస్తపరిపాలన సాగుతున్న రాజ్యంలో ఏ అధికారమూ గౌరవమూ అంగీకరింపనొల్లక ధీరుడైయున్న వానికి ఇతడు కుమారుడై ఉద్భవిస్తాడు. అతనితండ్రి తనకు న్యాయ్యంగా దక్కవలసినదానికోసమైనా న్యాయస్థానాలకు పోడు; ఎలాంటి ప్రయత్నమూ చేయడు. కష్టాలు, ఇబ్బందులు పరిహరించటంకోసం తనస్వత్వాలు కూడ వదలుకొన సిద్ధపడుతాడు.

మరి కొడుకుస్వభావం ఎలా తయారవుతుంది?

అతడు తల్లి మొత్తుకోళ్ళను అలకిస్తాడు. ఆమెభర్తకు ప్రభుత్వంలో స్థానం ఉండదు. అద్దానివల్ల ఆమెకు ఇతరమహిళల్లో అగ్రస్థానం లభించదు. పైగా భర్తకు ధనాసక్తి ఉండదు. సభలలో, న్యాయస్థానాలలో ఆత్మ రక్షణతత్పరుడు కాక ఏది సంభవించినా అతడు సమచిత్తంతో స్వీక రిస్తాడు. అతని ఆలోచనలన్నీ అతనియందే కేంద్రీకృతాలవుతవి. ఆమెను ఉపేక్షాభావంతో చూస్తాడు. ఇవన్నీ చూచి ఆమె కలతపొందుతుంది. 'మీనాన్న అరమానిసి, పరమాలసుడు' అంటూ ఆమె కొడుకువద్ద వెళ్ళబోసుకుంటుంది.

“అవును, ఆ గోడు అంతా ఇంతా కాదు. ఆడువారితత్త్వమెంతో ఆ గోడురూపు కూడ అంతే.” యాడైమాంటస్ అందుకొన్నాడు.

ఆ కుటుంబాన్ని కనిపెట్టుకొని వంశపారంపరితో వస్తున్న వృద్ధసేవకులు గూడ తరుచు ఇదేధోరణిలో మాటాడుతుంటారు. అతనితండ్రికి ఋణ పడిఉన్నవానిని చూచినా, తండ్రికి అపకారంచేసినవాడు కనిపించినా ఆవృద్ధసేవకులు వారినిచూపి, “పెద్దవాడవైనప్పుడు వారిపై కక్షసాధిం చాలి. మీనాన్నగారి కంటె నీవు నిండుమగసిరి చూపాలి” అని ఆ పిల్లవానికి చెబుతుంటారు. వెలుపలి ప్రపంచంలో అడుగుపెట్టినప్పుడు కూడ అతనికిదే కనిపిస్తుంది; ఇదే వినిపిస్తుంది. తమపనిని తాము చక్క బెట్టుకొనేవారు అమాయికులుగా, అసమర్థులుగా పరిగణింపబడుతారు. వారికి గౌరవప్రతిష్ఠలుండవు. పూసుకొనితిరిగేవారికి ఎక్కడలేని గౌర వమూ, మర్యాద. ఈవిషయాలన్నీ కనులార చూస్తూ, చెవులార వింటున్నయువకుడు తనతండ్రిఉపదేశాలను జీవితాన్ని స్వయంగా గమనిస్తూ తదితరాలతో తావిళ్ళువేసి పరిశీలిస్తూండేకొడుకు ఎడపెడల కీడ్వబడుతాడు. తండ్రి తనలోనివివేకాన్ని ప్రోదిచేస్తుంటే, ఇతరులు ఉత్సాహతృష్ణలను పెంపొందిస్తుంటారు. అతడు జనుషాదుష్టుడు కాడు. కాని, దుష్టసహవాసబలంవల్ల సుకృత దుష్కృతాలకు మధ్యస్థంగా ఉంటాడు. ఆంతరికదివ్యతేజోరాజ్యం వదలుకొని స్పర్ధోత్సాహవివశుడై గర్విష్ఠుడై అతితృష్ణాళువు అవుతాడు.

అతని పుట్టుపూర్వోత్తరాలు మీరు చక్కగా వివరించారు.

రాజ్యద్వితీయరూపమూ అందలిపౌరుడూ మనకు విస్పష్టమైనట్లే కదా?

అవును.

తరువాత, ఈస్క్యలస్ అన్నట్లుగా "అన్యరాజ్యమ్మునకు యోగ్యుడైన వాని" గూర్చి ఆలోచింతామా? కాక రాజ్యంతోనే ప్రారంభింతామా?

ఎలాగైనా సరే.

ఆ వెనుక ధనికవర్గీయరాజ్యం (Oligarchy) వస్తుందనుకొంటాను.

ఏరాజ్యాన్ని మీరు ధనికవర్గీయరాజ్యమంటారు?

ఆస్తివిలువపై ఆధారపడే ప్రభుత్వం. ఈ రాజ్యంలో సంపన్నులకు అధికారం, నిరుపేదలకు తదపహరణం సంభవిస్తవి.

సరే.

చాయురాజ్యం ధనికవర్గీయరాజ్యంగా ఎలా పరిణమిస్తుందో చెప్పనక్కర లేదా?

తప్పక.

మొదటిది రెండవదిగా ఎలా మారుతుందో గ్రహించటానికి అంతగా తెలివితేటలక్కర లేదనుకొంటాను.

ఎలాగంటారు?

వ్యక్తులకోశాలు స్వర్ణపరిపూర్ణాలు కావటంతోనే చాయురాజ్యానికి వినాశం దాపరిస్తుంది. ధర్మేతరధనవ్యయానికి పాలకులు ఒడికడతారు. వారికి గాని, వారిభార్యలకు గాని చట్టమన్నా ధర్మమన్నా లక్ష్యమేముంటుంది?

నిజమే.

ఒకడు భాగ్యవంతుడైతే చూచి మరొకడు అతనితో పోటీపడుతాడు.

ఈ విధంగా ప్రజలలో బహుళ సంఖ్యాకులు ధనలుబ్ధులవుతారు.

అది సహజమే.

ఈ విధంగా సంపదలపై సంపదలు కూడబెడతారు. ధనతృష్ణ పెంపొందుతున్నకొలది గుణాసక్తి సన్నగిల్లుతుంది. తులాధటాధిరూఢమైన సంపద్గుణద్వయంలో ఒకటి పైకిపోతే రెండవది క్రిందికి వ్రాలక తప్పదు కదా?

అవును.

సంపదలయందు, సంపన్నులయందు అభిమానగౌరవాలు పెంపొందినకొలది గుణసంపత్తిలోను, గుణవంతులలోను అనభిమానగౌరవాలు పెచ్చరిల్లుతవి కదా?

అవును.

మరి మానితార్థమందు ఆసక్తి, అమానితార్థమందు ఉపేక్ష పెంపొందుతవి.

నిజమే.

కాబట్టి తుదికి కీర్తిస్పర్ధలయందలిఆసక్తికి మారుగ ధనవాణిజ్యాలలో మమకారం పెరుగుతుంది. ధనవంతుని పౌరులు గౌరవిస్తారు. వారికతడు ఆదర్శమూర్తి అవుతాడు. అతన్ని పాలకుని చేస్తారు. నిరుపేదను అవమానిస్తారు.

అవును.

ఆ పిమ్మట వారు పౌరత్వం సిద్ధించాలంటే ఇంతధనం ఉండాలని శాసిస్తారు. ఈ మొత్తం ధనికవర్గీయరాజ్యస్థాయినిబట్టి ఎక్కువో తక్కువో అవుతుంది. నిర్దిష్టప్రమాణన్యూనధనికి ప్రభుత్వంలో స్థానం ఉండదు. బెదరింపులతో కార్యసిద్ధి కాకపోతే ఆయుధబలంతో రాజ్యాంగవిధానాన్ని సంస్కరిస్తారు.

అది నిజం.

మొత్తమ్మీద ధనికవర్గీయరాజ్యం ఇలా నెలకొంటుంది.

ఇంతకూ ఈ ప్రభుత్వలక్షణాలేమిటి? దోషాలేమిటి?

వారు విధించేయోగ్యతనే పరిశీలించు. సంపత్తినిబట్టి నౌకాధిపతులను నియోగించారనుకో. నౌకాచోదననైపుణ్యం ఉన్నా, పేదరికాన్ని మున్నాడుకొని ఒకనికి ఆ పదవి ఇవ్వలేదనుకో. అప్పుడేమి జరుగుతుందో ఊహించు.

అంటే నష్టేటపుట్టి మునుగుతుందనేగా మీ తాత్పర్యం?

అవును. మరి ప్రభుత్వానికిది సంభవించదా?

సంభవిస్తుంది.

ఇది రాజ్యానికి కూడ అన్వయిస్తుందంటావా లేదా?

వర్తించకపోవటమేమి? వర్తిస్తుంది. ఎందుకంటే రాజ్యపాలన సామాన్యం కాదు. అత్యంతక్లేశావహం.

అయితే ధనికవర్గీయరాజ్యంలో ఇది మొదటిదోషం.

అవును.

దానికి మరొకదోషం కూడ తోడవుతున్నది.

ఏ దోషమంటారు?

అనివార్యవిభాగం. అలాంటిరాజ్యం ఏకరాజ్యం కాదు. రెండురాజ్యాలవుతుంది: ఒకటి ధనికులరాజ్యం; మరొకటి పేదలరాజ్యం. ఒకేచోట నివసిస్తూ ఇరువాగులు ఎల్లప్పుడు ఒండొంటిపై కుట్రలు పన్నుతుంటవి.

అది శోచనీయమే.

మరొక దుర్లక్షణమేర్పడుతుంది. ఆ పౌరులు ఏ యుద్ధమూ సమర్థతతో కొనసాగించలేరు. అక్కరవస్తే పాలకులు ప్రజానీకానికి ఆయుధాలిచ్చి యుద్ధసన్నద్ధం చేయాలి. ఆ పక్షంలో శత్రువులకంటె ప్రజలకే వారు మెండుగా భయపడాలి. అట్లుకాక యుద్ధసమయంలో వారిని పిలవక పోతే పాలకులు మాత్రమే యుద్ధం చేయవలసివస్తుంది. అప్పుడు వారు అల్పసంఖ్యాకులవుతారు. పైగా ధనలోభం వారిని పన్నులు చెల్లించ నీయదు.

ఎంత అవమానకరం !

దీనికి తోడు ఇలాంటి రాజ్యాంగవిధానంలో ఒకేవ్యక్తి అనేకవృత్తులు అవలంబించవలసివస్తుంది. ఒకడే కర్షకుడూ వర్తకుడూ యుద్ధభటుడూ కావాలి. అది యోగ్యమంటావా?

ఎలా అవుతుంది?

వీని అన్నిటికంటె మించినదోషం మరొకటి రాజ్యంలో అంకురించ వచ్చును.

ఏ దోషం?

తనకున్నదంతా ఒకడు అమ్ముకోవచ్చును. మరొకడు కొనుక్కోవచ్చును. తనసర్వస్వం అమ్ముకొన్నతరువాత అతడు తనకు ఏ స్థానమూ కలుగని రాజ్యంలో వసిస్తాడు. అతడప్పుడు వర్తకుడా కాడు. శిల్పియా కాడు. రైతా కాడు. పదాతియా కాడు. కేవలం నిస్సహాయుడైన నిరుపేద అవుతాడు.

అవును. ఈ రాజ్యంలో తొలిసారిగా ఆ దోషమే అంకురిస్తుంది.

ఈ అనర్థకం అనివార్యం. ధనికరాజ్యంలో ఒకప్రక్క మహాసంపద, మరొకప్రక్క ఘోరదారిద్ర్యం పేరుకొని ఉంటవి.

నిజమే.

అయితే మరొకసారి ఆలోచించు. సంపన్నుడైఉన్నరోజుల్లోనైనా అతడు సొమ్ము వమ్ముచేస్తున్నప్పుడు రాజ్యానికి మేలేమైనా చేశాడా? లేక పరిపాలకసంఘంలో సభ్యుడుగా మాత్రమే ఉన్నాడా? అతడు పాలకుడూ కాక, పాలితుడూ కాక సొమ్ము వమ్ముచేస్తూవచ్చాడు గదా?

అవును. మీరు చెప్పినట్లు పాలకుడువలె కన్పించాడు. కాని, వాస్తవానికి డబ్బుమాత్రమే తగలేశాడు.

తేనెపట్టులో పోతుటీగ (drone) ఎలాగో ఇంటిలో ఇతడూ అలాగే మధుకోశానికి పోతుటీగవలె రాజ్యానికితడు వినాశకారి.

అంతే, సోక్రటిస్:

యాడైమాంటస్ ! పోతుటీగకు ఈశ్వరుడు కొండీ ఇవ్వలేదు కాని, ఈ నడి పోతుటీగలలో కొన్నిటికి భయంకరాలైన కంటకాలిచ్చాడు. కంటకాలు లేని పోతుటీగలజాతికిచెందినవారే ముదిమిలో నిరుపేదలైనవారు. సర్వ దోషులు కంటకదారుణమధుపాలు.

అవును.

రాజ్యంలో నిరుపేదలు గోచరించారంటే చోరులు, జేబుదొంగలు, దేవకుల తస్కరులు మున్నగాగలదోషులు ఆ ప్రాంతంలోనే నిగూఢంగా ఉన్నారన్నమాట.

స్పష్టంగా అంతే.

మరి ధనికవర్గీయరాజ్యంలో నిరుపేదలు కనిపించరా?

కనిపించకేమి? పాలకుడుకాని ఎల్లవాడు దాదాపు ఒకనిరుపేద.

ఆ పక్షంలో వారిలో బహుదోషులుంటారు. అయితే ప్రభుత్వం జాగ్రత్త

పడి బలం ఉపయోగించి వారిని అదుపుచేస్తుందని చెప్పవచ్చునుగదా?

నిశ్చితంగా.

అలాంటివ్యక్తుల ఉనికికి కారణమేమిటి? విద్యారాహిత్యం, శిక్షణశూన్యత, దుష్టరాజ్యాంగవిధానమూ దానికి మూలమని చెప్పవచ్చును గదా?

నిరభ్యంతరంగా.

కాగా, ధనికవర్గీయరాజ్యస్వరూపం అలాంటిది. దోషాలు అలాంటివి. వీనికితోడు మరికొన్ని అనర్థకాలుండవచ్చును.

అదీ సంభవమే.

సంపత్తిని పురస్కరించుకొని పాలకులను ఎన్నుకొనేరాజ్యాన్ని వదలి యిక దీనికనుగుణమైన వ్యక్తిపుట్టుపూర్వోత్తరాలు, స్వభావం పరిశీలింతామా?

అవశ్యం.

ఈ పేర్కొన్నతీరున నే చాయురాజ్యస్థవ్యక్తి ధనికవర్గీయరాజ్యస్థవ్యక్తిగా మారడా?

ఎలాగంటారు?

చాయురాజ్యప్రతినిధికి కుమారుడు జన్మించేసమయం వస్తుంది. కుమారుడు మొదట తండ్రిఅడుగుజాడలలో నడుస్తాడు. ఆకస్మికంగా సముద్రగర్భనిహితపర్వతోపహతమైననౌకవలె రాజ్యోపహతుడై తండ్రి తన సర్వస్వం కోల్పోతాడు. ఈ నాశనాన్ని కొడుకు కనులారచూస్తాడు. ఆ తండ్రి గూఢచారద్వేషసమారోపిత అభియోగాన్ని పురస్కరించుకొని న్యాయస్థానానికి ఈడ్వబడినసేనానియో లేక మరొక ఉన్నతోద్యోగియో కావచ్చును. అతనికి మరణదండనం విధింపబడవచ్చును. లేదా దేశబహిష్కారం సంభవించవచ్చును. అతనిపౌరస్వత్వాలు విలుప్తాలు

కావచ్చును. అతని ఆస్తి అంతా ప్రభుత్వం స్వాధీనపరచుకోవచ్చును.

అది సంభావ్యమే.

కుమారుడు ఇది అంతా కనులార చూచియుండవచ్చును. లేదా ఎరిగి ఉండవచ్చును. అతడు తనసర్వస్వం కోల్పోయాడు. హృదయపీఠికనుంచి తృష్ణ, ఉత్సాహం నిష్క్రమించాయి. లేమికి చిక్కి, దైన్యం పొంది ధనార్జనకు పూనుకొంటాడు. నైచ్యానికీ లోభిత్వానికీ ఒడికట్టి అష్ట కష్టాలుపడి ఐశ్వర్యవంతుడవుతాడు. అలాంటప్పుడు అతడు రిక్తహృదయ పీఠికపై బంధకీప్రాయమైన ప్రలోభితకు పట్టంగట్టి మూర్ధాన మకుటం, మెడలో హారం, చేతిలో ఖడ్గం నిలిపి మహారాజాధికారాలు సమర్పించడా ?

సందేహమా ?

వినయవినమితాంగులను జేసి వివేకోత్సాహాలను అతడు ఆ మహారాజున కిరువైపుల కటికనేలపై నిలుపుతాడు. అంతరువు తెలిసి మెలగండని వాటిని ఆదేశిస్తాడు. చిన్నమొత్తాలను పెద్దమొత్తాలుగ తయారుచేయటం ఎలాగో విచారించమని వివేకాన్ని పనిగొంటాడు. సంపదలూ సంపన్నులూ మాత్రమే పూజనీయాలు, ప్రస్తవనీయులు; ధనసంచయనం, తదుపాయాలు స్పృహణీయాలు అని ఉత్సాహానికి నూరిపోస్తాడు.

నిజమే, గౌరవాసక్తులైనబాలకులు లోభులుగా మారినంతత్వరితంగా మరేదీ మారదు.

మరి ప్రలోభి ధనికవర్గీయరాజ్యస్థబాలకుడే కదా ?

అవును, చాయురాజ్యంనుంచి ధనికవర్గీయరాజ్యం ఉత్పన్నమైనట్లే చాయురాజ్యస్థవ్యక్తినుంచి ధనికవర్గీయరాజ్యస్థవ్యక్తి వచ్చాడు.

అయితే ఈ ఇరువురకు సాదృశ్యమేమైనా ఉన్నదేమో పరిశీలింతామా ?

అలాగే.

సంపదలయందు ఆసక్తి ఇద్దరికీ సమానమేకదా ?

అవును.

నీచమైన లోభపుత్రిప్పులలోను, కష్టపాటులోను సాదృశ్యం ఉన్నది. వ్యక్తి ఆకలిదప్పులకు వలసినంతమాత్రంగా సొమ్ము వెచ్చిస్తాడు. లాభదాయకాలుకాని తక్కినకోర్కులను అణచివేసికొంటాడు.

నిజమే.

ప్రతిదానిలో కొంతమిగిల్చి కూడబెట్టేనీచుడవుతాడు. ఇలాంటివానిని నీచులు కొండాడుతుంటారు. ఇట్టివ్యక్తి తానుప్రాతినిధ్యం వహిస్తున్న రాజ్యానికి ప్రతీకం కాదా ?

అవును, అలాగే కనిపిస్తున్నాడు. డబ్బంటే అతడూ అతనిరాజ్యమూ ప్రాణాలు విడుస్తామంటారు.

కాబట్టి అతడు సంస్కారసంపన్నుడు గాడు కదా ?

విద్యావంతుడైతే అతడు తనజీవనచూళికకు అందమైన ధనదైవతాన్ని సూత్రధారిని చేయడు. అంతటి ఉత్తమగౌరవం నెరపడు.

సరే ఈ విషయం కూడ ఆలోచించు. విద్యావిహీనతవల్ల అతనిలో నిగూఢంగా అకించనధూర్తులవాంఛలు అణగి ఉంటవి. అతని సామాన్య జీవితాచారబలంవల్ల అవి అణచివేయబడుతవి.

నిజమే.

అతని ధూర్తక్రియలను తెలిసికోవాలంటే ఎక్కడ చూడాలో తెలుసా?

ఎక్కడ చూడాలంటారు ?

వంచనకు అవకాశమిచ్చేకార్యాలలో అతనిప్రవృత్తి చూడాలి. అనాథ

శిశుసంరక్షకత్వంవంటివానిని చూస్తే తేలిపోతుంది.

అవును.

అతడు సామాన్యవ్యవహారాలలో ఋజువర్తనుడనిపించుకొంటాడు. తెచ్చి పెట్టుకొన్నగుణసంపత్తితో దుష్టభావాలను బలవంతంగా అణచివేసి ఈ ఖ్యాతి సంపాదిస్తాడు. అంతే కాని అవి దుష్టభావాలు కాబట్టి వాటిని దగ్గరకు చేరనీయరాదన్నభావంతో మెలగడు. కేవలం కాలానికి కట్టువడి భయానికి దోసిలి ఒగ్గి తనసంపదలకెట్టిహాని వాటిల్లుతుందోనన్న శంకతో అలా నడుచుకొంటాడు.

నిశ్చితంగా అంతే.

అంతే కాదు. పోతుటీగకు సహజంగా ఉండేదుష్టచింతలన్నీ అలాగే ఉంటవి. ఇతరులధనం వ్యయించవలసివచ్చినప్పుడు అవి బయటపడుతవి.

అవును.

అలాంటప్పుడు అతడు అంతస్సంఘర్షణకు గురి అవుతాడు. కారణం అతడు ఏకవ్యక్తి కాడు. అతనిలో ఇద్దరు వ్యక్తులుంటారు. కాని, సామాన్యంగా అతనిలోని ఉత్తమవాంఛలు అధమవాంఛలను అణచివేసి తందనాలాడుతుంటవి.

నిజమే.

ఈ కారణాలవల్ల అలాంటివ్యక్తి చాలమందికంటె మెరుగు. అయినా అతడు సమరసాత్ముడు, అఖండబుద్ధికాడు. సమరసత్వం అతనికి దూరమై పోతుంది.

అవును.

విజయసాధనకు లోభి యోగ్యుడు కాడు. మాననీయవాంఛాసాధనకు గూడ సమర్థుడు కాడు. కీర్త్యర్థం జరిగేస్పర్ధలో అతడు ద్రవ్యం

ఏమాత్రం వెచ్చించడు. తనలో నిద్రాణంగా ఉన్న వ్యయాత్మకవాంఛలను మేలుకొలిపి పోటీలో వాటిసాయం పొందభయపడుతాడు. ధనికవర్గీయ ఆచారానుగుణంగా తనసాధనసంపత్తిలో అల్పభాగమే వెచ్చించి పోటీలో పాల్గొంటాడు. దానిమూలాన ధనం దక్కించుకొని బహుమానం కోల్పోతాడు.

అక్షరాల నిజం.

మరి ధనార్జనతత్పరుడైనలోభి ధనికవర్గీయరాజ్యానికి ప్రతిబింబమంటాను. ఇది సందేహాస్పదమా ?

లేదు.

తరువాత పరిగణ్యం ప్రజాస్వామ్యం. దీనిపుట్టుపూర్వోత్తరాలు, స్వభావం మనమింకా పరిశీలించవలసి ఉన్నది. ఆ తరువాత ప్రజాస్వామికవ్యక్తిమార్గాలు పరిశీలించి ఒకనిర్ణయానికి వద్దాము.

మనం అనుసరిస్తున్నపద్ధతి అదే కదా ?

మరి ధనికవర్గీయరాజ్యంనుంచి ప్రజాస్వామికరాజ్యం ఎలా ఆవిర్భవిస్తుంది? ధనికవర్గీయరాజ్యానికి పరమలక్ష్యమేమిటి ? ఉత్కటసంపదలే కదా ? మరి ఆ కాంక్షకు అవధులుంటవా ?

ఉండవనుకోండి. అయితే ?

తమ అధికారానికి సంపత్తి మూలమని ఎరిగి పాలకులు దుర్వ్యయపరులైన యువకులచర్యలను చట్టంతో నిరోధించనిరాకరిస్తారు. దీనికి కారణం ఉంది. వారు చెడిపోతే తాము బాగుపడతారు. వారికి పెద్ద వడ్డీలపై అప్పులిచ్చి వారి ఆస్తులు కొనివేస్తారు. ఈ విధంగా తమసంపదలను, అధికారాన్ని పెంపొందించుకొంటారు.

నిజమే.

మరి అలాంటి రాజ్యప్రజలలోని ధనతృష్ణకూ నిగ్రహానికీ పొత్తుకుదరదు. వానిలో ఒకటి ఉపేక్షితమౌతుంది.

అవును.

ధనికవర్గీయరాజ్యంలో నిగ్రహరాహిత్యం ధనవ్యయవైపరీత్యమూ సర్వసామాన్యమైపోయినప్పుడు సత్కుటుంబసంజాతులకు తరుచుగ అకించన స్థితి దాపరిస్తుంది.

అవును, అలాగే జరుగుతుంది.

అయినా వారు రాజ్యంలోనే ఉండి తిరుగుబాటుకు సంసిద్ధులవుతారు. వారిలో కొందరు అధమర్ణులు; కొందరు పౌరత్వభ్రష్టులు; మూడవ తెగవారు ఈ ఉభయులై ఉంటారు. వీరు తమ ఆస్తిని దక్కించుకొన్నవారినే కాదు, ఎల్లవారిని ద్వేషిస్తూ కుట్రపన్నుతారు. 'విప్లవం ఎప్పుడు వస్తుందా!' అని తహతహలాడుతుంటారు.

అది యథార్థం.

వేరొకవైపున వ్యాపారస్థులు తాము నాశనంకావించినవారిని చూడనట్లు నటిస్తూ తమక్రూరకృత్యం సాగిస్తారు. తగినజాగ్రతి లేక ప్రమత్తులై ఉన్నవారికి అప్పులు పెడతారు. పెట్టుబడులకు కొన్నిరెట్లధనం వసూలు చేస్తారు. ఈ విధంగా నిర్వ్యాపారులూ నిర్ధనులూ తామరతంపరవుతారు.

నిజమే.

ఈ అనర్థం ఒక్కసారిగా బగ్గునమండుతుంది. మానవుని ఆస్తివినియోగాన్ని కట్టుదిట్టంచేసి కాని, మరొకటి కావించి కాని వారు ఆ మంటను ఆర్పివేయరు.

మరొకటంటే?

సముచితప్రవర్తనాన్ని ప్రోత్సహించే మరొకచర్య. 'ప్రతివాడు లాభ

నష్టాలకు లోనుకావచ్చునని గుర్తెరిగి బుద్ధిపూర్వకంగానే ఒడంబడికలకు దిగాలి' అన్న సామాన్యశాసనం ఉండాలి. అట్టిది ఉంటే ఇంత అన్యాయ్యంగా ధనసంచయనం సాగదు. ఇలాంటిది ఉంటే మనం చెప్పుకొన్న అన్యాయాలు రాజ్యంలో చాలవరకు తగ్గుతవి.

అవును.

మనమింతకుముందు చెప్పుకొన్న దురుద్దేశాలకు పాల్పడి పాలకులు ప్రజలకు అన్యాయం చేస్తారు. పాలకులూ వారి అనుయాయులూ, ముఖ్యంగా పాలకవర్గీయయువకులు, శారీరకమానసిక అలసత్వానికీ భోగాలకూ అలవాటుపడతారు. వారు నిర్వ్యాపారులై సుఖదుఃఖాలలో మునిగితేలుతుంటారు.

అది నిజం.

వారికి ధనసంచయనమే ప్రధానమైపోతుంది. నిరుపేదలవలెనే వారు కూడ సద్గుణసంపత్తియందు ఉపేక్ష వహిస్తారు.

అవును.

వారిస్థితిగతులిలా ఉంటవి. జైత్రయాత్రాసందర్భాలలో కాని, తీర్థయాత్రాసందర్భాలలో కాని పాలకులకు పాలితులకు అన్యోన్యపరిచయమేర్పడుతుంది. ప్రమాదకాలంలో ఇరువురు ఒండొరులప్రవృత్తిని గమనిస్తారు. ఆ సమయంలో సంపన్నులు తమ్ము ఏవగించుకొంటారన్నభీతి పేదలకు ఉండదు. ఎండవానలకోర్చి దేహచ్ఛాయలకు బాసి, శుష్కదేహులగు నిరుపేదలు స్థూలకాయులైన లక్ష్మీపుత్రులప్రక్కన యుద్ధరంగంలో నిలిచి పోరాడవలసినస్థితి రావచ్చును. అతిమాంసలత్వంవలన ఆ కలవారిబిడ్డలు అసురుసురై ఆపసోపాలు పడుతుంటే అకించనుడైన యువకుడు చూస్తాడు. ఇలాంటివారు భాగ్యవంతులయ్యారంటే ప్రజలు సాహసించకపోవటమే కారణమని అతడనుకోడా? ఆ అకించనులు ఏకాంతంగా సమావేశమైనప్పుడు మనవీరులలో పసలేదని చెప్పుకోరా?

అవును, అలాగే చెప్పుకొంటారు.

అసలే శరీరం అస్వస్థమై ఉన్నప్పుడు మరొకదుఃస్థితి సంభవిస్తుందనుకో. ఒక్కొక్కప్పుడు ఇలాంటిది లేకపోయినా అంతఃక్షోభం బయలుదేరుతుంది. అలాగే రాజ్యం దుర్బలంగా ఉన్నప్పుడు మరొకవడిసుట్టు చుట్టుకోవచ్చును. ఇలాంటిదానికి అవకాశాలు తక్కువే కావచ్చును. కాని, ఒకపక్షం ఇరుగుపొరుగుననున్న ధనికవర్గీయరాజ్యసహాయం కాని, ప్రజాస్వామికరాజ్యసహాయం కాని అపేక్షించవచ్చును. బాహ్యప్రోద్బలం లేకుండానే ఒక్కొక్కప్పుడు అంతస్సంఘర్షణలు ప్రారంభంకావచ్చును.

నిజమే.

పేదలు ధనికులలో కొందరిని చంపివేస్తారు; కొందరిని దేశంనుంచి తరిమివేస్తారు. ఈ విధంగా ప్రతిపక్షులను జయించగానే ప్రజాస్వామిక రాజ్యం ఏర్పడుతుంది. మిగిలిఉన్నవారందరికీ వారు సమాన అధికార స్వాతంత్ర్యాలు ఇస్తారు. న్యాయాధికారులను ఈ రాజ్యంలో మూక ఉమ్మడిగా ఎన్నుకొంటారు.

యుద్ధం ప్రజ్వరిల్లి విప్లవం వచ్చినా, భయభ్రాంతమై ప్రభుత్వపక్షం ఉపసంహరించుకొన్నా నెలకొనేప్రజాస్వామ్యస్వభావం ఇలాగే ఉంటుంది.

ఆ రాజ్యంలో జీవితవిధానం ఎలా ఉంటుంది? ఎలాంటి ప్రభుత్వం ఏర్పడుతుంది? ప్రభుత్వమెట్లో పౌరుడు కూడ అట్లే కదా?

స్పష్టంగా అంతే.

ప్రజలు స్వతంత్రులు కదా? రాజ్యం స్వాతంత్ర్యకలితంగదా? పౌరుడు స్వచ్ఛందంగా మాటాడవచ్చును; ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించవచ్చును.

అలాగే చెబుతుంటారు.

స్వాతంత్ర్యం ఉన్నప్పుడు వ్యక్తి తనజీవితాన్ని తనకిచ్చవచ్చినరీతిగా మలచుకోవచ్చును.

24)

అవును.

ఇలాంటిరాజ్యంలో విభిన్నమానవప్రకృతులు అత్యధికసంఖ్యాకాలుగ ఉంటవి కదా ?

అవును.

కుట్టుబువ్వులతో అలంకృతమైన చిత్రవస్త్రంవలె రాజ్యాలన్నిటిలో ఇది ఉత్తమరాజ్యంవలె కనిపించవచ్చును. చిత్రవర్ణవస్తువులు తక్కినవాటన్నిటికంటె మనోజ్ఞతరాలని స్త్రీలు, బాలకులు భావిస్తారు. అట్లే విభిన్నఆచారశీలసంపన్నులగు మానవులతో గూడిన ఈ రాజ్యం కూడ మనోజ్ఞతమమని భావించేమనుజులు అనేకులుండవచ్చును.

అవును.

రాజ్యాంగవిధానపరిశీలనకు ఇంతకంటె మరొక ఉత్తమరాజ్యం లభించదు.

ఎందువల్లనంటారు ?

ఆ రాజ్యమందలి స్వాతంత్ర్యమే దీనికి కారణం. అన్నిరకాలరాజ్యాంగ విధానాలు అక్కడ ఉంటవి. ఎవడైనా రాజ్యం నెలకొల్పాలంటే అతడు ప్రజాస్వామికరాజ్యానికి పోయి, బజారులో వస్తువులు కొన్నట్లుగా, తనకిష్టమైనవిధానం అక్కడ ఎన్నుకోవచ్చును. ఎన్నుకొన్నపిమ్మట అతడు తనరాజ్యం నెలకొల్పుకొనవచ్చును.

అవును, అతనికి వలసినన్ని మచ్చుతునుకలు లభిస్తవి.

నీకు యోగ్యత ఉన్నా అక్కడ పాలకుడవు కానక్కరలేదు; ఇష్టం లేకపోతే పాలితుడవూ కానక్కరలేదు. వారు యుద్ధంచేస్తుంటే నీవు కూడ యుద్ధంచేయాలని లేదు. ఇతరులు శాంతిరక్షకులుగా ఉన్నప్పుడు నీవు శాంతికామివైతేతక్క శాంతిని కాపాడనక్కరలేదు. నీవు న్యాయాధికారివి కారాదని చట్టం శాసిస్తున్నా సంకల్పబలంఉంటే,

నీవాపదవి పొందవచ్చును. ఉన్నంతకాలమైనా అది ఎంత మనోజ్ఞజీవితం! మరి స్వర్గజీవితం కూడ ఒకజీవితమేనంటావా ?

అవును, ఆ ఉన్నక్షణకాలమూ అంతే.

న్యాయాధికారులచే శిక్షితులైన ఒకకొంతమందిదోషుల స్వభావం మనోజ్ఞంగా గోచరించదా ? ప్రజాస్వామికరాజ్యంలో మరణదండనానికి, దేశబహిష్కారానికి పాల్పడినవారు పెక్కురు ఉన్నచోటు వదలక ప్రపంచమంతా సంచరిస్తుంటారు. ఆ పెద్దమనుషులు మహావీరులవలె రొమ్ము విరుచుకొని తిరుగుతున్నా ఎవరూ గమనించరు. ఇలాంటిఘట్టం నీకు అనుభవగోచరం కాలేదా ?

కాకపోవటమేమి ? అనేకులు అలాగే చేస్తుంటారు.

అంతే కాదు. ప్రజాస్వామ్యక్షమాస్వభావమూ, అల్పవిషయాపేక్ష గమనించదగినవి. బాల్యంనుంచి రమణీయవస్తువులమధ్య పెరుగుతూ వాటిని ఆస్వాదిస్తూ పరిశీలిస్తూ ఉంటేతక్క ఎవడూ ఉత్తమవ్యక్తి కాజాలడు. దీనికి అపవాదంగా నూటికో కోటికో ఒకడు ఉండవచ్చునని మనం చెప్పుకొన్నాము. రాజ్యస్థాపనకై ఆవశ్యకమని మనం పేర్కొన్న ఇలాంటి ఉత్తమసూత్రాలను అన్నిటిని ప్రజాస్వామ్యం తనపాదాలతో రాచి మట్టుపెడుతుంది. రాజకీయవేత్తకు ఆవశ్యకాలైనవిద్యలను శిక్షణలను పాటించదు. 'నేను ప్రజకు ఆప్తుణ్ణి' అంటే చాలు, ప్రజాస్వామ్యం గౌరవిస్తుంది.

ఎంత ఉదాత్తస్వభావం !

ఈ లక్షణాలతోపాటు మరికొన్ని ఇతరలక్షణాలు ప్రజాస్వామ్యానికి ఉన్నవి. వైవిధ్యం, వ్యవస్థారాహిత్యం కలిగి సమానులకూ అసమానులకూ సమానత్వం కల్పిస్తూ ఈ ప్రభుత్వపద్ధతి సంతోషకరంగానే ఉంటుంది.

అవును, ఆ ప్రభుత్వపద్ధతి అంతా మనకు సుపరిచితమే కదా ?

ఇప్పుడు ప్రజాస్వామికవ్యక్తి స్వభావమేమో, అతడు ఎలా ఆవిర్భవిస్తు

న్నాడో పరిశీలింతామా ?

అలాగే కానీయండి.

అతడు లోభియైన సంపన్నునిపుత్రుడు. తన అలవాట్లకనుగుణంగానే అతనిని తండ్రి పెంచిపెద్దవాణ్ణి చేస్తాడు. అవునా ?

అంతే.

ధనసంపాదనకు కొరగాక సొమ్ముపోకడకు తోడ్పడేసుఖాసక్తిని అనావశ్యకమని భావించి తనతండ్రివలెనె అతడు దానిని పూన్కితో నిగ్రహించుకొంటాడు.

స్పష్టంగా అలాగే చేస్తాడు.

విస్పష్టతకోసం సుఖాలలో ఏవి ఆవశ్యకాలో, ఏవి అనావశ్యకాలో చెప్పమంటావా ?

తప్పక.

మానరాక ప్రయోజనకారులైనసుఖాలు ఆవశ్యకాలు కావా? నిజానికి వాటిని ఆవశ్యకసుఖాలే అనాలి. ఎందువల్లనంటే ప్రయోజనదాయకాలై అనివార్యాలైనవాటిని కాంక్షించటం మానవస్వభావం. మానవతత్త్వమే అలాంటిది.

అవును.

కాబట్టి వాటిని ఆవశ్యకాలనటం తప్పు కాదు గదా ?

కాదు.

బాల్యంనుంచి యత్నించి మాన్పుకోదగినవై, మేలుకలిగించక మీదు మిక్కిలి చెరుపుకలిగించేవాటిని అనావశ్యకాలనటం యోగ్యమే కదా ?

నిశ్చితంగా.

స్పష్టతకై ఈ రెండింటికి ఒక్కొక్క దృష్టాంతం చెప్పుకోలేమో?

విషయం బోధపడుతుంది.

దేహధారణకూ పోషణకూ అన్నపానాలు ఆవశ్యకాలు. ఈ అన్నపాన కాంక్ష ఆవశ్యకసుఖజాతికి చెందదా?

ఎందుకు చెందదు?

భోజనసుఖం రెండువిధాల ఆవశ్యకం. అది మనకు మేలు చేకూరుస్తుంది. పైగా దేహయాత్రకు ఆవశ్యకం.

అవును.

అయితే వ్యంజనాలు అనేవి ఆరోగ్యపోషకాలైనంతవరకే ఆవశ్యకాలు.

అవును.

ఈ ఆవశ్యకతకు మించినకోర్కెలు అంటే సుకుమారభోజనం మున్నగాగలభోగాలు—అభ్యాసనిగ్రహాలవల్ల మానుకోవచ్చును. శరీరానికి హానికరాలై ప్రజ్ఞాసద్గుణసంపాదనకు కొరగాక ఆత్మకు హానికరాలైనవి అనావశ్యకాలనవచ్చును గదా?

అవును.

ఇలాంటివాంఛలు వ్యయాత్మకాలు. తక్కినవి ఉత్పత్తికి తోడ్పడుతవి. కనుక వాటిని ఆదాయాత్మకాలనవచ్చునా?

ఆc.

మరి కామానికీ ఇతరసుఖాలకూ ఇదే వర్తిస్తుంది కదా?

అవును.

ఇలాంటిసుఖాలకూ కామాలకూ లొంగి అనావశ్యకవాంఛలకు దాసుడైన వాడు లోగడచెప్పుకొన్న పోతుటీగ అవుతాడు. ఆవశ్యకసుఖాలకు మాత్రమే లొంగేవాడు లోభీ ధనికవర్గీయుడూ అవుతాడు.

అవును.

అయితే ధనికవర్గీయవ్యక్తినుంచి ప్రజాస్వామికవ్యక్తి ఎలా ఉత్పన్నుడవుతాడో చూదాము. ఆ పరిణతి ఇలా జరుగుతుందనుకొంటాను.

ఏ విధంగా?

మొరటుగా పిసినిగొట్టుతనంతో పెంపబడినయువకుడు పోతుటీగ తేనెను చవిచూచినట్లు సుఖాన్ని చవిచూస్తాడు. వివిధసుఖాలు, ఎల్లరకాల నాజూకులు కల్పించగలిగినభయంకరకుటిలప్రకృతులతో స్నేహం ఏర్పరచుకొంటాడు. అప్పుడు అతనిలోని ధనికవర్గీయతత్త్వం ప్రజాస్వామికతత్త్వంగా మారనారంభిస్తుంది.

అవును.

రాజ్యంలోని ఒకపక్షం ఆత్మసదృశమైన మరొకరాజ్యపుసహాయం పొందినప్పుడు రాజ్యం మారిపోతుంది. అలాగే ఆత్మవాంఛాసదృశమైన బాహ్యవాంఛల సహాయం పొందినప్పుడు మనయువకుడు మారడా?

తప్పక మారుతాడు.

అతనిలో ఉన్న ధనికవర్గీయతత్త్వానికి తండ్రిప్రభావమో హితోపదేశాధిక్షేపపూర్వకమైన మరొకబంధుప్రభావమో తోడైనప్పుడు అతని మనస్సులో విరుద్ధపక్షాలు ఢీకొంటవి. అతడు అంతర్యుద్ధానికి పాల్పడుతాడు.

అంతే జరుగుతుంది.

కొన్ని సందర్భాలలో ధనికవర్గీయతత్త్వంయందు ప్రజాస్వామికతత్త్వం వీగిపోతుంది. అతనిలో కొన్నివాంఛలు నశిస్తవి; కొన్ని బహిష్కృతా లవుతవి. భక్తిప్రపత్తులు ఆత్మలో ప్రవేశిస్తవి; వ్యవస్థ తిరిగి నెలకొంటుంది.

అవును. ఒక్కొక్కప్పుడది సంభవమే.

ఆ తరువాత ఏమి జరుగుతుందో తెలుసా? ప్రాతకోర్కెలు బహిష్కృతా లైనప్పుడు తత్సదృశాలైన క్రొత్తవి అంకురిస్తవి. వాటిని ఎలా నిగ్రహించాలో అతనికి తెలియదు. అందువల్ల అవి భయంకరంగా పరశ్శతంగా వర్ధిల్లుతవి.

అవును.

అవి అతని ప్రాతసహచరులకు సన్నిహితునిజేసి మంతనాలుజరిపి అతనిలో గూళ్ళుకట్టుకొని పెంపొందుతవి.

అవును.

తుదకవి యువకుని ఆత్మదుర్గం ముట్టడించి వశపరచుకొంటవి. ఆ దుర్గంలో దేవతాప్రియాలు, ఉత్తమరక్షకాలు అయిన జ్ఞానసదాచారాలూ మహావాక్యాలూ వాటికి కనిపించవు.

అవును. ఆత్మదుర్గరక్షకాలు అవే కదా?

వికత్థనమైన ఆత్మవంచన, అనృతవాక్కులు ఆ దుర్గం అధిరోహించి తిష్ఠవేస్తవి.

అవును.

ఆ యువకుడు కర్మక్షేత్రం పరిత్యజించి స్వప్నసంచారభూమి తిరిగి చేరుకొంటాడు. ఇతరులెంతనిరోధించినా సరకుసేయక అందే స్థిరనివాసమేర్పరచుకొంటాడు. అతనిలోని ధనికవర్గీయతత్త్వానికి అతనిమిత్రులు ఏ సహాయం పంపించినా ఆత్మవంచకవాంఛలు రాజద్వారకవాటాలను బంధి

స్తవి. అవి రాయబారులను లోనికి రానీయవు. వ్యక్తులు కావించే ప్రత్యుపదేశం విననీయవు. చెంతకు గూడ చేరనీయవు. యుద్ధం ప్రారంభమవుతుంది. ఆనాటికవి జయిస్తవి. వినయాన్ని మూఢతక్రింద లెక్కగట్టి బహిష్కరిస్తవి. నిగ్రహాన్ని నపుంసకత్వమని వెక్కిరించి వెలికీడ్పిస్తవి. మితత్వం, సముచితవ్యయం హాస్యాస్పదాలనీ బర్బరలక్షణాలనీ అతనికి నచ్చజెప్పి నిష్ప్రయోజకవాంఛలసహాయంతో వాటిని తరిమివేస్తవి.

అవును.

అవి అతనిమనస్సును ప్రక్షాళితం కావించి స్వాయత్తం చేసికొని నూతనోపదేశం చేసి ఆ సౌధంలోనికి అవష్టంభ అరాజకత్వాలను, దుర్వ్యయదుర్వినీతులను మనోజ్ఞవస్త్రాలంకృతాలను కావించి శిరములపై కుసుమాక్షతలు చల్లి పరివారకోటీమధురస్తోత్రపాఠాలతో ఆహ్వానిస్తవి. ఆ వందిమాగధులు గర్వాన్ని ఆభిజాత్యమనీ, అరాజకత్వాన్ని స్వాతంత్ర్యమనీ, దుర్వ్యయాన్ని ఔదార్యమనీ, అవినీతిని ధైర్యమనీ శ్లాఘిస్తారు. ఈ విధంగా ఆయువకుడు తన మొదటిప్రకృతిని పరిత్యజించి విశృంఖలతాప్రవృత్తిని వరిస్తాడు. నిష్ప్రయోజక అనావశ్యకసుఖాలకు దాసుడవుతాడు.

అవును.

ఇది జరిగినతరువాత అతడు నిజద్రవ్యపరిశ్రమలను రెంటినీ ఆవశ్యకసుఖాలకువలెనే అనావశ్యకసుఖాలకై వెచ్చిస్తుంటాడు. అదృష్టవంతుడై వివేకం పూర్తిగా నశించకపోతే సంవత్సరకతిపయానంతరం యావనోద్ధతి శమించినప్పుడు అతడు మున్ను వెడలనడచినసద్గుణాలకు కొన్నిటికి తిరిగి ఆశ్రయమిచ్చి తనసుఖాలకు ఒకవ్యవస్థ కల్పిస్తాడు. ముందుగా వచ్చి తన్నువశపరచుకొన్నదానికి తనపై ప్రభుత్వంనెరపటానికి అధికారమిస్తాడు. దానితో విసిగిపోయినప్పుడు ఆ అధికారం మరొకదానికిస్తాడు. అతడు వాటిలో దేనినీ ద్వేషించక అన్నిటికీ సమానప్రోత్సాహమిస్తాడు.

అవును.

యథార్థహితోక్తిని అతడు ఆలకించడు. తనకోట చొరనీయడు. 'కొన్ని

వాంఛలపరిపూర్తి శివంకరం, ఉదాత్తం. మరికొన్నిటిపరిపూర్తి అనర్థదాయకం. కాబట్టి వివేచించి కొన్నిటిని సమ్మానించి వినియోగించుకో. కొన్నిటిని అధిక్షేపించి నిగ్రహించు' అని ఎవడైనా ఉపదేశిస్తే అతడు శిరఃకంపనం చేస్తాడు; అన్నీ ఒకటేనంటాడు. ఈ ఊరికావూరు ఎంతో ఆవూరికీవూరు అంతేనంటాడు.

అవును, అతనితీరే అంత.

అతడాయాకాలాలలో అంకురించినవాంఛలను బద్ధాంజలియై భజిస్తుంటాడు. ఒకొక్కప్పుడు వేణుగానలోలుడై మద్యపానంచేస్తాడు. ఆ పిమ్మట అతడు జలంసేవిస్తూ శరీరశోషణం అభిలషిస్తాడు. ఆ తరువాత వ్యాయామాసక్తుడవుతాడు. ఒకొక్కప్పుడు అలసుడై ప్రతిదానిని ఉపేక్షిస్తాడు. మరల తాత్త్వికునిజీవితంవంటిజీవితం సాగిస్తాడు. తరచు రాజకీయాలలో నిమగ్నుడవుతాడు. ఉద్యుక్తుడై బుద్ధికేదితోస్తే అది అనివేస్తాడు; చేస్తాడు. ఏ యుద్ధవీరునో చూచి అసూయపడటం సంభవిస్తే ఆ మార్గమే అనుసరిస్తాడు. వ్యాపారస్థులాకర్షించారేపో. వారి మార్గమే అనుగమిస్తాడు. అతనిజీవితంలో నీతినియమాలుండవు. ఇలాంటి లక్ష్యవిరహితజీవితమే ఆనందమనీ స్వాతంత్ర్యమనీ అంటాడు. అతడు ఆ ప్రవాహంలోనే కొట్టుకొనిపోతుంటాడు.

అవునవును. అతడు మూర్తీభవించినస్వాతంత్ర్యసమానత్వాలు కదా!

అతనిజీవితం విచిత్రం,బహువిధావిద్ధం, నానాజీవితాలకు మకుటం. మనోజ్ఞమనీ చిత్రమనీ మనం వర్ణించినరాజ్యానికతడు ప్రతీకం. స్త్రీపురుషులనేకులు అతనిని ఆదర్శప్రాయుడని భావిస్తారు. విభిన్నపద్ధతులకూ ఆచారాలకూ లక్ష్యాలు అతనిలో కనిపిస్తవి.

నిజమే.

ఇలాంటివ్యక్తిని ప్రజాస్వామికరాజ్యంప్రక్కన నిలుపుదాము. ఇతనిని నిజంగా ప్రజాస్వామికవ్యక్తి అనవచ్చును గదా?

అవును.

కట్టకడపటివి నియంతృకరాజ్యం, నియంతృకవ్యక్తి. ఈ ఉభయులను మనమిప్పుడు పరిశీలించాలి.

అవును.

మరి ఈ రాజ్యం ఎలా ఉద్భవిస్తుంది? దీనికి మూలం మాత్రం ప్రజాస్వామ్యమని తెలుసు.

అవును.

ధనికవర్గీయరాజ్యంనుంచి ప్రజాస్వామ్యమవతరించినట్లే ప్రజాస్వామ్యం నుంచి నియంతృకరాజ్యమవతరించదా?

ఎలాగంటారు?

సిరిసంపదల అతిశయమే శివమని ధనికవర్గీయరాజ్యం భావించింది. ఆ ఆశయసిద్ధికే అది వ్యవస్థాపితంగదా?

అవును.

నిరవధికధనతృష్ణవహించి ధనసముపార్జనైకబుద్ధితో తక్కినఅర్థాలన్నిటినీ నిరాకరించి ధనికవర్గీయరాజ్యం అంతరించింది.

అవును.

ప్రజాస్వామ్యానికి గూడ శివమని భావించబడేతృష్ణ ఒకటి ఉన్నది. దాని నిరవధికత్వంవల్ల ప్రజాస్వామ్యం విలయం పొందదా?

ఆ శివమేదంటారు?

ప్రజాస్వామ్యంలో అత్యంతమనోజ్ఞమైనది స్వాతంత్ర్యమని వర్ణిస్తుంటారు. అందువల్ల ఆరాజ్యమొకటే వాసయోగ్యమని స్వతంత్రప్రకృతిగలమానవుడు భావిస్తాడు.

అవును. ప్రతివానినోట ఆ మాటే వినిపిస్తున్నది.

అనుపశమనీయమైన ఈ తృష్ణవల్లనూ ఇతరార్థాపేక్షవల్లనూ ప్రజాస్వామ్యంలో మార్పు ప్రారంభమవుతుంది. ఈ మార్పు నిరంకుశత్వానికి దారితీస్తుంది.

ఎలాగంటారు?

స్వాతంత్ర్యపిపాసార్దితమైన ప్రజాస్వామ్యంలో దోషమధుకలశధారులు పానగోష్ఠీవల్లభులై ప్రజలు మదిరాదాసులై స్వాతంత్ర్యసురను సేవించినపుడు వారితృష్ణ అధికమౌతుంది. ఆ సురను ఇంకా తెమ్మని ఏలికలను కోరుతారు. వారు కోరినంతమదిరను అనుగ్రహించనప్పుడు ప్రజాస్వామ్యం పాలకులను ద్రోహులని నిందించి శిక్షిస్తుంది. నీచధనికవర్గీయులని చీకొడుతుంది.

అవును. తరుచుగా జరిగేసంఘటనే.

పాలకుల ఆజ్ఞలను శిరసావహించేవారిని బానిసలని నిరాకరిస్తారు. ప్రజాసదృశులైనపాలకులూ, పాలకసదృశులైనప్రజలూ సామాజికంగానేమి, వ్యక్తిగతంగానేమి గౌరవభాజనులవుతారు. ఇలాంటిరాజ్యంలో స్వాతంత్ర్యానికి హద్దుపద్దులుంటవా?

నిశ్చితంగా ఉండవు.

మెల్లమెల్లగా అరాజకత్వం వ్యక్తుల ఇండ్లలో ప్రవేశిస్తుంది. తుదికి జంతువులను గూడ ఆవేశించి చెరుస్తుంది.

అది ఎలాసాధ్యం?

తండ్రి తనకొడుకులస్థాయికి దిగజారటం, వారికి భయపడటం జరుగుతుంది. దానికతడు అలవాటుపడుతాడు. కొడుకు తండ్రిపదవి ఆక్రమిస్తాడు. తలిదండ్రులందు భయభక్తులుండవు. అదేమంటే స్వాతంత్ర్యమంటాడు. విదేశాగతుడై ఇచట నివాసమేర్పరచుకొన్నవ్యక్తి ఇచటి పౌరునితో

సమానుడవుతాడు. ఊరకవచ్చిపోయే విదేశస్థునికీ ఈ ఉభయులకూ తారతమ్యం ఉండదు.

అవును. అలాగే జరుగుతుంది.

అనర్థకాలు ఇంతటితో ఆగలేదు. స్వల్పానర్థకాలు ఇంకా ఎన్నో ఉన్నవి. అలాంటి సామాజికవ్యవస్థలో గురువు శిష్యునకు భయపడి అతన్ని కొనియాడుతుంటాడు. శిష్యుడు గురువును ద్వేషిస్తాడు. బాలుడూ వృద్ధుడూ ఒకటే. యువకుడు వృద్ధప్రతిపత్తి పొంది మాటలతోను చేతలతోను అతనినెదిరిస్తాడు. వృద్ధులు పిన్నలుచెప్పినట్లు వింటారు; నవ్వుతూ త్రేలుతూ ఉంటారు. ఉత్సాహశూన్యులై నిరంకుశంగా ప్రవర్తిస్తూ ఉంటారని యువకులు తమ్ము ఎక్కడ అనిపోతారో నన్నభయంతో వారూ ఆ యువకులపద్ధతులే అవలంబిస్తారు.

అక్షరాల అది నిజం.

వారిమతంలో స్వాతంత్ర్యపరమావధి ఏమిటో తెలుసా? చేయిమీదు గా డబ్బిచ్చి విలిచికొన్న బానిస పురుషుడైనా స్త్రీయైనా కొనుక్కొన్నవానితోపాటే స్వతంత్రుడు. ఇక స్త్రీపురుషుల పరస్పరసంబంధంలో సమానతాస్వాతంత్ర్యాలు ఎలా ఉంటవో వేరే చెప్పనక్కరలేదు.

ఈస్కూలస్ అన్నమాట నోట్లో ఆడుతున్నది.

అదే నేనూ చెప్పబోతున్నది. మానవుని అధీనంలో ఉండవలసినజంతువులు గూడ ప్రజాస్వామ్యంలో ఎంత స్వాతంత్ర్యం పొందుతవో చెబితే క్రొత్తవాడు నమ్మలేడు. సామెతచెప్పినట్లు మానవుడూ పశువులూ ఒకటే. గుఱ్ఱాలు, గాడిదలు కూడ స్వతంత్రమానవుల అధికారదర్పాలతో బయలుదేరుతవి. తమకు మార్గమివ్వక నిలిచేమానవులను మోరలతో నెరుముకొనిపోతవి. ఇలాగే ఇతరజంతువులన్నీ స్వాతంత్ర్యంలో ఓలలాడుతవి.

సరిగా నా అనుభవమే చెబుతున్నారు. నగరం విడిచి వాహ్యాళికి వెళ్ళినప్పుడు నాకు ఈ అనుభవమే సంప్రాప్తించింది.

వీటన్నిటివల్ల పౌరులమనస్సులు అతిసుకుమారాలవుతవి. ఏ మాత్రం అధికారం కనిపించినా అడిరిపడతారు. నియమాలను పాటించరు. తుదికి చట్టాలు కూడ లక్ష్యంచేయరు. తమపై ఎవడూ ఎలాంటిఅధికారం చెలాయించరాదు.

అవును, అదంతా నాకు పరిచితమే.

ఇలాంటి ప్రారంభదశనుంచి నియంతృత్వం ఉద్భవిస్తుంది.

ఏమి జరుగుతుందంటారు?

ఏ రోగంవల్ల ధనికవర్గీయరాజ్యం అంతరించిందో ఆ రోగంవల్లనే ప్రజాస్వామ్యం అంతరిస్తుంది. ఆ రోగమే స్వాతంత్ర్యంవల్ల విస్తరిల్లి ఉత్కటమై ప్రజాస్వామికాధికారులను వివశులను చేస్తుంది. వాస్తవానికి ఏది అతిమాత్రమైనా వైపరీత్యం తెచ్చిపెడుతుంది. ఋతువులందు, ఉద్భిజ్జ జంతులోకాలందు ఇది యథార్థం. ముఖ్యంగా ప్రభుత్వరూపాలలో మరీ నిజం.

అవును.

స్వాతంత్ర్య అతిమాత్రత రాజ్యాలలోనైనా వ్యక్తులలోనైనా దాస్యాతిశయానికి దారితీస్తుంది.

అవును. ప్రకృతిక్రమమే అంత కదా!

కాబట్టి ప్రజాస్వామ్యంనుంచి స్వాభావికంగా నిరంకుశత్వం ఉద్భవిస్తుంది. స్వాతంత్ర్యం పరాకాష్ఠ పొందినప్పుడు అత్యంతతీవ్రరూపాలైన నిరంకుశత్వదాసత్వాలు అవతరిస్తవి.

నిజమే.

అసలు నీవడిగిన అర్థమదికాదనుకొంటాను. ఏ వ్యతిక్రమం ఉద్భవించి ధనికవర్గీయరాజ్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని నాశనంచేసిందో తెలిసికొవ

గోరుతున్నావేమో ?

అవును, నాప్రశ్న అదే.

ఇంతకుముందు నిర్వ్యాపారులైన దుర్వ్యయపరులను పోతుటీగలతోను, వారిలోని సాహసవంతులను కొండీలున్న పోతుటీగలతోను, జంకుగొంకులు కలవారిని కొండీలులేనివాటితోను పోల్చాము.

ఆ పోలిక సముచితమే.

శరీరానికి పిత్తశ్లేష్మాలువలె రాజ్యానికి ఈ రెండువర్గాలు మహామారులు. మధుకరపాలకుడువలె ప్రజ్ఞావంతుడై సద్వైద్యుడై రాజ్యశాసనప్రదాత వారిని దూరంగా ఉంచాలి. వీలుపడితే అసలు వారిని చేరనీయరాదు. ఎట్లో చొరవచేసికొని ప్రవేశించిఉంటే అతడు సాధ్యమైనంతత్వరితంగా వారినీ వారికాపురాలనూ ఉన్మూలించాలి.

అవును, అలాగే చేయాలి.

స్పష్టార్థప్రతిపత్తికై ప్రజాస్వామికం మూడువర్గాలుగ విభక్తమై ఉందను కొందాము. నిజానికి అలాగే ఉంటుంది. ఎందువల్లనంటే స్వాతంత్ర్యం ధనికవర్గీయరాజ్యంకంటె ప్రజాస్వామిక రాజ్యంలో పోతుటీగలను మెండుగా ఉత్పాదిస్తుంది.

నిజమే.

ప్రజాస్వామికరాజ్యంలో వారిపోరు మరీ మెండవుతుంది.

ఎందువల్ల ?

కారణం ఒకటే. యోగ్యతలేదని వారిని ధనికవర్గీయరాజ్యం అధికారం నుంచి తరిమివేస్తుంది. అందువల్ల వారు బలంసమకూర్చుకొనేఅవకాశం పొసగదు. ప్రజాస్వామికరాజ్యంలోనో అలా కాదు. పాలకవర్గమంతా దాదాపు వారే. నిశితబుద్ధులు ప్రసంగిస్తారు; కార్యపరులవుతారు.

తక్కినవారు వేదికచుట్టూ చేరి ఝంకరిస్తూ ప్రతిపక్షవాదమే చెవిని పడనీయరు. అందువల్ల ప్రజాస్వామికరాజ్యాలలో దాదాపు ప్రతిదానిని పోతుటీగలే నిర్వర్తిస్తుంటవి.

అది అక్షరాల నిజం.

మరొకవర్గముంటుంది. దీనికి ప్రజానీకంతో ఏ సంబంధం లేకుండా చేస్తారు.

ఏ వర్గమంటారు ?

క్రమబద్ధవర్గం. వర్తకజాతిలో ఈ వర్గం అత్యంతధనవంతంగా ఉంటుంది.

అవును.

వీరిని తేలికగా పిండవచ్చును. పిండినప్పుడు వీరివల్లనే పోతుటీగలకు ఎక్కువమధువు లభిస్తుంది.

అవును. అకించనులను పిండితే ఏమి వస్తుంది?

దీనినే ధనికవర్గమంటారు. ఈ వర్గంమీదనే పడి పోతుటీగలు బ్రతుకుతుంటవి.

అవును. అలాగే జరుగుతుంటుంది.

మూడవవర్గం ప్రజలు. వీరు తమరెక్కలతో కష్టిస్తారు. కాని, రాజకీయవేత్తలు కారు. వీరి మనుగడకు వలసినధనధాన్యాదికం అంతగా ఉండదు. ఈ వర్గం ప్రజాస్వామికరాజ్యంలో అధికసంఖ్యాకమై అత్యంతబలవత్తరంగా ఉంటుంది.

నిజమే. కాని, జనత అంతో ఇంతో మధువు లభిస్తేకాని సమావేశం కాదు.

మరి వారికది లభించదా? వారినాయకులు భాగ్యవంతుల పాలంపుట

అపహరించి వాటిని ప్రజలకు పంచిపెట్టరా? అలా పంచేటప్పుడు మెట్టు వాటాలు మిగుల్చుకోరా?

ఎందుకు మిగుల్చుకోరు?

ఆస్తిపాస్తులు కోల్పోయినవారు ఆత్మరక్షణకోసం దిగవలసిరాదా?

మరి వారికి గత్యంతరమేమున్నది?

రాజ్యంలో మార్పు తేవలెనని ఆశించకపోయినా, వారు ప్రజావిద్రోహులై ధనికవర్గీయులతో కలిసి కుట్రలుపన్నుతున్నారని ఇతరులు వారిపై నేరాలు మోపరా?

మోపుతారు.

ఇదంతా తుదికి ఎలా పర్యవసిస్తుంది? వారికి ప్రజలతో నేరుగా పరిచయం ఉండదు. కీడుతలపెట్టి గూఢచారులు కూడ కల్లబొల్లివార్తలతో వారిని వంచిస్తారు. దానితో వారు వాస్తవంగా ధనికవర్గీయులు కావలసివస్తుంది. నిజానికది వారికి సమ్మతం కాదు. కాని, పోతుటీగలకుట్టనం వారిని బాధిస్తుంది. దానితో వారిలో విప్లవాగ్ని బయలుదేరుతుంది.

అవును, అలాగే జరుగుతుంది.

అపుడు పరస్పరరాజద్రోహారోపణలు, విచారణలు, తీర్పులు ప్రారంభమవుతవి.

అవును.

వానిని ఎదుర్కొనేజోదు ప్రజలకు లభిస్తాడు. అతనిని వారిపైకి ఉసికొల్పి ప్రజలు మహానాయకుని చేస్తారు.

అవును, వారితీరే అంత.

ఈ విధంగా నియంత అవతరిస్తాడు. అవతరించిన క్రొత్తలో అతడు ప్రజారక్షకుడే.

అవును.

ఈ రక్షకుడు నియంతగా ఎలా మారుతాడు? ఆర్కేడియాలోనిలిసియన్ జియూస్ దేవాలయ గాథలో వర్ణిత మైనసంఘటన జరుగుతుంది.

ఆ సంఘటనమేమిటి?

ఇతరజంతుమాంసంతో మిళితమైన మానవపలలం చవిచూచినవ్యక్తి వృకమైపోతాడు. ఈ కథ నీ వెప్పుడు వినలేదా?

వినకేమి? విన్నా.

ప్రజారక్షకుడు కూడా అలాగే తయారవుతాడు. ప్రజాసందోహమంతా అతనికి అండగా నిలుస్తుంది. బంధురక్తం చిందించటానికైనా అతడు సంకోచించడు. మిథ్యాదోషారోపణలు కావించి న్యాయస్థానాలకు ఈడ్పించి వారిని చంపిస్తాడు. క్రూరరాక్షసుడై తోడిపౌరులరక్తం చవి చూస్తాడు. కొందరిని చంపుతాడు. కొందరిని దేశంనుంచి వెళ్లగొడతాడు. ఆదేసమయంలో 'అప్పులు రద్దుచేస్తాను. పొలాలు పంచుతాను' అని ప్రకటిస్తాడు. ఇంత జరిగిన తరువాత విధి ఎలా ఉంటుంది? శత్రువులకు చిక్కి అతడు నాశనం పొందాలి. లేదా మానవత్వం కోల్పోయి వృకం కావాలి. అంటే నియంత కావాలి.

అది అనివార్యం.

అతడు భాగ్యవంతులపై కక్ష కడతాడు.

అవును.

కొలదికాలంలోనే అతడు దేశబహిష్కృతుడవుతాడు. శత్రువులెంతగా ఎదుర్కొని నిరోధించినా పరిపూర్ణనియంతయై త్వరలోనే తిరిగి ప్రత్యక్ష

మవుతాడు.

అలాగే జరుగుతుంది.

అతనిదేశబహిష్కృతికై పూనుకొంటారు. న్యాయస్థానాలకీడ్చి అతనికి మరణదండనం విధింపజేయ యత్నిస్తారు. ఈ ప్రయత్నాలేవీ సఫలం కాకపోతే అతనివధకై కుట్రలు జరుగుతవి.

అవును. అదే వారిపద్ధతి.

నియంత్రికజీవితం ఈ దశకు వచ్చినప్పుడు అంగరక్షకులు ఆవశ్యకమన్న విజ్ఞప్తి బయలుదేరుతుంది. ప్రజాబంధువు ప్రజలకు కరవైపోరాదన్న పాలికేక బయలుదేరుతుంది.

వాస్తవంగా అంతే.

ప్రజలు వెంటనే ఆమోదిస్తారు. అతనిభద్రతకోసమై ఆరాటపడుతారే కాని, తమస్థితి ఆలోచించుకోరు.

అవును.

భాగ్యవంతుడై ప్రజాద్రోహిగా పరిగణింపబడినవాడెవడైనా దీనిని వీక్షించినపుడు, దివ్యవాణి క్రీశస్ కువినిచిన ఈ సందేశం అతనికి జ్ఞప్తికి వస్తుంది:—

"శార్కరమ్ము హెర్మాసు కచ్ఛమ్మునందు
పిక్కబలముకోలఁది ప్రధావించుఁ గాని
బంకుఁదనమునకిసుమంత కంతగనఁడు."

అతడు వెంటనే పలాయనం చిత్తగిస్తాడు.

అదిసముచితమే. ఎందువల్లనంటే మరొకసారి సిగ్గుపడనక్కరలేదు. అసలు అవకాశముంటేగా!

అవును. పట్టువడితే చావు తప్పదు కదా!

అంతే మరి.

ఈ లోపున మన ప్రజారక్షకుడు "నిజతనువుతో ధరణి భ్రమాణింపఁబోక" ప్రతిపక్షాన్ని సమూలంగా రూపుమాపి రాజ్యాధికార ప్రగ్రహాలు హస్తగతం కావించుకొని పరమనియంత రూపంతో ప్రత్యక్షమవుతాడు.

నిస్సందేహంగా అంతే.

ఇలాంటి క్షుద్రుడు బయలుదేరినప్పుడు మానవుడూ రాజ్యమూ ఎంత సుఖంగా ఉంటారో పరిశీలింతామా ?

అలాగే కానీయండి.

అధికారం హస్తగతమైన క్రొత్తలో అతని ముఖాన చిరునవ్వులు చిందులాడుతవి. కనిపించిన ఎల్లవానికి అతడు నమస్కరిస్తాడు. తాను నియంతను కాదంటాడు. సభలలో సదస్సులలో సదనాలలో వాగ్దానాలు చేస్తాడు. ఋణగ్రస్తులకు విమోచనం కలిగిస్తాడు. ప్రజలకూ తన అనుచరులకూ భూములు పంచుతాడు. ప్రతివానికి మంచిగా ఉండి మేలుచేయాలని యత్నిస్తాడు.

అది అతనికి తప్పదు కదా ?

అతడు విజయక్రియతోనో సంధానక్రియతోనో బాహ్యశత్రువులను వదల్చుకొంటాడు. ఇంక వారికి భయపడవలసిన అవసరం కలుగదు. నాయకుడు కావాలని ప్రజలు కోరుకొనేనిమిత్తం అతడు ఎప్పుడూ ఏదో ఒక యుద్ధం రేకెత్తిస్తుంటాడు.

మరి గత్యంతరం లేదు కదా ?

ఈ చేతతో అతడు మరొక ప్రయోజనాన్ని సాధించటం లేదా? యుద్ధాలు రేగుతున్నపుడు పన్నులు కట్టికట్టి ప్రజలు నిరుపేదలైపోతారు. దినవెచ్చం కోసం దేవులాడుకోవలసివస్తుంది. అందువల్ల వారు అతనిపై కుట్రపన్నే అవకాశం ఉండదు.

నిజమే.

'వీడు స్వాతంత్ర్యం కావాలంటున్నాడు, వీడు నా అధికారం ప్రతిఘటించ తలపెడుతున్నాడు' అని అతడు ఎవరిని శంకించినా వారిని శత్రువులకు అప్పగించి సమూలనాశనం చేయటానికి సాకు కల్పిస్తాడు. ఈ కారణాలన్నిటివల్ల నిరంతరయుద్ధప్రజ్వలనం అతనికి ఆవశ్యకమాతుంది.

అవును.

అప్పుడతనిపై ప్రజలకున్న అనురాగం సన్నగిలనారంభిస్తుంది. సహాయులై అతనికధికారం చేకూర్చి తాము కూడ కొంత అధికారం పొందినవారు కొందరు తమ ఉద్దేశాన్ని అతనికి చెబుతారు. తమలో తాము కూడబలుకుకొంటారు. వారిలో ధైర్యవంతులు అతడుచేస్తున్న పనిని అతనిముఖాన అనివేస్తారు.

అది సంభవమే.

ఆ నియంత తనపాలకత్వం దక్కించుకోవాలంటే ప్రయోజకుడైన ప్రతివానిని మిత్రుడైనా శత్రువైనా వదల్చుకొనక తప్పదు.

అవును.

అందువల్ల అతడు రాజ్యంలో ఎవడు ధీరుడో, ఎవడు ఉదారుడో, ఎవడు ప్రజ్ఞావంతుడో, ఎవడు సంపన్నుడో వేయికన్నులతో కనిపెట్టి ఉండాలి. ఇష్టం ఉన్నా లేకపోయినా వీరందరితో అతడు శత్రుత్వంవహించి నిర్మూలించి రాజ్యాన్ని క్షాళితం చేయాలి.

అవును. అది అపూర్వక్షాళనం.

అది వైద్యుడుకావించే శరీరక్షాళనవంటిది కాదు. వైద్యులు దుష్టరక్తాన్ని పోకార్చి మంచిరక్తాన్ని కాపాడుతారు. అతడు దీనికి వైపరీత్యం కావిస్తాడు.

పాలకత్వం దక్కించుకోవాలంటే అతనికి అంతకన్నా మార్గం లేదు.

ఎంత శ్లాఘ్యమార్గం! తన్నుద్వేషించే దుష్టులసాంగత్యంతో జీవయాత్ర సాగించాలి. లేదా ఇహలోకయాత్ర చాలించాలి.

అవును, అంతేకదా!

అతనిచర్యలు ప్రజానీకానికెంత కంటకంగా ఉంటే అంతగా అతడు తన అనుచరుల భక్తిప్రపత్తులను ఆకాంక్షిస్తాడు.

అవును.

అలాంటి భక్తబృందం ఏదీ? ఎక్కడ లభిస్తుంది?

వేతనమిస్తేచాలు, ఎందరో తమకు తామై మూగుతారు.

అంటే అన్నిరకాలపోతుటీగలు ఎల్లదేశాలనుంచి మూగుతవనే కదా నీభావం?

అవును.

అయితే అలాంటివారిని స్వదేశంనుంచి చేకూర్చుకోగోరడా?

అంటే?

పౌరుల సొంతబానిసీలకు స్వాతంత్ర్యమిచ్చి, వారిని తన అంగరక్షకులుగా చేర్చుకొంటాడు.

అవును. అందరికంటె వారే ఎక్కువ విశ్వసనీయులు.

ఈ నియంత ఎంత అదృష్టశాలి! తతిమ్మావారినందరినీ వధించి వీరిని ఆప్తమిత్రులను కావించుకోవాలి.

అవును. వారే ఆత్మసదృశులు.

అవును. ఈ నూతనపౌరులను అతడే సృష్టించాడు. సత్పురుషులు అతనిని ద్వేషించి పరిహరిస్తూఉంటే వీరు అతన్ని కొనియాడుతూ సహచరిస్తారు.

అంతేకదా!

నిజంగా విషాదాంతరూపకం ప్రజ్ఞావిలసితం. యూరిపిడీజ్ మహావిషాదాంత రూపకకర్త.

కారణం?

కారణమా? "ప్రాజ్ఞసాహచర్యమున నిరంకుశుండు పండితాఖండమండలోద్దండుండగును" అన్నసూక్తికి అతడే కర్త. నిరంకుశుడు చేరదీసే వారంతా ప్రాజ్ఞులని అతని తాత్పర్యం.

నిజమే. నిరంకుశత్వం ఈశ్వరసదృశమంటూ ఏదేదో చెప్పాడు. ఇతర కవులూ అలాగే వ్రాశారు.

విషాదాంతరూపకకర్తలు ప్రజ్ఞావంతులు. కాబట్టి మనమూ మనవంటి జీవితవిధానంకలవారూ తమ్మి మనరాజ్యంలో అడుగుమోపనీనందుకు వారు క్షమించాలి. ఎందుకంటే వారు నిరంకుశత్వాభిమానులు కదా?

అవును, ఆ బుద్ధిమంతులు మనలను క్షమించాలి.

అయితే వారు ఇతరరాజ్యాలకు పోయి ప్రజానీకాన్ని ఆకర్షించనారంభిస్తారు. మధురమోహనకంఠులను పిలిచి రాజ్యాలను నిరంకుశత్వంవైపు, ప్రజాస్వామ్యంవైపు మలుపుతారు.

నిజమే.

పైగా, ఈ పని చేస్తున్నందుకు వారికి డబ్బు గిడుతుంది. ఎక్కడలేని గౌరవం లభిస్తుంది. ఇలాంటిసత్కారాలు మెండుగా నియంతలవల్ల

లభిస్తవి. కించిన్న్యూనంగా ప్రజాస్వామికాలవల్ల గూడ లభిస్తవి. మన రాజ్యాంగవిధానశిఖరిశిఖరం సమీపిస్తున్నకొలది వారికి కీర్తిప్రతిష్ఠలు సన్నగిల్లుతవి. అధిరోహణాయాసం మెండవుతుంది. దానివల్ల ఇంకా వారు మీదికి పోలేరు.

యథార్థం.

మనం ప్రకృతాన్ని వదలి పరభూములు త్రొక్కుతున్నాము. కాబట్టి ప్రకృతాన్ని అనుసరించి బహుళసంఖ్యాకమై, నానాప్రకృతికమై నిరంతరం మారుతుండే తనసైన్యాన్ని నియంత ఎలా పోషిస్తాడో చూదాము.

రాజ్యంలో పవిత్రనిధులుంటే వాటిని అతడు కైవసంచేసికొని వారికై వెచ్చిస్తాడు. సంపన్నుల ఆస్తిపాస్తులు చాలినంతగా ఉంటే ప్రజలకు పన్నులభారం తగ్గిస్తాడు. లేకపోతే ఆ భారం వారిమీదనే వేస్తాడు.

ఇవి చాలనప్పుడో?

మిత్రులను—పురుషులైనా స్త్రీలైనా—అతడు తనతండ్రి ఆస్తిపాస్తులతో పోషిస్తాడు.

అంటే, ఏప్రజలవల్ల అతడు అధికారంపొందాడో ఆప్రజలే అతనిని అతనిసహచరులను పోషిస్తారనేకదా నీతాత్పర్యం?

అవును. మరి వారికి గత్యంతరం ఉండదు.

అయితే పెరిగి పెద్దవాడైన కొడుకు ముదుసలితండ్రిని పోషించాలి కాని, ముదుసలితండ్రి యెదిగి అక్కరకువచ్చినకొడుకును పోషించకూడదని కుపితులైనప్రజలు అంటేనో? తనకొడుకు పెద్దవాడైనప్పుడు అతని సేవకులకు తాను సేవకుడై అతని దాసీదాసాన్ని మిత్రబృందాన్ని పోషించే నిమిత్తం అతనిని కనిపెంచాడా? తనకొడుకు తన్ను రక్షించాలనీ, అతని సాయంతో సంపన్నులైన అరిస్టోక్రాట్లపాలననుంచి విమోచనంపొందాలనీ తండ్రి ఎంతగానో ఆశించాడు. అందువల్ల ఈ నాడు అతడు కొడుకును అతనిసహచరులను వెళ్ళిపొమ్మంటాడు. తిరుగుబాటుచేసినకుమారుని అనభి

లపణీయులైన అతనిసహచరులను సాధారణంగా ఏ తండ్రి అయినా ఏ విధంగా వెళ్ళగొడతాడో ఇతడూ అలాగే చేస్తాడు.

ఘోరం! ఆ పక్షంలో తానెంతకాలం ఎంతఘాతుకమృగాన్ని పెంచుతూ వచ్చాడో తండ్రికిబోధపడుతుంది. అతనిని వెళ్ళగొట్టాలని నిర్ణయించుకొనేటప్పటికి తాను దుర్బలుడై కొడుకు బలవంతుడవుతాడు.

ఇంతకూ నియంత బలప్రయోగం చేస్తాడని నీవు చెప్పటం లేదు గదా? తన్ను ప్రతిఘటిస్తే తండ్రిని కొడతాడా?

అవును. ముందుగా చేతిలోనిఆయుధం లాగుకొని ఆ పిదప ఆ పనే చేస్తాడని అతడన్నాడు.

అయితే అతడు పితృహంత; వృద్ధజనులకు క్రూరసంరక్షకుడు. నిజమైన నియంతృత్వం ఇదే. ఇందు అతిశయోక్తి ఏ మాత్రం లేదు. గోతినుండి తప్పించుకొనబోయి నూతిలోపడ్డదన్నసామెతగా, స్వేచ్ఛాజీవులైన పౌరులకు లోబడి దాస్యం అనుభవించవలసివస్తుందేమోనని భయపడినజాతి చివరకు బానిసలనిరంకుశత్వానికే దాసికావలసివస్తుంది. ఈ విధంగా క్రమాన్ని, వివేకాన్ని ఉల్లంఘించినస్వాతంత్ర్యం దుర్భరదురంత దాస్యంగా పరిణమిస్తుంది.

అక్షరాలనిజమని అతడన్నాడు.

సరే. ప్రజాస్వామ్యం నియంతృత్వంగా ఎలా మారుతుందో, నియంతృత్వం ఎలా ఉంటుందో వలసినంతగా చర్చించాము.

అవును, అది చాలు.

# తొమ్మిదవ ప్రకరణం

విచారక్రమంలో అందరికంటె కడపటివాడు నియంతృకవ్యక్తి. ఇతడు ప్రజాస్వామికవ్యక్తినుంచి ఎలా వచ్చాడో మరొకమారు పరిశీలించాలి. అతనిజీవనయాత్ర ఎలా ఉంటుందో, అదిసుఖమయమో దుఃఖమయమో చూడాలి.

అవును, మిగిలిఉన్నది అతడొక్కడే కదా ?

ఏది ఎలా ఉన్నా వెనుకటిప్రశ్న అలాగే ఉన్నది.

ఏ ప్రశ్న ?

తృష్ణలస్వభావం, వానిసంఖ్య మనం సరిగా నిర్ణయించలేదు. ఇది నిర్ణీతం కానంతవరకు ఈ పరిశీలనం తికమకలకాస్పదమవుతుంది.

ఈ లోటు ఇప్పుడైనా తీర్చవచ్చును.

నిజమే. అయితే ఈ అంశం నీవు గుర్తుంచుకో. అనావశ్యకసుఖాలూ, తృష్ణలూ కొన్నిధర్మేతరాలు. ఇలాంటివి అందరికీ ఉన్నట్లు కనిపిస్తుంది. కాని, కొందరువ్యక్తులు చట్టాలను పాటించి వివేకాన్ని భజించి వాటిని నిగ్రహించుకొంటారు. దానివలన ఉత్తమవాంఛలు నెగ్గుతవి. అంటే ధర్మేతరాలను పూర్తిగా పరిహరించటమవుతుంది. లేదా, అవి అల్ప సంఖ్యాకాలై దుర్బలతపొందుతవి. ఇతరులలో అవి బలవత్తరాలవుతవి. వాటిసంఖ్య కూడ పెరుగుతుంది.

ఏ తృష్ణలని మీ అభిప్రాయం ?

వివేచనాత్మకశక్తి నిద్రాణమై ఉండగా మేల్కొని ఉండేవని నా తాత్పర్యం. అలాంటి సమయాలలో మనలోనివన్యమృగం ఆస్వాదిత మాంసమై లేదా సేవితమదిరమై మేల్కొని నిదురను విదిల్చివైచి తన వాంఛలను తీర్చుకొన బయలుదేరుతుంది. ఆ సమయంలో అది చేయరాని దోషమంటూ ఉండదు. ధర్మనిషిద్ధసంగమానికి గాని, అగమ్యాగమనానికిగాని, పితృహత్యకు గాని, నిషిద్ధభోజనానికి గాని వెనుకాడదు.

అక్షరాల నిజం.

అయితే మానవుడు ఆరోగ్యవంతుడై నిగ్రహంకలిగి, నిద్రపోవకమున్ను తనవివేచనాశక్తులను జాగృతంచేసి, ఉత్తమభావాలతో మననంతో వానిని పోషిస్తూ సమాధినిమగ్నుడు కావాలి. తనస్పృహలను పూర్తిగా ఎండగట్టనూరాదు; పోషించనూరాదు. కేవలం వాటిని నిద్రపుచ్చి వాని భుక్తిముక్తులవలనిసుఖదుఃఖాలు ఉత్తమతత్త్వానికి అప్రతిబంధకాలు కావించుకోవాలి. అలా చేసినప్పుడు అతనిలోని ఉత్తమతత్త్వం నిర్మలంగా స్వయంసమృద్ధంగా ఉండవీలవుతుంది. ఆలోచించి ఒకనిర్ణయం ఏర్పరచుకొనే వెరవేర్పడుతుంది. తానింతకుమున్ను ఎరుగని భూతభవిష్యద్వర్తమానాలు సందర్శించటానికి అవకాశం కలుగుతుంది. అదే విధంగా అతడు తనలోని ఉత్సాహాన్ని ఉపశాంతమొనరించి నిదురపోక ముందు ఎవరిపైని కారాలు మిరియాలు నూరక, తనలోని అవివేకతత్త్వాలను రెండింటిని శమింపజేసి, మూడవతత్త్వమైన వివేకాన్ని జాగృతం చేసి విశ్రాంతుడైనప్పుడు సత్యాన్ని దాదాపుపొందుతాడు. అతని స్వప్నాలు విపరీతాలు కావు. నియమరహితాలుగా ఉండవు. అట్టిదానికి అవకాశాలు చాల తక్కువ.

మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను.

మూలవిషయం వదలి శాఖాచంక్రమణం చేస్తున్నాను. ఇంతకూ నేను చెప్పబూనుకొన్నవిషయం ఒకటే. మన అందరిలోను, తుదికి సత్పురుషులలో గూడ నియమరహితమై వన్యమృగప్రాయమైనప్రకృతి ఉంటుంది. ఇది నిద్రాసమయంలో బయటపడుతుంది. నేను చెబుతున్నది యథార్థమో కాదో, నాతో ఏకీభవించగలవో లేవో ఆలోచించు.

మీతో ఏకీభవిస్తున్నాను.

మనం ప్రజాస్వామికవ్యక్తిశీలం ఎలా ఉంటుందో చెప్పుకొన్నాము. దానిని మరొకసారి గుర్తుకు తెచ్చుకో. అతడు చిన్నప్పటినుంచి లోభి యైన తండ్రిశిక్షణలో పెరిగాడన్నాము. అతనిలోని ఆదాయకాంక్షలను ప్రోత్సహించి వినోదార్థమై అలంకారప్రాయమైన అనావశ్యకకాంక్షలను తండ్రి నిరుత్సాహపరిచాడు.

అవును.

ఆ తరువాత ఆ యువకుడు విశృంఖలవర్తనులైన నాగరకులసావాసంపట్టి తండ్రిప్రలోభంలో పెరిగిన అసహ్యతకొలది సావాసగాండ్రనడవడులు అలవరచుకొన్నాడు. అయితే అతడు ఆభ్రష్టులకంటె ఉత్తముడు. ఆ కారణంవల్ల అతడు ఇరువాగునకీడ్వబడి తుదికి మధ్యస్థుడౌతాడు. తుచ్ఛ రాగద్వేషాలకు దాసుడు కాక వివిధసుఖాలను తనదృష్టిలో మితంగా అనుభవిస్తాడు. ఈ విధంగా ధనికవర్గీయులనుంచి ప్రజాస్వామికవ్యక్తి ఉద్భవిస్తాడు.

అవును, అతనిని గూర్చి లోగడ అలాగే చెప్పుకొన్నాము. ఇప్పుడు కూడ అలాగే అభిప్రాయపడుతున్నాము.

ఆ తరువాత సంవత్సరాలు గడుస్తవి. అతనికి కొడుకు కలుగుతాడనుకో. అతనిని స్వకీయనియమానుసారంగా పెంచుతాడు.

అలాగే జరిగిందనుకొందాము. జరిగితే?

తండ్రికి సంప్రాప్తించిన అనుభవంవంటి అనుభవమే కుమారునికి కలిగిందనుకో. అతడు కేవలనియమరహితజీవనప్రవాహంలో పడ్డాడనుకో. అతనిని చెరిచేవారు ఆ జీవితం మూర్తీభవించినస్వాతంత్ర్యమంటారు. అతనితండ్రిమిత్రులు అతనిమితవాంఛలలో భాగస్వాములవుతారు. ప్రతిపక్షం విరుద్ధగుణాభివృద్ధికి తోడ్పడుతుంది. ఈ ఇంద్రజాలికులు నియంతృనిర్మాయకులు. తమప్రభావం అతనిపై తగ్గుతున్నదని పసికట్టినప్పుడు అతనిలోని దారుణఉత్సాహమ్ముగాన్ని రెచ్చగొడతారు. ఇది అతనిలోని

నిర్వ్యాపారతానిరర్థకధనవ్యయాలను పురికొల్పుతుంది. ఈ క్రూరమృగం బ్రహ్మాండమైన రెక్కలపోతుటీగ అంటే సరిపోతుంది. అంతకన్నా మరొకమాట దానిని వివరించలేదు.

అవును, దానికాపదమే సరిపోతుంది.

అగురుధూపకుసుమమాలికాసవసందోహమేఘాలు ఆవరించినప్పుడు విశ్రృంఖలవర్తనసుఖాలు బందాలు త్రెంచుకొని ఝుంకారాలు చేస్తూ అతనిలో నిక్షిప్తమైన గాంధవాంఛాత్రోటిని బలపరుస్తవి. అప్పుడు అతని ఆత్మాధినాథుడు ఉన్మాదాన్ని నిజాంగరక్షకాధిపతినిగా చేసికొని ఆవేశంతో విజృంభిస్తాడు. తనలో ఇంకా సద్భావాలు, కాంక్షలు, లజ్జాభిమానాలు ఏ మాత్రం మిగిలిఉన్నా వాటిని అతడు త్రుంచి వెలికిత్రోసివేస్తాడు. ఈ విధంగా ఆమూలం నిగ్రహం క్షాళితమవుతుంది. ఉన్మాదం పరాకాష్ఠ పొందుతుంది.

అవును. ఈ విధంగానే నియంత ఉద్భవిస్తాడు.

మరి ఈ కారణంవల్లనే కదా ప్రేమ నియంతగా కీర్తింపబడ్డది?

అవును, ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు.

మరి మదిరామత్తునిలో గూడ నియంతృత్వం లేదా?

లేకేమి? ఉన్నది.

మదితప్పినవాడు మానవులనే కాదు, దేవతలను గూడ పాలించగలనని భావించడా?

భావిస్తాడు.

ప్రకృతివల్ల గాని, అలవాటువల్ల గాని, ఈ రెంటివల్ల గాని, ఉన్మత్తుడు గాఢకామలాలసుడు ఉత్సాహోద్వేగి అయినప్పుడు సార్థకనామధేయుడైన నియంత ఉద్భవిస్తాడు.

అవును.

అతడు ఇలాంటివాడు. అతనిస్వభావమే ఈ విధంగా ఉంటుంది. ఇంతకూ అతడు ఎలా జీవిస్తాడు ?

మీరే చెప్పాలి.

అతనిజీవితం తరువాతిదశలో విందులు వినోదాలు, త్రాగుడులు తందనాలు, నాగవాసం భోగవాసం—ఇలాంటివన్నీ ప్రారంభమవుతవి. అతని ఆత్మలో కామం పీఠం వేసికొని ఆత్మవ్యవహారాలన్నీ శాసిస్తుంది.

అవును.

నానాటికీ వాంఛలు చిలవలు పలవలై దట్టంగా అల్లుకొంటవి. వాంఛితార్థాలు పెరిగిపోతవి.

అవును.

రాబడులుఅనేవి ఉంటే అవి అంతలోనే యింకిపోతవి.

నిజమే.

తరువాత అప్పుసప్పులు అంటుకొంటవి. ఆస్తిపాస్తులు సన్నగిలుతవి.

అంతగాక మరేమి జరుగుతుంది ?

ఈ విధంగా సర్వమంగళం పాడినతరువాత అతనివాంఛలు రాబందుల పిల్లలవలె గూటిలోగుమిగూడి తిండికోసం కేరుకేరుమనవా ? వాటి అరుపులకు ఆగలేక ఉద్విగ్నుడవుతాడు. వాటిని సంతృప్తిపరచటంకోసం ఎవరిని మోసగింతామా, ఎవరిని దోచుకుందామా అని వెమకుతుంటాడు.

నిజమే.

ఈ దుర్భరబాధనుంచి బయటబడాలంటే అతనికి డబ్బు అవసరం. 'అది ఎలావచ్చిందా?' అన్నదానితో నిమిత్తం లేదు.

అవును. అతనికి కావలసింది డబ్బు.

తనలో మార్పు వచ్చింది. ప్రాతసుఖాలను తొలగించి క్రొత్తసుఖాలు వచ్చాయి. క్రొత్తసుఖాలు ప్రాతసుఖాలస్వత్వాలను అపహరించాయి. అలాగే తాను గూడ తనతలిదండ్రులకంటె పిన్నవాడు కావటంవల్ల వారి కంటె తనకెక్కువ కావాలంటాడు. ఆస్తిలో తనవంతు ఖర్చుపెట్టుకొని ఉంటే తలిదండ్రులభాగం కొంత గిలుబుకొంటాడు.

అందు సందేహం లేదు.

తలిదండ్రులు ఇవ్వకపోతే మొదట వారిని వంచింప యత్నిస్తాడు.

యథార్థం.

ఆ ఆట సాగకపోతే బలముపయోగించి దోచుకొంటాడు.

అది సంభావ్యమే.

మరి ముసలితలిదండ్రులు దానికి ఒప్పుకొనక ఎదురుతిరిగితే వారిపై దౌర్జన్యం సాగించటానికి అతుడ్రుడేమాత్రమైనా వెనుకాడుతాడా?

లేదు. పాపం ఆ ముదివగ్గులు దురదృష్టవంతులు !

యాడైమాంటస్ ! చెడిపతోడితగులం ఆవశ్యకసుఖం కాదు గదా? దీనిని మున్నిడుకొని తన్ను కని పెంచి పెద్దవాణ్ణిచేసినతల్లిపై చేయిచేసి కొంటాడంటే నమ్ముతావా? ఆ చెడిపను తనయింట నిలిపి తల్లిచే ఊడిగం చేయిస్తూ దానిఅదుపుఆజ్ఞలలో పెడుతాడంటే నీవు విశ్వసిస్తావా? క్రొత్తప్రాయపువానిచెలిమి పాటించినప్పుడు తండ్రికి గూడ ఇదేమర్యాద జరుపుతాడంటే నమ్ముతావా?

నమ్మకేమి? అంతకు తక్కువ ఏ మాత్రం చేయడు.

కాబట్టి అలాంటి కుమారనియంత నిజంగా తలిదండ్రుల అదృష్టరేఖ!

అవును. వారిఅదృష్టం క్రుక్కపుడుతున్నాడు !

వాడు ముందు తలిదండ్రుల ఆస్తిపాస్తులు గిలుబుకొంటాడు. అవి అడుగంటినా సుఖాలు తండోపతండాలుగా అతనిమనస్సులో రేగి ఝంకరిస్తవి. అప్పుడు ఇంటికి కన్నంవేస్తాడు. లేదా రేయి బాటసారుల ఉడుపులు ఒడుచుకొంటాడు. ఆ మీదట దేవళంమీద పడతాడు. ఈ లోపున చిన్నతనంలో నేర్పినకార్యాకార్యనిర్ణాయకభావాలను నూతనభావాలు వెడలవడిచి తామే కామానికి అంగరక్షకత్వం వహించి అతనిసామ్రాజ్యం పంచుకొంటవి. అతడు ఇంకా ప్రజాస్వామికావస్థలో ఉండి నీతినియమాలకు మాతాపితలకు కట్టువడిఉన్నరోజులలో ఇవి అతనిస్వప్నలోకంలోనే స్వైరవిహారం సాగిస్తవి. ఇప్పుడతడు కామవశవర్తి. కాబట్టి తొల్లి అరుదుగ స్వప్నావస్థలో ఎలా ఉండేవాడో ఇప్పుడు జాగ్రదవస్థలో నిరంతరం అలా ఉంటాడు. ఘోరహత్య చేస్తాడు. నిషిద్ధాహారం సేవిస్తాడు. మరేఘోరకర్మఅయినా చేస్తాడు. కామం అతన్ని చెవులుపట్టుకొని ఆడిస్తుంది. మహాప్రభువువలె నియమరహితమై నిరంకుశమై అతనిలో వర్తిస్తుంది. రాజ్యాన్ని నియంతవలె అతన్ని కామం యథేచ్ఛం ఏలుకొంటుంది. తన్నూ తనదుష్టభావాలనూ బాహ్యప్రపంచాగతదుష్ప్రభావాలనూ పోషించుకొనటానికి ఏ తెగువకైనా పూనుకొంటాడు. అతని మనుగడతీరు ఇప్పుడు బొమ్మకట్టినట్లుగా కనిపిస్తున్నది కదా?

ఆం.

ఇలాంటివారు రాజ్యంలో కొలదిగా ఉండి సచ్చరితులు మెండుగా ఉంటే వారు యుద్ధసమయంలో మరొకరాజ్యనియంతవద్ద అంగరక్షకులుగా చేరుతారు. లేదా కైజీతగాండ్రుగా అతనివద్ద కుదురుతారు. అలాంటియుద్ధం రానప్పుడు తమ ఇండ్లవద్దనే ఉండి రాజ్యంలో చిన్నచిన్నదుర్మార్గాలు అనేకాలు చేస్తుంటారు.

ఎలాంటిదుర్మార్గాలంటారు?

వీలునుబట్టి దొంగలుగా కన్నగాండ్రుగా జేబుదొంగలుగా తెరువాటు గాండ్రుగా దోపిడికాండ్రుగా మానిసిబందెకాండ్రుగా తయారవుతారు. మాటనేర్పు ఉంటే దోషారోపకులవుతారు. తప్పుడుసాక్ష్యాలు చెబుతారు. లంచాలు పుచ్చుకొంటారు.

తమసంఖ్య తక్కువే అయినా చేసేగుండగాలకు తక్కువలేదు.

నిజమే. కాని 'చిన్నవి, పెద్దవి' అన్నపదాలు సాపేక్షాలు. వారు రాజ్యానికి కావించే ఈ అనర్థకాలన్నీ నియంత కావించేవాటిలో వెయ్యోవంతుకూడ ఉండవు. ఈ పచ్చికలిజాతి పెరిగి తనబలం తెలిసికొని ప్రజలదుర్విదగ్ధతచే దోహదం పొందినప్పుడు తనలోనుంచి నియంతృకలక్షణపరిపూర్ణుని ఎన్నుకొని నియంతను చేస్తుంది.

అవును. దానికి అతడే కదా అత్యంతయోగ్యుడు ?

ప్రజలు లొంగితే మేలే. లొంగక ప్రతిఘటిస్తే తలిదండ్రులను హింసించినట్లే వారిని హింసిస్తాడు. మాతృదేశాన్ని తన అనుచరవర్గానికి బానిసను చేస్తాడు. అతని ఉత్సాహోద్వేగవాంఛలలక్ష్యమిదే.

అక్షరాల అంతే.

అధికారం చేపట్టకముందు వారిశీలం ఇలా ఉంటుంది: తమ్ము శ్లాఘించే వారితోను తమకుసాధనప్రాయులుగా ఉండేవారితోను సాహచర్యం నెరపుతారు. ఎవరినుంచి ఏది కావలసివచ్చినా వారికాళ్ళపైబడ సిద్ధపడతారు. ఎంతో అనురాగమున్నట్లు నటిస్తారు. తమకు వలసినఅర్థం సిద్ధించినవెనుక వారెవరో తామెవరో.

అవును.

ఎల్లప్పుడు వారిస్థితి ఒకటే. వారు అధికారులైనా కావాలి, లేదా సేవకులైనా కావాలి. ఎవరికీ మిత్రులు మాత్రం కారు. నియంతకు యథార్థ స్వాతంత్ర్యం, స్నేహం నలుపో తెలుపో, పులుపో తీపో తెలియదు.

నిజమే.

అలాంటివారిని పచ్చిమోసగాండ్రు అనవచ్చునుగదా?

ఇంకా సంశయమా!

మనం న్యాయమని భావిస్తున్నది నిజమైతే వారు పరమఅన్యాయవంతులు.

నిస్సందేహంగా.

అయితే అధమతమునిస్వభావం ఒక్కముక్కలో చెప్పుకొందాము. మన భయంకరదుస్స్వప్నార్థమే వాస్తవమై అతనిరూపంతో మనకు సాక్షాత్కరిస్తుంది.

అది యథార్థం.

నియంతృకస్వభావం కలిగినవాడు అధికారం చేపట్టినప్పుడు ఇలా జరుగుతుంది. అతని ఆయుఃప్రమాణంతోపాటే అతని నియంతృతాగుణదారుణత్వం పెరుగుతుంది.

నిజమేనని గ్లాకన్ అందుకొన్నాడు.

ఈ అతిక్రూరుడు అధికదుఃఖభాజనుడు కాడా? దీర్ఘతరకాలం క్రూరతర నియంతృత్వం నెరపినవాడు అధికతరదుఃఖభాజనుడుకాడా? ఈ విషయాన్ని ప్రజలు సాధారణంగా అంగీకరించకపోవచ్చును.

అవును.

నియంతృకవ్యక్తి నియంతృకరాజ్యానికి, ప్రజాస్వామికవ్యక్తి ప్రజాస్వామికరాజ్యానికి, ఇలాగే ఆ యా వ్యక్తులు ఆ యా రాజ్యాలకు సదృశులు కారా?

కాకపోవటమేమి?

అలాగే గుణసంపత్తిలో సౌఖ్యాలలో ఒకరాజ్యానికి మరొకరాజ్యానికి ఉన్నసంబంధమే ఒకమానవునకూ మరొకమానవునకూ ఉంటుంది కదా?

అవును.

సుగుణసంపత్తినిబట్టి చూస్తే సత్ప్రభువురాజ్యానికీ నియంతృపాలిత రాజ్యానికీ సంబంధమేమిటి?

అవి కేవలం విరుద్ధకోటులు. మొదటిది ఉత్తమోత్తమం. రెండవది అధమాధమం.

ఏది ఎలాంటిదన్నవిషయంలో పొరపాటు కలుగదు. కాబట్టి వాటిసుఖదుఃఖాలవిషయంలో నీనానిశ్చయమేమో చూదాము. నియంతృభూతానికి గాని, అల్పసంఖ్యాకులైన అతని అనుచరులకు గాని భయపడక అతని రాజ్యమందలి ప్రతిభాగాన్ని సందర్శించి మన అభిప్రాయాన్ని చెప్పుకొందాము.

ఈ ఆహ్వానం సముచితమే. నియంతృత్వం ఘోరతమపరిపాలనగా, రాజపరిపాలన సుఖతమపరిపాలనగా గోచరిస్తున్నది. ఎల్లవారికీ ఇలాగే కనిపించాలి.

సరే. ఈ వ్యక్తులిద్దరితారతమ్యం నిర్ణయించటం అంత తేలికకాదు. తీర్పరి మానవస్వభావంలో పూర్తిగా మునిగి దానిస్వరూపం జ్ఞానచక్షువుతో చూడాలి. నియంతబాహ్యాపటాటోపం చూచి బాలుడువలె భ్రాంతి పొందరాదు. సునిశితగ్రాహి కావాలి. ఇలాంటిశక్తిమంతుడై ఆ నియంతతో ఒకేచోట గడపి అతనిదైనందినజీవితంతో గాఢపరిచయం ఏర్పరచుకొని అతడు తనకుటుంబంలో ఎవరితో ఎలా మెలగుతాడో, సామాజికవిపత్తి వచ్చినప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో తెలిసికొన్నవాడు అతని సుఖదుఃఖాలను ఇతరమానవులసుఖదుఃఖాలతో పోల్చి ఎలా ఉంటవో చెప్పాలి.

అదే ఉత్తమమార్గం.

అయితే దీనికి వలసినయోగ్యత, అనుభవం ఉన్నతీర్పరులము మనమే. ఇలాంటివ్యక్తితో మనకు ఇదివరకే పరిచయమున్నదని చెప్పవచ్చునా? మనం అడిగేప్రశ్నలకు ఎవరో ఒకరు సమాధానం చెప్పాలి.

అలాగే.

అయితే వ్యక్తికీ రాజ్యానికీ ఉన్న సాదృశ్యం నీవు విస్మరించరాదు. పర్యాయంగా రెంటిని పరీక్షించి ఒక్కొక్కదానిస్థితిగతులను వివరిస్తావా?

అంటే?

రాజ్యంతో ప్రారంభిద్దాము. నియంతృపాలితరాజ్యం స్వతంత్రమా? అస్వతంత్రమా?

ఏ రాజ్యమూ అంత దాస్యమనుభవించదు.

అయినా ఆ రాజ్యంలో స్వతంత్రులూ యజమానులూ ఉంటారు కదా?

అవును. ఏదో కొలదిగా ఉంటారు. కాని, సామాన్యంగా చెప్పాలంటే ప్రజలలోని ఉత్తములు భ్రష్టులై దాస్యనిమజ్జితులవుతారు.

మనుజుడు రాజ్యసదృశుడై ఉన్నప్పుడు ఆసూత్రమే ప్రవర్తిల్లాలి కదా? అతనిఆత్మ నైచ్యబర్బరతాపరిపూరితమౌతుంది. ఉత్తమగుణాలు మాటుపడుతవి. అతనిలోఉండే స్వల్పమైనపాలకాంశం కూడ హీనాతిహీనమై పోతుంది.

అది తప్పదు.

అలాంటివానిఆత్మ స్వతంత్రమానుషమా? పరతంత్రదాసీయమా?

దాసీయమే.

నియంతవల్ల దాస్యమనుభవిస్తున్నరాజ్యం స్వచ్ఛందకర్మప్రవృత్తి

కాజాలదు.

అవును.

నియంతకు లోబడి ఉన్న ఆత్మ కూడ తాను కోరినదానిని ఏ మాత్రం చేయజాలదు. లోపల జోరీగ చేరి దానిని రెచ్చగొడుతుంది. అందువల్ల ఎంతో బాధపడుతుంది; పశ్చాత్తాపం పొందుతుంది.

అవును.

నియంతపాలనకు లోనైనరాజ్యం సిరిసంపదలతో తులదూగుతుందా? దారిద్ర్యం వెళ్లబోస్తుందా?

దారిద్ర్యమే వెళ్ళబోస్తుంది.

మరి నియంతృకాత్మ నిత్యదరిద్రమై తృప్తి ఎరుగదు గదా?

ఎరుగదు.

మరి అలాంటిరాజ్యమూ అలాంటివ్యక్తీ నిత్యశంకితులు కారా?

ఎందుకు కారు?

ఈ రాజ్యంకంటె మరేరాజ్యంలోనైనా ఏడ్పులు, పెడబొబ్బలు, మూల్గులు మెండుగా వినిపిస్తవా?

వినిపించవు.

నిరంతరరాగద్వేషోపహతిపొందే నియంతకంటె మరెవడైనా అధికదుఃఖం పొందుతాడా?

అసంభవం.

వీటినీ ఇతరఅనర్థకాలనూ మున్నిడుకొని రాజ్యాలన్నిటిలో నియంతృక రాజ్యం అత్యంతశోచనీయమని భావిస్తున్నావన్నమాట.

అవును.

సరే. ఈ అనర్థకాలే నియంతృకమానవునిలో గోచరించినప్పుడు ఏమను కొంటావు?

సర్వమానవకోటిలో అతడు శోచ్యతముడు.

ఇక్కడే నీవు పొరబడుతున్నావేమో ?

అంటే?

అతనిదుఃస్థితి ఇంకా పరాకాష్ఠ పొందలేదనుకొంటున్నాను.

అయితే అతనికంటె శోచనీయులున్నారన్నమాట.

అవును.

వారెవరు ?

నియంతృకస్వభావం కలిగి వైయష్టికజీవయాత్రకు మారుగా ప్రజానియంతృత్వం సాగింపవలసిననిర్భాగ్యులు.

ఇంతకుముందు చెప్పుకొన్నదానినిబట్టి చూస్తే మీరు చెప్పింది యథార్థం.

అయితే ఉదాత్తవిషయవిచారణలో తలదోకలు లేనితలపులకు తావివ్వక నిశ్చితి ఏర్పరుచుకోవాలి. ఎందువల్లనంటే అన్నిసమస్యలకంటె ధర్మాధర్మసమస్య అత్యంతముఖ్యం.

అవును.

ఈ దృష్టాంతం చెబితే నీకీవిషయం ఇంకా విశదం కావచ్చును.

ఏ దృష్టాంతం?

రాజ్యాలలో సంపన్నులై దాసీదాసంకలిగినవ్యక్తులను తీసికో. వారినిబట్టి నియంతస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. అటు సంపన్నులకూ, ఇటు నియంతకూ బానిసలుంటారు. అయితే ఈ ఉభయులకు ఒకతేడా. అతనికి ఎక్కువమంది బానిసలుంటారు.

అవును.

సంపన్నులు సురక్షితజీవయాత్ర చేస్తారు. సేవకులకు వారు భయపడనక్కరలేదు.

ఎందుకు భయపడాలి?

భయకారణం లేదు. అయితే దీనికి హేతువేమో తెలిసికొన్నావా?

ఆఁ. ప్రతిపౌరునిరక్షణకోసం రాజ్యమంతా ఏకమవుతున్నది.

అవును. అయితే ఇలాంటివానిని ఒకనిని ఆస్తిపాస్తులతో కుటుంబంతో దాసీదాసంతో కొనిపోయి ఏదో ఒకదేవత నిర్జనప్రదేశంలో పడవేసిందనుకో. ఆచట అతనికి తోడ్పడేస్వతంత్రులు ఎవరూ ఉండరు. అలాంటప్పుడు తన్నూ భార్యాపుత్రులనూ బానిసలు చంపివేస్తారని అతడు భయపడడా?

సందేహమేమున్నది?

బానిసలను అతడు స్తుతించవలసివస్తుంది. ఇష్టం లేకపోయినా వారికి ఎన్నో ఆశలు చూపుతాడు. స్వాతంత్ర్యమిస్తానంటాడు. ఇంకా ఏవేవో చెబుతాడు. ఈ విధంగా అతడు వారిని బుజ్జగించవలసివస్తుంది.

అవును. ఆత్మరక్షణకు అంతకంటె గత్యంతరమేమున్నది?

అతన్ని చేరవేసినదేవతే సేవ్యసేవకభావం అక్షంతవ్యమనీ, మరణదండనార్హమనీ భావించేసమాజంలో అతనిని పడవేసినదనుకో.

అప్పుడతనిస్థితి మరీశోచనీయమే. ప్రతిచోటా అతనికి శత్రువులే. ఎల్లప్పుడూ వారు అతనిని ఒకకంట కనిపెడుతుంటారు.

ఇలాంటిచెర నియంతకు దాపరించదా? అతనిపై అన్నిరకాలభయాలు, కామాలు క్రమ్ముకొంటవి. అసంతుష్టమై ఆశాబద్ధమై అతనిఆత్మరాజ్యంలో ఎల్లవ్యక్తులమధ్య ఏకాకి అవుతుంది. అతడు యాత్రకు పోలేడు. దర్శనీయవస్తువులను దర్శించలేడు. వంటింటిగడపదాటనిఆడుదానివలె అతడు తన ఇల్లుకదలలేడు. దూరదేశాలకు పోయి విచిత్రాలు చూచివచ్చినపౌరులను చూచి అసూయపడతాడు.

అవును.

ఇలాంటి అనర్థకాలమధ్య తన్నుతానే సంబాళించుకోలేని నియంత పరమశోచ్యుడని చెప్పావు. అతడు వైయష్టికజీవయాత్ర సాగించక అదృష్టం త్రిప్పలకు లోబడి ప్రజానియంత కావలసివచ్చినప్పుడు విపరీతశోచనీయావస్థ పొందడా? తన్నుతానే సంబాళించుకోలేనప్పుడు ఇతరులను గూడ సంబాళించవలసివస్తుంది. పక్షవాతగ్రస్తుడో తదన్యరోగపీడితుడో విశ్రాంతికి దూరుడై ఇతరులతో డీకొని పోరాడవలసివచ్చినప్పుడారోగికి కలిగేదుఃస్థితే నియంతకు దాపరిస్తుంది.

ఈ పోలిక చక్కగా కుదిరింది.

అతనిస్థితి అతిశోచనీయం కాదా? నీవు కష్టతమమని వర్ణించినవానిజీవితంకంటె యథార్థనియంత అధమాధమజీవితం వెళ్లబోయడా?

ఇంకా సందేహమా?

మానవులేమనుకొన్నా వాస్తవంగా అతడు బానిస. పరమనీచులను అతడు శ్లాఘించవలసివస్తుంది. వారికి ఊడిగం చేయవలసివస్తుంది. అతనికోరికలు ఎన్నడూ తీరవు. పైగా, వానిసంఖ్య కూడ మెండు. కాబట్టి నిజంగా

అతడు దరిద్రుడు. అతనిజీవితమంతా భయభ్రాంతం; సంక్షోభాపూర్ణం; అపసారకాకలితం. ఈ విషయాలలో అతనికీ నియంతృకరాజ్యానికీ ఉన్న సాదృశ్యం అంతా ఇంతా కాదు.

అవును.

పైగా, అధికారప్రాప్తితో అతనిస్థితి మరీ విషమిస్తుంది. అసూయ, శ్రద్ధా రాహిత్యం, అన్యాయం, స్నేహశూన్యత, అపవిత్రత అంతంతకు అధిక మవుతవి. అతడు ప్రతివ్యసనానికి పాల్పడతాడు. వీటన్నిటిఫలితంగా అత్యంతశోచనీయావస్థ పొందుతాడు. ఇతరులకు కూడా తనకుపట్టినదుఃస్థితినే కలిగిస్తాడు.

జ్ఞానవంతుడెవడూ మీమాటలు కాదనడు.

సరే తగవరి ఆటలఫలితాలు నిర్ణయించి ప్రకటిస్తున్నట్లే నీవు కూడ సుఖంలో ఎవడు ప్రథముడో, ఎవడు ద్వితీయుడో, ఇతరులు ఏ క్రమంలో వస్తారో చెబుతావా? ఉన్నది ఐదుగురువ్యక్తులు: రాజు, చాతుర్యవ్యక్తి, ధనికవర్గీయవ్యక్తి, ప్రజాస్వామికవ్యక్తి, నియంతృక వ్యక్తి.

నిర్ణయం తేలికగా చెప్పవచ్చును. ఒక్కొక్కరే రంగస్థలం ప్రవేశిస్తే గుణావగుణాలను, సుఖదుఃఖాలను పురస్కరించుకొని వారిక్రమం నిర్ణయిస్తాను.

అయితే వైతాళికుని ఇందుకు నియోగింతామంటావా? లేక నన్నే నీనిర్ణయాన్ని ప్రకటించమంటావా? ఉత్తమోత్తముడు, అత్యంతన్యాయవంతుడు అయినవాడు అత్యంతసుఖి అని అరిస్టాన్ కుమారుడు నిర్ణయించాడని ప్రకటించేదా? ఇలాంటివ్యక్తి రాజు. అతడు తనకు తానే రాజుగా ఉంటాడు. అధముడూ అత్యంత అన్యాయవంతుడూ అయినవాడు పరమ శోచ్యుడు. ఇతడు నియంత. ఇతడు తనకేకాదు తనరాజ్యానికి గూడ ఘోరనియంత.

అలాగే నానిర్ణయం మీరే ప్రకటించండి.

అయితే ప్రకృతవాక్యానికి 'మర్త్యామర్త్యులు చూచినా చూడకపోయినా' అన్నవిశేషం కూడ చేర్చేదా?

అలాగే.

సరే, ఇది మొదటిఉపపత్తి. మరొకటి గూడ దీనిని కొంత బలపరచ వచ్చును.

ఏ ఉపపత్తి?

ఆత్మస్వభావాన్ని పురస్కరించుకొని ఈ రెండవది సిద్ధిస్తుంది. రాజ్యంలో వలెనే ఆత్మలో గూడ మూడుతత్త్వాలున్నవని చెప్పుకొన్నాము. ఈ విభాగంవల్ల రెండవఉపపత్తి ఏర్పడవచ్చును.

ఎలాగంటారు?

ఈ మూడుతత్త్వాలకు అనుగుణంగా మూడుసుఖాలు, శక్తులు ఉన్నవను కొంటాను.

అంటే మీతాత్పర్యం?

ఇంతకుముందు చెప్పుకొన్నట్లు ఒకతత్త్వం జ్ఞానం ప్రసాదిస్తుంది. మరొ కటి క్రోధం కలిగిస్తుంది. మూడవది అనేకరూపాలు పొందుతుంది. దానికి ప్రత్యేకనామం లేదు. అయినా క్షుత్పిపాసాకామాదికతీవ్రతనుబట్టి తృష్ణ అనీ, ధనసహాయంతో ఈకోర్కెలు నెరవేరటానికి వీలున్నది కాబట్టి ధనకాంక్షఅనీ ఇది సామాన్యంగా పేర్కొనబడుతున్నది.

అవును.

ఈ తృతీయభాగానికి సంబంధించిన ప్రేమలూ సుఖాలు లాభప్రధానా లన్నపక్షంలో మనం దీనిని ఒకభావంగా చెప్పుకోవచ్చును. అప్పుడు ఆత్మయొక్క ఈతత్త్వాన్ని లాభప్రణయం, లేదా ధనకాంక్ష అని చెప్పవచ్చును.

మీతో నేనేకీభవిస్తున్నాను.

ఈ ఉత్సాహఫలితాంశం కేవలం పాలనా విజయ యశస్సంపాదనైకనిష్ఠం కాదా ?

అవుతుంది.

దీనిని స్పర్ధాళుత, లేదా ప్రస్పృహ అనటం యోగ్యమా ?

ఆc.

మరి ఈ జ్ఞానతత్త్వం కేవలం సత్యైకాభిముఖమై తక్కిన రెండుతత్త్వాల వలె లాభమందు గాని, కీర్తియందు గాని అంతగ ఆసక్తిపొందదు.

అవును.

ఆత్మలోని ఈ అంశానికి 'ప్రజ్ఞాప్రణయి, జ్ఞానప్రణయి' అన్నబిరుదాలు సార్థకాలే కదా ?

నిశ్చితంగా.

ఒక్కజాతిమానవులలో ఒకతత్త్వం మెండుగా మరొకజాతివారిలో మరొకటి మెండుగా ఉండవచ్చును గదా ?

అవును.

అప్పుడు మానవులలో మూడుజాతులేర్పడుతున్నవి. ఒకటి ప్రజ్ఞాప్రణయి, మంొకటి గౌరవప్రణయి, మరొకటి లాభప్రణయి అని చెప్పవచ్చునా ?

ఆc.

వారి విభిన్నలక్ష్యాలకనుగుణంగా త్రివిధసుఖాలు ఏర్పడుతున్నవి.

నిజమే.

మీజీవితాలలో ఏది సుఖతమమని వరుసగ వారిని ప్రశ్నిస్తే ఎవనికి వాడు తనజీవితాన్ని శ్లాఘిస్తూ అన్యుల జీవితాలను కొంచెపరుస్తాడు. ధనసంపాదనాసక్తులు వెండిబంగారాలవల్ల కలిగేప్రయోజనాలతో ధనం సమకూర్చనిగౌరవాన్ని జ్ఞానాన్ని పోల్చి వాటిని వట్టిఆటోపంక్రింద జమకడతాడు.

నిజమే.

మరి గౌరవకామి ఏమి భావిస్తాడు? సిరిసంపత్తులసుఖం తుచ్ఛం. ప్రఖ్యాతి సంపాదించనిజ్ఞానసుఖం అర్థరహితమని భావించడా?

అవును.

మరి జ్ఞానప్రణయి భావన ఎలా ఉంటుంది? సత్యగ్రహణసుఖంతో తక్కిన సుఖాలేవీ సాటిరావనీ, అర్థవంతాలుకావనీ తలపడా? సత్యగ్రహణమే నిరంతరవృత్తిగాగలిగి ఎప్పుడూ నేర్చుకొంటూ ఉంటే అది స్వర్గసుఖానికి అదవీయమని భావించడా? ఇతరసుఖాల ఆవశ్యకత లేకపోతే తనకు వాని అక్కర ఉండదన్నభావంతో అతడు ఇతరసుఖాలను ఆవశ్యకాలనడా?

అందు సందేహం లేదు.

ప్రతిజాతిసుఖం, ప్రతివానిజీవితం వివాదాస్పదంగా ఉన్నప్పుడు ఏ యే జీవితాలు గౌరవాగౌరవప్రదాలో ఉత్తమాధమాలో అన్నప్రశ్న కాక, ఏజీవితం ఎక్కువసుఖవంతమో ఏది ఎక్కువ దుఃఖరహితమో అన్న ప్రశ్న ఉదయించినప్పుడు ఎవడు నిజం చెబుతున్నాడో మనకు ఎలా తెలుస్తుంది?

నావరకు నేను చెప్పలేనని అతడన్నాడు.

అయితే నిర్ణయించి చెప్పటానికి ప్రమాణం ఒకటి ఉండాలి కదా?

అనుభవం, ప్రజ్ఞ, వివేకం—వీనికంటె మేలైనప్రమాణమున్నదా?

లేదు.

అయితే ఆలోచించి చూడు:— ఈ ముగ్గురువ్యక్తులలో మనం పేర్కొన్న సుఖాలన్నిటిలో ఎక్కువ అనుభవం ఎవరికున్నది? లాభసుఖగ్రహణంలో తత్త్వవేత్తపొందినఅనుభవంకంటె ప్రధానసత్యస్వభావగ్రహణంలోను, జ్ఞానసుఖంలోను లాభకామికి ఎక్కువ అనుభవమున్నదా?

తత్త్వవేత్తకే ఎక్కువ ఆనుకూల్యమేర్పడుతున్నది. ఎందుకంటే బాల్యం నుంచి అతడు ఇతరసుఖాలు చవిచూచాడు. మరి లాభకామికో జ్ఞాన మాధుర్యం, సత్యగ్రహణసౌఖ్యం అనుభూతార్థాలు కావు.

అలాంటప్పుడు తత్త్వవేత్త ఉభయానుభవం పొందినవాడు కావటంవల్ల లాభకామికంటె అతనికే ఎక్కువ అధికారం ఏర్పడుతుంది.

అవును.

మరి తత్త్వవేత్తకు గౌరవసుఖవిషయంలో ఎక్కువ అనుభవం కలుగుతున్నదా? లేక గౌరవకామికి ప్రజ్ఞాసుఖవిషయంలో ఎక్కువ అనుభవం కలుగుతున్నదా?

అలా కాదు. ఈ ముగ్గురు తమలక్ష్యసిద్ధినిబట్టి గౌరవం పొందుతారు. ఇందు ప్రతివానికి తన్ను శ్లాఘించేవర్గముంటుంది. ఆ ముగ్గురూ గౌరవం పొందుతారు. కాబట్టి వారందరికి గౌరవసుఖానుభవం కలుగుతుంది. కాని, సత్పదార్థజ్ఞానానందం మాత్రం ఒక్క తత్త్వవేత్తకే అనుభూతం.

ఇంతకూ ఈ నిర్ణయంలో ఇతరులకంటె తత్త్వవేత్తకే స్వానుభవం ఎక్కువ తోడ్పడుతుందంటావు?

అవును.

మరి అతనికి ఒక్కనికే కదా ప్రజ్ఞానుభవాలున్నవి?

అవును.

తీర్పునకు వలసినశక్తి స్పృహాళువునకు లేదు, తత్త్వవేత్తకు మాత్రమే ఉన్నదంటావు.

ఏ శక్తి అంటారు?

వివేకం. దీనిమీదనే కదా నిర్ణయం ఆధారపడవలసింది?

అవును.

మరి వివేకం ప్రత్యేకంగా అతని ఉపకరణం కదా?

అవును.

సంపత్తిలాభాలే ప్రమాణాలైతే లాభకామి కావించేదూషణభూషణలు పరమప్రమాణాలు కావాలి.

అవును.

అలా కాక గౌరవమూ, విజయమూ, ధైర్యమూ ప్రమాణమైతే కీర్తికాముల నిర్ణయం, లేదా ప్రస్పృహాళువులనిర్ణయం యథార్థతమమవుతుంది కదా?

అవును.

అయితే ప్రజ్ఞానుభవవివేకాలేకదా నిర్ణయించాటవలసినవి?

వీటినిబట్టి ప్రజ్ఞావివేకప్రణయి ఆమోదించినసుఖాలే యథార్థతమాలని ఏర్పడుతున్నది.

కాగా, ఆత్మలోని జ్ఞానాంశసుఖమే సుఖతమం. ఎవనియందీజ్ఞానం రాజ్యం చేస్తుందో అతనిది సుఖతమజీవితమని తేలుతున్నది.

తనజీవితం సుఖతమమని ప్రజ్ఞావంతుడన్నప్పుడు అతడు సప్రమాణంగా మాటాడుతున్నాడు.

ఆ తరువాతిపరిగణ్యజీవితం ఏదని తీర్పు చెబుతాడు ? ఆ తరువాతిసుఖం ఏదంటాడు ?

స్పష్టంగా వీరుడూ గౌరవప్రణయి. ఇతడే ధనసంపాదనపరునికంటె తనకు సన్నిహితుడవుతున్నాడు.

కడపటివాడు లాభకామియే కదా ?

అవును.

ఈ సంఘర్షణలో వరుసగా రెండుసార్లు న్యాయవంతుడు అన్యాయవంతుని ఓడించాడు. ఇప్పుడు రక్షకుడైన ఒలింపియన్ జియూస్‌కు అంకితమైనమూడవప్రయత్నం వస్తున్నది. 'ప్రజ్ఞావంతునిసుఖంతప్ప తక్కిన సుఖాలేవీ యథార్థాలు కావు, స్వచ్ఛాలు కావు. తక్కినవన్నీ ఛాయామాత్రాలు' అని ఒకఋషి నాచెవిలో చెబుతున్నాడు. నిశ్చితంగా పరమంగా ఇది పరాజయాన్ని నిర్ణయిస్తున్నది.

ఇది మహత్తరమైనదే. కాని, మీ అభిప్రాయం వివరించాలి.

అలాగే. అయితే నీవు నాప్రశ్నలకు సమాధానం చెబుతూ తోడ్పడాలి.

సరే, కానివ్వండి.

సుఖం దుఃఖానికి ప్రతికోటి కదా ?

అవును.

అటు సుఖం కాక ఇటు దుఃఖం కాక తటస్థస్థితి ఒకటి ఉన్నది కదా ?

లేకేమి ? ఉన్నది.

రెంటికీ మధ్యస్థమై ఇది రెంటినుంచి విరతిపొందేఆత్మవిశ్రాంతి అవుతుందంటావు.

అవును.

జబ్బుపడినప్పుడు ప్రజలేమంటారో గుర్తున్నదా?

ఏమంటారు?

ఆరోగ్యంకంటె సుఖతరమైనది మరొకటి లేదంటారు. కాని, జబ్బుపడనంతవరకు వారికిది సుఖాలన్నిటిలో ఉత్తమమని తోచదు.

అవును.

వ్యక్తులు తీవ్రబాధకు గురి అయినప్పుడు బాధావిమోచనకంటె సుఖతరమైనది ఏమీ లేదని అనగా విని ఉంటావు.

వినకేమి? విన్నా.

ఇంకా పెక్కుబాధాసమయాలలో కేవలబాధావిరతి ఉత్తమోత్తమ సుఖంగా కొనియాడబడుతుంటుంది. అంతేకాని "ఇలాంటి అనుభవమే మహాభోగమని" అన్వయపూర్వకంగా పేర్కొనబడటంలేదు.

అవును. ఆ కాలంలో విరతి లభిస్తే చాలునని వారు సంతోషిస్తున్నారు. సంతృప్తి పొందుతున్నారు.

సుఖవిరతి కలిగినప్పుడు ఆ విరతి బాధాకరమేకదా?

నిస్సంశయంగా.

అప్పుడు మధ్యస్థస్థితి అటు సుఖమూ ఇటు దుఃఖమూ అవుతుంది.

అలాగే కనిపిస్తున్నది.

అనుభయం ఉభయమవుతుందా ?

కాదనే చెప్పాలి.

సుఖదుఃఖాలు రెండు ఆత్మగతులు (motions), అవునా ?

ఆం.

అనుభయమైనది విరతేకాని గతికాదు. అది సుఖదుఃఖాలకు మధ్యస్థమని చెప్పకొన్నాము.

అవును.

ఆ పక్షంలో బాధాభావం సుఖమనీ, సుఖాభావం దుఃఖమనీ భావించటం ఎలా సముచితమాతుంది ?

కాదు.

అప్పుడిది ఆభాసమే కాని, యథార్థం కాదు. అంటే బాధాకరమైన దానితో పోల్చినప్పుడు విరతి ఆ సమయానికి సుఖమవుతున్నది. సుఖకరమైనదానితో పోల్చినప్పుడు అది దుఃఖమవుతున్నది. అంతే కాని, యథార్థసుఖాన్నిబట్టి పరిశీలించినప్పుడు ఇవి యథార్థాలు కావు; ఒక విధమైన అధ్యారోపాలు.

అలాగే భావించవలసివస్తున్నది.

దుఃఖపూర్వాలు కాని మరొకజాతిసుఖాలను పరిశీలించు. ఇప్పటివలె అప్పుడు బాధారాహిత్యమే సుఖమని కాని, సుఖవిరతే దుఃఖమని కాని భావించవు.

అవి ఏవి? ఎక్కడ కనిపిస్తవి?

చాల ఉన్నవి. దృష్టాంతంగా సుగంధసుఖాలనుతీసికో. ఇవి మహత్త

రాలూ దుఃఖపూర్వాలూ కావు. క్షణంలో అవి కలుగుతవి. అపసరిల్లి నప్పుడు బాధను దిగవిడిచిపోవు.

అవును.

అలాంటప్పుడు దుఃఖరాహిత్యమే సుఖమని కాని, సుఖవిరతే దుఃఖమని కాని నమ్మనక్కరలేదు.

నిజమే.

అయినా శరీరంద్వారా ఆత్మను చేరే అసంఖ్యాకతీవ్రసుఖాలు సాధారణంగా ఇలాంటివే. ఇవి బాధావిరతిరూపాలు.

అది యథార్థం.

భావిసుఖదుఃఖాల ఊహలు కూడ ఇలాంటిప్రకృతికలవే కదా ?

అవును.

వాటికి దృష్టాంతం చెప్పనా ?

చెప్పండి.

ప్రకృతిలో ఉత్తరాధరమధ్యమప్రాంతాలున్నవని అంగీకరిస్తావా ?

ఆఁ.

ఒకవ్యక్తి క్రిందిప్రాంతంనుంచి మధ్యమప్రాంతానికి పోయినప్పుడు అతడు తాను మీదికి పోతున్నాననుకొంటాడు. మధ్యమప్రాంతంలో నిలిచి, యథార్థమైన ఉత్తరప్రాంతమెరుగనివాడు తాను ఎక్కడినుంచి వచ్చాడో చూచినప్పుడు అతడు ఉత్తరప్రాంతంలోనే ఉన్నానని భావించడా ?

అవును, మరొకవిధంగా అతడెలా భావిస్తాడు ?

అతనిని తిరిగి తీసికొనిపోవటం జరిగితే తాను క్రిందికిపోతున్నానని భావించడా ?

ఎందుకు భావించడు ?

ఈ భ్రాంతి అంతా యథార్థంగా ఏవి ఉత్తరాధరమధ్యప్రాంతాలో తెలియక పోవటంవల్ల కలుగుతున్నది.

అవును.

సత్యానుభవంలేనివ్యక్తులు పెక్కువిషయాలలో అపోహపడుతుంటారు. సుఖదుఃఖాలనుగూర్చి వానిమధ్యస్థస్థితినిగూర్చి వారికి అపోహలుకలగటం ఆశ్చర్యకరం కాదు. బాధాకరాలవైపు ఆకృష్టులవుతున్నప్పుడు వారు దుఃఖంపొందుతారు. తాము పొందుతున్నదుఃఖం యథార్థమనుకొంటారు. అదేరీతిగా బాధాపకృష్టులై మధ్యస్థస్థితికి చేర్పబడినప్పుడు పరిపూర్ణతను చేరుకొన్నామనీ సుఖం పొందుతున్నామనీ గాఢంగా విశ్వసిస్తారు. సుఖం తెలియక వారు బాధనూ బాధావిరతినీ విరుద్ధకోటులని భ్రాంతిపడతారు. ఇది సరిగా, నలుపుతెలుపులను వదలి కాలధూసరవర్ణాలను విరుద్ధాలని భావించినట్లుగా ఉంటుంది. ఈ భ్రాంతిపాటు నీకాశ్చర్యకరంగా ఉన్నదా ?

లేదు. కాని, అలాంటిభ్రాంతి పొందకపోతేనే ఆశ్చర్యపడవలసి ఉంటుంది.

ఈ విషయం చూడు: పిపాసాదులు శారీరకరిక్తతలే కదా (inanitions) ?

అవును.

అజ్ఞానమూ, దోషమూ మానసికరిక్తతలే కదా ?

నిజమే.

మరి ఆహారప్రజ్ఞలు శారీరకమానసికతృప్తులు కలిగిస్తవి కదా?

నిజమే.

న్యూనతచే సంతృప్తికలిగించేది యథార్థమా? ఆధిక్యంచే సంతృప్తికలిగించేది యథార్థమా?

రెండవదే.

శరీరపోషకాలైన అన్నపానీయాదికాలు ఒకజాతికీ; యథార్థఅభిప్రాయం, జ్ఞానం, వివిధసద్గుణాలు మరొకజాతికీ చెందుతవి. వీనిలో ఏ జాతికి నిర్మలసత్త్వాధిక్యమున్నది? ఈ ప్రశ్ననే మరొకరీతిగా అడుగుతాను. అవికారము, అమర్త్యము, యథార్థము అయినదానిలో నిర్మలసత్త ఎక్కువ ఉంటుందా, లేక వికారి, మర్త్యము అయినదానిలో నిర్మలసత్త ఎక్కువ ఉంటుందా?

అవికారిసంబంధియే స్వచ్ఛతరం.

అవికారి తత్త్వాన్ని భజించినంతగా జ్ఞానాన్ని భజిస్తుందా?

భజిస్తుంది.

సత్యాన్ని గూడ అంతగానే భజిస్తుందా?

అవును.

మరి తక్కువయాథార్థ్యం కలది న్యూనతత్త్వమే కదా?

విధిగా.

ఆత్మకు తోడ్పడేదానికంటె శరీరానికి తోడ్పడేదానిలో తక్కువ యాథార్థ్యమూ తత్త్వమూ ఉండవా?

అవును.

ఆత్మకంటె శరీరంలో సత్యమూ తత్త్వమూ తక్కువ కదా?

అవును.

యథార్థసత్తాధిక్యపూరితమైనది అల్పసత్తాపూరితమైనదానికంటె మిన్న కదా?

అవును.

స్వభావానుగుణపూరణంలో సుఖమనేది ఉంటే యథార్థసత్పదార్థంతో యథార్థంగా నింపబడుతున్నప్పుడు అది యథార్థంగా సత్యసుఖం అనుభవిస్తుంది. అల్పసత్తను భజించినది అల్పయథార్థసంతృప్తిని పొందుతూ భ్రాంతిపూర్వకమైన అల్పయథార్థసుఖాన్ని భజిస్తుంది.

నిస్సందేహంగా అంతే.

ప్రజ్ఞాదిసద్గుణసంపత్తి ఎరుగక నిరంతరం ఇంద్రియభోగలాలసులై ఉండేవారు మధ్యమప్రదేశం దాటక అచటినుంచి క్రిందికి మీదికి పోతుంటారు. ఈ ప్రాంతంలోనే ఎందో యావజ్జీవం సంచరిస్తుంటారు. అంతే కాని ఊర్ధ్వలోకం పోరు. వారిదృష్టి అటు ప్రసరించదు. ఆ మార్గమే వారికెన్నడు గోచరించదు. వారు సత్యపూరితులు కారు. నిర్మల నిత్యసుఖం చవిగొనరు. నిరంతరం ధరాకృష్టగ్రీవులై, అధరదేశనివిష్టదృష్టులై మేస్తూ బలుస్తూ, ఆత్మసదృశసుఖాలే కోరుతూ కాలాయసఖురశృంగంతో పరస్పరంతన్నుకొంటూ క్రుమ్ముకొంటూ ఉంటారు. అద్రవ్యంతో తమ్ము పూరించుకొంటారు. ఆ పూరింపబడుతున్న భాగం కూడ అద్రవ్యం, అపవిత్రం.

సోక్రటిస్! బహుసంఖ్యాకులజీవితాన్ని మీరు దివ్యవాణివలె అభివర్ణిస్తున్నారని గ్లాకన్ అన్నాడు.

వారిసుఖాలు దుఃఖమిశ్రితాలు. అవి మరొకరీతిగా ఉండవు. యథార్థవస్తువులకవి ఛాయలు, చిత్రాలు మాత్రమే. ద్వంద్వభావోత్కటతచే

వి(భాంతిగొలుపుతూ అవి మూఢులమనస్సులందు ఉన్మాదకవాంఛలు రేకెత్తిస్తుంటవి. సత్యం తెలిసికోలేక ట్రాయ్‌వద్ద హెలెన్ ఛాయకోసం యవనులు యుద్ధంచేశారని స్టెసికోరస్ చెప్పాడు. అలాంటిఛాయల కోసమే పోరాటం జరుగుతుంది.

అవును, అలాంటిదేదో ఒకటి అనివార్యంగా సంభవించాలి.

మరి ఉత్సాహం సంగతేమిటి ? వివేకజ్ఞానాలకు స్వస్తిచెప్పి మానవుడు గౌరవమో విజయమో ఆశయో తుదముట్ట అనుసరించినప్పుడు అనివార్యంగా ఈ కథే జరగదా? అవి అతనిని అసూయాగ్రస్తునిగా, దౌర్జన్యపరునిగా, అసహనవంతునిగా చేయవా ?

అవును, చేస్తవి.

వివేకచోదితులై ప్రజ్ఞానిరూపితసుఖాలు అన్వేషించి వానిని పొందినప్పుడు ధనగౌరవప్రణయులు తాము పొందగలిగినసత్యతమసుఖాలను అధికంగా పొందుతారు. ఎవనికేది ఉత్తమమో అది వానికి స్వాభావికమే. అయితే వారు తమకు స్వాభావికాలైనసుఖాలను పొందుతారని మనం ఘంటాపథంగా చెప్పవచ్చును గదా ?

అవును.

ఆత్మ సంపూర్ణంగా తాత్త్వికాంశాన్ని అనుసరిస్తే విభాగం ఉండదు. వివిధభాగాలు న్యాయవంతాలై తమపనులను అవి నిర్వహించుకొనిపోతూ ఉంటే శక్యాలు, ఉత్తమాలు, యథార్థతమాలు అయినసుఖాలను దేనికది అనుభవిస్తుంది.

అవును.

అలా కాక తక్కినరెండుతత్త్వాలలో ఏదో ఒకటి ఆధిపత్యం వహిస్తే తనసుఖాన్ని అది పొందలేదు. తక్కినవి కూడ అనుచితచ్ఛాయామాత్రపు సుఖంకోసం దేవులాడవలసివస్తుంది.

అవును.

తత్త్వవివేకాలకు దూరమైనకొలది వానిసుఖం భ్రాంతిమంతంగా విచిత్రంగా ఉంటుంది.

నిజమే.

వివేకానికి దూరమైనది న్యాయాక్రమాలకు కూడ దూరమే కదా?

అవును.

కామాంధాలు, నియంతృకాలు అయినవాంఛలు న్యాయానికి పరమదూరాలు కదా?

అవును.

ఉత్తమోత్తమాలు, క్రమబద్ధాలు అయినవాంఛలు పరమసన్నిహితాలు కదా?

అవును.

అలాంటప్పుడు యథార్థసుఖానికి, లేదా స్వాభావికసుఖానికి (క్రూర) నియంత దూరమై రాజు (ధర్మప్రభువు) సన్నిహితుడై జీవిస్తారు.

నిస్సంశయంగా అంతే.

ఆ పక్షంలో నియంత అత్యంత అసుఖి, రాజు పరమసుఖి.

అవును.

వారిరువురికి అంతరమెంత ఉంటుందో ఎరుగుదువా?

మీరే చెప్పండి.

సుఖం త్రివిధంగా కనిపిస్తున్నది. ఒకటి యథార్థం. తక్కినవి రెండూ ఆభాసమాత్రాలు. నియంతృనుల్లంఘనం ఆభాసాన్ని అధిగమించిపోతుంది. అతడు న్యాయవివేకభూములను విడచిపెట్టి తనకనుచరబృందమైన దాససుఖాలమధ్య నివాసమేర్పరచుకొన్నాడు. అతనిహీనతను లెక్కకట్టి చెప్పవచ్చును.

అంటే మీ అభిప్రాయం ?

ధనికవర్గీయునినుంచి మూడవస్థానంలో నియంత ఉన్నాడు. ప్రజాస్వామికవ్యక్తి మధ్యలో ఉన్నాడు.

అవును.

ఇంతకుముందు మనం చెప్పుకొన్నది యథార్థమైతే నియంతసుఖచ్ఛాయ ధనికవర్గీయునిసుఖానికి సత్యతలో త్రిగుణంగా దూరమౌతుంది గదా ?

అవును.

మరి ధనికవర్గీయుడు రాజునుంచి మూడవవాడవుతున్నాడు. ఎందువల్లనంటే సత్ప్రభువును మొదటివానినిగా పరిగణిస్తున్నాము.

అవును. అతడు మూడవవాడే.

అలాంటప్పుడు యథార్థసుఖానికి సంఖ్యలో చెప్పాలంటే నియంత మూడు మూళ్ళు ఎడమవుతున్నాడు.

స్పష్టంగా అంతే.

సంఖ్యాపూర్వకదైర్ఘ్యనిర్దిష్టమైన నియంతసుఖచ్ఛాయ సమతలాకృతి♦

---

♦యవనులు తరచుగ సంఖ్యలను దైశికంగా ప్రదర్శించేవారు. సమతలాకృతిచే సూచింపదగినది పూర్ణాంకం. సమతలాకృతిభుజములలబ్ధంవల్ల ప్రకృతసంఖ్యవస్తుంది.

(Plane figure) అవుతుంది.

అంతేకదా మరి!

దీనిని చతురస్రీకరించి ఘనంచేస్తే రాజుకూ నియంతకూ ఎంత వ్యవధానం ఏర్పడుతుందో గ్రహించటం కష్టం కాదు.

అవును. గణితశాస్త్రజ్ఞులు ఆ లెక్క తేలికగా తేల్చివేస్తారు.

ఎవరైనా ఒకవ్యక్తి ఆవలికొసనుంచి ప్రారంభించి నియంతనుంచి రాజు సుఖసత్యతలో ఎంత దూరంగా ఉన్నాడో కొలిస్తే లెక్క పూర్తిఅయ్యే టప్పటికి రాజు 729ఋ రెట్లు సుఖంగా ఉన్నాడనీ, నియంత అంత అసుఖంగా ఉన్నాడనీ కనుగొంటాడు.

ఎంత విచిత్రపులెక్క! సుఖదుఃఖాలలో న్యాయవంతునకు అన్యాయ వంతునకు ఎంత అంతరమున్నది!

అయినా యథార్థగణనమే. మానవజీవితం దివారాత్రమాసప్రమితమే అయితే ఈ లెక్క మానవజీవితానికి సరిపోతున్నది.

అవును, మానవజీవితానికి వీనికి సంబంధమున్నది.

అనర్థకారి, అన్యాయవంతుడు అయినవానికంటె ఉత్తముడూ న్యాయ వంతుడూ అయినవాడు సుఖాధికుడైనప్పుడు జీవితయోగ్యతలోను సౌంద ర్యంలోను సద్గుణత్వంలోను అతనిఆధిక్యం అనంతంగా అతిశయిస్తుంది కదా?

---

ఋ729 సంఖ్య దాదాపు సంవత్సరంలోని దివారాత్రసంఖ్యకు సరిపోతుంది. దీనిఅర్థం మొత్తమ్మీద అనిశ్చితం. పైథాగరస్ అనుయాయి అయిన ఫిలోలస్ సంవత్సరానికి 364½ రోజులని లెక్కకట్టాడు. పగళ్ళెన్నో రేలు గూడ అన్నే అయినప్పుడు దివారాత్రసంఖ్య 729. అతడు 729 మాసాలతోగూడిన మహాసంవత్సరాన్ని ఊహించాడు. ఇది మనబృహ స్పతిమానంవంటిది(?).

అవును.

వాదం ఇంతవరకూ వచ్చింది కాబట్టి దీనికి మూలమైన అర్థం పరిశీలింతాము. అన్యాయమనేది, న్యాయవంతుడని (అసందర్భంగా) ప్రఖ్యాతిగాంచిన అన్యాయవంతుని లాభమని ఎవరో అన్నారు కదా?

అవును.

న్యాయాన్యాయాలశక్తిని గుణాలను నిర్ణయించాము. కాబట్టి అతనితో కొంతమాటాడి చూదాము.

ఏమి మాటాడుదామంటారు?

అతనిమాటలు అతనికన్నులకు పొడకట్టేటట్లుగా ఆత్మచిత్రం గీసి చూపుదాము.

ఎలాంటిచిత్రం?

అనేకప్రకృతిమిశ్రితాలైన కిమీర♦, శిలా*, శర్బరస్§ మున్నగువాటిని పౌరాణికగాథలు పేర్కొంటున్నవి. ఆ విచిత్రజీవులవంటి భావనామాత్రరూపమైన ఆత్మబింబం గీతాము.

నిజమే. అలాంటిసమ్మేళనాలను అవి పేర్కొన్నవి.

క్రూరాక్రూరజంతుముఖపంక్తులను యథేచ్ఛగా ఉత్పాదించుకొని మార్చుకోగలిగిన నానాముఖభయంకర మృగాన్ని ఉల్లేఖించగలవా?

---

♦ఇది అగ్నిజ్వాలలు క్రక్కే ఉగ్రరూపిణి. దీని పూర్వకాయం సింహం. అపరకాయం సర్పం. మధ్యమకాయం అజం.

*ఇది భయంకరరూప. దీనికి ద్వాదశపాదాలు, గ్రీవాషట్కం, ఒక్కొక్క నోటిలో మూడువరుసల నిశితదంష్ట్రలు ఉంటవి.

§ఇది నరకద్వారంకాచే శతకంఠశ్వానం. అర్వాచీనరచయితలు దీనికి మూడుతలలు, పాముతోక, మెడలో పాములు ఉంటవని వర్ణించారు.

చిత్రకారునికి విభ్రాంతికరశక్తులుండవలెనంటున్నారు. అయితే లాక్షాదికం కంటె వాక్కునకే అలాంటిది ఎక్కువసాధ్యం కాబట్టి అలాంటి ఆలేఖ్యం వాఙ్నిబద్ధం చేయటం మంచిది.

రెండవదానిని సింహరూపంగా, మూడవదానిని మానవాకృతిగా ఊహించు. అయితే మొదటిదానికంటె రెండవది, రెండవదానికంటె మూడవది చిన్నవి

అది తేలికే. మీరు చెప్పినట్లే ఊహిస్తున్నాను.

ఇప్పుడు వాటిని కలుపు. అవి మూడు ఏకాకృతి కావాలి.

అలాగే చేశాను.

వాటిబాహ్యాకారం మానవరూపంగా మలుచు. అయితే స్థూలంగా చూచేవానికి అప్రతిమ క్రూరజంతువువలె కాక మానవరూపంవలె భాసించేటట్లు దిద్దితీర్చు.

అలాగే చేశాను.

'అన్యాయవర్తి లాభదాయకం, న్యాయవర్తి నష్టదాయకం' అని వాదించేవానికి మనం సమాధానం చెప్పాలి. అతడు చెప్పేది యథార్థమైతే ఈ బహుముఖఘోరజంతువును మేపి, సింహాన్ని సింహసదృశగుణాలను పుష్టం చేసి, ఆహారవిరహితంగా మానవుని శుష్కింపజేసి తక్కినరెంటిలో దేనిబారికైనా అతనిని అగ్గంచేయటం లాభదాయకం. అంతే కాని వానికి పరస్పరపరిచయకల్పన కాని, మైత్రీసమాపాదన కాని ఏ మాత్రం లాభదాయకం కాదు. అవి ఒండొంటిని మార్కొని చీల్చిమ్రింగటం అతనికి సమ్మతమన్న మాట.

అవును. అన్యాయసమర్థకుడు నిశ్చితంగా అలాగే చెబుతున్నాడు.

వానికి న్యాయసమర్థకుడు ఇలా సమాధానం చెబుతున్నాడు. ఆ జీవిలోనిమానవునకు యావన్మానవజీవితంమీద ఏదోవిధంగా సంపూర్ణాధి

సత్యం సమకూర్చుటకై సదా బోధించాలి. తదనుగుణంగా ప్రవర్తించాలి. అతడు సమగ్రమైనపశుపాలునివలె వానిసాత్త్వికగుణాలను పెంపొందిస్తూ క్రూర గుణాలను వర్ధిలజేయరాదు. వాటినన్నిటిని పాలిస్తూ విభిన్నభాగాలకు ఆంతరికపరస్పరమైత్రి కల్పించాలి.

అవును. న్యాయసమర్థకునివాదమంతే.

సుఖదృష్టితో చూచినా, గౌరవదృష్టితో చూచినా, లాభదృష్టితో చూచినా, మరేదృష్టితో చూచినా న్యాయసమర్థకునివాదం యథార్థం. అతడు సత్యం చెబుతున్నాడు. న్యాయాన్ని ఆమోదించనివానివాదం అపవాదం, దుష్టం, అజ్ఞానజనితం.

అవును, ఏ దృష్టితో చూచినా అంతే.

ఉద్దేశపూర్వకంగా పెడత్రోవపట్టనిఅన్యాయవంతునితో సాత్త్వికంగా చెబుదాము. 'అయ్యా! ఉదాత్తనీచతలున్నవంటున్నారు. అందు మీ అభిప్రాయమేమిటి?' జంతువును మానవునకు, లేదా మానవునిలోని ఈశ్వరునకు అధీనంకావించటం ఉదాత్తమై, మానవుని జంతువునకు అర్పించటం నీచంకాదా? దీనికతడు కాదనలేడు. అవునా?

నా అభిప్రాయాన్ని అతడేమాత్రమైనా మన్నిస్తే కాదనడు.

ఇంతవరకు ఆమోదిస్తే మనం అతనిని మరొకప్రశ్న అడుగుదాము. తనలోని ఉత్తమాంశాన్ని నీచాంశానికి బానిసకావించేమానవుడు తన వ్యాపారంతో వెండిబంగారాలు సంపాదించినా అది అతనికెలా లాభదాయకం? ఒకడు తనకొడుకునో కొమార్తెనో డబ్బుకోసం బానిసగా అమ్మివేశాడనుకొందాము. దానివల్ల ఎంత డబ్బు వచ్చినా అతడు లాభం పొందినవాడవుతాడా? తనలోనిదివ్యత్వాన్ని పరమనాస్తికత్వానికి అమ్ముకొన్నవాడు పరమదుర్మతికాడని ఎవరైనా అంటారా? కంఠహారంకోసం ఎరిపైల్ తనభర్తప్రాణాలను అమ్మివేసింది. అతడు అంతకన్నా ఘోరకృత్యం చేస్తున్నాడు.

అవును. కూలికి విషం త్రాగుతున్నాడు.

నిగ్రహరాహిత్యాన్ని ప్రాచీనులు నిరసించారు. ఎందువల్లనంటే అతనిలో బహురూపఘోరజంతువు విశృంఖలవిహారం చేస్తుంది.

నిజమే.

తమలోనిసింహసర్పాంశాలు అసముచితంగావర్ధిల్లి బలపడుతున్నప్పుడు మానవులగర్వాదిదుర్గుణాలు నిందితాలవుతున్నవి.

అవును.

భోగసౌఖ్యమార్గాలు అలసతాదౌర్బల్యాలను పెంపొందించి మానవుని భీరువును చేస్తవి. కాబట్టి అవి గర్హితాలు.

యథార్థం.

తనలోని ఉత్సాహాన్ని అల్పధనంకోసం క్రూరజంతువునకు బానిసనుచేసి దాని ఇష్టంవచ్చినట్లు ఆడించటానికి తనయౌవనదశనుంచీ సమ్మతిస్తున్న వ్యక్తి వృథాశ్లాఘకుడు, నీచుడు. అతడు సింగాన్ని కోతిని చేస్తున్నాడు.

నిజమే.

ఉత్తమతత్త్వాన్ని దుర్బలం చేస్తున్నవి కాబట్టి నీచజీవికలు, చేతివృత్తులు నింద్యాలవుతున్నవి. తనలోనిపశువులను నిగ్రహించలేనివ్యక్తికి వాని అనుగ్రహం సంపాదించవలసినదుర్గతి పడుతున్నది. వాటిని శ్లాఘించి సంతృప్తిపరచటమే అతనికి వృత్తి అవుతున్నది.

అవును.

అందువల్ల దైవాంశపాలితుడైన ఉత్తమునకు అతడు సేవకుడు కావాలని చెబుతున్నాము. అంతే కాని థ్రాసిమాకస్ భావించినట్లు మనం సేవకునకు కీడుకోరటంలేదు. ఆంతరికదివ్యాంశానుశాస్యత ఎల్లవానికి శ్రేయోదాయకమే. ఇది సాధ్యంకానిపక్షంలో మనమంతా మిత్రులమూ సమా

నులమూ అయి బాహ్యాధికారి ఏల్బడికి లోబడిఉండటం మేలు.

యథార్థం.

సమస్తరాజ్యానికి మిత్రమైన శాసనంయొక్క తాత్పర్యమిదే. మన బాలానుశాసనక్రియలో కూడ ఇదే స్పష్టంగా గోచరిస్తుంది. మన రాజ్యాంగవిధానానికి సదృశమైనతత్త్వం నియంతగా వారిలో నెల కొనాలి. ఇలాంటితత్త్వం. వారిహృదయాలలో పుష్టంకావాలి. మన పాలకునివంటిసంరక్షకుడు వారిహృదయాలలో నెలకొనాలి. అంతవరకు వారికి స్వాతంత్ర్యం ఇవ్వము. ఇలాంటిసంరక్షకుడు నెలకొన్న వెనుక వారు స్వతంత్రులు కావచ్చును.

అవును. శాసనప్రయోజనం సువ్యక్తమే.

అన్యాయంవల్ల కాని, నిగ్రహరాహిత్యంవల్ల కాని, ఇతరనీచత్వంవల్ల కాని మానవుడు లాభంపొందుతాడని ఏ విధంగా సమర్థించగలము ? దౌష్ట్యం వల్ల ధనమూ అధికారమూ సంపాదిస్తే సంపాదించవచ్చును గాని, దాని వల్ల మానవుడు ఏ మాత్రం బాగుపడడు. పైగా ఘోరపతనం పొందు తాడు.

అవును.

తన అన్యాయం అజ్ఞాతమై అర్హదండనం పొందనంతమాత్రాన అతనికి కలిగేలాభమేమున్నది? అజ్ఞాతదోషునిస్థితి మరీహీనం. అన్యాయం దృష్టమై సముచితశిక్ష పొందినప్పుడు అతనిలోనిపశుత్వం దండితమై శాంతిల్లి మానవత్వం పొందుతుంది. అతనిసాత్వికతత్త్వం విముక్తి పొందు తుంది. ఆతనిఆత్మ పరిపూర్ణతను పొంది న్యాయనిగ్రహప్రజ్ఞలు సము పార్జించి ఉదాత్తమాతుంది. బలారోగ్యసౌందర్యాలు పడసినశరీరం కంటె గౌరవం సంపాదించినఆత్మ పరిపూర్ణం.

నిశ్చితంగా అంతే.

ఈ ఉత్తమప్రయోజనంకోసమే జ్ఞానవంతుడు తనజీవితశక్తులన్నిటిని

ధారపోస్తాడు. ఈ సద్గుణపుంజాన్ని ప్రసాదించేవిద్యలకు ప్రథమస్థానమిచ్చి తక్కినవాటిని ఉపేక్షిస్తాడు.

అవును.

ఆ తరువాత శారీరకాభ్యాసశిక్షణలను అతడు క్రమబద్ధం చేస్తాడు. పాశవికాలైన అంధసుఖాలకు లొంగడు. ఆరోగ్యం కూడ అతనికి గౌణమే కాని ప్రధానం కాదు. అతనిప్రథమలక్ష్యాలు బలసౌష్ఠవ రామణీయకాలు కావు. వాటివల్ల నిగ్రహం పెంపొందటానికి వీలుంటే అంత మేర వాటిని ఆదరిస్తాడు. అయితే అతడు ఎల్లప్పుడు ఆత్మసమరసభావ రక్షణకు అనుగుణంగా తనశరీరం మలచుకొనగలుగుతాడు.

అవును. సముచితసంగీతసాహిత్యసంస్కారముంటే నిశ్చితంగా అతడు అలాగే చేస్తాడు.

ధనసముపార్జనలో అతనికి ఒకక్రమం ఒకపద్ధతి ఉంటుంది. మూఢశ్లాఘనకు వివశుడై అతడు ఆత్మవినాశకరమైనసంపదను కూడబెట్టడు.

ఎన్నడూ ఆపని చేయడు.

తనలోని ఆత్మరాజ్యాన్ని సందర్శించి అందులో అతిమాత్రతచే గాని, అతిహీనతచే గాని ఎలాంటి క్రమరాహిత్యం కలుగనీక కనుగలిగి ప్రవర్తిస్తాడు. ఈ సూత్రం మున్నిడుకొని తన ఆస్తిపాస్తులను చక్కబరుచుకొంటాడు. తనకున్న సాధనసంపత్తినిబట్టి ఆయవ్యయాలు సంస్కరించుకొంటాడు.

అవును.

ఈ కారణంవల్లనే తనకు మేలుకావించేగౌరవాలను అతడు సంతోషపూర్వకంగా స్వీకరించి ఆనందిస్తాడు. జీవితక్రమభంగకారులైన సామాజికగౌరవాలను వైయక్తికగౌరవాలను అతడు పరిహరిస్తాడు.

అదే అతనిలక్ష్యమైతే అతడు రాజనీతిజ్ఞుడు కాడు.

కాకపోవటమేమిటి? ఆత్మరాజ్యంలో నిశ్చితంగా అతడు రాజనీతిజ్ఞుడే. ఈశ్వరసంకల్పం లేనప్పుడు జన్మదేశంలో అతడు అలాంటివాడు కాక పోతే కాకపోవచ్చును.

ఇప్పుడు బోధపడుతున్నది. మనం నిర్మించినరాజ్యంలో—అంటే భావ రూపరాజ్యంలో—అతడు పాలకుడవుతాడంటాగు. ఎందువల్లనంటే అలాంటిరాజ్యం భూలోకంలో ఎక్కడా లేదనే నానమ్మిక.

స్వర్గంలో అలాంటిది ఉన్నది. సంకల్పముంటే చూడవచ్చును. చూచి తనరాజ్యం దానికనుగుణంగా మలచుకోవచ్చునని నాభావన. 'అయితే అలాంటిది వాస్తవంగా ఉంటుందా?' అన్నది ముఖ్యం కాదు. మరొక దానితో అతనికి నిమిత్తం లేదు. ఆ రాజ్యానికి అనుగుణంగా అతడు జీవిస్తాడు.

నేనూ అలాగే భావిస్తున్నానని అతడన్నాడు.

# పదవ ప్రకరణం

మనరాజ్యంలో నాకు పెక్కు ఉత్తమగుణాలు కనిపిస్తున్నవి. కాని, వానిలో ఏదీ కవితానుశాసనమంత సంతృప్తికరంగా లేదు.

ఏ శాసనముద్దేశించి మాటాడుతున్నారు?

అనుకరణాత్మక కవితానిరాసం. ఆ కవిత్వం నిశ్చితంగా ఆదరణీయం కాదు. ఆత్మలోనిభాగాలను స్పష్టంగా గుర్తించినతరువాత అది విశద మాతున్నది.

అంటే మీ తాత్పర్యం?

మనలోమాట. విషాదాంతరూపకకర్తలకూ తక్కిన అనుకారిజాతికీ మన మాటలు చెవినిబడటం నాకిష్టం లేదు. కాని, నీతో మాత్రమే అంటున్నాను. శ్రోతలబుద్ధికి కవితాత్మకానుకరణాలు హానికారులు. యథార్థ స్వభావజ్ఞానమొకటే దానికి సరియైనవిరుగుడు.

మీ తాత్పర్యం కాస్త వివరించాలి.

అలాగే. చిన్ననాటినుంచి నాకు హోమరంటే ఎంతో భక్తి, గౌరవం. ఇప్పటికి గూడ అతనిపేరెత్తితే చాలు, మాటలుతడబడుతవి. ఆ మనోజ్ఞ విషాదాంతరచయితృసంఘానికి అంతకూ అతడు గురువు, మహానాయకుడు. అయితే సత్యంకంటె మానవుడెన్నడూ ఉపాస్యతరుడు కాడు. కాబట్టి చెబుతాను.

అలాగే ప్రారంభించండి.

28)

అయితే సమాధానం చెప్పు.

మీ ప్రశ్న అడగండి.

నిజంగా తెలియక అడుగుతాను. అనుకరణమంటే ఏమిటి ?

ఇంతకూ నాకు తెలియదన్న మాట.

ఎందుకని ? ఒక్కొక్కప్పుడు నిశితదృష్టికంటె మందదృష్టే ఒకవస్తువును ముందుగా చూస్తాడు.

నిజమే కాని, దానినిగూర్చి నాకు లీలామాత్రపుభావమున్నా మీముందు వ్యక్తంచేయాలంటే గుండె చాలదు. కాబట్టి మీరే చెప్పాలి.

సరే. మనవిచారం యథాప్రకారంగా ప్రారంభింతామా ? పెక్కువస్తువులకు సామాన్యనామం ఒకటి ఉన్నప్పుడు తత్ప్రకారకభావం కూడా ఒకటి ఉంటుందని భావిస్తాము. నా అభిప్రాయం బోధపడిందా ?

ఆఁ.

ఏదో ఒకసామాన్యదృష్టాంతం తీసికొందాము. ప్రపంచంలో తల్పాలు, మేజాబల్లలు సమృద్ధిగా ఉన్నవి.

ఆఁ.

అయితే వానిభావాలు మాత్రం రెండే: ఒకటి తల్పభావం, రెండు మేజాభావం.

అవును.

తల్పం కాని, మేజా కాని తయారుచేసేవాడు ఆ యా భావాన్నిబట్టి మన ఉపయోగార్థం వాటిని తయారుచేస్తున్నాడు. అంతే కాని వస్తునిర్మాత భావాలను నిర్మించటంలేదు. నిర్మించగలడంటావా ?

అసంభవం.

మరొకశిల్పి ఉన్నాడు. అతన్నిగూర్చి నీ అభిప్రాయమెలా ఉంటుందో మరి.

ఎవరు ?

అతడు ఇతరకర్మకారులపనులన్నీ చేస్తాడు.

అతివిచిత్రజీవిగా ఉన్నాడే !

కొంచెం తాళు, నీమాట చక్కగా సార్థకమాతుంది. అతడు సర్వజాతిపాత్రలనే కాదు, ఉద్భిజ్జాలనే కాదు, జంతుజాలాలనే కాదు, తన్నే కాదు, స్వర్గమర్త్యపాతాళాలను, అందలి సర్వవస్తువులను నిర్మిస్తాడు. తుదకు దేవతలను గూడ సృష్టిస్తాడు.

ఎవడో కాని మహేంద్రజాలికుడుగా ఉన్నాడే!

అంటే నీకు నమ్మకం కలగలేదనేనా? నీ ఉద్దేశమేమిటి? అట్టినిర్మాత లేడంటావా? లేక ఒకర్థంలో సర్వవస్తునిర్మాత ఉంటే ఉండవచ్చును; కాని, మరొకర్థంలో లేడంటావా? వాటినన్నిటిని నీకు నీవే నిర్మించే మార్గం ఒకటి ఉన్నదని గుర్తించావా?

ఏ మార్గం?

చాల తేలిక. అనేకమార్గాలున్నవి. వీటన్నిటికంటె త్వరితంగా సుకరంగా చేయాలంటే అద్దం పుచ్చుకొని గిరగిర త్రిప్పితే చాలు. స్వల్పకాలంలో అనాయాసంగా సూర్యుణ్ణి, భూమ్యాకాశాలను, నిన్ను, ఇతర జంతువులను, ఉద్భిజ్జాలను, ఇంతకుముందు మనం ముచ్చటించుకొన్న ఇతర వస్తువులను అద్దంలో నిర్మించగలవు.

నిజమే. కాని, అవి కేవలం ఆభాసాలే కదా?

మంచిది. నీవు అసలువిషయానికి వస్తున్నావు. చిత్రకారుడు కూడ నీ మతంలో అలాంటివాడే. అతడు ఆభాసస్రష్ట కాడా?

అవును.

అయితే అతనిసృష్టి అయథార్థమంటావనుకొంటాను. అయినా ఒక దృష్టిలో చిత్రలేఖకుడు కూడ తల్పాన్ని నిర్మిస్తున్నాడు.

అయితే యథార్థతల్పం కాదు.

మరి తల్పనిర్మాతసంగతి ఏమిటి? అతడు గూడ మనమతంప్రకారం తల్పతత్త్వమైన భావం కాక తల్పవ్యక్తిని నిర్మిస్తున్నాడని చెప్పావు గదా?

అవును.

సద్వస్తువును నిర్మించనప్పుడు అతడు సత్తను నిర్మించలేడు. కేవలం సత్తాభాసం మాత్రమే నిర్మించగలడు. తల్పనిర్మాతకృతి గాని, లేక ఇతరశిల్పికృతి గాని యథార్థసత్తాకమని ఎవరైనా అంటే అతడు సత్యం చెబుతున్నాడని భావించరాదు కదా?

తత్త్వవేత్తలు మాత్రం అతడు సత్యం చెబుతున్నాడనరు.

అప్పుడు అతనికృతి కూడ సత్యంయొక్క అస్పష్టాభివ్యక్తియే కదా?

అవును.

ప్రకృతదృష్టాంతం పురస్కరించుకొని అనుకారి ఎవడో పరిశీలింతామా?

అలాగే.

సరే, ఇక్కడ మూడు తల్పాలున్నవి. ఈశ్వరకృతం ఒకటి ప్రకృతిలో ఉన్నది. దానికి వేరెవడూ కర్తకాడు కదా?

కాదు.

రెండవది వర్ధకికృతి.

అవును.

చిత్రకారునికృతి మూడవది కదా ?

అవును.

కాబట్టి తల్పాలు మూడువిధాలు. వాటినిర్మాతలు ముగ్గురు. మొదటివాడు ఈశ్వరుడు. రెండవవాడు వర్ధకి. మూడవవాడు చిత్రకారుడు.

అవును, ముగ్గురునిర్మాతలు.

స్వతంత్రుడై కాని, ఆవశ్యకతవల్ల కాని, ప్రకృతియందలి ఏకైకతల్పాన్ని ఈశ్వరుడు సృష్టించాడు. అనేకభావమాత్రతల్పాలను అతడు పూర్వం సృష్టించలేదు. ఇకముందు సృష్టించడు.

కారణం ?

కారణమా ? రెంటిని అతడు నిర్మించాడనుకో. ఆ రెంటికీ భావం మూలమై మూడవది వానివెనుక గోచరిస్తుంది. ఈ మూడవదే భావాత్మకతల్ప మాతుంది. కాని తక్కినవి రెండూ కావు.

నిజమే.

ఇది ఎరిగి ఈశ్వరుడు తాను యథార్థతల్పస్రష్ట కావలెనని సంకల్పించు కొన్నాడు. అంతే కాని వైయష్టికతల్పసృష్టి అతని ఉద్దేశం కాదు. అందువలననే అతడు స్వభావైకతల్పమొకటే సృష్టించాడు.

అలాగే నమ్మదాము.

మరి ఈశ్వరుని తల్పస్రష్టగా పేర్కొందామా ?

అలాగే. సృష్టియొక్క స్వాభావికపరిణామంతో ఈశ్వరుడు దీనికీ తక్కినవస్తువులకూ కర్త అవుతున్నాడు.

వర్ధకిసంగతి ఏమిటి ? అతడు కూడ తల్పనిర్మాత కదా ?

అవును.

మరి చిత్రకారుడు కూడ స్రష్ట, నిర్మాత అని అంటావా ?

లేదు.

నిర్మాత కాకపోతే తల్పంతో అతనికున్న సంబంధమేమిటి ?

అన్యులకృతులను అనుకరించేవాడని అనటం సముచితమనుకొంటాను.

ప్రకృతినుంచి ఏర్పడుతున్న అవతరణలో మూడవవానిని అనుకారి అని అంటున్నావు కదా ?

అవును, నిశ్చితంగా అంతే.

విషాదాంతకావ్యకర్త అనుకారి. కాబట్టి అతడు ఇతరఅనుకారులవలె రాజునుంచి సత్యంనుంచి త్రిగుణంగా వ్యవహితుడే కదా ?

అలాగే కనిపిస్తున్నది.

అనుకారిసంగతి మనకు తేలిపోయింది. మరి చిత్రకారునిసంగతి ఏమిటి ? ఆదిలో ప్రకృతియందున్న వస్తువును అతడు అనుకరిస్తున్నాడా ? లేక శిల్పులకృతులను మాత్రమే అనుకరిస్తున్నాడా ?

శిల్పులకృతులనే అనుకరిస్తున్నాడు.

వాటిని యథాతథంగా అనుకరిస్తున్నాడా? లేక యథాభాసంగా అనుకరిస్తున్నాడా? ఇంకా దీనిని నీవు నిర్ణయించవలసి ఉన్నది.

అంటే మీ తాత్పర్యం?

తల్పాన్ని విభిన్న దృక్పథాలనుంచి చూడవచ్చును. ఏటవాలుగా, నేరుగా, ప్రక్కగా, మరేదిశనుంచైనా చూడవచ్చును. తల్పం విభిన్నంగా కనిపిస్తుంది. కాని, వస్తువు మాత్రం ఒకటే. ఇదే అన్నివస్తువులకు వర్తిస్తుంది.

అవును, భేదం ఆభాసమాత్రం.

ఇప్పుడు మరొకప్రశ్న అడుగుతాను. చిత్రలేఖనకు ఉద్దిష్టలక్ష్యమేమిటి? వస్తువులను ఉన్నవానిని ఉన్నట్లు అనుకరించటమా? లేక కనిపించినట్లు అనుకరించటమా? అంటే యాథార్థ్యానుకరణమా? ఆభాసానుకరణమా?

ఆభాసానుకరణమే.

అప్పుడు అనుకారి సత్యానికి అతిదూరగుడవుతున్నాడు. అతడు అన్నివస్తువులు చేయగలుగుతున్నాడు. ఎందువల్లనంటే వాటిస్వల్పాంశాన్ని—అది కూడా ఛాయామాత్రాన్ని—కొంచెం స్పృశిస్తున్నాడు. ఈ దృష్టాంతమే చూడు. చిత్రకారుడు చర్మకారునేమి, వర్ధకినేమి, ఇతరశిల్పినేమి చిత్రిస్తున్నాడు. వారికళలతనికి ఏ మాత్రం తెలియవు. అతడు సమర్థుడే అయితే వర్ధకిచిత్రం దూరాన ఉంచి చూపి పిల్లలను, అమాయికులను వంచించవచ్చును. నిజమైనవర్ధంగిని చూస్తున్నామని వారనుకొంటారు.

అవును.

'సర్వకళలెరిగినమనుజుణ్ణి నేను కనుగొన్నాను. ఎవనికేది తెలిసిఉన్నా అదంతా అతడెరుగును. ప్రతివస్తువును సవిశేషంగా ఇతరులందరికంటె అతడు బాగా ఎరుగును,' అని ఎవడైనా చెబితే అతడు మహేంద్రజాలికునిచేతనో నటునిచేతనో వంచితుడైన అమాయికుడని మనం ఊహించ

వచ్చును. జ్ఞానాజ్ఞానానుకరణలస్వభావం తాను గ్రహించలేడు కాబట్టి అతడు వానిని సర్వజ్ఞుడని భావించి ఉంటాడు.

అక్షరాల నిజం.

''విషాదాంతరూపకకర్తలు, వారిగురువైన హోమర్ ఎల్లకళలెరుగుదురు. సర్వమానవవిషయాలు, పాపపుణ్యాలు, దివ్యాదివ్యవస్తువులు వారికి తెలుసు. ఎందువల్లనంటే ఉత్తమకవి తాను వర్ణించదలచుకొన్నవిషయాన్ని ఎరుగకపోతే చక్కగా వర్ణించలేడు. ఇలాంటిజ్ఞానం లేనివాడు ఎన్నడూ కవి కాలేడు.'' అని వ్యక్తులు చెబుతుండగా మనం విన్నప్పుడు 'ఇక్కడ కూడ అలాంటి భ్రాంతి ఉండరాదా ?' అని మనం అవశ్యం ఆలోచించాలి. వారు అనుకారులపరిచయం పొంది వారిచే వంచితులై ఉండవచ్చును. వారికృతులను చూచినప్పుడు అవి సత్యానికి త్రిగుణంగా వ్యవహితాలనీ, అనుకృతులనీ గుర్తుండకపోవచ్చును. ఆ కృతులు ఆభాసాలే కాని యథార్థాలు కావు కాబట్టి సత్యజ్ఞానం లేకుండానే వాటిని తేలికగా నిర్మించవచ్చునన్నసంగతి వారు గుర్తింపకపోవచ్చును. కాక వారుచేప్పేది యథార్థమై బహుళసంఖ్యాకులకు చక్కగా చెబుతున్నట్లు గోచరించేకవులు వస్తువులను యథార్థంగా ఎరుగుదురా ?

ఈ ప్రశ్న అన్నివిధాల పరిశీలనయోగ్యం.

ఒకవ్యక్తి మూలమూ ప్రతీకమూ నిర్మించగలిగినప్పుడు చిత్తశుద్ధితో అతడు ప్రతీకనిర్మితికి పూనుకొంటాడంటావా ? మరొక ఉత్తమలక్ష్యం లేదన్నట్లు అనుకరణాన్ని తన జీవితప్రధానలక్ష్యం కావించుకొంటాడా ?

లేదు.

తన అనుకరణలక్ష్యం చక్కగా తెలిసికొన్నశిల్పి యాథార్థ్యతత్పరుడవుతాడే కాని అనుకృతితత్పరుడు కాడు. నిజనామస్మారకములైన అనేక మనోజ్ఞకృతులు ముందలితరాలవారికి ఇవ్వాలని కోరుతాడు. స్తోత్రపాత్రాలకు కర్తకావటంకంటె ఆ స్తోత్రపాత్రాలకు తానే వస్తువు కాగోరుతాడు.

అవును. అదే అతనికెక్కువ గౌరవలాభాలు సమకూరుస్తుంది.

అలాంటప్పుడు హోమర్‌ను ఒకప్రశ్న అడగాలి. 'నీవు ఎస్క్లిపియస్ వలె రోగులకు స్వాస్థ్యం కల్పించావా? లేక అతనివలె భిషక్సంప్రదాయాన్ని నెలకొల్పావా?' అని అతనిని గాని మరొకకవిని గాని అడగబోవటంలేదు. 'వైద్యంలో గాని మరొకవిషయంలో గాని శ్రుతపాండిత్యుడవై వర్ణించావా?' అని ప్రశ్నించబోవటం లేదు. కాని, అతనికావ్యాలకు ముఖ్యోద్దాత్తవిషయాలై సైనికరాజకీయవిద్యాతంత్రాలున్నవి. వాటినిగూర్చి తెలిసికొనే అధికారం మనకున్నది. కనుక వాటినిగూర్చే అతనిని అడుగుదాము. 'మిత్రమా, హోమర్! సద్గుణసంపత్తిని వర్ణించావు. ఇందులో నీవు సత్యానికి తృతీయస్థానీయుడవు కాక ద్వితీయస్థానీయుడవే అయితే ప్రతీకశిల్పివి, అనుకారివి కాకపోతే, వైయష్టికజీవితంలో కాని, సామాజికజీవితంలో కాని ఏయే కార్యప్రవృత్తులు మానవులను ఉత్తములను చేస్తవో ఏవేవి అధములను చేస్తవో నీవు వివేచించగలిగితే నీ సహాయంతో ఏ రాజ్యం ఉత్తమంగా పరిపాలింపబడ్డదో కాస్త వినిపించు. స్పార్టా సమ్యగ్వ్యవస్థకు లైకర్గస్ కారణం. అలాగే అల్పరాజ్యాలు, మహారాజ్యాలు కూడ ఇతరులవల్ల మేళ్ళు పొందాయి. కాని, వానికి నీవు సచ్ఛాసనాలు ప్రసాదించావని కాని, మేలు చేశావని కాని ఎవరంటారు? ఇటలీ సిసిలీదేశాలు చరండాస్‌ను సగర్వంగా పేర్కొంటవి. మనకు సొలోన్ ప్రఖ్యాతుడే కదా? మరి నిన్ను ఏరాజ్యం చెప్పుకొంటున్నది?' ఇలా అడిగితే నిజానికతడు పేరితో పేర్కొనగల రాజ్యమేదైనా ఉన్నదా?

ఉన్నదనుకోనని గ్లాకన్ అన్నాడు. హోమర్ అనుయాయులు కూడ అతనిని శాసనకర్తగా పేర్కొనలేదు.

పోనీ అతడు సజీవుడై ఉన్నప్పుడు జయప్రదంగా నిర్వహించిన యుద్ధమొకటైనా ఉన్నదా? కాదు, అతని ఉపదేశం కాని, సహాయం కాని పొందినఘట్టం ఒకటైనా చరిత్రలో కనిపిస్తున్నదా?

లేదు.

మెలిటస్ నివాసి థేల్స్♦, సిథియావాసి యానకార్సిస్ మున్నైన అపూర్వ ప్రతిభావంతులు వృత్తివిద్యలకో, మానవజీవితానికో ఉపయోగపడే వాటిని కనుగొన్నారు. అలాంటిదొకటైనా అతడు కనుగొన్నాడా?

అలాంటిదేమీ లేదు.

సరే, ప్రజాసేవ చేయకపోతే చేయకపోయాడు. ఎవనికైనా అతడు గురువై ఆచార్యుడై ఉపదేశించాడా? పోనీ అది అలాఉంచు. పైథాగరస్ ప్రజ్ఞను ప్రజలు ప్రేమించారు. అతని పేరితో ప్రఖ్యాతవ్యవస్థను సాగిస్తూ అతని అనుయాయులు ఈ నాటికీ ఖ్యాతి గడిస్తున్నారు. అలాగే హోమర్ జీవితకాలంలో అతనిసాహచర్యం అభిలషించిన మిత్రులతని కున్నారా? వారు ఆ హోమర్ జీవితవిధానాన్ని ఉత్తరకాలంవారికి ప్రసాదించారా?

అలాంటిదేదీ ఉన్నట్లు చరిత్ర పేర్కొనటం లేదు. చెప్పుకొంటున్న కథలే నిజమైతే అతనిజ్ఞానానికి అతనిమిత్రుడైన క్రియోఫిలస్క తార్కాణం. అతని పేరే అతనిబుద్ధిమాంద్యాన్ని చాటుతున్నది. అతడెన్నడూ హోమర్‌ను లక్ష్యపెట్టలేదని ఐతిహ్యం ఘోషిస్తున్నది.

అవును, ఐతిహ్యం అలాగే ఉన్నది. నిజంగా విద్య గరపి మానవజాతికి అభ్యుదయపరంపరాభివృద్ధి సమకూర్చగలశక్తి హోమర్‌కు ఉంటే, అతడు అనుకారి కాక నిజంగా జ్ఞానసంపన్నుడైతే, అనుచరులుండకపోతారా? వారతనిని ఎంతగానో గౌరవించకుండ ఉంటారా? యాబ్డేరా నగరవాసియైన ప్రోటాగరస్, సియోస్ ద్వీపనివాసియైన ప్రాడికస్ మున్నగాగల

---

♦ఇతడు మెలిటస్ నగరవాసి. అయోనియాదేశపు తత్త్వవేత్త. ఇతడు సూర్యగ్రహణం ఎప్పుడు కలుగుతుందో కనుగొన్నాడు. హాలిస్ నదీ మార్గం మార్చాడు. అయోనియన్ల ఐకమత్యసిద్ధికి ఫెడరల్ కౌన్సిల్ ఏర్పాటు చేశాడు. గ్రీసుదేశంలో తత్త్వగణితశాస్త్రాధ్యయనం నెలకొల్పిన ప్రాథమికులలో ఒకడు. సర్వవస్తువులు జలంనుంచి ఉద్భవించినవనీ అందులోనే అవి లీనమవుతవనీ అతనిసిద్ధాంతం.

క క్రియోఫిలస్ అన్నపదానికి గోమాంసభక్షకుడని అర్థం. అలాంటివాడు జడమతి అవుతాడని యవనుల నమ్మకం.

ఉపదేష్టలెందరో 'మావద్ద చదువుకోనివాడెవ్వడూ వైయష్టికవ్యవహారాలు కాని, సామాజికవ్యవహారాలు కాని చక్కబెట్టుకోజాల'డని సమకాలికులను నమ్మించగలిగారు. వారి విశిష్టజ్ఞానంచేత సమ్మోహితులై సమకాలికులు వారిని తమభుజస్కంధాలమీద మోయటానికి గూడ ఆయత్తులయ్యారు. మానవులను ఉత్తములను చేయగలశక్తి హోమర్‌కూ, హెసియడ్‌కూ ఉంటే వారు కవిత్వం పాడుకొంటూ దేశసంచారం చేయటానికి సమకాలికులు సమ్మతిస్తారా? బంగారం పనికిరాదని ఎవరైనా పారవేస్తారా? వారిని వదలిపెట్టి ఉండలేనివారై, తమతోపాటు స్వస్థానంలో నివసించవలసినదని సమకాలికులు వారిని బలవంతపెట్టి ఉండరా? ఒకవేళ అలా ఉండటానికి తమగురువు సమ్మతించకపోతే వారు కూడ అతడు పోయినచోటికి పోతూ సముచితవిద్య ఆర్జించరా?

నిజమే సోక్రటిస్! మీరు చెప్పింది యథార్థం.

దీనినిబట్టి హోమర్ మున్నుగాగల కవులందరు అనుకారులని ఊహించవలసివస్తున్నది. వారు సద్గుణాదుల ప్రతీకాలను మాత్రమే అనుకరిస్తున్నారు కాని, యాథార్థ్యం వారెన్నడూ పొందటం లేదు. చర్మకారవృత్తి లవలేశం తెలియకపోయినా చర్మకారుని స్వరూపాన్ని చిత్రకారుడు చిత్రిస్తున్నాడని చెప్పుకొన్నాము. కవి కూడ చిత్రకారునివంటివాడే. చిత్రకారునకు ఎంత జ్ఞానం ఉంటున్నదో చిత్రపటసంతుష్టులకు అంతే జ్ఞానం ఉంటున్నది. వారు వర్ణాకృతులనుబట్టి చిత్రం మంచిచెడుగులను నిర్ణయిస్తున్నారు.

అవును, అదే జరుగుతున్నది.

అలాగే కవి కూడా అనుకరణకు వలసినంతగా ఆయావృత్తుల స్వభావాలు గ్రహించి తనమాటలతో విభిన్నకళల రూపాలను నిర్మిస్తున్నాడు. అతనివలె అజ్ఞానులైన ఇతరులు అతని మాటలనుబట్టి నిర్ణయిస్తున్నారు. పాదుకానిర్మాణం కాని, సైనికతంత్రాలు కాని ఛందోబద్ధంగా సమతాదిగుణవిశిష్టంగా వర్ణిస్తే అతడు చక్కగా చెప్పాడనుకొంటున్నారు. వృత్తికి (Melody), రీతికి (Rhythm) స్వాభావికంగా అలాంటి మనోజ్ఞప్రభావం ఉన్నది. కవుల కథలయందలి సంగీతాపాదితథగద్ధగలను తీసివేసి వానిని కేవలవచనంచేసి చదివితే అవి ఎంత నిష్పచ్ఛరంగా ఉంటవో నీవు

గ్రహించే ఉంటావు.

అవును, మీ చెప్పింది యథార్థం.

అవి వాస్తవంగా మనోజ్ఞాలు కాక యౌవనవికాసమాత్రైకముఖాలువలె ఉంటవి. ఇప్పుడు ఆ యౌవనవికాసం అదృశ్యమైపోయింది కదా?

అవును, సరిగా అదే జరిగింది.

మరొకవిశేషం: అనుకారికి, లేదా ప్రతీకనిర్మాతకు యథార్థసత్త తెలియదు. అతడు ఆభాసాలను మాత్రమే ఎరుగును. నేను చెబుతున్నది యథార్థమా?

ఆఁ.

తత్త్వం స్పష్టంగా అవగతం చేసికొందాము. అర్ధజ్ఞానంవల్ల ప్రయోజనం లేదు.

అలాగే కానివ్వండి.

చిత్రకారుడు కళ్ళెమూ వాగెలూ చిత్రిస్తాడు కదా?

అవును.

మరి కాంస్యకారుడు, చర్మకారుడు ఇత్తడితోను చర్మంతోను వాటిని నిర్మిస్తారు గదా?

ఆఁ.

అయితే కళ్ళెమూ వాగెలూ ఎలా ఉండాలో చిత్రకారుడు ఎరుగునా? లేదు. కంచరికీ చర్మకారునకూ తెలియదు. వాని వినియోగం తెలిసిన ఆశ్వికుడు మాత్రమే వాని సరియైనరూపాలు ఎరుగును.

అవును.

ఇదే అన్నివస్తువులకు వర్తిస్తుంది కదా?

అంటే?

ఎల్లవస్తువులకు సంబంధించినవై మూడు కళలున్నవి. ఒకటి ఉపయోగించేది. మరొకటి నిర్మించేది. మూడవది వీటిని అనుకరించేది.

అవును.

చేతనం కాని, అచేతనం కాని, ప్రాకృతం కాని, మానవం కాని ప్రతినిర్మితి యొక్క అతిశయమేమి, సౌందర్యమేమి, సత్యమేమి నిర్మాత ఉద్దేశించిన ప్రయోజనంమీద ఆధారపడుతున్నది.

నిజమే.

ఉపయోగించేవానికే వాటిలో ఎక్కువ అనుభవముంటుంది. కాబట్టి వాని ఉపయోగంలో కనిపించే గుణావగుణాలను అతడు నిర్మాతకు సూచించాలి. ఉదాహరణకు వేణువాదకుని తీసికొందాము. వేణువులలో ఏవి వాదకునకు సంతృప్తికరాలో, ఏ విధంగా వాటిని చేయాలో వాదకుడు నిర్మాతకు చెబుతాడు. అతడు ఆ ఉపదేశాలను పాటిస్తాడు.

అవును.

వేణువుల గుణావగుణాలను ఎరిగినవాడు కావటంవల్ల ఒకడు ప్రామాణికుడై చెబుతాడు. అతనిలో ప్రత్యయబుద్ధిగల రెండవవాడు వాటిని పాటిస్తాడు.

నిజమే.

ఉపకరణం ఒకటే. అయితే దాని బాగోగులను తనకున్న విశ్వాసాన్ని బట్టి నిర్మాత సాధిస్తాడు. ఉపకరణం ఉపయోగించేవానికి దానిజ్ఞానం

ఉంటుంది. అతనితో మాటాడి అతని ఉపదేశాన్ని పాటించి నిర్మాత ఆవిశ్వాసం సంపాదిస్తాడు.

అవును.

అనుకారికి జ్ఞానవిశ్వాసాలలో ఏ ఒకటైన ఉన్నదా? ఉపయోగాన్ని బట్టి తనచిత్రం సరిగా అందంగా ఉన్నదో లేదో చెప్పగలడా? పోనీ తానెలా చిత్రించవలసి ఉంటుందో ఎరిగినవాని సాహచర్యం చేసి వాని ఉపదేశంవల్ల విశ్వాసం పొందగలడా?

ఈ రెంటిలో ఏదీ అతనికి లేదు.

కాబట్టి తన అనుకరణక్రియాగుణావగుణాల యథార్థజ్ఞానం కాని, విశ్వాసం కాని అతనికి కలుగజాలదు.

అవును.

అనుకారియైన శిల్పికి తనకృతుల విషయంలో అంత అద్భుతజ్ఞానం ఉన్నదన్నమాట.

నిజమే. అలాంటి విపరీతస్థితిలోనే ఉంటాడు.

అయినా వస్తువుల మంచిచెడుగుల కారణం తెలిసికొనకుండానే అతడు అనుకరిస్తుంటాడు. కాబట్టి అజ్ఞానులైన బహుళసంఖ్యాకులకు మేలుగా కనిపించేదానినే అతడు అనుకరిస్తాడని ఊహించవలసి ఉంటుంది కదా?

అవును.

ఇంతవరకు అనుకారికి అనుకార్యవస్తుజ్ఞానం ఉండదని తేల్చుకొన్నాము. అనుకరణం ఒకవిధమైన క్రీడ; లేదా, లీల. ఏ ఛందంలో వ్రాసినా విషాదాంతకావ్యకర్తలు కేవలం అనుకర్తలే కదా?

అక్షరాల నిజం.

అనుకరణవిషయం సత్యానికి త్రిగుణంగా వ్యవహితమని ఇంతకుముందు తేల్చుకొన్నాము.

అవును.

మానవునిలోని ఏ శక్తికి అనుకరణం విషయమౌతున్నది?

అంటే?

వివరిస్తున్నాను. సమీపమందుండి చూచినప్పుడు పెద్దదిగా కనిపించేశరీరం దూరమందుండి చూచినప్పుడు చిన్నదిగా కనిపిస్తుంది.

అవును.

జలానికి వెలుపలినుంచి చూచినప్పుడు సరళంగా కనిపించేశరీరం జలంలో ఉన్నప్పుడు వక్రంగా గోచరిస్తుంది. రూపవిషయంలో దృష్టి భ్రాంతిపడ వచ్చును. ఈ భ్రాంతివల్ల పుటాకృతి కుంభాకృతి అవుతున్నది. ఈ విధంగా ఎల్లవిధములైన భ్రాంతులు మనలో గోచరిస్తున్నవి. మానవుని మనస్సునందలి ఈ దౌర్బల్యాన్ని పురస్కరించుకొని వంచకమూ సమ్మోహకమూ అయినకళ వెలుగునీడలు మున్నగుసాధనాలు ఉపయోగించుకొని ఇంద్రజాలమట్లు ముగ్ధం చేస్తున్నది.

అవును.

లెక్కలు, కొలతలు, తూకాలు బుద్ధికితోడ్పడుతున్నవి. కాబట్టి పిన్న పెద్దలు, ఎక్కువతక్కువలు, బలువుసులువులు అనువాని ఆభాసం బుద్ధిని మోసగించజాలదు. గణితాదికంవల్ల అది దూరాపాస్తమవుతుంది.

అవును.

ఈ పని ఆత్మయందలి వివేకం చేస్తున్నది.

అవును.

వివేకం కొలిచి 'ఈ వస్తువులు సమానాలు, ఇవి పెద్దవి, ఇవి చిన్నవి' అని చెప్పినప్పుడు ఆభాసాలతో బాధ ఏర్పడుతున్నదా?

లేదు.

అలాంటి బాధ కలగటానికి వీలులేదని చెప్పుకొన్నాము. ఎందుకంటే ఒకేశక్తి ఒకేకాలంలో ఒకేవిషయాన్ని గూర్చి విరుద్ధాభిప్రాయం పొందజాలదు.

అవును.

కొలతకు విరుద్ధమైన అభిప్రాయం పొందే ఆత్మాంశమూ మానానుగుణమైన అభిప్రాయం పొందే ఆత్మాంశమూ ఒకటి కావు గదా?

కావు.

మానగణనాలను విశ్వసించే ఆత్మాంశం ఉత్తమం కదా?

నిశ్చితంగా.

వాటికి విరుద్ధమైన అంశం ఆత్మయొక్క హీనతత్త్వాలలో ఒకటి కాదా?

అవును.

ఇందుకే లోగడ చెప్పాను. చిత్రలేఖనమేమి, అనుకరణమేమి తమవిధులను నిర్వర్తిస్తున్నప్పుడు అవి సత్యానికి అతిదూరములవుతున్నవి. ఆత్మలోని సత్యదూరమైన తత్త్వానికి మిత్రములూ సహకారులూ అయి పని చేస్తున్నవి. 'వానిలక్ష్యం యథార్థమూ కాదు, ఆరోగ్యకరమూ కాదు' అని అన్నాను.

అవును.

అనుకరణాత్మకకళ అధముని పెండ్లాడి అధమసంతతి కాంచే అధము రాలు.

నిజం.

ఇది దృశ్యానికి మాత్రమే వర్తిస్తుందా? లేక మనం కవిత్వమని చెప్పే శ్రవ్యానికి గూడ వర్తిస్తుందా?

కవిత్వవిషయంలో గూడ ఇదే యథార్థం కావచ్చును.

చిత్రలేఖనసాదృశ్యంవల్ల కలుగుతున్న సంభావ్యతమీద ఆధారపడక కవితాత్మక అనుకరణకు సంబంధించినశక్తి మంచిదో చెడ్డదో మరికొంత తరచిచూదాము.

అలాగే.

మనప్రశ్నను ఇలా చెప్పుకోవచ్చు. అనుకరణం మానవుల కర్మలను అను కరిస్తుంది. ఆ కర్మలు స్వచ్ఛందాలు కావచ్చును, కాకపోవచ్చును. వాటినిబట్టి సత్ఫలితమో దుష్ఫలితమో ఏర్పడుతుందని వారు భావిస్తారు. ఫలానుగుణంగా సంతోషమో దుఃఖమో పొందుతారు. ఇంతేనా? ఇంతకన్న మరేమైనా ఉన్నదా?

ఇంకేమీ లేదు.

ఈ స్థితిగతుల వైవిధ్యంలో మానవుడు తనలోతాను స్తిమితపడు తున్నాడా? విషయగ్రహణంలో దృష్టివల్ల అభిప్రాయభ్రాంతి, విరోధం ఏర్పడుతున్నట్లే అతనిజీవితంలో గూడ వీటివల్ల సంఘర్షణ, విరోధం ఏర్పడటం లేదా? ఇదివరకే దీనిని విచారించాము. ఒకేక్షణంలో వేల కొలది సంఘర్షణలతో ఆత్మ నిండి నిబిడీకృతమైపోతుందని మనం గుర్తిం చాము. కాబట్టి ఈ ప్రశ్నను నీవు తిరిగి ప్రస్తావించనక్కరలేదు.

అవును.

మనం సముచితమే కావించాము. కాని, అప్పుడొకటి వదలివేశాము. ఇప్పుడు దానిని పరిశీలించాలి.

ఏది వదలామంటారు ?

ఉత్తమపురుషునకు దురదృష్టంవల్ల పుత్రమరణమో, మరొక ప్రియంకర వస్తునాశమో సంభవించినప్పుడు అన్యునికంటె అతడు సమచిత్తుడై దానిని సహిస్తాడని చెప్పుకొన్నాము.

అవును

ఇంతకూ అతనికి దుఃఖం ఉండదని చెప్పాలా? లేక, దుఃఖం కలిగినా అతడు దానిని నిగ్రహించుకొంటాడని చెప్పాలా ?

రెండవపక్షమే యథార్థం.

అతడెప్పుడు తనదుఃఖం నిగ్రహించు కొంటాడు? అన్యులు చూస్తున్నప్పుడా ? లేక ఏకాంతంగా ఉన్నప్పుడా ?

ఏకాంతస్థితికీ అనేకాంతస్థితికీ చాల తేడా ఉన్నది.

ఏకాంతంగా ఉన్నప్పుడు కొన్నిమాటలనటానికీ, కొన్నిపనులు చేయటానికీ వెనుకాడడు. వాటినే ఇతరులు వింటున్నారన్నా, చూస్తున్నారన్నా సిగ్గుపడతాడు.

అవును.

అతనిలో దుఃఖం దిగమ్రింగజేసే నియతి, వివేకం ఉన్నవి. కలిగిన దురదృష్టానికి దురపిల్లజేసే తత్త్వమూ ఉన్నది.

అవును. .

ఒకవిషయానికి సుముఖంగా, విముఖంగా మానవుడు ఆకర్షింపబడుతున్న

ప్పుడు అతనిలో రెండు భిన్నతత్త్వాలు ఉండవలెనంటున్నాము.

ఉండితీరాలి.

వానిలో ఒకటి నీతిని శిరసావహించటానికి సిద్ధపడుతుంది.

అంటే?

బాధ సంప్రాప్తించినప్పుడు సహనం మేలని నియతి అంటుంది. సంప్రాప్తించిన కష్టాలు మంచికే వచ్చినవో చెడ్డకే వచ్చినవో తెలియదు. కాబట్టి మనం సహనం కోల్పోరాదంటుంది. పైగా దానివల్ల కలిగే లాభం కూడ లేదు. మానవజీవితంలో ఏదీ అంత ముఖ్యం కాదు. దురదృష్టకాలంలో మనకావశ్యకమైన దానిని పొందనీక దుఃఖం అడ్డుపడుతుంది.

"అదేమిటి?" అతడు ప్రశ్నించాడు.

గతాన్ని విచారించి అనాగతాన్ని బోధించే వివేకం అవసరం. బాలకుడు క్రిందబడి దెబ్బతగిలిన అవయాన్ని పట్టుకొని ఏడుస్తూ కాలం రిత్తపుచ్చుతాడు. బుద్ధిమంతుడట్లు కాక చికిత్సామార్గమాలోచించాలి. క్షతాగ్ధాన్ని ఉద్ధరించి చికిత్సావిద్యచే బాధను పరిహరించాలి.

అవును, విధివిఘాతాలను ఎదుర్కొనే మార్గమిదే.

ఉత్తమతత్త్వం వివేకవిహితమైన ఈ సూచనను పాటించటానికి సిద్ధమే కదా?

అవును.

గతబాధలను స్మరణకు తెచ్చి అంతులేకుండా దురపిల్లజేసే ద్వితీయతత్త్వం అవివేకీ నిరర్థకమూ భీరువూ అని చెప్పవచ్చును గదా?

నిర్బాధంగా.

చిత్రవిచిత్రమైన వస్తువును పుష్కలంగా దుర్దమమైన ద్వితీగతత్త్వం అనుకరణకు అందించదా? ప్రాజ్ఞశాంతస్వభావం ఎల్లప్పుడు సమవృత్తి కలిగి ఉంటుంది. కాబట్టే అది అనుకరణకు సుసాధం కాదు. ఒకవేళ అనుకృతమైనా పర్వకాలమందు నాటకశాలలో చేరే నానాగోత్రప్రజకు అది దురాస్వాదం. ఎందువల్లనంటే ఆ సంవేదన వారికి అననుభూత పూర్వం.

అవును.

ప్రజామోదమే కవికి లక్ష్యం. కాబట్టి స్వాభావికంగా అతడు కాని, అతనికళ కాని ఆత్మగత వివేకతత్త్వసంతృప్తికోసం ఉద్దిష్టం కాదు. అనుకరణకు సుకరమైన వ్యగ్రస్వభావాన్ని అతడు అభిమానిస్తాడు.

అవును.

అతడు రెండువిధాల చిత్రకారునకు తుల్యుడు. ఒకటి, అతనికృతులు సత్యతాతిమ్యూనాలు. ఇక్కడ చిత్రకారుడూ ఇతడూ సబ్రహ్మచారులు. అతనివలెనే ఇతడు ఆత్మలోని హీనాంశాన్నే సంతృప్తిపొందించ యత్నిస్తున్నాడు. సువ్యవస్థితరాజ్యప్రవేశం అతనికి నిరాకరించి మనం మంచిపనే చేశాము. ఎందువల్లనంటే సంవేదనలను మేల్కొలిపి, పోషించి, ప్రబలం చేసి వివేకానికి ఇతడు ఎగ్గు కలిగిస్తున్నాడు. రాజ్యంలో నియంత అనర్థక శక్తులకు అధికారమిచ్చి, సత్పురుషులను పరిహరించినట్లుగా అనుకరణ శీలుడైనకవి వివేకాన్ని ఉపేక్షించి ఆత్మలో అనర్థకవిధానం నాటుతున్నాడు. ఎందువల్లనంటే అలతివలతితనాలు వివేచించలేక ఒకేవస్తువు ఒకకాలంలో గొప్పదని, మరొకకాలంలో చిన్నదని భావించే అజ్ఞాన ప్రకృతిని రెచ్చగొడుతూ కేవలం ప్రతీకనిర్మాతయై అతడు సత్యానికి అతిదూర మౌతున్నాడు

అవును.

ఇంతకూ మన ప్రబలతమనిందారోపణ ఇంకా ప్రస్తావించనేలేదు. సత్పురుషులకు గూడ కవిత్వం హానికలిగిస్తుంది. ఆ హానికి పాల్పడనివారు చాల తక్కువ. కవిత్వానికి ఉన్న ఆ శక్తి దారుణం కాదా?

నిజంగా అలాంటి చెరుపు చేయగలిగితే దారుణమే. అందు సందేహం లేదు.

అయితే విని తీర్పుచెప్పు. హోమర్ రచనలోని ఒకఘట్టం విన్నప్పుడు పారవశ్యం కలుగుతుంది. విషాదాంతనాటకాలలో దుఃఖోపహతుడైన నాయకునిదీర్ఘప్రలాపం కాని, రోదిస్తూ రొమ్ము మోదుకొంటున్న నాయకునివర్ణన కాని చదివినప్పుడు ఉత్తములు ఆర్ద్రచిత్తులై ఆనందిస్తారు. మన భావాలను ప్రజ్వలింపజేసే కవి అతిశయాన్ని ఎంతగానో శ్లాఘిస్తారు.

అవును, నాకది అనుభవమే.

ఒకదుఃఖం కలిగినప్పుడు దానిని నిగ్రహించుకోగలిగితే మనం గర్విస్తాము. ప్రశాంతచిత్తులమై సహనంతో ఉండగలిగితే సంతోషిస్తాము. ఇది పౌరుషపద్ధతి. పఠనంతో మనం పొందే రెండవసంతోషం స్త్రీజన యోగ్యమని భావించబడుతున్నది.

అవును.

మనకుమనమై చేయ సేవగించి సిగ్గుపొందేపనిని ఇతరులు చేస్తుంటే చూచి శ్లాఘించటం యోగ్యమా ?

కాదు.

అలా కాదు. ఒకదృక్పథంతో చూస్తే అది సహేతుకమే.

ఏ దృక్పథంతో ?

ఒకదుఃస్థితి దాపరించినప్పుడు ఏడ్చివైచి ఉపశమనం పొందాలన్నవాంఛ స్వాభావికంగా ఉంటుంది. స్వకీయవిపత్తునందు నిగ్రహించుకొంటున్న శోకాన్ని పరిప్లావితంచేసి కవులు మనకు సంతోషం చేకూరుస్తున్నారు. మనలోని ఉత్తమప్రకృతి వివేకాభ్యాసాలచే సముచితశిక్షణ పొందకపోవటంవల్ల సానుభూతిప్రకటనకు అవకాశం ఇస్తుంది. ఎందువల్లనంటే ఆ దుఃఖం ఎదుటివానిది కాని, తనది కాదు. ఒకడు తనవద్దకు

వచ్చి తానెంతవాడో ఎలాంటి ఇక్కట్లు వచ్చాయో వెళ్ళబోసికొంటే అతనిని శ్లాఘించి కరుణించటం తనకేమాత్రం అవమానకారణం కాదని సామాజికుడు భావిస్తాడు. ఈ సుఖమతడు లాభమని తలపోస్తాడు. ఉపేక్షాభావం వహించి ఈ సుఖాన్ని కావ్యాన్ని ఎందుకు కోల్పోవాలను కొంటాడు. ఇతరమానవుల అనర్థంవల్ల కొంత అనర్థం తమకు గూడ సంక్రమిస్తున్నదన్న సంగతి ఏ కొలదిమంది మాత్రమో గుర్తిస్తున్నారనుకొంటాను. అందువల్ల ఇతరుల దుఃస్థితిసందర్శనంతో బలపడుతున్న దుఃఖసంవేదన స్వకీయవిషయాలలో అతికష్టమ్మీద నిగ్రహించుకో వలసివస్తుంది.

ఎంత యథార్థం!

ఇదే హాస్యానికి గూడ అన్వయించదా? కొన్ని నర్మగర్భోక్తులాడటానికి నీకు నీవు సిగ్గుపడతావు. వాటినే ఇతరులు రంగభూమినుంచి పలికినా, ఏకాంతమున్నప్పుడు వినిచినా ఆనందిస్తావు. కాని, వానివికృతత్వాన్ని ఏవగించుకోవు. అనుకరణలో జరుగుతున్నదే ఇక్కడ తిరిగి సంభవిస్తున్నది. హసించే తత్త్వమొకటి ఆత్మలో ఉన్నది. ఇతరులు నిన్ను విదూషకుడంటారన్నభయంతో దానిని నిగ్రహించుకొంటున్నావు. నాటకశాలలో హసనశక్తిచే ప్రేరితుడవై నీకు తెలియకుండానే నీవు విదూషకపాత్రను వహిస్తావు.

అక్షరాల నిజం.

ఇదే కామక్రోధాలకు మన కార్యానువర్తులైన సుఖదుఃఖాదులకు వర్తిస్తుంది. కవిత్వం రాగద్వేషాలను శుష్కింపజేయటానికి బదులు దోహదమిచ్చి పెంపొందిస్తుంది. సుగుణసంపత్తిని పెంపొందించుకొని మానవజాతి సుఖపడాలంటే వీటిని నిగ్రహించుకోవాలి. అలా నిగ్రహించటానికి బదులు కవిత్వం "స్వైరవిహారం సాగించం"డని వీటిని వదలిపెడుతుంది.

దీనికి నేను కాదనలేను.

గ్లాకన్! యవనులను హోమర్ విద్యావంతులను చేశాడు. విద్యాసము

పార్జనానికీ మానవవ్యవహారాలు చక్కదిద్దుకొనటానికీ అతనిరచనలెంతో ఉపయోగిస్తవి. అందువల్ల వాటిని మననంచేస్తూ వాటినిబట్టి మనుగడనంతా దిద్దితీర్చుకోవాలని హోమర్‌ను శ్లాఘించేవారు చెబుతారు. ఇలాంటివారు తటస్థపడినప్పుడు మనం వారిని ప్రేమించవచ్చును; గౌరవించవచ్చును. వారికున్నంతజ్ఞానంలో వారు ఉత్తములే. కవులలో హోమర్ శ్రేష్ఠుడే. విషాదాంతరూపకకర్తలలో అతడు అద్యుడే. అయితే ఈశ్వరస్తవాలు, మహాపురుషుల స్తోత్రాలు తక్క మరేకవిత్వాన్నీ మన రాజ్యంలో ప్రవేశించనీయరాదని మనసంకల్పం. దీనిని ఏ మాత్రం సడలనీయరాదు. ఈ సూత్రాన్ని అధిగమించి గేయరూపంలో కాని, మహాకావ్యరూపంలో కాని, సుధామధురభారతిని రాజ్యంలో అడుగిడనిస్తే సుఖదుఃఖాలు మనరాజ్యాన్ని ఏలుతవి కాని, ఉత్తమాలైన నియతివివేకాలు కావు.

అది యథార్థం.

అనుకరణశీలమైన కళను మనరాజ్యంనుంచి బహిష్కరించాలని లోగడ అన్నాము. ఇప్పుడు కవిత్వాన్నిగూర్చి తిరిగి ప్రస్తావిస్తున్నాను. కాబట్టి మనవాదసామంజస్యాన్ని స్పష్టంచేయాలి. కవితాభిమానాన్ని మన వివేకమే నిగ్రహిస్తున్నది. 'మీకు హృదయం లేదు, వినయం అంతకన్నా లేద'ని కవితాసరస్వతి మనలను నిందించవచ్చును. 'అమ్మా! తత్త్వశాస్త్రానికీ కవిత్వానికీ ప్రాచీనస్పర్ధ ఉన్నది. ఎందుకు ఊరక మమ్మ నిందిస్తావు?' అని మనం ఆమెకు చెబుదాము. ఇందుకు ఎన్నో నిదర్శనాలున్నవి. "అఱచుకునకమ్మ యజమానునరసి మొఱిగె", లేదా "మూర్ఖరిక్తప్రలాపాలపోతురాజు", "బ్రహ్మదేవుమించిన ఋషీశ్వరులమూక", లేక "తిరిపెమెత్తి జీవించెడి తీక్ష్ణమతులు"—ఇలాంటివి పెక్కులు చూపవచ్చును. ఇవి ఇలా ఉన్నా కవితకూ తక్కిన అనుకరణశీలకళలకూ ఈ మాట చెబుదాము. సమ్యగ్వ్యవస్థితరాజ్యంలో "నీవు వాస్తవ్యవని నిరూపిస్తే నిన్ను మారాజ్యానికి సంతోషపూర్వకంగా ఆహ్వానించటానికి సంసిద్ధుల"మని అభయమిద్దాము. దాని సమ్మోహకశక్తులు మనకు తెలియనివి కావు. అంతమాత్రాన సత్యాన్ని వంచించరాదు. గ్లాకన్! అది హోమర్ రచనలో గోచరించినప్పుడు నావలె నీవు కూడ పరవశం పొందుతావు.

అవును, ఎంతో ఆనందం కలుగుతుంది.

కాబట్టి బహిష్కారవిమోచనం పొంది పునరాగమనానికి అభ్యనుజ్ఞ పొందాలంటే 'నీవు గేయరూపంలోనో మరొక ఛందోరూపంలోనో నీయోగ్యతను సమర్థించుకోవాలి' అని దానికి 'షరతు' ఒకటి విధించుదాము.

అవును.

అంతే కాదు. కవితాభిమానులై స్వయంగా కవిత్వం చెప్పలేక దానిని సమర్థించేవారికి గూడ వచనంలో దానిపక్షాన వాదించటానికి అనుమతి ఇద్దాము. అది కేవలం సుఖప్రదాయి మాత్రమే కాక రాజ్యాలకు మానవ జీవితానికి మేలుచేస్తుందని వారు నిరూపిస్తే మనం సహృదయతతో వారి వాదం విందాము. ఇది నిరూపితమైతే మనకే లాభం కదా! కవిత్వం ఆనందమే కాక ప్రయోజనం కూడ కలిగిస్తే మేలు కాదా?

అవును. దానివల్ల నిశ్చితంగా లాభం పొందుతాము.

ఒకవేళ ఆ సమర్థకవాదం విఫలమౌతుందిపో. వాంఛాకృష్టులై ఆ కోర్కెలు ఆత్మశ్రేయోభంజకాలని గ్రహించినప్పుడు బుద్ధిమంతులు వాటిని నిగ్రహించుకొంటారు. అలాగే మనం కూడ మనకవితాభిమానాన్ని నిగ్రహించుకోవాలి. అయితే ఇందు కొంత సంఘర్షణ తప్పదు. ఉదాత్తరాజ్యాలు మనకిచ్చిన విద్యవల్ల కూడ మనం కవితాభిమానంచేత ఉద్బుద్ధులమౌతున్నాము. అందువల్ల తన ఉత్తమత్వంతో నిజరూపంతో అది గోచరించటం మనకు సమ్మతం. అయితే తన్నుతాను అది సమర్థించుకోలేనంతకాలం మన ఈవాదం మనకు రక్షఅవుతుంది. గీతికారూపమైన దానివాదాన్ని వింటున్నప్పుడు మనవాదాన్ని మనం పునశ్చరణ చేసికొంటాము. అనేకులవలె మనం వ్యామోహానికి లోబడము. ఏది ఎలా ఉన్నా మనం ఇంతకుముందు తేల్చుకొన్నట్లు అది సత్యసాధకం కాదు. కవితాశ్రవణపరుడు తన ఆంతరికభద్రతకోసం దానిచే మోసపోక జాగ్రత్తపడాలి. మనమాటలను అతడు శాసనంగా స్వీకరించాలి.

అవును, మీ అభిప్రాయంతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను.

గ్లాకన్ ! మనం తేల్చుకోవలసినవిషయం గొప్పది. మానవసముద్ధరణం మనప్రధానసమస్య. గౌరవానికో, ధనానికో, అధికారానికో, కవితా పారవశ్యానికో లోగి, న్యాయం, సద్గుణసంపత్తి ఉపేక్షిస్తే ఎవనికైనా లాభమేమి కలుగుతుంది?

అవును. మీవాదం నాకు నచ్చింది. అందు నమ్మిక కుదిరింది. ఎవనికైనా ఇలాగే నచ్చుతుంది, గురి ఏర్పడుతుందని నావిశ్వాసం.

ఇంతకూ సుగుణసంపత్తివల్ల కలిగే ఉత్తమోత్తమలాభసత్కారాలు స్పృశించనే లేదు.

ఇంకా వేరే లాభాలున్నవా? ఉంటే అవి ఎంతో మహత్తరాలు.

స్వల్పకాలంలో ఏదైనా గొప్పదవుతుందా? నిత్యతముందు మన డెబ్బది సంవత్సరాలెంత?

అవును. శూన్యమనే చెప్పవచ్చును.

మరి అమర్త్యజీవి ఆ పూర్ణతను విడనాడి ఈ స్వల్పవ్యవధానాన్ని అంతగా పాటిస్తాడా?

లేదు. ఇంతకూ ఈ ప్రశ్న ఎందుకడుగుతున్నారు?

మానవుని ఆత్మ అవినాశి, అమర్త్యం. ఈ సంగతి తెలియదా?

ఆశ్చర్యచకితుడై నావంక చూచి అన్నాడు: 'విడ్డూరంగా ఉంది. నిజంగా మీరు దీనిని సమర్థిస్తారా?'

అవును, నేనే కాదు. నీవు కూడ దీనిని సమర్థించవలసినదే. ఇందులో క్లేశమేమీ లేదు.

ఎంతో క్లేశమున్నట్లు నాకు కనిపిస్తున్నది. అల్పవిషయమున్నట్లుగా పేర్కొన్న ఈ వాదాన్ని మీరు వివరించాలి.

అయితే విను.

సావధానంగా ఉన్నాను.

'మేలు' అనేది ఒకటి, 'కీడు' అనేది మరొకటి, అవునా?

ఆఁ.

కలుషితం కావించి నాశనంచేసేది కీడని, ఉద్ధరించి చక్కబరచేది మేలని నాతలపు. దీనికి సమ్మతిస్తావు కదా?

ఆఁ.

మరి ప్రతివస్తువులోను మేలూ కీడూ ఉన్నవని ఒప్పుకొంటావు కదా? కంటికి ఎరుపు, శరీరానికి రోగం, ధాన్యానికి పుచ్చు, కలపకు బుగులు, రాగికి కిలుము, ఇనుముకు త్రుప్పు కీడైనట్లు ప్రతివస్తువునకు సహజంగా కీడొకటి ఉంటుంది.

అవును.

ఇలాంటికీడు పొందినదేదైనా తుదికి నశిస్తుంది.

అది తప్పదు.

ప్రతిదానికి స్వతస్సిద్ధంగా ఉండే అనర్థకం దానినాశనానికి హేతువు అవుతుంది. అది వినాశం కల్పించకపోతే వస్తువును మరేదీ నాశనం చేయదు. మేలువల్ల వినాశం కలుగదు గదా? అలాగే మేలుకీళ్లకంటె వేరైన మరొకదానివల్ల దానికి వినాశం సంభవించదు.

అవును.

స్వతస్సిద్ధమైన ఈ దోషంచేత నాశం పొందని ప్రకృతి ఒకానొకటి ఉంటే అది అనశ్వరమే కదా?

అవును.

మరి ఆత్మను కలుషితంచేసే అనర్థకమేమీ లేదా?

లేకేమి? ఉన్నవి. ఇంతకుముందు మనం పేర్కొన్నవన్నీ అవే కదా? అధర్మం, నిగ్రహరాహిత్యం, భీరుత్వం, అజ్ఞానం మున్నైనవన్నీ అనర్థకాలే.

వీనిలో ఏదైనా ఆత్మను నాశనం చేస్తుందా? ఇక్కడ మనం భ్రాంతి పడరాదు. అన్యాయవంతుడూ మూఢుడూ అయినవాడు పట్టువడినప్పుడు తన అన్యాయంవల్ల తానే నశిస్తాడని పొరపడరాదు. శరీరదృష్టాంతమే తీసికో. శరీరానర్థకమైన వ్యాధి శరీరాన్ని చెరిచి, శుష్కింపజేసి నాశనం చేస్తుంది. ఇంతకుముందు మనం పేర్కొన్నట్లు ఎల్లవస్తువులు తమదోషం వల్ల వినాశం పొందుతవి. ఇది నిజమే కదా?

అవును.

అలాగే ఆత్మవిషయం కూడ పరిశీలించు. అన్యాయం కాని, మరొక అనర్థకం కాని ఆత్మను నాశనంచేస్తుందా? ఆత్మను అంటుకొని అందులో నివాసమేర్పరచుకొని తుదికి దానిని నాశనంచేసి శరీరంనుంచి వేరుపరుస్తుందా?

లేదు.

అంతర్గతదోషోపహతమై నశించనివస్తువు బాహ్యానర్థోపహతమై నశిస్తుందనుకొనటం అసముచితం కదా?

అవును.

ఆహారపదార్థం నిలవ ఉండటంవల్లనో, కుళ్ళిపోవటంవల్లనో, మరొక కారణంవల్లనో దుష్టమౌతుంది. ఆ దోషం ఆహారపదార్థైకగతమై ఉన్నంత కాలం శరీరానికి వినాశం కల్పించదు. ఆహారదోషం శరీరానికి సంక్రమిస్తే శరీరం నిజదోషమైన వ్యాధివల్ల నశించిందంటాము. అది వేరేసంగతి. కాని

శరీరం ఒకటి, ఆహారం మరొకటి. ఆహారదోషం శారీరకదోషమాపాదించక శరీరాన్ని నశింపజేస్తుందని మనం ఒప్పుకోము. ఆ వాదం మనం పూర్తిగా నిరాకరిస్తాము.

అవును.

ఈ సూత్రాన్నిబట్టి చూస్తే శారీరకానర్థం ఆత్మానర్థం కలిగిస్తే తప్ప ఆత్మ తనకన్యమైన మరొకదానిదోషంవల్ల విలయం పొందుతుందని భావించ వీలులేదు.

అవును. అది సహేతుకమే.

కాబట్టి ఈ వాదం మనం నిరాకరించాలి. మనవాదం అప్రత్యాఖ్యాతమై ఉన్నంతకాలం జ్వరం కాని, మరొకవ్యాధి కాని, ఖడ్గం కాని, శరీర శతధాఖండనం కాని ఆత్మకు నాశనం కలిగించజాలదు. శరీరానికి ఆపాదితాలైన పరమ అపవిత్రత అప్రగుణత్వాలవల్ల ఆత్మ కూడ అపవిత్రతా అప్రగుణత్వాలు పొందిందని రుజువు చేస్తేతప్ప పై అర్థం సిద్ధించదు. అంతర్గతదోషోపహతం కానప్పుడు ఆత్మ కాని, మరొకటి కాని బాహ్యమైన మరొకవస్తువువల్ల నాశం పొందుతుందని వాదించ శక్యంకాదు.

అవును. మరణంవల్ల మానవుల ఆత్మలు అన్యాయ్యతరాలవుతవని ఎవరూ నిరూపించలేరు.

ఆత్మయొక్క అమర్త్యత్వం ఆమోదించనివాడెవడైనా ధైర్యంగా దీనిని నిరాకరించి, మరణం నిజంగా అనర్థకమూ అప్రగుణమూ అని అంటాడేపో., అతడు చెప్పింది యథార్థమే అయితే వ్యాధివలెనే అన్యాయం కూడ అన్యాయవంతునకు వినాశకారి కావాలి. అన్యాయమాశ్రయించేవారు ఆ అనర్థంలో స్వతస్సిద్ధంగాఉండి ఎప్పుడో ఒకప్పుడు మరణమాపాదింపగల శక్తివల్ల నశించాలి. అంటే ఆత్మకృతాపరాధంవల్ల దుష్టులు ఇతరులచేతుల్లో మరణిస్తున్నట్లు కాక మరొకరీతిగా మరణం పొందాలి.

నిజంగా అన్యాయం అన్యాయవంతునకు మహోపకారం చేసేదే అయితే అది అతనికి అంత భయంకరం కాదు. ఎందువల్లనంటే అనర్థంనుంచే

అతడు విముక్తి పొందుతాడు. కాబట్టి ఇలా కాక దీనికి విపరీతమైనది యథార్థమేమోనన్న అనుమానం నాకు కలుగుతున్నది. అన్యాయానికి ఆ శక్తి ఉంటే అది ఇతరులను చంపి హంతకుని ప్రాణాలతో వదలి వేయాలి. అతనికి భయంకరం కాకపోవాలి.

ఆత్మయందు స్వతస్సిద్ధంగా ఉన్న దుర్గుణం ఆత్మను నశింపజేయలేనప్పుడు శరీరనాశనానికి ఉద్దిష్టమైన అర్థం తనలక్ష్యాన్ని విడిచి వేరొకదానిని నాశనం చేయదు.

అవును.

ఆత్మగతదోషంవల్ల కాని, బాహ్యదోషంవల్ల కాని నశించని ఆత్మ నిత్య సత్పదార్థం కావాలి. నిత్యమైనప్పుడది అమర్త్యం కావాలి.

నిశ్చితంగా అంతే.

ఇదీ నిర్ణయం. ఈ నిర్ణయమే యథార్థమయితే ఆత్మలు ఎల్లప్పుడు ఒకటిగా ఉండాలి. నాశం లేనప్పుడు అవి పెరగవు తరగవు. వానిసంఖ్య పెరగవలెనంటే మర్త్యాలనుండి అమర్త్యాలుద్భవించాలి. ఈ విధంగా ఎల్లవస్తువులు తుదికి అమర్త్యాలు కావాలి.

అవును.

శుద్ధస్వభావమైన ఆత్మలో వైవిధ్యం కాని, భేదం కాని, అసాదృశ్యం కాని ఉంటుందనుకొనటానికి అవకాశంలేదు. యుక్తి ఈ అర్థాన్ని సమర్థించదు.

అంటే మీ తాత్పర్యం ?

ఇంతకుముందు నిరూపించినట్లు ఆత్మ అమర్త్యం కాబట్టి బహుద్రవ్యరచితం కాక ఉత్తమరచన కావాలి.

అవును.

పూర్వయుక్తులచేతనే ఆత్మయొక్క అమర్త్యత్వం సిద్ధం. ఇవికాక ఇంకా పెక్కులున్నవి. శరీరాదిదోషదూషితరూపంతో కాక యథాతథంగా ఆత్మను సందర్శించాలంటే వివేకనేత్రంతో దానిస్వచ్ఛతను సందర్శించాలి. అప్పుడే దానిరామణీయకం గోచరిస్తుంది. న్యాయాన్యాయాలు, మనంచర్చించిన ఇతరవిషయాలు విస్పష్టంగా అభివ్యక్తాలవుతవి. ఇంతవరకు మనం ఇప్పటికి గోచరించిన సత్యం చెప్పుకొన్నాము. అయితే మనమొకటి గుర్తుంచుకోవాలి. సముద్రదేవుడైన గ్లాకస్‌ను యథార్థరూపంతో కాక ఉపాధిగతబహుదోషపరీతునిగా చూస్తున్నాము. నానావిధతరంగపంక్తులచే ఆ దేవుని అంగాలు ఆహతాలై భగ్నాలై శంఖశిలాశైవాలాదికకర్కశాలై కనిపిస్తున్నవి. ఈ వికృతిచే అతడు భయంకరజంతువువలె గోచరిస్తున్నాడే కాని అతనిసుందరరూపం కనిపించటం లేదు. అలాగే మనకు కనబడుతున్న ఆత్మరూపం కూడ ఆస్థితిలోనే ఉన్నది. పరశ్శతదోషసంవృతమై కనిపిస్తున్నది. గ్లాకన్! మనం చూడవలసినది ఇక్కడ కాదు.

మరెక్కడ?

దానిప్రజ్ఞాప్రణయం అమర్త్యమూ నిత్యమూ అయినతత్త్వంతో తనకున్న బాంధవ్యాన్ని పురస్కరించుకొని అది దేనిని మారుస్తుందో, దేని సాహచర్యసల్లాపాలభిలషిస్తుందో మనం చూడాలి. తన్ను కప్పిపుచ్చుతున్న మట్టితో బ్రతుకుతున్నది కాబట్టి ప్రకృతం ఆత్మ సముద్రగర్భంలో రాలరప్పలమధ్య, గవ్వలగుల్లలనడుమ మన్నుమకిల కొట్టుకొని ఉన్నది. ఈ వికారాలన్నీ జీవితప్రార్థ్యవస్తువులని చెప్పబడుతున్నవి. కాని, దివ్యసంస్కారోద్బుద్ధమై ఆ తత్త్వాన్ని సంపూర్ణంగా అనుసరిస్తున్నప్పుడు ఆత్మ ఈ కాలుష్యపరంపరనంతా వదల్చుకొని ఎలాంటి విభిన్నరూపం పొందుతుందో ఊహించుకోవాలి. అప్పుడే దానిని యథార్థరూపంలో చూడగలవు. అప్పుడే దాని ఆకృతి ఏకమో అనేకమో తెలిసికోగలవు. దానిప్రకృతి ఏమిటో గ్రహించగలవు. ఇహజీవితంలో అది పొందేవికారాలు, ఆకృతులు మనం వలసినంతమేర చెప్పుకొన్నాము.

అవునని అతడన్నాడు.

ఇంతకు చర్చాలక్ష్యాలు సిద్ధించాయి. హోమర్, హెసియడ్ న్యాయంవల్ల

సిద్ధిస్తవని పేర్కొన్న సత్కారగౌరవాలను పేర్కొనక తనకుతానుగా న్యాయం శ్రేయోదాయకమని నిరూపించాము. గైజస్ ముద్రిక సంప్రాప్తమైనా కాకపోయినా ఆ ముద్రికతోపాటు అంధంకరణశిరస్త్రాణం ధరించినా ధరించకపోయినా మానవుడు న్యాయం అనుష్ఠించవలసి ఉంటుందని నిరూపించాము.

అవును.

న్యాయాదిసద్గుణాలవల్ల మర్త్యామర్త్యులచే ఇహపరలోకాలలో ఆత్మకు ఎన్ని సత్ఫలాలు ఎంతగా లభిస్తవో ఇప్పుడు పేర్కొంటే నష్టం లేదు కదా!

లేదు.

మన చర్చాసందర్భంలో నీవు పుచ్చుకొన్న అప్పు తీర్చివేస్తావా?

అప్పా? ఏమి పుచ్చుకొన్నాను?

న్యాయవంతుడు అన్యాయవంతుడుగా, అన్యాయవంతుడు న్యాయవంతుడుగా కనిపించాలని చెప్పావు. కేవల న్యాయం కేవల అన్యాయంతో పోల్చి తత్త్వం నిర్ణయించటంకోసం యథార్థస్థితి మర్త్యామర్త్యులకు కనిపించకుండా ఉండటానికి వీలులేకపోయినా అలా కనిపించటం ఆవశ్యకమన్నావు. గుర్తున్నదా?

ఆఁ. ఎలా మరచిపోతాను?

నిర్ణయం ఇప్పుడు తేలిపోయింది. కాబట్టి మర్త్యామర్త్యులకు న్యాయమందున్న తొల్లిటిగౌరవాన్ని దానికిప్పుడు తిరిగి ఇచ్చివేయాలి. న్యాయం యాథార్థ్యాన్ని ప్రసాదిస్తుందే కాని, న్యాయవంతులను వంచించదు అని నిరూపించాము. కాబట్టి దాని నుంచి స్వీకరించినదానిని ఇచ్చివేస్తే, తన ప్రఖ్యాతికనుగుణమైన ఆబహూకృతిని అది అనుగ్రహిస్తుంది.

ఈ అభ్యర్థన సముచితమే.

న్యాయాన్యాయవంతుల ఇద్దరిస్వభావం నిజంగా దేవతలకు వేద్యమేనని ముందు ఆమోదించాలి.

ఆమోదించాను.

ఆ ఉభయులు వారికి సుపరిచితులైనప్పుడు దేవతలకు వారిలో ఒకడు హితుడు, వేరొకడు అహితుడు కావాలి.

అవును.

దేవతలకు ఆప్తుడైనవాడు పురాకృతపాపఫలం వినా ఉత్తమఫలాలే వారివల్ల పొందుతాడనవచ్చును గదా?

నిశ్చితంగా.

న్యాయవంతుడు దారిద్ర్యపీడితుడై ఉన్నా, వ్యాధిగ్రస్తుడై ఉన్నా, మరొక దురవస్థపాలై ఉన్నా ఎల్లవస్తువులు అతనికి జీవనమరణములందు మేలే కలిగిస్తవి. న్యాయవంతుడు కావలెనని కోరి సాధ్యమైనంతవరకు సత్కార్యాచరణంతో దేవునివలె ఉండాలని యత్నించేవానిని దేవతలు కాపాడుతారని చెప్పవచ్చును గదా?

దేవునివలె ఉంటున్నప్పుడు అతడు ఎన్నటికీ ఉపేక్షితుడు కాడు.

అన్యాయవంతుని విషయంలో దీనికి విరుద్ధంగా జరుగుతుందని భావించవచ్చును గదా?

అవును.

కాబట్టి దేవతలవల్ల ఇలాంటి అనుగ్రహం పొందుతాడు.

ఆఁ. పొందుతాడనే నావిశ్వాసం.

మానవులనుగూర్చి వారేమనుకొంటారు? విషయాలను యథాతథం

చూదాము. తెలివితేటలుగల అన్యాయవంతుడు పరుగుపందెంలో గమ్యం వరకు అతివేగంగా పరుగిడి తిరిగి స్వస్థానానికి చేరుకోలేని పందెగానివలె ప్రవర్తిస్తాడు. క్రీడాధావకులు ప్రారంభంలో అతివేగంగా పరుగిడుతారు. కాని, పరుగు తుదిపాలు వచ్చేటప్పటికి కాళ్ళు ఈడిగలబడిపోతవి, గెలుపు జారిపోతుంది. సరియైనధావకుడు తుదిదాక జయప్రదంగా పరుగిడి బహూకృతి పొందుతాడు. న్యాయవంతుడీవిధంగానే ఉంటాడు. ప్రతి కర్మలోను తుదిదాక సహనంతో వర్తిస్తూ బ్రతికినంతకాలమూ సద్వర్తనుడై ఉండేవాడు మానవసత్కారాలన్నిటినీ పొందుతాడు.

అవును.

అలాంటప్పుడు అదృష్టవంతుడైన అన్యాయపరునకు సంక్రమిస్తవని నీవు లోగడ పేర్కొన్న అదృష్టాలన్నీ న్యాయవంతునకు కలుగుతవని నీవు సమ్మతించాలి. న్యాయవంతులకు వార్ధకం అతిశయిస్తున్నకొలది ఇష్టముంటే తమరాజ్యంలో తామే పాలకులవుతారు. తమకు నచ్చినవారిని పెండ్లాడుతారు. తాము సంకల్పించుకొన్నవారికి తమపిల్లలనిచ్చి పెండ్లి చేస్తారు. ఇదివరకు నీవు అన్యాయవంతునకు ఏ యే సౌఖ్యాగులు కలుగుతవని చెప్పావో అవన్నీ నేను న్యాయవంతునకు కలుగుతవంటాను. అంతే కాదు. అన్యాయవంతులలో పెక్కురు బాల్యంలో పట్టుపడక ఒకవేళ తప్పించుకొన్నా తుదకి పట్టుపడుతారు. చివరకు మూర్ఖులైపోతారు. వారు ముదివగ్గులై శోచనీయావస్థలో ఉన్నప్పుడు వారిని క్రొత్తవారే కాదు, పరిచితులు గూడ ఏవగించుకొంటారు. వారికి దేహశుద్ధి జరుగుతుంది. నీవు చెప్పినట్లుగా శ్రవణయోగ్యంకాని దుఃస్థితి దాపరిస్తుంది. హింసకయంత్రాగోపకులవుతారు. వారికన్నులు మాడ్చివేయబడుతవి. నీవుచెప్పిన భయంకరక్షావశేషం నేను కూడ చెప్పాననుకో. వాటినన్నిటినీ నేను తిరిగి ఏకరువుపెట్టకుండా నిజమేనని అంగీకరిస్తావా ?

ఆఁ. మీరు చెప్పేదంతా నిజం.

కాబట్టి న్యాయవంతులకు దేవతలూ మానవులూ బహుమానాలు, సత్కారాలు, కానుకలు ఈ జన్మలోనే సమర్పిస్తారు. ఇవికాక న్యాయమే ఇతర సద్వస్తువులెన్నో ప్రసాదిస్తుంది.

అవును. అవి రమణీయాలు, పైగా నిత్యాలు.

అయినా మరణానంతరం న్యాయవంతులకు కలుగనున్నవాటిముందు ఈ పేర్కొన్నవి పరిమాణంలో కాని, సంఖ్యలో కాని ఒకలెక్క కావు. నీవు వాటిని విన్నప్పుడు న్యాయాన్యాయవంతులిరువురకు మనవాదంవల్ల ముట్టవలసిన మొత్తమంతా ముగుతుంది.

అయితే చెప్పండి, ఇంతకంటె కుతూహలజనకాలుండవు.

నీకొకకథ చెబుతాను. అయితే అల్సినోవస్ వీరునికి యులిసీస్ చెప్పిన కథ కాదు. ఇది పాంపీలియామండలవాసి ఆర్మినస్ కుమారుడైన 'యర్' కథ. అతడు యుద్ధంలో చనిపోయాడు. ఆ తరువాత పదిరోజులకు అంతిమసంస్కారార్థం మృతకళేబరాలను తొలగించారు. తక్కినశవాలన్నీ చెడి పూతిగంధం కొడుతూ ఉంటే అతనిశరీరం కందక గాజువారక అలాగే ఉన్నది. దహనసంస్కారార్థమై బంధుకోటి దానిని ఇంటికి కొనిపోయింది. పన్నెండవరోజున ఆ శవం చితిపై సజీవమైలేచి కూర్చుండి పరలోకంలో తాను చూచివచ్చినవింతవిశేషాలు తనచుట్టూ ఉన్నవారికి వినిపించింది. తనఆత్మ శరీరం వదలి సహచరబృందంతో యాత్రకు బయలుదేరింది. అవి అలాపోయి ఒక విచిత్రప్రదేశం చేరుకొన్నవి. అక్కడ భూమిలో రెండు సొరంగాలు కనిపించాయి. వాటికి తిన్నగా పైన స్వర్గానికి మరిరెండు బిలముఖాలున్నవి. ఈ వివరాల నడిమిపట్టున న్యాయాధికారులు సమాసీనులై న్యాయవంతులను విచారించి, తీర్పుచెప్పి, ఆ తీర్పులు వారివక్షోభాగాన బద్ధంకావించి కుడివైపుననున్న స్వర్గపథాన పోవలసినదని ఆజ్ఞాపించారు. ఆవిధంగానే అన్యాయవంతులను ఎడమప్రక్కననున్న బిలమార్గాన దిగిపోవలసినదని శాసించారు. వీరికర్మపట్టికలు పృష్ఠభాగాన బద్ధాలై ఉన్నవి. తాను (యర్) ఆ న్యాయాధికారులను సమీపించాడు. 'నీవు పరలోకవృత్తాంతం మానవులకు దూతవై తెలుపవలసి ఉన్నది. కాబట్టి ఈ ప్రాంతంలోని దృశ్యశ్రవ్యాలన్నీ సాకల్యంగా ఆకళించుకోవలసిన'దని వారు ఆజ్ఞాపించారు. తీర్పుల అనంతరం ఒకప్రక్క భూస్వర్గబిలాలద్వారా నిర్గమిస్తున్న జీవులు కనిపించాయి. రెండవప్రక్కనున్న బిలముఖాలనుంచి మరికొన్ని జీవులు వెలువడుతున్నవి. భూగర్భంనుంచి వస్తున్నవి ధూళిధూసరితాలై దీర్ఘమార్గాయాసితాలై ఉన్నవి. స్వర్గంనుంచి అవతరిస్తున్నవి శుచులై

తేజస్వంతాలుగా ఉన్నవి. నిరంతరసమాగతాలవుతున్నజీవులు దీర్ఘ దీర్ఘప్రయాణాలు సాగించివచ్చినట్లు కనిపిస్తున్నవి. అవి మహానందంతో మైదానానికి పోయి ఉత్సవకాలంలో విడిసినట్లు విడుదులేర్పాటుచేసి కొన్నవి. ఒండొరులనెరిగినవి కౌగిలించుకొని కుశలప్రసంగాలు సాగించాయి. భూగర్భంనుంచి ఏతెంచినవి ఊర్ధ్వలోకవృత్తాంతాలను, స్వర్గంనుంచి అరుదెంచినవి భూలోకవృత్తాంతాలను కుతూహలంతో అడిగినవి. జరిగిన విశేషాలు ఒండొంటికి చెప్పుకొన్నవి. అధోలోకంనుంచి వచ్చినవి తమయాత్రలో (ఈ యాత్ర వేయిసంవత్సరాలు పట్టింది.) అనుభవించిన అగ్గాలు, సందర్శించినవిషయాలు స్మరణకువచ్చి దురపిల్లి దూపటిల్లాయి. ఊర్ధ్వలోకంనుంచి వచ్చినవి స్వర్గసుఖాలను, అప్రమేయరమణీయదృశ్యాలను వర్ణించాయి. ఈకథ సాకల్యంగా చెప్పాలంటే చాలకాలం పడుతుంది. దానిసంగ్రహస్వరూపం ఇది: "తాము పరులకొనర్చిన అపకారానికి అవి పదిరెట్ల అపకారం అనుభవించాయి" అని అతడు చెప్పాడు. మానవజీవితం సామాన్యంగా శతవత్సరపరిమితం కదా? ఒకడు చేసిన పాపకృత్యాన్ని వెయ్యేండ్లకాలంలో పదిసార్లు అనుభవించాలి. ఎవడైన అనేకహత్యలు చేశాడనుకో. లేదా రాజ్యద్రోహమో, రాజ్యస్వాతంత్ర్యాపహరణమో కావించాడనుకో. లేదా సైన్యాలకు మహాద్రోహం కాని, మరొక పాపకృత్యం కాని చేశాడనుకో. ప్రతిపాపకృత్యానికి అతడు పదిరెట్లనుభవిస్తాడు. దానధర్మాది పుణ్యకృత్యాలకు గూడ ఈ నిష్పత్తిలోనే ఫలమనుభవించాలి. పుట్టగానే మరణించే శిశువులను గూర్చి అతడు చెప్పినవిషయాలు నేను తిరిగి వల్లించనక్కరలేదు. దేవతలందు తలిదండ్రులందు భక్తితాత్పర్యాలతో ద్రోహచింతలతో వర్తించినవారికి ఎన్నోరెట్లు ప్రతిఫలం కలుగుతుందని అతడు వర్ణించాడు. 'చండశాసనుడైన ఆర్డియస్ ఎక్కడ?' అని ఒకజీవి మరొకజీవిని అడుగుతుండగా తానక్కడే ఉన్నా"నని అతడు చెప్పాడు. (ఈ ఆర్డియస్ యర్ కు పూర్వం ఎప్పుడో వేయిసంవత్సరాలక్రిందట ఉండేవాడు. అతడు పాంఫీలియాలో ఒకరాజ్యానికి ఏలిక. అతడు వృద్ధుడైన తనతండ్రిని, అన్నను చంపటమే కాదు, ఇంకా ఎన్నో ఘోరకృత్యాలు చేశాడు.) రెండవజీవి చెప్పింది: 'అతడిక్కడికి రాడు. అది అసంభవం. మాకళ్ళతో ఈ భయానకదృశ్యం చూచాము. మేమప్పుడు గుహాముఖంవద్ద ఉన్నాము. మాకర్మఫలాలు అనుభవించి తిరిగి పైకెక్కి రాబోతున్నాము. అప్పుడే ఆకస్మికంగా ఆర్డియస్ కనిపించాడు. అతనితోపాటు ఇతరులు పెక్కురున్నారు. వారిలో చాలమంది నియంతలు. వారితోపాటు వైయక్తికంగా

మహాపాపకృత్యాలు చేసినవారు కూడ ఉన్నారు. ఊర్ధ్వలోకానికి తాము తిరిగి రాబోతున్నామని అనుకొంటూ ఉండగా వారిని పోనీక ముఖద్వారం ఒక్కసారి కర్ణకఠోరంగా గర్జించింది. నివృత్తిలేని పాపాత్ములుకాని, పాపఫలం సముచితంగా అనుభవించనివారు కాని ఆరోహణ క్రియకు ఉపక్రమించినప్పుడెల్లా అది అలాగే గర్జిస్తుంటుంది. సమీపవర్తులై అగ్నితీక్ష్ణులైన మానవులు కొందరు ఆ ధ్వని విని వారిని బంధించి ఈడ్చుకొనిపోయారు. ఆర్డియస్ మున్నైనవారి కాలుసేతులు కట్టిపడవేసి కొరడాలతో మోదారు. కంటకమయరజ్జువులతో బంధించి ప్రక్కనే ఉన్న 'రోడ్డు'మీద బడాబడా ఈడ్చారు. 'దారినిపోతున్నవారికి ఆ పాపులు చేసినదుష్కర్మలను విప్పిచెప్పి నరకంలో కూలద్రోయటానికి కొనిపోతున్నా'మని వారు చెప్పారు "మేమనుభవించినభయంకరదుఃస్థితులలో ఏ ఒకటీ అప్పుడు అనుభవించిన దుఃస్థితికో పోలదు. ఆ కఠోర గర్జ మళ్ళీ ఎప్పుడు వినిపిస్తుందోనని మేము హడలిపోయా"మని అతడు చెప్పాడు. నిశ్శబ్దత నెలకొన్నతరువాత ఒక్కరొక్కరే మహాసంతోషంతో అధిరోహించారు. ఇవీ శిక్షలూ పాపఫలాలు. పుణ్యఫలాలు కూడ ఇంత అధికమేనని యర్ పేర్కొన్నాడు.

మైదానంలో ఏడునాళ్ళు విడిసి ఉన్నజీవులు ఎనిమిదవనాడు తిరిగి తమ యాత్రకుపక్రమించాయి. అట్లు పయనించి నాల్గవనాడు తా మొకచోటికి చేరుకొన్నామని అతడు చెప్పాడు. మహాస్తంభంవలె ఋజువై భూస్వర్గలోకాలగుండ విస్తరించి ఇంద్రచాపవర్ణమై స్వచ్ఛతాకాంతులందు ఆ ఇంద్రధనువును మించిన తేజోరేఖ ఒకటి కనిపించింది. మరునాడు కూడ పయనించి అవి ఒకచోటికి చేరుకొన్నవి. స్వర్ణశృంఖలాలు పైనుంచి క్రిందికి వ్రేలుతూ వెలుగులో అక్కడ కనిపించాయి. ఓడకు కీలుదూలమట్లు ఈ వెలుగు స్వర్గానికి నడికట్టై విశ్వవలయం వ్రీలిపోనీక బంధించి కాపాడుతున్నది. ఈ శృంఖలాగ్రంనుంచి తర్కువు (కదురు) విస్తరించి ఉన్నది. దీనిమీదనే ఎల్లభ్రమణాలు వర్తిల్లుతున్నవి. ఈ కదురు, దీనికొక్కెము ఉక్కుతో చేసిఉన్నవి. కదుటిదిండు (Whorl) లో కొంత ఉక్కుతోను కొంత ఇతరలోహాలతోను నిర్మింపబడిఉన్నది. ఈ దిండు లౌకికమైన దిండువలె ఉన్నది. దానివర్ణననుబట్టి చూస్తే అది తొలగల పెద్దదిండు. ఈ తొలలో మొదటిదానికంటె కొంచెం చిన్నదైనదిండు దానిలో మరొకటి, ఆ మరొకదానిలో వేరొకటి, ఆ వేరొకదానిలో మరినాలుగుదిండ్లు ఒకదానిలో మరొకటి ఉండునట్లు జొనిపినపాత్రల

వలె మొత్తం ఎనిమిదిదిండ్లు ఉన్నవి. ఈ దిండ్ల అంచులు ఉపరిభాగాన మలగి క్రిందిభాగంలో మొత్తమన్నీ కలిసి ఒకేదిండుగా ఉన్నవి. కదురు దీనిలోనుంచి ఎనిమిదవదాని కేంద్రంలోనికి గ్రుచ్చబడి ఉన్నది. మొదటిదీ అన్నిటికంటె వెలుపలిదీ అయిన దిండుఅంచు విశాలతమము. మిగిలిన ఏడుదిండ్ల అంచులు ఈ అంచుకంటె చిన్నవై ఇలా ఉంటవి: ఆరవదిండు అంచు పరిమాణంలో మొదటిదానికి తరువాతిది అవుతుంది. నాల్గవది ఆరవదాని తరువాత వస్తుంది. ఆ తరువాత ఎనిమిదవది వస్తుంది. ఏడవది ఐదవదిగా, ఐదవది ఆరవదిగా, మూడవది ఏడవదిగా, కడపటిదీ ఎనిమిద వదీ అయినది రెండవదిగా పరిగణ్యాలవుతవి. మహత్తరమై (నిశ్చల తారలు గలిగి)నభాగం మిలమిలలతో ఖచితమై ఉంటుంది. ఏడవది (సూర్యుడు) అతితేజస్వంతం. ఎనిమిదవది (చంద్రుడు) ఏడవదాని తేజః ప్రతిఫలనంతో రంజితమవుతుంది. రెండవది, ఐదవది (శని, బుధులు) రంగులో ఒండొంటిని పోలి వెనుకటిదానికంటె ఎక్కువ పసుపుపచ్చగా ఉంటవి. మూడవది (శుక్రుడు) మిక్కిలి తెల్లన. నాల్గవది (కుజుడు) ఎర్రడాలుగా ఉంటుంది. ఆరవది (బృహస్పతి) ధావళ్యంలో రెండవది. మొత్తం కదురంతకు ఒకటేగతి. మొత్తమంతా ఏకదిశాభిముఖమై భ్రమి స్తున్నప్పుడు లోపలి ఏడువలయాలు మెల్లగా రెండవదిక్కునకు అభి ముఖమై కదలుతవి. ఈ గతులన్నిటిలో ఎనిమిదవదానిగతి అత్యంత వేగ వంతం. దానితరువాత వేగంలో పరిగణ్యాలు ఏడవది, ఆరవది, ఐదవది. ఇవి సమవేగాలు. వేగంలో నాల్గవది మూడవది అవుతుంది. ఇది విరుద్ధభ్రమణ వంతంగా కనిపించింది. వేగంలో మూడవది నాల్గవదిగాను, రెండవది ఐదవదిగాను కన్పించాయి. కదురు విధిమోకాళ్ళపై తిరుగుతుంటుంది. ప్రతివలయంయొక్క ఉపరితలాన ముఖరశృంగం (Siren) ఏకస్వరంతో మ్రోగుతూ ఆవలయంతోపాటు తిరుగుతుంటుంది. ఈ ఎనిమిదిశృంగాలు కలిసి ఒకరాగం (Harmony) అవుతవి. వానిచుట్టూ సమానాంతర దూరాలలో సింహాసనాసీనలై విధిదుహితలైన లాకిసిస్, క్లోథో, ఎట్రొపోస్ అను కర్మకన్యలుంటారు. ధవళవస్త్రాలు దాల్చి, శిరమున తావళాలు వేసికొని ఆసీనలై ఉంటారు. శృంగసంగీతాన్ని అనుగమిస్తున్న కంఠాలతో లాకిసిస్ గతాన్ని గానంచేస్తుంది; క్లోథో వర్తమానం, ఎట్రొపోస్ భవిష్యమూ గానంచేస్తారు. క్లోథో తనకుడిచేతితో దిండును, లేదా కదురుయొక్క బాహ్యవలయాన్ని అప్పుడప్పుడు నెడుతుంది. ఎట్రొపోస్ తన ఎడమచేత లోపలివలయాల భ్రమణానికి తోడ్పడుతుంది. లాకిసిస్ అంతర్బాహ్యవలయాలను సవ్యాపసవ్యహస్తాలతో ఒకప్పుడొక

దానిని, మరొకప్పుడు రెండవదానిని పట్టుకొంటుంది.

ఇతరజీవులతో కలిసి అక్కడకు చేరగానే లాకిసిస్‌వద్దకు వెళ్ళవలసి ఉంది. ప్రవక్త ఒకడు ముందుగా వచ్చి వాటిని క్రమంలో నిలిపి ఆమె వద్దనుంచి అదృష్టసూచికలు (lots), మనుగడల మచ్చుతునకలు స్వీకరించి ఉన్నతవేదిక అధిరోహించి ఇలా అన్నాడు: "విధిదుహిత లాకిసిస్ సందేశం వినండి: మర్త్యజీవులారా! జీవనమర్త్యత్వనూతనపరంపర సందర్శించండి. మీకు అదృష్టం (Genius)♦ మాత్రం నిర్ణీతం కాదు. మీఅదృష్టానికి మీరే కర్తలు. మొదటి అదృష్టసూచికను పొందినజీవి మొదట కోరుకోవలసి ఉంటుంది. తాను కోరుకొనేజీవితం దానికి లభిస్తుంది. సద్గుణసంపత్తి స్వచ్ఛందం. దానిని సత్కరిస్తే మెండుగా లభిస్తుంది. అవమానిస్తే అల్పంగా అలవడుతుంది. ఈ బాధ్యత అంతా కోరుకొనే జీవిది. ఈశ్వరునికి పక్షపాతం లేదు." ఇలా చెప్పి ఆప్రవక్త అదృష్టసూచికలను నిర్లిప్తుడై వాటిమధ్య వెదజల్లాడు. ఆ జీవులలో ప్రతిఒకటి తనసమీపంలోపడిన అదృష్టసూచికను తీసికొన్నది. యర్ ఒకనికి మాత్రం ఇది నిషిద్ధం. ప్రతిజీవి తాను గ్రహించిన అదృష్టసూచికలో తనకు వచ్చినసంఖ్యను చూచుకొన్నది. ఆ పిమ్మట సందేశవాహకుడు జీవితాల మచ్చుతునకలు వారిముంగలినేలమీద నిలిపాడు. అచటచేరిన జీవుల సంఖ్యకంటె జీవితాల మచ్చుతునకలసంఖ్య మెండు. ఆ మచ్చుతునకలలో ఎల్లజాతిజీవితాలు, ఎల్లజీవితదశలున్నవి. వాటిలో నైరంకుశ్యాలు కూడ గోచరించాయి. ఆ నైరంకుశ్యాలలో కొన్ని జీవితాంతపరిమితాలు. ఇతరాలు మధ్యలో భగ్నాలై దారిద్ర్యంతో దేశబహిష్కారంతో భిక్షాటనంతో సమాప్తమైనవి. ప్రఖ్యాతపురుషుల జీవితాలున్నవి. వాటిలో కొన్ని ఆకారసౌందర్యానికి, బలానికి, క్రీడావిజయానికి ప్రసిద్ధాలు. లేదా ఆభిజాత్యానికి, వారిప్రాచీనుల గుణసంపత్తికి పేరుమోసినవి. విపరీతగుణాలచే కొన్ని దుష్కీర్తి పొందినవి. అలాగే స్త్రీజీవితాలు. అయితే వాటిలో నిర్దిష్టశీలం లేదు. ఎందువల్లనంటే నూతనజీవితాన్ని ఎన్నుకొంటున్నప్పుడు జీవి విధిగా భిన్నంకావాలి. అయితే ప్రతి ఇతర గుణమూ అందులో ఉన్నది. అవన్నీ కలిమిలేములతో, ఆరోగ్యానారోగ్యాలతోపాటు పరస్పరమిశ్రితాలై ఉన్నవి. అందు మధ్యదశలూ ఉన్నవి. గ్లాకన్! మానవదశలో ఇక్కడే పరమప్రమాదం ఏర్పడు

♦ధర్మాధర్మావదృష్టంస్యాత్.

తున్నది. కాబట్టి మిక్కిలి జాగ్రత్తపడాలి. ఎల్లవారు ఇతరజ్ఞానాలన్నీ వర్జించి ఒకేదానిని అన్వేషించాలి. దానినే అనుసరించాలి. మంచిచెడుగులను తెలిపి ఉత్తమజీవితసిద్ధికి తోడ్పడేవ్యక్తి లభిస్తాడేమో అన్వేషించాలి. సద్గుణసంపత్తివిషయంలో విడివిడిగానేమి సమష్టిగానేమి మనం చర్చించినవిషయాల ప్రాముఖ్యం గణించి, దారిద్ర్యంతో కాని, సంపత్తితో కాని, సౌందర్యంతో కాని సమ్మిశ్రితమైనప్పుడు జీవిలో వచ్చే మార్పులను తెలిసికోవాలి. కులీనతాకులీనతలవల్ల, వైయష్టికసామాజిక ప్రతిపత్తులవల్ల, బలదౌర్బల్యాలవల్ల, బుద్ధినైశిత్యమాంద్యాలవల్ల, సిద్ధసాధ్యాలైన ఇతరగుణాలవల్ల, వాని కలయికవల్ల ఏ యే మంచిచెడుగులు కలుగుతవో ఆలోచించాలి. తరువాత జీవి ఆత్మస్వభావాన్ని విలోకిస్తుంది. ఈ గుణాలన్నీ పరిశీలించినప్పుడు ఏది ఉత్తమమో ఏది అధమమో నిర్ణయించగలుగుతుంది. ఈ విధంగా తన ఆత్మను అన్యాయవంతంగా చేసే జీవితాన్ని అనర్థంగాను, ఇతోధికన్యాయవంతంగా చేసేదానిని మేలుగాను నిర్ణయించి ఎన్నుకొంటుంది. తక్కినదానిని పరిహరిస్తుంది. ఎందుకంటే ఇహజీవితంలోనూ మరణానంతరకాలంలోనూ ఇదే ఉత్తమమని మనకు తేలిపోయింది. మానవుడు ఇహలోకయాత్ర చాలించి పరలోక (అధోలోక) యాత్రకు బయలుదేరినప్పుడు సత్యాబుజుత్వాలలో అచంచలవిశ్వాసం ఏర్పడాలి. అక్కడ కూడ సంపదలకు, ఇతరప్రలోభాలకు మోసపోరాదు. నైరంకుశ్యాదిదౌష్ట్యాలు తటస్థపడినప్పుడు వాటిని వరించి ఇతరులకు తీరని అపకారం కావించి తనకు అంతకంటె ఘోరానర్థం కల్పించుకొనక పరిహరించాలంటే అలాంటి అచంచలవిశ్వాసం ఆవశ్యకం. సాధ్యమైనంతవరకు 'అతి సర్వత్ర వర్జయేత్' అన్న సూత్రం పాటించి మాధ్యమికమార్గానుసరణం అతడు తెలిసికోవాలి. ఇది ఇహమందే కాదు, పరమందు కూడ అనుసరణీయం. ఎందువల్లనంటే సౌఖ్యానికిదే మార్గం.

అప్పుడు ప్రవక్త ఇలా చెప్పాడని పరలోకసందేశహరుడు అన్నాడు: "ఒకడు చివరలో వచ్చినా వివేకంతో వర్తించి కష్టపడిజీవిస్తే అతనికి సుఖజీవితమే లభిస్తుంది కాని, అనభిలషణీయజీవితం సిద్ధించదు. మొదట వరించేవాడు ప్రమత్తుడు కారాదు. కడపట కోరుకొనేవాడు నిస్పృహ పొందనక్కరలేదు." అతడలా చెప్పగానే ప్రథమవరణావకాశం లభించినవాడు ముందుకువచ్చి క్షణంలో పరమనైరంకుశ్యం కోరుకొన్నాడు. అజ్ఞానభోగలాలసతలచే అతనిమనస్సు అంధమైపోయింది. కోరుకొనటానికిముందు అతడు విషయం సాకల్యంగా ఆలోచించలేదు. ఇతర అనర్థా

లతోపాటు తనసంతానాన్ని తనపాట్టన పెట్టుకోవలసివస్తుందన్న సంగతి అతడు మొదట గ్రహించలేదు. తానేమికోరుకొన్నాడో ఎట్టి దుర్గతి ప్రాప్తించిందో ఆలోచించినప్పుడు ప్రవక్తవచనం విస్మరించి రొమ్ము రొమ్మే మోదుకొని విలపించాడు. తనదురదృష్టానికి కారణం తాను కాదట. దానికి అంతకు విధి, దేవతలు కారణమని అతడు వాపోయాడు. స్వర్గంనుంచి తిరిగివచ్చినవారిలో అతడొకడు. పూర్వజన్మంలో అతడు సవ్యగ్వ్యవస్థితరాజ్యంలో వసించాడు. అప్పటి అతనిగుణసంపత్తి ఆచారానుగతమే కాని, తత్త్వవివేకంవల్ల సిద్ధించింది కాదు. ఇలాంటి దురదృష్టవంతులైన ఇతరులకు కూడ ఇదే సంభవించింది. పెక్కురు స్వర్గలోకం నుంచి వచ్చారు. కాబట్టి వారికి దుఃఖానుభవం లేదు. భూలోకంనుంచి వచ్చిన యాత్రికులు స్వయంగా దుఃఖం చవిచూచారు. ఇతరులు దుఃఖం అనుభవించగా కనుగొన్నారు. కాబట్టి వారు కోరుకొనటంలో తొందర పడలేదు. అనుభవం లేకపోవటంవల్లనూ అదృష్టసూచిక యాదృచ్ఛికం కావటంవల్లనూ పెక్కుజీవులు ఉత్తమజీవితాలకు బదులుగా అనర్థకజీవితాలు, అనర్థకజీవితాలకు బదులు ఉత్తమజీవితాలు కోరుకొన్నవి. మానవుడు ఇహలోకానికి రాగానే సరియైన తత్త్వశాస్త్రాధ్యయనంలో నిమగ్నుడైతే అదృష్టసూచికాసంఖ్య కొంత కలిసివస్తే వార్తాహరుడన్నట్లు అతడిక్కడ సుఖపడవచ్చును. అటు పరలోకయాత్ర, ఇటు పునఃప్రాప్తమైన ఇహలోకయాత్ర విషమాలుకాక సుగమములై స్వర్గప్రాయంగా ఉంటవి. ఒకదృశ్యం తనకెంతో ఔత్సుక్యం కలిగించిందని అతడన్నాడు. అది శోచనీయంగా, హాస్యాస్పదంగా, విచిత్రంగా కనిపించిందట. ఎందువల్లనంటే జీవులస్వయంవరం చాలవరకు పూర్వజీవితానుభవమ్మీద ఆధారపడి ఉంటుంది. ఒకప్పుడు ఆర్ఫియస్‌గా ఉన్న ఆత్మ తన్ను స్త్రీలు ఖూనీచేశారు కాబట్టి, వారిపైగల ద్వేషంతో వారికడుపున పుట్టటానికి సమ్మతింపక హంసజన్మం వరించింది. థమరాస్ ఆత్మ కోకిల జన్మం కోరుకొన్నది. హంసలు, ఇతరకూజకశకుంతాలు మానవులపుట్టువులు కోరుకొన్నవి. ఇరువదిఒకటవ అదృష్టసూచిక పొందిన ఆత్మ పూర్వజన్మంలో పొందిన అన్యాయం స్మరించి సింహజన్మం కోరుకొన్నది. అది టెలామన్ కుమారుడైన ఎజాక్స్ ఆత్మ. మానవులు కావించిన అక్రమ నిర్ణయంవల్ల తనకుదక్కని ఆయుధాలుస్మరించి అతడు నరజన్మమెత్తుట కంగీకరించలేదు. మానవుడు అనుభవిస్తున్న కష్టాలుచూచి మానవప్రకృతిని ఏవగించుకొని అగమెమ్నన్ గృధ్రజన్మం వరించాడు. మధ్యలో అటలాంటాకు భవిష్యజన్మం కోరుకొనే అవకాశం వచ్చింది. వ్యాయామ

క్రీడాసమర్థుని మహాఖ్యాతి చూచి అందలిప్రలోభం నిగ్రహించుకోలేక పోయింది. ఆమెతరువాత పెనోపియస్ కుమారుడైన ఎపియస్ ఆత్మ వచ్చి (ఇతడు ట్రోజన్ హాయం నిర్మించాడు.) శిల్పనిపుణురాలైన స్త్రీప్రకృతిని స్వీకరించింది. ఎన్నుకొన్న ఆత్మలలో కడపటివానియందు విదూషకుడైన థర్ సైటీజ్ కూడ ఉన్నాడు. అతడు కోతిరూపం ధరిస్తున్నాడు. (ట్రాయ్‌నగరంముందు దండువిడిసినసైనికులలో అతడు అత్యంతవికృత రూపుడు.) ఒడిసియస్ ఆత్మ కూడ వచ్చింది. అది ఇంకా తనభావిజన్మం కోరుకోవలసి ఉంది. దాని అదృష్టసూచిక కట్టకడపటిది. పూర్వజన్మంలో తానుపొందిన కష్టపరంపర ప్రస్పృహవైపు మ్రొగ్గనీయలేదు. చీకు చింతలేని వైయష్టికమానవజన్మకోసం కొంతసేపు అన్వేషించింది. కష్టమ్మీద దానిని సంపాదించగలిగింది. ఎల్లజీవులచే ఉపేక్షితమై ఇది ఒకమూల పడిఉన్నది. "తుదికి గాక మొదటనే అవకాశం లభించి ఉన్నా దీనినే కోరుకొని ఉండేదాన్ని. ఇది నాకు ప్రాప్తించటం ఎంతో అదృష్ట"మని అది అన్నది. మానవులు మాత్రమే జంతువులుగా మారలేదు. సాధుక్రూరజంతువులు కూడ జాతిమార్పులు ప్రాపించాయి. కొన్ని ఆత్మోచితమానవప్రకృతులు పొందాయి. సాధుజంతువులు సాధు పురుషులుగా, క్రూరజంతువులు ఆటవికులుగా మారాయి.

ఎల్లజీవులు తమతమ భవిష్యజ్జన్మలను వరించాయి. స్వయంవరకార్య కలాపం ముగిసింది. అదృష్టసూచికాక్రమాన్నిబట్టి అవి లాకిసిస్ వద్దకు వెళ్ళాయి. ఏ జీవి కోరుకొన్న అదృష్టాన్ని ఆ జీవికి ప్రాణరక్షకంగా ఉండి దానికోరుకొన్న అర్థాన్ని సఫలంచేయటానికి ఆమె ఆ జీవివెంట పంపింది. ఈ అదృష్టం జీవులను ముందు క్లోథోవద్దకు కొని పోయింది. ఆమెచే త్రిప్పబడుతున్నతర్కుభ్రమణంలోనికి కొనిపోయి ప్రతిదానిభవిష్యాన్ని ధ్రువపరిచింది. ఆమెను స్పృశించినపిమ్మట అదృష్టం జీవిని వలయభ్రమణకారిణియైన ఎట్రాపోస్ వద్దకు కొనిపోయింది. ఆమె తన నూలితో జీవిభవితవ్యాన్ని అపరివర్తనీయంగా బంధించింది. ఆ వెనుక జీవులు వెనుదిరిగి చూడక విధిసింహాసనంక్రిందుగా వెళ్ళాయి. అవి అట్లు వెడలి మండుటెండలో పయనించి విస్మృతిభూమికి చేరుకొన్నాయి. అది మరుభూమి. ఎక్కడా చెట్టూ చేమా లేదు. అందు పయనించి సాయం కాలానికి జీవులు అపసారికానామనదీతీరం చేరుకొని అక్కడ విడిది చేశాయి. ఆ నదీజలాలు ఏ పాత్రలోనూ నిలువవు. వాటిని అందరూ కొంత సేవించవలసివచ్చింది. అప్రజ్ఞాపరిరక్షితులు వలసినదానికంటె

KLVA 109 B 128



ఎక్కువగా త్రాగారు. ఆ జలం త్రావగానే ప్రతిజీవి ఎల్లవిషయాలు మరచిపోయింది. ఆ తరువాత అవి విశ్రమించాయి. నడిరేయి గాలివాన, భూకంపం బయలుదేరాయి. నానాభంగుల వ్రాలుతున్న రిక్కలవలె అవి తమతమపుట్టువులకోసం విద్రావితాలయ్యాయి. యర్ మాత్రం నివారితుడై ఆ నదీజలం త్రావలేదు. అయితే తానేతీరున నిజశరీరానికి చేరుకొన్నాడో చెప్పలేకపోయాడు. ఉదయాన ఆకస్మికంగా లేచిచూడగానే తాను చితిపై శయినించి ఉన్నానని తెలిసికొన్నాడు. గ్లాకన్! ఈ విధంగా మనకీకథ నశించక దక్కింది. ఈ ఉపదేశాన్ని శిరసావహిస్తే ఇది మనలను కాపాడుతుంది. మనం సురక్షితంగా అపసారికానదిని దాటుతాము. మన ఆత్మలు కలుషితాలు కావు. కాబట్టి నా ఉపదేశం ఒకటే. ఆత్మ అమర్త్యమనీ ఎలాంటి పాపపుణ్యాలైనా సహించగలదనీ గుర్తించి నిరంతరం ఊర్ధ్వగమనమనుసరిస్తూ ఎల్లప్పుడూ న్యాయాన్ని సద్గుణసంపత్తిని పాలించాలి. ఈ విధంగా ఐహికజీవితమందు క్రీడావిజేతలవలె బహూకృతిపొందేటప్పుడు మనం ఒండొరులకేమి దేవతలకేమి ప్రీతిపాత్రులమై జీవించాలి. ఈ జీవితంలోను ఉత్తరసహస్రవర్ష యాత్రలోను మనకు కల్యాణమగుగాక!

పాశ్చాత్య తాత్త్విక సిద్ధాంతాలను, సంస్కృతిని అకళించుకొనటానికి ప్లేటో రచించిన ఆదర్శరాజ్యం ఎంతైనా తోడ్పడుతుంది.

ప్లేటో యీనాటివాడు కాడు. క్రీస్తు పూర్వం 427 లో ఏథెన్సు నగరంలో జన్మించాడు. జగత్ప్రసిద్ధి పొందిన సోక్రటిస్‌వద్ద శిష్యత్వం చేశాడు. ఏథెన్సులో విశ్వవిద్యాలయం నెలకొల్పి 20 సంవత్సరాలు విద్యార్థులకు వివిధ శాస్త్రవిషయాలు బోధించాడు. అతని శిక్షణలో పెరిగి ఆరి తేరినవాడే అరిస్టాటిల్. ఇలా చరితార్థుడైన ప్లేటో క్రీ. పూ. 348 లో అస్తమించాడు.

మనకు ఉపనిషత్తు లెట్టివో, పాశ్చాత్యులకు ప్లేటో రచన లట్టివి. అతని రచనలకు ఆదర్శరాజ్యం కొలికిపూస. ఈ ఉద్గ్రంథానికి డా. జి. వి. కృష్ణరావు గారు చేసిన యీ తెలుగు సేతను పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాము.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA109B128 |
| పుస్తకం పేరు | ప్లేటో ఆదర్శ రాజ్యం |
| తారీఖు | 10 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 491 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | D,viii 2,98,346,432, BC2,256,302 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Priyanka |
| పేజీలు విడదీసినది | Akshaya |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |